


ఒకనాడు నారదమహాముని తమసా నదీ తీరాన గల వాల్మీకి మహాముని ఆశ్రమానికి వచ్చాడు. వాల్మీకి ఆయనను శాస్త్రోక్తంగా పూజించి, "మహాత్మా, ఈ యుగంలో ఈ లోకంలో సకల సద్గుణసంపన్నుడూ, మహా పరాక్రముడూ అయిన పురుషుడు ఎవడైనా ఉన్నాడా?" అని అడిగాడు.

అప్పుడు వాల్మీకికి నారదమహాముని రాముడి కథ సవిస్తరంగా చెప్పాడు. నారద మహాముని సెలవు తీసుకుని వెళ్ళిపోయేసరికి మధ్యాహ్న స్నానానికి వేళఅయింది. వాల్మీకి మహాముని తన శిష్యుడైన భరద్వాజుణ్ణి వెంటబెట్టుకుని తమసా నదీతీరానికి వెళ్లాడు.

అక్కడ ఆయనకు ఒక క్రౌంచపక్షుల జంట కనిపించింది. ఆ పక్షులు పరస్పర ప్రేమలో మైమరచి తియ్యగా పాడుతూ, అరణ్యంలో ఎగురుతూ ఆనందిస్తున్నాయి.

నార బట్టకట్టుకుని నీటిలోకి దిగబోతూ వాల్మీకి ఆ పక్షుల ఆనందోత్సాహన్ని చూస్తున్నంతలో ఒక బోయవాడు బాణంతో మగ పక్షిని కొట్టాడు. అది కిందపడి గిలగిలా తన్నుకున్నది. ఆడపక్షి ఆర్తనాదాలు చేసింది.

వాల్మీకి హృదయంలో ఆ పక్షిపైన జాలి, కిరాతుడిపైన ఆగ్రహమూ తన్నుకుని వచ్చాయి. వెంటనే ఆయన బోయవాడితో ఇలా అన్నాడు:

"మానిషాద ప్రతిష్ఠాంత్వ
మగమ శ్శాశ్వతీ స్సమాః,
యత్క్రౌంచ మిధునాదేక
మవధీః కామమోహితం."







"ఓరి కటికవాడా, ప్రేమోద్రేకంలో ఉన్న క్రౌంచపక్షుల జంటలో ఒకదాన్ని చంపిన నువు చిరకాలం బాగా ఉండలేవు," అనే అభిప్రాయం అప్రయత్నంగా వాల్మీకి నోట శ్లోకం రూపంలో వెలువడింది. ఆ శ్లోకానికి నాలుగు పాదాలూ, ఒక్కొక్క పాదంలోనూ ఎనిమిదేసి అక్షరాలూ ఉన్నాయి.

తన నోట ఇలా శ్లోకం వెలువడటం చూసి వాల్మీకే విస్మయం చెందాడు. ఇక ఆయన శిష్యుడైన భరద్వాజుడి ఉత్సాహానికి అంతే లేదు. అతను తన గురువు నోటి మాటలను పదేపదే పఠించి శ్లోకాన్ని కంఠస్థం చేశాడు.



తరవాత వాల్మీకి స్నానం చేసి కాల కృత్యాలు తీర్చుకుని ఆశ్రమానికి వెళ్ళాడు. భరద్వాజుడు జల కలశం తీసుకుని ఆయన వెంబడే వెళ్ళాడు. ఆశ్రమంలో కూడా వాల్మీకి తన నోట వెలువడిన శ్లోకం గురించే ఆలోచిస్తూ ఉండిపోయాడు.

అంతలో బ్రహ్మదేవుడు ఆయనను చూడ వచ్చాడు. వాల్మీకి చప్పున లేచి బ్రహ్మకు సాష్టాంగం చేసి, అర్ఘ్యపాద్యా లిచ్చి, స్తోత్రాలతో సన్నుతించి మౌనంగా నిలబడ్డాడు. అప్పుడు బ్రహ్మ వాల్మీకిని కూచోమని, "వాల్మీకీ, నా అనుగ్రహంచేతనే నీకు కవిత్వం అబ్బింది. నీవు ఇంతకు ముందే రాముడి కథ విన్నావుగదా. ఆ కథను మహా కావ్యంగా రచించు. అది భూమి ఉన్నంత కాలమూ నిలిచి ఉంటుంది. అది ఉన్నంత కాలమూ నీవు ఉత్తమ లోకాలలో సంచరించ గలిగి ఉంటావు," అని చెప్పి అంతర్ధానమైనాడు.

ఈ విధంగా బ్రహ్మయొక్క ప్రోత్సాహంతో వాల్మీకి రామాయణ కథను, తన నోట అప్రయత్నంగా వెలువడిన శ్లోకాలలాటి శ్లోకాలతో, అందరికీ ఆనందం కలిగించే విధంగా రచించాడు. ఆ కథనే మనంకూడా చదివి ఆనందించుదాం.









వైవస్వతుడు సూర్యుడి కొడుకు. ఇక్ష్వాకు అనేవాడు వైవస్వతుడి కొడుకు. వైవస్వతుడు ఏడవ మనువు అయి శాశ్వత కీర్తి సంపాదించాడు. ఆయన అనంతరం ఇక్ష్వాకు సంతతివారు ఇక్ష్వాకులనీ, సూర్యవంశం వారనీ పిలవబడి ప్రసిద్ధి కెక్కారు. వీరిలో సగరుడుకూడా ఒకడు. ఈ సగరుడు షట్చక్రవర్తులలో ఒకడు. గంగను స్వర్గం నుంచి భూమికి తెచ్చిన భగీరథుడు ఈ సగరుడికి మనమడే.

సూర్యవంశపు రాజులు అయోధ్యా నగరం రాజధానిగా కోసలదేశాన్ని పాలించారు. అయోధ్యను వైవస్వత మనువు స్వయంగా నిర్మించాడు. అది పన్నెండు అమడలు పొడుగూ, మూడు అమడలు వెడల్పూ గల చక్కని నగరం. దాని చుట్టూ ప్రాకారమూ, లోతైన అగడ్తలూ ఉండేవి. నగరంలో లక్ష్మి తాండవించేది. అక్కడి ప్రజలలో శిల్పులూ, కళాకారులూ, పండితులూ, యుద్ధవిద్యలో ఆరితేరినవారూ వేదవేదాంగాలు తెలిసినవారూ ఉండేవారు. పట్టణంలో ఏనుగులూ, మేలుజాతికి చెందిన గుర్రాలూ, గోవులూ, ఒంటెలూ, గాడిదలూ దండిగా ఉండేవి. ప్రజల జీవితం సుఖమయంగా ఉండేది.



శత్రువులకు దుర్భేద్యమైన ఈ అయోధ్యను సూర్యవంశపు రాజైన దశరథుడు పరిపాలిస్తూ ఉండేవాడు. దశరథుడు ఐశ్వర్యంలో ఇంద్ర కుబేరులకు తీసిపోనివాడు, మహాపరాక్రమ సంపన్నుడు.

దృష్టి, జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, అర్థసాధకుడు, అశోకుడు, మంత్రపాలుడు, సుమంత్రుడూ అనే ఎనిమిది మందీ దశరథుడి మంత్రులు. వసిష్ఠ మహాముని ఆయనకు కులగురువు. వసిష్ఠుడూ, వామదేవుడూ ఆయన పురోహితులు. వేగుల వాళ్లద్వారా దేశంలో ఏమూల ఏమి జరుగుతున్నదీ తెలుసుకుంటూ, తన మంత్రుల







సహాయంతో దశరథుడు న్యాయంగా రాజ్యపాలన చేస్తూవచ్చాడు.

దశరథుడికి ఏలోటూ లేదుగాని సంతానం లేని లోటు ఉండి, అయనను బాధించేది. ఒకనాడాయన అశ్వమేధయాగం చేసి దేవతలను మెప్పించి, వారి అనుగ్రహంతో సంతానం పొందుదామని ఆలోచించి, తన మంత్రులలో అగ్రగణ్యుడైన సుమంత్రుడి ద్వారా వసిష్ఠవామదేవులనూ, సుయజ్ఞుడు, జాబాలి మొదలైన గురువులనూ, ఇతర బ్రాహ్మణ శ్రేష్ఠులనూ పిలిపించి, వారి సలహా అడిగాడు. అశ్వమేధయాగం చేసే ఆలోచనను వారు మెచ్చుకున్నారు.

వారందరూ వెళ్లినాక దశరథుడితో సుమంత్రుడు, "మహారాజా, మీరు తలపెట్టిన అశ్వమేధయాగాన్ని జరిపించటానికి ఋశ్యశృంగుణ్ణి మించినవాడు లేడు. అతని వృత్తాంతం చెబుతాను వినండి," అంటూ ఈ కథ చెప్పాడు:

అంగదేశాన్ని పరిపాలించే రోమపాదుడు దశరథుడి మిత్రులలో ఒకడు. రోమపాదుడు అన్యాయంగా పరిపాలించటంచేత అంగదేశంలో భయంకరమైన కరువు సాగింది. రోమపాదుడు ఈ కరువు చూసి దిగులు చెంది, బ్రాహ్మణులను పిలిపించి, కరువు తొలగిపోయే ఉపాయం చెప్పమన్నాడు.



"మహారాజా, విభండకమునికి ఋశ్యశృంగుడనే కుమారుడున్నాడు. అతను ఉండేచోట కరువు ఉండదు. ఎలాగైనా అతనిని అంగదేశానికి రప్పించి, సకల మర్యాదలూ జరిపి, తమ కుమార్తె అయిన శాంతనిచ్చి పెళ్ళిచేసి, అంగదేశంలోనే ఉంచుకున్నట్టయితే, కరువు కాటకాలు పోయి దేశం సుభిక్షంగా ఉంటుంది," అని బ్రాహ్మణులు చెప్పారు.

అప్పుడు రోమపాదుడు తన పురోహితుణ్ణి, మంత్రులనూ పిలిచి, "మీరు వెళ్ళి ఋశ్యశృంగ మహామునిని ఇక్కడికి తీసుకురండి," అని ఆజ్ఞాపించాడు.

ఈ మాట విని పురోహితుడూ, మంత్రులూ భయపడ్డారు. ఎందుకంటే ఋశ్యశృంగుడు సులువుగా అరణ్యాలనూ, తన తపస్సునూ మాని, ఎవరో పిలవగానే వచ్చే మనిషికాడు. ఆగ్రహించి శపించినా శపించగలడు. అతన్ని రప్పించాలంటే ఏదో ఒక మాయోపాయం పన్నాలి.

ఆ ఉపాయాన్ని రోమపాదుడికి పురోహితుడు ఈవిధంగా చెప్పాడు:

"మహారాజా, ఋశ్యశృంగుడు పసితనం నుంచీ అరణ్యంలోనే ఉండి వేదాధ్యయనంలోనూ, తపశ్చర్యలోనూ జీవితం గడిపినవాడు. అతనికి ఆడవాళ్ళు ఎలా ఉంటారో







కూడా తెలియదు. మనం కొంతమంది వేశ్యలను అలంకరించి, పూలుపెట్టి, సుగంధాలు వెదజల్లేలాగా తయారుచేసి పంపినట్టయితే వారు సులువుగా ఋశ్యశృంగుణ్ణి ఆకర్షించి తమవెంట తీసుకురాగలుగుతారు."

రోమపాదు డిందుకు సమ్మతించి కొందరు వేశ్యలను చక్కగా అలంకరింపజేసి ఋశ్యశృంగుడి ఆశ్రమానికి పంపాడు. వారు ఆశ్రమం వెలపల ఉండి ఋశ్యశృంగుడు ఎప్పుడు కనిపిస్తాడా అని వేచి ఉన్నారు.

ఆ ఋశ్యశృంగుడు ఎప్పుడూ తండ్రికి శుశ్రూషలు చేస్తూ ఎన్నడూ ఆశ్రమందాటి వెళ్ళేవాడు కాడు. అలాటిది ఒకనాడు అతను ఎందుకో ఆశ్రమందాటి వచ్చాడు. వెంటనే వేశ్యలు పాటలు పాడుతూ అతన్ని సమీపించారు. వారి అందమైన ఆకారాలూ, అలంకరణలూ, పాటలూ, శ్రావ్యమైన గొంతులూ విని ఋశ్యశృంగుడు ఆశ్చర్యపోయి ఆకర్షించబడ్డాడు. కాని వారు స్త్రీలని కూడా అతనికి తెలియదు.

వేశ్యలు అతన్ని సమీపించి, "ఓ బ్రాహ్మడా, నీ పేరు? ఎందుకీ అరణ్యంలో ఒంటరిగా తిరుగుతున్నావు?" అని అడిగారు.

"నేను విభండక మహాముని కొడుకును. అదే మా ఆశ్రమం. మీరు ఆశ్రమానికి వచ్చినట్టయితే మీకు విధ్యుక్తంగా పూజ చేస్తాను," అన్నాడు. వారు అతని వెంట ఆశ్రమానికి వెళ్ళి, అతనిచ్చిన కంద మూలాలూ, ఫలాలూ తిన్నారు. అక్కడ ఎక్కువసేపు ఉంటే విభండకుడు శపిస్తాడని భయపడి వేశ్యలు వెళ్ళిపోతూ అతనికి తమ వెంట తెచ్చిన భక్ష్యాలిచ్చి, "ఇవి మా పళ్ళు. వీటినికూడా రుచిచూడు! ఇక మేము వెళ్ళి తపస్సు చేసుకోవాలి," అంటూ ఋశ్యశృంగుణ్ణి అలింగనం చేసుకుని ఆశ్రమందాటి వెళ్ళిపోయారు.

ఋశ్యశృంగుడు వారు పెట్టిన భక్ష్యాలు తిని అవీ పళ్ళే అనుకున్నాడు. అయితే



అవి తాను తినే పళ్ళకంటె చాలా రుచిగా ఉన్నాయి. అలాగే తన ఆతిథ్యం స్వీకరించిన వారు మామూలు మునులకంటె చాలా అందంగా ఉన్నారు. అతను వారిని మరవలేక ఆ రోజల్లా వికలమైన మనస్సుతో గడిపాడు. మర్నాడు, వారు కనిపించవచ్చునన్న ఆశతో, కిందటిరోజు వారు కనిపించిన చోటికే వెళ్ళాడు.

అతన్ని చూడగానే వేశ్యలు తమ పని నెరవేరిందనుకున్నారు. వారు అతనితో, "అయ్యా, నీవుకూడా మా ఆశ్రమానికి రా. అక్కడ నీకు చక్కగా మర్యాద చేస్తాము," అన్నారు.

ఋశ్యశృంగుడు అందుకు పరమానందంతో సమ్మతించి, ఆశ్రమం విడిచి వారి వెంట బయలుదేరాడు.

ఋశ్యశృంగుడి వెంటనే అంగదేశానికి వర్షంకూడా వచ్చింది. రోమపాదుడు ఋశ్యశృంగుడికి ఎదురు వచ్చి, సాష్టాంగపడి మొక్కి, తాను అతనిని ఈవిధంగా రప్పించినందుకు క్షమాపణ చెప్పుకుని, తన కూతురైన శాంత నిచ్చి శాస్త్రోక్తంగా పెళ్ళిచేశాడు. ఋశ్యశృంగుడు శాంతతోకూడా సమస్త సుఖాలూ అనుభవిస్తూ అంగదేశంలోనే ఉండిపోయాడు.

సుమంత్రుడు చెప్పిన ఈ కథ విని దశరథుడు ఎంతో సంతోషించి, వసిష్ఠమహాముని అనుమతి పొంది, తన భార్యలనూ, మంత్రులనూ వెంటపెట్టుకుని అంగదేశం వెళ్ళాడు. రోమపాదుడు దశరథుడికి గొప్పగా ఆతిథ్యం ఇచ్చి తన యింట వారం రోజు లుంచుకుని, ఆయన వచ్చిన పని తెలుసుకుని, తన అల్లుడైన ఋశ్యశృంగుణ్ణీ, తన కుమార్తె అయిన శాంతనూ దశరథుడి వెంట పంపటానికి ఒప్పుకున్నాడు. వెంటనే దశరథుడి దూతలు, అయోధ్యా నగరాన్ని అలంకరించే ఏర్పాట్లు చేయించటానికి ముందుగా బయలుదేరి వచ్చేశారు.






ఋష్యశృంగుడు వచ్చి దశరథుడి వద్ద అతిథిగా ఉంటున్నాడు. కొద్దిరోజులు గడిచాయి. వసంతరుతువు ప్రవేశించింది. దశరథుడు ఋష్యశృంగుడితో, "ఇక మీరు యాగం ఆరంభించి నడిపించండి," అన్నాడు. ఋష్యశృంగుడు సరే నన్నాడు.

అశ్వమేధయాగం కోసం పెద్ద యెత్తున ప్రయత్నాలు సాగించారు. యజ్ఞాలు చేసేవారూ, వేదాలు చదివేటందుకు సుయజ్ఞుడూ, వామదేవుడూ, జాబాలీ, కాశ్యపుడు మొదలైన ఋషులూ, బ్రాహ్మణశ్రేష్ఠులూ పిలిపించబడ్డారు. ఏమేమి వస్తువులు సమకూర్చాలో వసిష్ఠుడు మొదలైనవారు చెప్పారు. సమర్థుడైన వాణ్ణి గుర్రం వెంట పంపారు. సరయూనది ఉత్తరపుగట్టున యజ్ఞశాల నిర్మించారు. యజ్ఞకార్యాలలో పాల్గొనటానికి వడ్రంగులనూ, బేలుదారీలనూ, చిత్రకారులనూ, నాట్యశాస్త్రంలో ప్రవీణులనూ నియోగించారు. యాగానికి వచ్చే రాజులకు మేడలు కట్టారు. బ్రాహ్మణులకు కుటీరాలూ, భోజనాలకు విశాలమైన పందిళ్లూ తయారుచేశారు. సమస్తమైన రాజులకూ, చతుర్వర్ణాల వారికీ ఆహ్వానాలు వెళ్లాయి. మిథిల రాజైన జనకుడికీ, కాశీరాజుకూ, దశరథుడి మామగారైన కేకయమహారాజుకూ, రోమపాదుడికీ ప్రత్యేకాహ్వానాలు వెళ్లాయి. అనేకమంది రాజులను సుమంత్రుడు స్వయంగా వెళ్లి ఆహ్వానించాడు. రావలిసిన వారంతా వచ్చి బసలలో విడిదిచేశారు.







మంచిరోజూ, మంచి ముహూర్తమూ చూసుకుని దశరథుడు యజ్ఞశాలకు బయలుదేరివచ్చాడు. యజ్ఞకర్మ ఆరంభమయింది. మొదటి హవిర్భాగం ఇంద్రుడికి అర్పించి హోమం సాగించారు. యజ్ఞశాల అతిథులతో కళకళలాడింది. భోజనం రాసులుగా పోశారు. వర్ణవిచక్షణ లేకుండా అందరికీ తృప్తిగా భోజనాలు పెట్టించి వస్త్రదానం చేస్తూవచ్చారు.

అశ్వమేధం మూడురోజుల యాగం. అది శాస్త్రోక్తంగా ముగియగానే దశరథుడు తన చేత యజ్ఞం చేయించిన ఋత్విజులకు భూమి యావత్తూ దానం చేశాడు. వారు రాజుతో, "మహారాజా, భూమిని పాలించటం మావల్ల అయే పనికాదు. అందుచేత మాకు భూమి బదులు మణులో, బంగారమో, గోవులో, మరొకటో, ఏది సిద్ధంగా ఉంటే అది ఇప్పించు," అన్నారు. దశరథుడు వారికి పదిలక్షల గోవులూ, నూరుకోట్ల బంగారమూ, నాలుగువందల కోట్ల వెండీ దానం చేశాడు.

తమకు ముట్టిన ధనమంతా బ్రాహ్మణులు ఋశ్యశృంగుడికీ, వసిష్ఠుడికీ సమర్పించారు. వసిష్ఠుడు మొదలైనవాళ్ళు దాన్ని వంతుల ప్రకారం పంచుకున్నారు.

ఇంతలో ఒక దరిద్ర బ్రాహ్మణుడు వచ్చి దశరథుడి ముందు చెయ్యి చాచాడు. దశరథుడు వెంటనే తన చేతి కడియం తీసి ఆ బ్రాహ్మడి కిచ్చేశాడు. బ్రాహ్మణులందరూ దశరథుణ్ణి దీవించారు.

అశ్వమేధం పూర్తికాగానే ఋశ్యశృంగుడు దశరథుడి చేత పుత్రకామేష్టి చేయించాడు. ఆయన అగ్నిలో వేల్చే హవిస్సులు పుచ్చుకోవటానికి సమస్త దేవతలూ అక్కడికి వచ్చి తమ ఉచిత స్థానాలలో కూచున్నారు. అప్పుడు దేవతలు బ్రహ్మతో రావణాసురుడు తమను పెడుతున్న కష్టాలు వివరించి చెప్పుకున్నారు.



దానికి బ్రహ్మ, "దుర్మార్గుడైన రావణుడు దేవ దానవ గంధర్వ యక్ష రాక్షసులచేత చావు లేకుండా వరం అడిగాడు గాని మనుషుల మీది తేలికభావంకొద్దీ వారి వల్ల చావులేకుండా వరం కోరలేదు. ఇదుగో మహావిష్ణువు, దశరథుడి భార్యలలో ఒకరికి కొడుకుగా పుట్టి నరరూపంతో రావణాసురుణ్ణి సంహరిస్తాడు," అని దేవతలతో అన్నాడు. దేవతలు పరమానందం చెందారు.

ఇంతలో హోమగుండం నుంచి కళ్ళు జిగేలుమనే ఒక మహాభూతం పైకి వచ్చింది. ఆ భూతం తన చేతులలో ఒక కలశాన్ని పట్టుకుని ఉన్నది. కలశం మేలిమి బంగారుతో చేసినది, దానిపై మూత వెండిది.

ఆ భూతం దశరథుడితో, "ఓ రాజా, దేవతలు ఈ కలశంలో తాము వండిన పాయసాన్ని నింపి ఇచ్చారు. ప్రజాపతి ఆజ్ఞపై నేను దీన్ని తెచ్చాను. ఈ పాయసాన్ని నీ భార్యల కిచ్చినట్టయితే వారికి గర్భోత్పత్తి అయి, కొడుకులు కలుగుతారు," అన్నది.

దశరథుడు పరమానందంతో ఆ కలశాన్ని అందుకుని, భూతానికి ప్రదక్షిణ నమస్కారాలు చేశాడు. వెంటనే భూతం అంతర్థానమై పోయింది.







దశరథుడు ఆ కలశంలో ఉండే పాయసంలో సగం కౌసల్య కిచ్చాడు. మిగిలిన దానిలో సగం సుమిత్ర కిచ్చాడు. సుమిత్ర కివ్వగా మిగిలిన దానిలో సగం కైకేయి కిచ్చి, ముగ్గురూ తీసుకోగా మిగిలిన పాయసాన్ని మరొకసారి సుమిత్రకే ఇచ్చాడు. త్వరలోనే కౌసల్యా, సుమిత్రా, కైకేయీ గర్భవతులయారు.

ఒక పంక మహావిష్ణువు మానవుడుగా అవతరించటానికి ప్రయత్నాలు సాగుతూంటే, ఇంకోపంక బ్రహ్మ ఆజ్ఞ చొప్పున దేవతలు కామరూపులైన వానరులను సృష్టించారు.

దేవేంద్రుడికి వాలీ, సూర్యుడికి సుగ్రీవుడూ, బృహస్పతికి తారుడూ, కుబేరుడికి గంధమాదనుడూ, విశ్వకర్మకు నలుడూ, అగ్నికి నీలుడూ, అశ్వినీ దేవతలకు మైంద ద్వివిదులూ, వరుణుడికి సుషేణుడూ, పర్జన్యుడికి శరభుడూ, వాయుదేవుడికి హనుమంతుడూ పుట్టారు. వీరందరూ మహాబలులైన వానరశ్రేష్ఠులు. ఇతర దేవతలకు వేలసంఖ్యలో వానరమూక పుట్టింది. వానరులతోబాటే ఎలుగు బంట్లూ, కొండముచ్చులూ కూడా రావణ వధ కోసం పుట్టారు. ఈ వానరులు ఋష్యమూకం అనే పర్వతం దగ్గిర స్థిరపడి, వాలి సుగ్రీవులను రాజులుగా పెట్టుకుని, నలుడూ, నీలుడూ, హనుమంతుడూ మొదలైన వారిని మంత్రులుగా పెట్టుకుని జీవించసాగారు.

పుత్రకామేష్టి ముగిసిన పన్నెండవ నెలలో చైత్రశుద్ధ నవమినాడు పునర్వసు నక్షత్రాన కౌసల్య రాముణ్ణి ప్రసవించింది. పుష్యమీ నక్షత్రంలో కైకేయికి భరతుడు పుట్టాడు. ఆశ్లేషా నక్షత్రంలో మిట్టమధ్యాహ్నంవేళ సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులు కలిగారు.

అయోధ్యానగరంలో పౌరులు ఉత్సవాలు చేసుకున్నారు. వీధులు జనంతోనూ, నాట్యం చేసేవాళ్లతోనూ, గాయకులతోనూ







కిటకిట లాడిపోయాయి. దశరథుడు అంతు లేని గోదానాలూ, అన్నప్రదానాలూ చేయించాడు.

నలుగురు పిల్లలూ క్రమంగా ఎదిగి పెద్ద వారవుతున్నారు. ఒక తల్లి బిడ్డలు కాక పోయినా రామ లక్ష్మణులు ఎప్పుడూ కలిసి ఉండేవారు. ఒకేసారి భోజనం చేసి ఒకే చోట నిద్రపోయేవారు. అదేవిధంగా భరత శత్రుఘ్నులు ఎప్పుడూ జంటగా తిరిగేవారు. వారు నలుగురూ వేదశాస్త్రాలు అధ్యయనం చేసి, విలువిద్యలో ఆరితేరి, తండ్రికి ఎప్పుడూ శుశ్రూషలు చేస్తూ యౌవనవంతులయారు. దశరథుడు వారి వివాహాలను గురించి మంత్రులతోనూ, పురోహితులతోనూ ఆలోచనలు ప్రారంభించాడు.

రాజూ మంత్రులూ ఈ ఆలోచనలో ఉన్న సమయంలో ద్వారపాలకులు వచ్చి, తొట్రుపడుతూ, "మహారాజా, కుశిక వంశం వాడు, గాధి రాజుకుమారుడు, విశ్వామిత్ర మహాముని తమ దర్శనంకోరి వచ్చి ద్వారం వద్ద ఉన్నారు," అని చెప్పారు.

వెంటనే దశరథుడు పురోహితుణ్ణి వెంట బెట్టుకుని, విశ్వామిత్రుడికి ఎదురు వెళ్ళి అర్ఘ్యపాద్యాలతో పూజించాడు.

విశ్వామిత్రుడు, "రాజా, నీవూ, నీ ప్రజలూ క్షేమంగా ఉంటున్నారా? శత్రు






భయమేమీలేదుగదా!" అని కుశలప్రశ్నలు చేసి, వసిష్ఠాది మునులను పలకరించి రాజభవనం ప్రవేశించి ఉచితాసనంమీద కూర్చున్నాడు.

"మహామునీ, మీరాక నా కెంతో ఆనందాన్ని కలిగించింది. నావల్ల మీకు కావలిసిన దేమిటి?" అని దశరథుడు విశ్వామిత్రుడితో అన్నాడు.

విశ్వామిత్రుడు ఈ మాటకు సంతోషించి, "రాజా, నేను వచ్చిన పని నెరవేర్చి సత్యసంధుణ్ణి అనిపించుకో. నేనొక యాగం తలపెట్టి ఆరంభించేసరికి ఇద్దరు రాక్షసులు, బల పరాక్రమవంతులు, నా యజ్ఞవేదికపై



రక్తమాంసాలు కుమ్మరించి అపవిత్రం చేసి, నా వ్రతసంకల్పం పాడుచేశారు. ఆగ్రహించి వారికి శాపమిద్దామంటే నా వ్రతసంకల్పం భంగమవుతుంది. అందుకని బయలుదేరి ఇక్కడికి వచ్చాను. నా వెంట నీ పెద్ద కొడుకైన రాముణ్ణి పంపించు. నా యజ్ఞాన్ని మారీచ సుబాహులనే ఆ రాక్షసులు భగ్నం చెయ్యకుండా ఈ కుర్రవాడు రక్షిస్తాడు. రాముడు ఆ రాక్షసులను సులువుగా చంపగలడు. ఆ సంగతి వసిష్ఠుడుకూడా ఎరుగును," అన్నాడు.

ఈ మాటలు వినగానే దశరథుడి గుండె బద్దలయినట్టయింది, భయమూ దుఃఖమూ ముంచుకొచ్చాయి. ఆయన సింహాసనంమీది నుంచి లేచి గడగడా వణుకుతూ, "మహామునీ, రాముడు పసివాడు. వాడి కింకా పదహారేళ్లయినా నిండలేదు. వాడికి విలువిద్యకూడా సరిగా రాదు. వాడు రాక్షసులతో ఎక్కడ యుద్ధం చేస్తాడు. నా దగ్గిర ఒక అక్షౌహిణిసేన ఉన్నది. నేనే వచ్చి ఆ రాక్షసులను చంపేస్తాను. ఇంతకూ ఆ రాక్షసులెవరు? ఎంత ఒడ్డూపొడుగూ ఉంటారు? ఎవరి కొడుకులు?" అన్నాడు.

దానికి విశ్వామిత్రుడిలా చెప్పాడు: "రావణుడనే రాక్షసరాజును నీ వెరుగుదువు





కదా! అతడు బ్రహ్మను మెప్పించి గొప్ప శక్తులు పొందాడు. ఇంతకూ ఆ రావణుడు విశ్రవసుడి కొడుకు, కుబేరుడికి సాక్షాత్తూ తమ్ముడు. అతను స్వయంగా యజ్ఞభంగం చెయ్యలేనప్పుడు ఈ బలశాలులైన మారీచ సుబాహులను పంపుతూ ఉంటాడు."

"ఓయమ్మో! రావణుడే? అతడిముందు నేనే నిలవలేనుగదా, పసివాడు రాముడెలా నిలుస్తాడు? ఆ మహాశక్తి మంతుడి పైకి రాముణ్ణి పంపించటం ఎంత మాత్రమూ పొసగదు," అన్నాడు దశరథుడు.

కోపంతో విశ్వామిత్రుడి కళ్ళు ఎర్రబడ్డాయి. "మహారాజా, ఆడినమాట తప్పే వాడివనే అపకీర్తి మోస్తూ సుఖంగా ఉండు!" అంటూ ఆయన చివాలున లేచాడు.

అప్పుడు వసిష్ఠుడు దశరథుణ్ణి మందలిస్తూ, "రాజా, నీవు చేయరాని పని చేస్తున్నావు. ఆడినమాట తప్పి ఇక్ష్వాకు వంశానికి కళంకం తెస్తున్నావు. విశ్వామిత్రుడంటే ఎవరనుకున్నావు? ఆయనకు తెలియని అస్త్రం లేదు, కొత్త అస్త్రాలుకూడా సృష్టించగలవాడు. ఆయన ఆ రాక్షసులను చంపలేక ఇంత దూరం వచ్చాడనుకున్నావా? నీ కొడుకులకు మేలు చేసేటందుకు వచ్చాడు. రాముణ్ణి నిశ్చింతగా ఆయన వెంట పంపు. ఆయనవెంట ఉండగా అతనికి ఏ ప్రమాదమూ రాదు," అని బోధించాడు.

ఈ మాటలతో ధైర్యం తెచ్చుకున్నవాడై దశరథుడు రామ లక్ష్మణులను పిలిపించి, వారిని విశ్వామిత్రుడికి అప్పగించాడు. విశ్వామిత్రుడు ముందు నడుస్తుంటే చక్కగా అలంకరించబడిన రామ లక్ష్మణులు ఒకరి వెనక ఒకరుగా ఆయనను అనుసరించారు. వారిద్దరి వద్దా విళ్ళున్నాయి. వారి చేతులకు ఉడుము తోలుతో చేసిన తొడుగులున్నాయి. వేళ్ళకు కూడా తొడుగులున్నాయి. వారు చేతులలో కత్తులు పట్టుకుని విశ్వామిత్రుడి వెనకగా నడవసాగారు.






విశ్వామిత్రుడూ, ఆయన వెనకగా రామలక్ష్మణులూ ఒక కోసు దూరం నడిచి వెళ్ళి సరయూ నది దక్షిణపుగట్టు చేరుకున్నారు.

"నాయనా, రామా! నీవు వెంటనే ఆచమనం చేసి రా. నీకు బల, అతిబల అనే రెండు విద్యలిస్తాను. మంత్రాలతో కూడి ఉన్న ఈ విద్యలు నీకు అలసటా, జబ్బూ, రాకుండా చేస్తాయి. నీ రూపం చెక్కు చెదరకుండా ఉంచుతాయి. నిన్ను ఆపదల నుంచి కాపాడతాయి. ఆ మంత్రాలు జపిస్తూ ఉన్నంత కాలమూ నిన్ను మించిన అందగాడూ, తెలివిగలవాడూ, నేర్పరీ, వాదనలో నిన్ను మించగలవాడూ ఉండరు. ఆకలిదప్పు లుండవు. గొప్ప కీర్తి కలుగుతుంది," అన్నాడు విశ్వామిత్రుడు.

రాముడు సంతోషంతో ఆచమనం చేసి పరిశుద్ధుడై విశ్వామిత్రుడి నుంచి బలాతిబలలను గ్రహించాడు. ఆ రాత్రికి వారు సరయూ తీరాన విశ్రాంతి తీసుకున్నారు.

తెల్లవారుతూనే విశ్వామిత్రుడు వారిని నిద్రలేపి, సరయూ నదిలో స్నానాలు చేయించాడు. వారు తమ అనుష్ఠానాలు పూర్తి చేసుకుని విశ్వామిత్రుడి వెంట మళ్ళీ బయలుదేరి, సరయూనది గంగలో కలిసే చోటికి వచ్చారు.

అక్కడ ఒక ఆశ్రమం ఉన్నది. అక్కడ ఒకప్పుడు శివుడు తపస్సు చేసుకుంటూ ఉంటే మన్మథుడు ఆయన తపస్సు చెడగొట్టటానికి వచ్చి, శివుడు తన మూడో కన్ను తెరిచేసరికి భస్మమైపోయాడు. అదిమొదలు







ఆ ఆశ్రమంలో శివుడి శిష్యులైన మును లుంటున్నారు. మన్మథుడు తన అంగాన్ని—అంటే శరీరాన్ని—అక్కడ పోగొట్టు కున్నాడు గనక, ఆ ప్రాంతానికి అంగదేశ మనే పేరు వచ్చింది.

రామలక్ష్మణులు ఈ విషయాలన్నీ విశ్వా మిత్రుడి ద్వారా తెలుసుకుని, ఆ రాత్రి ఆ ఆశ్రమంలో గడిపి, మర్నాడు ఒక పడవలో గంగను దాటారు. ఆ తరవాత వారు కాలినడకను ఒక భయంకరమైన అరణ్యం ప్రవేశించారు. ఎక్కడా జన సంచారం లేదు. విడవకుండా కీచురాళ్ళ అరుపులూ, సింహగర్జనలూ, పులుల



కాండ్రింపులూ, అడవిపందుల గురగురలూ, ఏనుగుల ఘీంకారాలూ వినవస్తున్నాయి. చంద్ర, మద్ది, మారేడు, తుమ్మ, రేగు మొదలైన చెట్లు దట్టంగా పెరిగి మనుషులు చొర రాకుండా ఉన్నది ఆ అరణ్యం.

రాముడా అరణ్యాన్ని చూసి ఆశ్చర్య పడి విశ్వామిత్రుణ్ణి, "మహామునీ, ఈ అరణ్యం పేరేమిటి?" అని అడిగాడు. విశ్వామిత్రుడు ఆ అరణ్యం కథ అంతా రామలక్ష్మణులకు వివరంగా చెప్పాడు.

ఆ ప్రాంతంలో ఒకప్పుడు మలదమూ, కరూశమూ అని రెండు గొప్ప దేశాలుండేవి. ఈ ప్రాంతాలలో తాటక అనే యక్షిణీ, దాని కొడుకు మారీచుడనేవాడూ చేరి రెండు దేశాలనూ నాశనం చేస్తున్నారు. వారికి జయ పడి మనుషులెవరూ అటుకేసి రావటం లేదు. తాటక సామాన్యురాలు కాదు, వెయ్యి ఏనుగుల బలం కలది. అందుచేత అది సుభిక్షంగా ఉన్న రెండు దేశాలనూ మహారణ్యంగా మార్చ గలిగింది.

ఈ మాట విని రాముడు, "స్వామీ, యక్షులు అల్ప శక్తిగలవారంటారు గదా, ఈ తాటక అనే యక్షిణికి వెయ్యి ఏను గుల బలం ఎలా వచ్చింది?" అని విశ్వామి త్రుణ్ణి అడిగాడు.











"నాయనా, తాటక వృత్తాంతంకూడా చెబుతాను, విను. సుకేతుడనే గొప్ప యక్షుడుండేవాడు. ఆయన బిడ్డలను కోరి గొప్ప తపస్సు చేశాడు. బ్రహ్మ ఆయన తపస్సుకు సంతోషించి, ఆయనకు కొడుకును ఇవ్వక, వెయ్యి ఏనుగుల బలంగల కూతురు కలిగే లాగుమటుకు వరమిచ్చాడు. బ్రహ్మ వర ప్రభావంచేత సుకేతుడికి తాటక పుట్టి పెరగ సాగింది. ఆమె యుక్తవయస్సు వచ్చి మంచి అందగత్తెగా తయారయింది. అప్పుడు సుకేతుడు ఆమెను సుందుడనే యక్షకుమారుడి కిచ్చి పెళ్ళి చేశాడు. వారిద్దరికీ మారీచుడనే కొడుకు కలిగాడు. వాడు పరాక్రమంలో ఇంద్రుణ్ణి పోలినవాడు, చాలా గర్వంగలవాడు. ఇలా ఉండగా ఒక సంగతి జరిగింది. ఈ ప్రాంతాలనే తపస్సు చేసుకుంటున్న అగస్త్యుడు తాటక భర్త అయిన సుందుణ్ణి చంపాడు. అందుకని తాటకా, మారీచుడూ అగస్త్యుడిపై ఆగ్రహించి, గట్టిగా అరుస్తూ ఆయనను తినేసేటట్టుగా మీదికి వచ్చారు. అప్పుడగస్త్యుడు వారిద్దరినీ రాక్షసులు కమ్మని శపించాడు. మారీచుడు రాక్షసుడైపోయాడు. తాటక తన అందమంతా కోల్పోయి భయంకరాకారం ధరించి, నరభక్షిణిగా మారిపోయింది. తాటక అగస్త్యుణ్ణి ఏమీ చెయ్యలేక ఆయన సంచరించిన ఈ పుణ్యభూమిని పాడుపెట్టేస్తూ భీభత్సం కలిగిస్తున్నది. అందుచేత, ఓ రామా, నీవా తాటకను వధించు. ఆడదని సంకోచించకు. ఈమె చేస్తున్న దుర్మార్గానికి అంతులేదు. ఈమెను చంపినందువల్ల నీకు కొంచెమైనా పాపం రాదు," అని విశ్వామిత్రుడు చెప్పాడు. రాముడు చేతులు జోడించి, "మహామునీ, మా తండ్రి మీరు చెప్పినదెల్లా చెయ్యమని అజ్ఞాపించి మీ వెంట పంపారు. అందుచేత మీ అజ్ఞ చొప్పున అలాగే తాటకను చంపుతాను," అన్నాడు.





అ తరవాత రాముడు బాణంచేత పట్టి దాని తాడును బలంగాలాగి ఖంగు ఖంగు మని మోగించాడు.

ఈ చప్పుడు వినపడే సరికి తాటాకా వనంలో ఉండేవారంతా ఉలిక్కిపడ్డారు. తాటక మండిపడి ఆ ధ్వని వినిపించిన వేపు అతి వేగంగా పరిగెత్తుకుంటూ వచ్చింది. అలా తమకేసి వచ్చే తాటకను చూసి రాముడు లక్ష్మణుడితో, "చూశావా, లక్ష్మణా, ఈమె ఎంత వికారాకారం కలిగి, ధైర్యవంతులకుకూడా భీతి కలిగించేదిగా ఉన్నదో! ఈ ఆడదాన్ని చంపటానికి నాకు చేతులు రావటంలేదు. దగ్గిరికి రానీ, ముక్కూ, చెవులూ కోసి, పొగరు అణచి పంపేద్దాం!" అన్నాడు.

తాటక ఈ మాటలు విని మరింత ఉగ్రురాలై చేతులు పైకెత్తి రాముడి మీదికే వచ్చి, దుమ్ము చిమ్ముతూ రామలక్ష్మణులను కప్పేసి, వారిపై రాళ్ళవాన కురిపించ సాగింది. రాముడు దాని చేతులు రెండూ తన బాణాలతో తెగగొట్టాడు. లక్ష్మణుడు అతి కోపంతో దాని ముక్కూ, చెవులూ కోసేశాడు. కాని మాయావి అయిన తాటక వాళ్ళపై మళ్లీ రాళ్లవాన కురిపించసాగింది.

అప్పుడు విశ్వామిత్రుడు, "రామా, ఈ పాపాత్మురాలిని దయతలుస్తా వేమిటి?



ఇది ప్రాణాలతో ఉంటే ఇంకా ఎన్ని మాయలైనా చెయ్యగలదు. సంధ్యాకాలం లోపల దీన్ని చంపెయ్యి. ఉదయవేళా, సాయం సమయానా రాక్షసులకు బలం హెచ్చు. ఆ సమయంలో వారిని జయించటం కష్టం," అని హెచ్చరించాడు.

ఈమాట విని రాముడు తాటక రొమ్ములోకి ఒక్క బాణం బలంగా కొట్టాడు. ఆ దెబ్బతో అది నేలమీద పడి, గిలగిలా తన్నుకుని ప్రాణాలు వదిలింది.

విశ్వామిత్రుడు పరమానందభరితుడై రాముణ్ణి దగ్గిరికి తీసుకుని, తల వాసన చూసి, "నాయనా, ఈ దుష్టురాలిని చంపి చాలా మేలు చేశావు. ఈ రాత్రికి మనం ఇక్కడనే ఉండి, తెల్లవారి మన ఆశ్రమానికి పోదాం," అన్నాడు.

మర్నాడు వేకువజామునే ఆయన రాముణ్ణి లేపి, తాను శుచి అయి, తూర్పు ముఖంగా కూచుని రాముడికి అనేక అస్త్రాల తాలూకు మంత్రాలు ఉపదేశించి, జపం చేశాడు. అంతలోనే ఆ అస్త్రాలన్నీ రాముడి ఎదట రూపంతో నిలబడి, చేతులు జోడించి, "మేము నీ భృత్యులం. ఏ పని చెబితే అది చేస్తాం," అన్నాయి. రాముడు ఆ అస్త్రాలను చేతితో తాకి, "ఇప్పటికి మీరంతా నా మనసులో చేరి ఉండండి," అని చెప్పాడు.





తరవాత రాముడు విశ్వామిత్రుడి నుంచి అస్త్రాలను ఉపసంహరించే మంత్రాలు కూడా అడిగి తెలుసుకున్నాడు. తరవాత వారు ముగ్గురూ ప్రయాణం సాగించారు.

వారు కొంతదూరం పోయేసరికి ఒక కొండ పక్కగా ఒక అందమైన వనం కనిపించింది. రాముడది చూసి, "స్వామీ, ఈ వనం చూస్తే నాకెంతో ఆనందంగా ఉన్నది. ఇది ఒక ఆశ్రమమనికూడా తోస్తున్నది, దీని కథ ఏమిటి?" అని అడిగాడు. విశ్వామిత్రుడు ఈ విధంగా చెప్పాడు:

"నాయనా, పూర్వం విరోచనుడి కొడుకైన బలి మహా బలపరాక్రమశాలి అయి,



మూడు లోకాలనూ జయించి స్వర్గలోకం ఆక్రమించే సరికి, మహావిష్ణువు కశ్యపుడికి వామనుడుగా పుట్టి, బలి చేసే మహా యాగానికి వెళ్ళి బలిని మూడడుగుల భూమి యాచించాడు. బలి ఇచ్చాడు. వామనుడు మూడడుగులూ కొలిచి మూడు లోకాలూ పుచ్చుకుని బలిని అధోలోకానికి పంపేశాడు. ఆ వామనుడూ, ఆయన తండ్రి కశ్యపుడూ కూడా ఈ ఆశ్రమంలోనే దీర్ఘ తపస్సు చేశారు. అందుచేత నేనుకూడా ఇక్కడే ఆశ్రమం ఏర్పాటు చేసుకున్నాను. రాక్షసులు మాటి మాటికీ వచ్చి నన్ను చాలా క్షోభ పెడుతున్నారు. వారందరినీ నీవు చంపాలి."

విశ్వామిత్రుడుంటున్న ఆశ్రమం పేరు సిద్ధాశ్రమం. విశ్వామిత్రుడు రామలక్ష్మణులతోసహా ఆశ్రమం ప్రవేశించగానే అక్కడ ఉండే మునులందరూ సంతోషంతో పరిగెత్తుకుంటూ వచ్చి విశ్వామిత్రుణ్ణి పూజించి, రామలక్ష్మణులకు అతిథి సత్కారాలు చేశారు. రామలక్ష్మణులు కొంచెంసేపు విశ్రమించి ప్రయాణపు బడలిక తీర్చుకుని, విశ్వామిత్రుడి వద్దకు వచ్చి నమస్కారం చేసి, "మహామునీ, ఇక మీరు యాగం సాగించే ప్రయత్నాలు చేయవచ్చు. మీ యాగాన్ని మేము రక్షిస్తాము," అని చెప్పారు.







ఆ రాత్రి గడిచింది. రామలక్ష్మణులు లేచి, సంధ్యానుష్ఠానాలన్నీ ముగించి విశ్వామిత్రుడి వద్దకు వచ్చేసరిగి ఆయన అప్పటికే హోమం ముందు కూచుని ఉన్నాడు. వారు విశ్వామిత్రుడికి నమస్కరించి, "మహాత్మా, రాక్షసులు ఎప్పుడు వస్తారు? వాళ్ల కోసం మేము ఏ సమయాలలో కాచుకుని ఉండాలి?" అని అడిగారు.

విశ్వామిత్రుడు జవాబు చెప్పలేదు, కాని యజ్ఞవేదిక చుట్టూ చేరిన మునులు రామలక్ష్మణులతో, "నాయనలారా, 'విశ్వామిత్రుడు యాగదీక్షలో ఉండటంచేత మౌనంగా ఉండాలి. ఇవాళ్టినుంచీ ఆరు రోజులదాకా మీరు మమ్మల్ని కాపాడాలి," అని చెప్పారు.

రామలక్ష్మణులు పెద్ద పెద్ద బాణాలు ధరించి, రాత్రివేళ నిద్రకూడా మాని అయిదు పగళ్ళూ, అయిదు రాత్రులూ ఆశ్రమాన్ని కాపాడారు. ఆరో రోజు వచ్చింది.

యజ్ఞశాలలో అగ్ని దేదీప్యమానంగా వెలుగుతున్నది. విధియుక్తంగా, మంత్రోక్తంగా యాగం నడుస్తున్నది. ఆ సమయంలో ఆకాశం నుంచి పెడబొబ్బలు వినిపించాయి. సుబాహు మారీచులూ, వారి బలగానికి చెందిన రాక్షసులూ కారుమేఘాల లాగా ఆకాశం ఆవరించి యజ్ఞవేదికపై రక్త వర్షం కురిపించసాగారు.

రాముడు రాక్షసుల ఆర్భాటాలు విని, తలఎత్తి ఆకాశంలోని రాక్షసమూకను చూశాడు. అతను మానవాస్త్రం ఎక్కుపెట్టి మారీచుణ్ణి కొట్టాడు. ఆ దెబ్బకు వాడు వెళ్ళి సముద్రంలో పడ్డాడు. తరవాత రాముడు ఆగ్నేయాస్త్రంతో సుబాహుణ్ణీ, వాయవ్యాస్త్రంతో మిగిలిన రాక్షసులనూ చంపేశాడు. విశ్వామిత్రుడి యాగం పూర్తి అయింది. ఆయన రాముడితో, "నాయనా, నాకు చాలా గొప్ప ఉపకారం చేశావు," అంటూ అతన్ని ప్రశంసించాడు.








తాటకను సంహరించి, మారీచ సుబాహులను కొట్టి, విశ్వామిత్రుడి యాగాన్ని నిర్విఘ్నంగా కొనసాగించిన నాటి రాత్రి రామలక్ష్మణులు హాయిగా నిద్రపోయి వేకువతోనే లేచారు. వారు కాలకృత్యాలు తీర్చుకుని, విశ్వామిత్రుడూ ఇతర మునులూ ఉండే చోటికి వెళ్ళి, వారందరికీ నమస్కారాలు చేసి, విశ్వామిత్రుడితో, "మహాముని, మీ ఆజ్ఞ నిర్వర్తించాము. ఇంకా చెయ్యవలిసిన పనులేవైనా ఉంటే సెలవియ్యండి," అని అడిగారు.

అప్పుడు మునులు రామలక్ష్మణులతో ఇలా చెప్పారు: "మిథిలానగరాన్ని పాలించే జనక మహారాజు ఒక గొప్పయాగం చెయ్యబోతున్నాడు. మేమంతా బయలుదేరి అక్కడికి వెళుతున్నాము. ఒకప్పుడా జనక మహారాజు ఒక యాగం చేసి దానికి ఫలితంగా దేవతల నుంచి ఒక అద్భుతమైన ధనుస్సు సంపాదించాడు. దేదీప్యమానంగా వెలిగిపోయే ఆ ధనుస్సును ఆ మహారాజు తన ఇంట ఉంచుకుని రోజూ సుగంధధూప దీపాలతో అర్చిస్తూ ఉంటాడు. ఆ ధనుస్సును దేవతలుగాని, రాక్షసులుగాని ఎక్కుపెట్టలేరంటే ఇక మనుషులమాట చెప్పాలా? మహా బలశాలులైన రాజులూ, రాజకుమారులూ ఎందరో ప్రయత్నించికూడా దాన్ని ఎక్కుపెట్టలేకపోయారు. మీరుకూడా వచ్చినట్టయితే జనక మహారాజు చేసే యాగాన్నీ, ఆ అద్భుతమైన ధనుస్సును చూడగలుగుతారు."









అక్కడ వారంతా స్నానసంధ్యానుష్ఠానా లన్నీ తీర్చుకున్నాక రామలక్ష్మణులు విశ్వామిత్రుడికి ఎదురుగా కూర్చుండి, "స్వామీ, అందమైన వనాలుగల ఈ దేశం ఏది? దీని వృత్తాంతమేమిటి?" అని అడిగారు.

ఆ ప్రశ్నకు సమాధానంగా విశ్వామిత్రుడు ఆ దేశం గురించీ, తన వంశం గురించీ ఇలా చెప్పాడు:

"పూర్వం బ్రహ్మయొక్క కుమారుడు కుశుడనే మహాతపస్వి ఉండేవాడు. ఆయన వైదర్భి అనే ఒక రాజకుమార్తెను పెళ్ళాడి, ఆవిడకు నలుగురు కుమారులను—కుశాంబుడు, కుశనాభుడు, అధూర్తరజసుడు, వసువు అనేవారిని—కన్నాడు. ఆయన క్షత్రియ ధర్మాన్ని పెంపొందించగోరి తన నలుగురు కొడుకులనూ భూమిని పంచుకుని, న్యాయంగా ప్రజా పరిపాలన చేయవలసిందిగా ఆజ్ఞాపించాడు. వారు కూడా ఆ విధంగానే నాలుగు గొప్ప నగరాలను తమ రాజధానులుగా చేసుకుని రాజ్యపాలన చేశారు. కుశాంబుడి రాజధాని కౌశాంబి; కుశనాభుడి రాజధాని పేరు మహోదయం; అధూర్తరజసుడు ధర్మారణ్యమనే పట్టణాన్ని రాజధాని చేసుకున్నాడు; వసువు అనేవాడు గిరివ్రజం రాజధానిగా పెట్టుకుని

అప్పుడే ప్రయాణ సన్నాహాలు జరిగాయి. విశ్వామిత్రుడు వనపాలకులతో, "నేను మిగిలిన మునులందరినీ వెంట బెట్టుకుని గంగానదికి ఉత్తరంగా హిమాలయాలకేసి వెళుతున్నాను," అని చెప్పి, సిద్ధాశ్రమానికి ప్రదక్షిణం చేసి తిరిగివచ్చాడు.

తరవాత మునులందరూ రామలక్ష్మణులతో ఉత్తరాభిముఖులై బయలుదేరారు. వారి వెనక కొన్నివందల బండ్లమీద సమిధలూ, ఇంధనాలూ మొదలైన అగ్నిసాధనాలు వచ్చాయి. వారు పగలల్లా చాలా దూరం నడిచి అస్తమయ వేళకు శోణానదీ తీరాన్ని చేరుకున్నారు.







పాలించాడు. మనం ఇప్పుడున్నది ఆయన పాలించిన దేశంలోనే.

"ఈ దేశంచుట్టూ అయిదు అందమైన పర్వతాలున్నాయి. ఈ శోణానది ఆ పర్వతాలలోనే పుట్టి ఈ ప్రదేశాన్ని సారవంతంగానూ, సస్యశ్యామలంగానూ చేస్తున్నది. ఇది తూర్పున పుట్టి పడమరకు ప్రవహించే నది.

"కుశుడి కుమారులలో కుశనాభుడనే వాడొకడని చెప్పానుగద. ఆయనకు ఘృతాచి అనే భార్య ఉండేది. వారిద్దరికీ నూరుమంది ఆడపిల్లలు కలిగారు. వారంతా చక్కని చుక్కలు. ఒకనాడు ఆ నూరు మంది కన్యలూ ఆడుతూ, పాడుతూ ఉల్లాసంగా వనవిహారం చేస్తూండగా వాయుదేవుడు వారిని చూసి మోహించి, తనను పెళ్ళాడమని కోరుతూ, అలా చేసినట్టయితే వారిని ముసలితనమూ, చావూలేని దేవతలుగా చేస్తానన్నాడు. కాని ఆ కన్యలు వాయుదేవుణ్ణి తిట్టి, తమ తండ్రి నిర్ణయించిన భర్తను తప్ప చేసుకోమన్నారు. వాయుదేవుడికి ఆగ్రహం వచ్చి వారందరినీ మరుగుజ్జులుగా చేసేశాడు. అప్పుడా కన్యలు ఏడుస్తూ తండ్రి దగ్గిరికి వెళ్ళి జరిగినదంతా చెప్పుకున్నారు.




"తన కుమార్తెలు ప్రదర్శించిన ఐకమత్యమూ, వంశాభిమానమూ చూసి కుశనాభుడు చాలా సంతోషించాడు. వారిని ఇక పెళ్ళిలేకుండా ఉంచటం క్షేమం కాదనుకుని ఆయన, కాంపిల్యపురాన్ని పాలించే బ్రహ్మదత్తుడనే రాజుకు తన కుమార్తెలందరినీ ఇచ్చి పెళ్ళిచేశాడు. బ్రహ్మదత్తుడు తాకగానే వారందరికీ మరుగుజ్జుతనం పోయింది.

"కూతుళ్ల కందరికీ పెళ్ళిచేశాక కుశనాభుడు కొడుకునుకోరి పుత్రకామేష్టి చేశాడు. ఆయనకు గాధి అనే ధర్మాత్ముడైన కొడుకు కలిగాడు. ఆ గాధి రాజు కొడుకునే నేను. నాకు సత్యవతి అనే అక్క ఒకామె







ఉండేది. ఆమెను ఋచీకుడికిచ్చి చేశారు. ఆవిడ మహా పతివ్రత. మేము కుశికవంశం వాళ్లం గనక మమ్మల్ని కౌశికులనికూడా అంటారు. మా అక్క పేరుతో కౌశికి అనే నది ఏర్పడింది. మా అక్కపైగల అభిమానం కొద్దీ నేను హిమవత్ప్రాంతంలో కౌశికీ నదీ తీరానే ఉంటున్నాను. అయితే యాగం నిమిత్తమై సిద్ధాశ్రమానికి వచ్చానన్నమాట. మన కబుర్లతో అప్పుడే సగం రాత్రి గడిచిపోయింది. రామా, ఇక మీరిద్దరూ పడుకుని నిద్రపొండి!"

ప్రయాణపు బడలిక మూలాన రామలక్ష్మణులు ఆ రాత్రి గాఢ నిద్రపోయి, తెల్ల



వారి విశ్వామిత్రుడు లేపినదాకా లేవలేదు. అప్పుడు వారు కాలకృత్యాలు తీర్చుకుని శోణానదిని అందరూ దాటే రేవులో దాటారు. అది ఆటే లోతైన నదికాదు; ఇసుకతిన్నెలతో చాలా అందంగా ఉన్నది.

వారా నదిని దాటి మళ్ళీ నడక సాగించి మధ్యాహ్నం వేళకు గంగాతీరాన్ని చేరుకున్నారు. పవిత్రమైన గంగను చూడగానే అందరికీ అంతులేని ఆనందం కలిగింది. అక్కడ వారు స్నానం చేసి, దేవతర్పణాలూ, పితృతర్పణాలూ చేసుకుని, హోమం చేసి, భోజనాలు పూర్తిచేసుకుని గంగాతీరాన విశ్వామిత్రుడి చుట్టూ కూచున్నారు. అప్పుడా మహర్షి వారందరికీ గంగయొక్క వృత్తాంతం యిలా చెప్పాడు:

హిమవంతుడనే పర్వతరాజుకు గంగా, ఉమా అని ఇద్దరు కుమార్తెలు. వారిలో పెద్దదైన గంగను దేవతలు పర్వతరాజును బతిమాలి స్వర్గానికి తీసుకుపోయారు. ఉమను పరమశివుడు పెళ్ళి చేసుకున్నాడు. కాలక్రమాన సగర చక్రవర్తి మనమడికి మనమడైన భగీరథుడు గంగను అతి ప్రయాసతో స్వర్గం నుంచి భూమికి తెచ్చి, భూమి నుంచి పాతాళానికి కూడా తీసుకుపోయాడు.












విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు గంగావతరణకథా, కుమారస్వామి జన్మ వృత్తాంతమూ సవిస్తరంగా చెప్పాడు. ఆ రాత్రి వారందరూ గంగయొక్క దక్షిణపు గట్టున గడిపి, మర్నాడు తెల్లవారగానే దర్భాసనాలు పరిచిన పడవలలో ఉత్తరపు గట్టుకు చేరుకున్నారు. అక్కడ వారికి విశాలానగరం కనిపించింది. ఆ నగరాన్ని చాలాసేపు చూసినాక రాముడు విశ్వామిత్రుణ్ణి, "మహామునీ, ఈ నగరాన్ని పాలిస్తున్నది ఏ వంశపు రాజులు? వారి కథ ఏమిటి?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు సమాధానంగా విశ్వామిత్రుడు, దేవదానవులు క్షీరసాగరాన్ని మథించటమూ, అందులో పుట్టిన హాలాహలాన్ని శివుడు మింగటమూ, అమృతం పుట్టగా దానికోసం దేవదానవులు పోట్లాడుకుంటూంటే విష్ణువు మోహినీ రూపంలో వచ్చి అమృతాన్ని హరించి, తనను ఎదిరించిన వారినందరినీ చంపి, తనను శరణుజొచ్చిన వారిని కాపాడటమూ మొదలైన విషయాలన్నీ చెప్పి, ఇలా అన్నాడు:

తన కొడుకులందరూ ఇంద్రుడి చేతిలో చనిపోయేసరికి దితి తన భర్త అయిన కశ్యపుడి వద్దకు వెళ్ళి, ఇంద్రుణ్ణి చంపగల కొడుకు తనకు కలిగేటట్టు వరమియ్యవలసిందని వేడుకున్నది.

"నీవు వెయ్యి సంవత్సరాలు నిష్ఠతో, ఎలాటి మైలకూడా సోకకుండా, తపస్సు చేసినట్టయితే, ఇంద్రుణ్ణి చంపి, ముల్లోకాలూ ఏలగల కొడుకు కలుగుతాడు," అని కశ్యపుడు దితికి వరమిచ్చాడు.

దితి సంతోషించి కుశప్లవసమనే చోట చేరి కఠోరమైన తపస్సు ప్రారంభించింది. ఇంద్రుడు ఆమె వద్దకు వచ్చి ఎంతో భక్తితో ఆమెకు సేవలు చేస్తూ, నీరూ, సమిధలూ, దర్భలూ, కందమూల ఫలాలూ తెచ్చి ఇస్తూవచ్చాడు.








తొమ్మిదివందల తొంభై సంవత్సరాలు గడిచాయి. ఇంకా పదేళ్ళు గడిస్తే దితి గర్భం నుంచి ఇంద్రుణ్ణి చంపగలవాడు బయటికి వస్తాడు. ఒకనాటి మధ్యాహ్నం ఈ సంగతి దితి ఇంద్రుడితో చెప్పి, "నాయనా, నాకు విసురుతున్నావు, కాళ్ళు పిసుకుతున్నావు. అందుచేత నాకు పుట్టే కొడుకు నీతో సఖ్యంగా ఉండేటట్టు నేను చూస్తాలే!" అన్నది. అంటూ ఆమె తలను కాళ్ళు పెట్టవలిసిన చోట ఉంచి పక్క మీద పడుకుని నిద్రపోయింది.

ఈవిధంగా ఆమెకు మైలసోకింది. ఇలాటి అవకాశం కోసమే వేచివున్న ఇంద్రుడు



వెంటనే ఆమె గర్భంలో ప్రవేశించి, గర్భం లోని పిండాన్ని తన వజ్రాయుధంతో ఏడు ముక్కలుగా నరికాడు. వారే దేవతా సమానులైన సప్త మారుతాలు.

"రామా, ఆ సమయంలో దితి తపస్సు చేసుకుంటూ ఉంటే ఇంద్రుడు ఈ ప్రదేశం లోనే ఆమెకు సేవలుచేశాడు. అటు తర వాత ఇక్ష్వాకు మహారాజుకు విశాలుడనే కుమారుడు కలిగాడు. అతనే ఈ మహా నగరాన్ని నిర్మించాడు. అందుకే దీనికి విశాలా నగరమనే పేరువచ్చింది. ఇప్పుడీ నగరాన్ని వారి వంశానికి చెందిన సుమతి అనేవాడు పాలిస్తున్నాడు," అని విశ్వా మిత్రుడు రాముడితో అన్నాడు.

ఈలోపల సుమతికూడా విశ్వామిత్రాదుల రాక తెలిసి బంధు మంత్రి పురోహితులు మొదలైనవారితో ఎదురువచ్చి స్వాగతం చెప్పాడు. విశ్వామిత్రుడు రామలక్ష్మణు లను సుమతికి పరిచయం చేశాడు. వారందరూ ఆ రాత్రికి సుమతి అతిథులుగా ఉండి, తెల్లవారగానే మిథిలానగరానికి ప్రయాణమయారు.

వారు మిథిలను చేరవచ్చే సమయంలో దారిలో ఒక పాడుబడిన ఆశ్రమం కన బడింది. ఆ ఆశ్రమం అందంగా ఉన్నప్పటికీ







అందులో జనసంచారం లేకపోవటానికి కారణమేమిటని రాముడు అడిగాడు.

"నాయనా, ఒకప్పుడీ ఆశ్రమంలో గౌతమ మహాముని తన భార్య అయిన అహల్యతోకూడా సాటిలేని తపస్సు చేశాడు. ఆయనకు ఆగ్రహం తెప్పించి ఆయన తపశ్శక్తి నిర్మూలించాలనే ఉద్దేశంతో, ఇంద్రుడు గౌతముడు స్నానానికిగాను నదికి వెళ్ళి ఉన్న సమయంలో మునివేషం ధరించి అహల్య వద్దకు వచ్చాడు. అహల్య అతని కోరిక తీర్చి పంపేసింది. ఇంద్రుడికి గౌతముడు తడి బట్టలతో ఎదురై, జరిగినది తెలుసుకుని, ఇంద్రుడికి శాపమిచ్చి, ఆశ్రమానికి వచ్చి తన భార్యను కూడా శపించాడు. ఆ శాపం ఫలితంగా ఆమె గాలి తప్ప మరొక ఆహారం లేక, ఎవరికీ కనబడకుండా ఈ ఆశ్రమంలో తపస్సమాధిలో ఉండిపోయింది. నిన్ను చూడగానే ఆమెకు శాపవిమోచనం కలిగేలాగు గౌతముడు అనుగ్రహించాడు గనక మనం ఈ ఆశ్రమం ప్రవేశించి, ఆ అహల్య అందరికీ తిరిగి కనబడేలాగు చేద్దాం," అన్నాడు విశ్వామిత్రుడు.

వారు లోపలికి వెళ్ళేసరికి రాముడి కళ్ళకు సూర్యుడి కాంతితో వెలిగిపోతూ, మోహినీ దేవతను బోలిన అందంగల అహల్య కనిపించింది. ఆమె రాముణ్ణి చూడగానే ఆమెను మిగిలిన వారుకూడా చూడగలిగారు.

రామలక్ష్మణులు వంగి ఆమె కాళ్ళు తాకి నమస్కరించారు. తన భర్త చెప్పిన మాటలు జ్ఞాపకం తెచ్చుకుని అహల్య రామలక్ష్మణుల కాళ్ళు తాకి, వారికి అర్ఘ్య పాద్యాలిచ్చింది. ఆ సమయానికే గౌతముడు కూడా తిరిగివచ్చాడు.

విశ్వామిత్రుడు అక్కడి నుంచి బయలుదేరి, రామలక్ష్మణులను వెంట బెట్టుకుని మిథిలానగరం ప్రవేశించాడు.






రామలక్ష్మణులను వెంట బెట్టుకుని విశ్వామిత్రుడు ఈశాన్య దిక్కుగా వెళ్ళి జనక మహారాజు యజ్ఞం చేస్తున్న చోటికి వెళ్లాడు. యజ్ఞశాల చుట్టూ అనేక ఋషి నివాసాలున్నాయి. విశ్వామిత్రుడు కూడా ఒక నివాసం తమకై ఏర్పాటు చేయించాడు.

ఈలోపల జనక మహారాజుకు విశ్వామిత్రుడు వచ్చినట్టు తెలిసింది. ఆయన తన పురోహితుడైన శతానందుడితో సహా వచ్చి విశ్వామిత్రుడికి అర్ఘ్యపాద్యాలిచ్చి పూజించాడు. జనక మహారాజు విశ్వామిత్రుడితో తన యజ్ఞం పూర్తికావటానికి ఇంకా పన్నెండు రోజులున్నదని చెప్పి, రామలక్ష్మణులను చూసి, "ఈ రాజపుత్రులెవరు? ఎవరి కుమార్లు?" అని అడిగాడు.

విశ్వామిత్రుడు జనకుడికి రామలక్ష్మణులను పరిచయం చేసి, "మీ వద్ద ఉండే వింటిని ఎక్కుపెట్టటం సాధ్యమవుతుందేమో చూడడానికే ఈ అబ్బాయిలు ముఖ్యంగా ఇక్కడికి వచ్చారు," అని తెలియపరిచాడు.

జనకుడి వద్ద పురోహితుడుగా ఉంటున్న శతానందుడు అహల్యా గౌతముల పెద్ద కుమారుడు. రాముడి వల్ల తన తల్లికి శాప విమోచనం జరిగిందనీ, తన తల్లిని శపించి వెళ్ళిపోయిన తండ్రి ఆశ్రమానికి తిరిగి వచ్చాడనీ విని శతానందుడు ఎంతో సంతోషించాడు. అతను రాముడి కేసి తిరిగి, "రామా, ఈ విశ్వామిత్ర మహాముని అనుగ్రహం సంపాదించటం వల్ల నీవు ధన్యుడ







వయావు. ఈ మహనీయుడి విచిత్రగాథ చెబుతాను విను," అంటూ, అక్కడ చేరిన వారంతా వింటూండగా విశ్వామిత్రుడి జీవిత వృత్తాంతం ఈ విధంగా చెప్పసాగాడు :

బ్రహ్మదేవుడికి కుశుడనే కుమారుడు పుట్టాడు. ఆయనకు కుశనాభుడు పుట్టాడు. కుశనాభుడి కొడుకైన గాధికి విశ్వామిత్రుడు కొడుకై పుట్టి, చాలాకాలం రాజ్యంచేశాడు. ఆ కాలంలో ఆయన ఒక అక్షౌహిణి సేనను వెంట బెట్టుకుని పర్యటన చేస్తూ వసిష్ఠ మహాముని ఆశ్రమానికి వచ్చాడు. తపస్సులో నిమగ్నులై ఉండే ఋషులతో ఆ ఆశ్రమం రెండో బ్రహ్మలోకంలాగా ఉన్నది.



తన ఆశ్రమంలోకి వచ్చిన విశ్వామిత్రుడికి వసిష్ఠుడు అతిథి సత్కారాలు చేశాడు, ఇద్దరూ కుశలప్రశ్నలు వేసుకున్నారు. కొంచెంసేపు ఇష్టాగోష్ఠి జరిగాక వసిష్ఠుడు తన అతిథికి ఆయన పరివారానికి విందు చేస్తానన్నాడు. "తమ దర్శనమే నాకు గొప్ప విందు. వేరే విందు లెందుకు ?" అంటూ విశ్వామిత్రుడు బయలుదేరబోయాడు. కాని వసిష్ఠుడాయనను బలవంతాన ఉంచేసి, శబల అనే తన కామధేనువును పిలిచి, భక్ష్యభోజ్యలేహ్య చోష్యపానీయాలతో అందరికీ షడ్రసోపేతమైన విందు ఏర్పాటు చేయమన్నాడు. శబల అలాగే చేసింది.

విశ్వామిత్రుడీ విందుకు ఎంతో ఆనందించి, "మహర్షీ, నాకు శబలను ఇప్పించండి. దీనికి మారుగా లక్షగోవులను ఇచ్చుకుంటాను. శ్రేష్ఠమైన వస్తువులన్నీ రాజుకే చెందాలి గనక న్యాయంగా ఈ కామధేనువు నాకే చెందాలి," అన్నాడు.

"మహారాజా, లక్ష గోవులు కాదు, నూరు కోట్ల గోవుల నిచ్చినా నేను శబల నివ్వను. ఇదే నాకున్న ధనం. మా ఆశ్రమం యావత్తూ దీనిపైనే ఆధారపడి ఉన్నది," అన్నాడు వసిష్ఠుడు.











విశ్వామిత్రుడు వసిష్ఠుడికి అడిగినంత బంగారం ఇస్తానన్నాడు, రత్నరాసు లిస్తానన్నాడు, శబలను ఎలాగైనా తన కివ్వమన్నాడు. వసిష్ఠుడు నిరాకరించాడు. అప్పుడు విశ్వామిత్రుడు శబలను బలాత్కారంగా తీసుకుపోవటానికి ఉద్యమించాడు.

శబల తనను పట్టవచ్చిన రాజభటులను కుమ్మి, రంకెలు వేస్తూ, కన్నీరుకారుస్తూ వచ్చి వసిష్ఠుడి కాళ్ళపైబడి, "ఏమిటీ అన్యాయం?" అన్నది.

వసిష్ఠుడు శబలతో, "విశ్వామిత్రుడు అక్షౌహిణీసేనతో వచ్చిన బలశాలి. నాకా బలంలేదు. నేనేం చేసేది?" అని అడిగాడు.

"తమ తపశ్శక్తి ముందు ఈ విశ్వామిత్రుడి బలం ఏమిటి? ఈ సేనలను సర్వనాశనం చేయగల బలాలను నేనే సృష్టిస్తాను, నాకు అనుమతి నివ్వండి," అన్నది కామధేనువు.

కామధేనువు రంకెలు వేస్తూంటే పహ్లవులూ, మ్లేచ్ఛులూ అనంతంగా పుట్టుకొచ్చి విశ్వామిత్రుడి సేనలను నుగ్గుచెయ్యసాగారు. విశ్వామిత్రుడు రథమెక్కి తనకు తెలిసిన దివ్యాస్త్రాలను ఈ సేనలపై ప్రయోగించసాగాడు. కామధేనువు ఇంకా శకులనూ, కాంభోజులనూ, హారీతులనూ, కిరాతులనూ సృష్టిస్తూనే ఉన్నది. వారు విశ్వామిత్రుడి సేనను మట్టుపెట్టేస్తున్నారు.

ఇది చూసి విశ్వామిత్రుడి కొడుకులు నూరుమంది ఆయుధాలతో వసిష్ఠుడిపైకి వెళ్ళారు. ఆయన ఒక్కసారి హుంకారం చేసేసరికి నూరుగురూ భస్మమైపోయారు. తన సేన అంతా పోయింది, నూరుగురు కొడుకులు క్షణంలో చచ్చారు. విశ్వామిత్రుడికి తీరని పరాభవం జరిగింది. ఆయన రెక్కలు విరిచిన పక్షిలాగా అయిపోయి, చావగా మిగిలిన ఒక కొడుకుపై రాజ్యభారంవేసి, హిమాలయానికి వెళ్ళి అక్కడ శివుణ్ణి గురించి తపస్సుచేశాడు.









కొంతకాలానికి శివుడు ప్రత్యక్షమై ఏమి వరం కావాలో కోరుకోమన్నాడు. దేవతలూ, గంధర్వులూ, యక్షులూ, రాక్షసులూ అధిదేవతలుగాగల అస్త్రాలన్నీ తనకు వశం కావాలనీ, సాంగోపాంగంగా ధనుర్వేదమంతా తనకు కరతలామలకం కావాలనీ విశ్వామిత్రుడు కోరాడు. శివుడు ఆయన కోరిక తీర్చి అంతర్ధానమైనాడు.

ఈ విధంగా సాధించిన అస్త్రాలతో వసిష్ఠుణ్ణి నిర్మూలించ దలిచి విశ్వామిత్రుడు వసిష్ఠాశ్రమం ప్రవేశించి, తన అస్త్రాలతో ఆశ్రమాన్ని దహించసాగాడు. అక్కడి ఋషులు చెల్లాచెదరుగా పరిగెత్తారు, పక్షులూ, మృగాలూ పారిపోయాయి. క్షణంలో ఆశ్రమం శూన్యమైపోయింది.

వసిష్ఠుడు ఆగ్రహావేశంతో తన బ్రహ్మదండం ఎత్తి విశ్వామిత్రుడి కెదురువచ్చాడు. విశ్వామిత్రుడు ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. వసిష్ఠుడి బ్రహ్మదండాన్ని తగలగానే అది కాస్తా చల్లారిపోయింది.

విశ్వామిత్రుడు కొన్నివందల అస్త్రాలను ప్రయోగించాడు. కాని వసిష్ఠుడి బ్రహ్మదండం అన్నిటినీ దిగమింగేసింది. వసిష్ఠుడి బ్రహ్మదండం నుంచీ, ఆయన శరీరంనుంచీ జ్వాలలు చిమ్ముతున్నాయి, రవ్వలు లేస్తున్నాయి. ఇతర మునులు వసిష్ఠుణ్ణి సమీపించి, "ఓ మహర్షీ, విశ్వామిత్రుణ్ణి జయించావు. ఇక శాంతించు!" అని వేడారు.

"బ్రహ్మతేజోబలం ముందు క్షత్రియ బలం ఎంత? నేను తపస్సుద్వారా బ్రహ్మత్వం సంపాదిస్తాను," అనుకుని విశ్వామిత్రుడు భార్యా సమేతంగా దక్షిణదిశకు వెళ్ళి అక్కడ ఘోరమైన తపస్సుచేశాడు. ఆ సమయంలో ఆయనకు హవిష్యందుడు, మధుష్యందుడు, దృఢనేత్రుడు, మహారథుడు అనే నలుగురు కొడుకులు కలిగారు.

కొంతకాలానికి బ్రహ్మ ప్రత్యక్షమై విశ్వామిత్రుడితో, "నీ తపస్సుచేత నీకు రాజర్షి





లోకాలు స్వాధీనమైనాయి. ఇక ముందు అందరిచేతా నీవు రాజర్షివని పిలవబడతావు" అని చెప్పాడు.

రాజర్షి అనే బిరుదుతో విశ్వామిత్రుడు తృప్తి చెందలేదు. ఆయనకు బ్రహ్మర్షి అని పించుకోవాలని ఉన్నది. అందుచేత ఆయన మళ్ళీ తపస్సు సాగించాడు.

ఆ కాలంలో ఇక్ష్వాకు వంశపు రాజు త్రిశంకు అనే వాడు బొందితో స్వర్గానికి పోవాలనుకున్నాడు. ఈ కోరికను తన కుల గురువైన వసిష్ఠుడితో చెబితే, అది అసాధ్య మని ఆయన అన్నాడు. దక్షిణాన ఉంటున్న వసిష్ఠకుమారులు తనకు సహాయపడతా రేమో నని త్రిశంకు వారి వద్దకు వెళ్ళాడు. వాళ్ళు కోప్పడి త్రిశంకును వచ్చిన దారి పట్టమన్నారు. అంతటితో బుద్ధిరాక త్రిశంకు వాళ్ళను దెప్పి, మరెవరినైనా ఆశ్రయిస్తా నన్నాడు. వసిష్ఠుడి నూరుగురు కొడుకులు మండిపడి, చండాలుడివి కమ్మని అతణ్ణి శపించారు.

శాపం చేత త్రిశంకు నల్లటి ఆకారమూ, నల్లటి బట్టలూ, ఇనప సొమ్ములూ కలిగిన వాడై వసిష్ఠుడి గర్భశత్రువైన విశ్వామిత్రుణ్ణి ఆశ్రయించాడు. విశ్వామిత్రుడు త్రిశంకు చెప్పినదంతా విని, " నిన్ను ఈ ఆకారంతోటే



స్వర్గానికి పంపుతాను," అని మాట ఇచ్చాడు. ఆయన యజ్ఞం తలపెట్టి, అందుకు ఋషుల నందరినీ పిలుచుకు రమ్మని తన శిష్యులను పంపాడు.

ఆహ్వానాలు అందుకుని అందరూ వచ్చారుగాని, మహోదయుడనేవాడూ, విశ్వామిత్రుడి కొడుకులూ రాలేదు. రాని వారిని విశ్వామిత్రుడు ఘోరంగా శపించాడు.

యజ్ఞం ఆరంభమయింది. కాని హవిస్సులు తీసుకోవటానికి దేవతలు రాలేదు. విశ్వామిత్రుడికి మండిపోయింది. ఆయన త్రిశంకుతో, " నే నింతకాలం తపస్సు చేసి సంపాదించిన శక్తితోనే నిన్ను స్వర్గానికి







పంపుతాను," అన్నాడు. మునులందరూ చూస్తుండగానే త్రిశంకు తన శరీరంతోనే పైకి లేచి స్వర్గానికి వెళ్ళిపోయాడు.

అయితే ఇంద్రాది దేవతలు త్రిశంకును స్వర్గానికి రానివ్వక, అతన్ని కిందికి తోసే శారు. త్రిశంకు తలకిందుగా పడిపోతూ, "మహాత్మా, రక్షించు!" అని అరిచాడు. విశ్వామిత్రుడు కోపావేశంతో దక్షిణదిక్కున మరొక సప్తర్షి మండలాన్ని, కొత్త నక్షత్రాలనూ సృష్టించి, "ఇంకొక స్వర్గాన్ని, కొత్త దేవతలనూ కూడా సృష్టిస్తాను," అన్నాడు.

అప్పుడు దేవతలూ, ఋషులూ భయపడి విశ్వామిత్రుడి వద్దకు వచ్చి, "మహాను



భావా, శాపగ్రస్తుడైన త్రిశంకును స్వర్గంలో ఎలా ఉంచటం?" అని అడిగారు.

"ఇతణ్ణి బొందితో స్వర్గానికి పంపుతానని మాట ఇచ్చాను. అది జరిగితీరాలి," అన్నాడు విశ్వామిత్రుడు.

త్రిశంకు కొత్తగా సృష్టి అయిన నక్షత్రాల మధ్య తలకిందులై శాశ్వతంగా ఉండిపోయేటట్టూ, విశ్వామిత్రుడు కొత్త దేవతలను సృష్టించే ప్రయత్నం మానుకునేటట్టూ ఏర్పాటు జరిగింది.

తరవాత విశ్వామిత్రుడు దక్షిణాన్ని వదిలిపెట్టి, పడమరగా ఉన్న పుష్కరమనే పెద్ద తపోవనానికి వెళ్ళి అక్కడ తపస్సు ప్రారంభించాడు.

ఈ సమయంలో అయోధ్యలో అంబరీష మహారాజు ఒక యజ్ఞాన్ని ప్రారంభించగా, ఇంద్రుడు యజ్ఞపశువును ఎత్తుకుపోయాడు. అప్పుడు రాజపురోహితుడు యజ్ఞపశువును ఎలాగైనా సంపాదించాలని, అది దొరక్కపోతే నరపశువును బలి ఇవ్వవలిసి ఉంటుందనీ రాజుతో చెప్పాడు. యజ్ఞపశువు దొరక్కపోవటంచేత అంబరీషుడు నరపశువుకోసం బయలుదేరాడు.

భృగుతుండ మనే కొండప్రాంతంలో ఋచీకుడనే ముని తన భార్యా బిడ్డలతో





ఉంటున్నాడు. అంబరీషుడు అయన వద్దకు పోయి తన కథ చెప్పి, "లక్ష గోవులిస్తాను, మీ కొడుకులలో ఒకణ్ణి యజ్ఞపశువుగా ఇవ్వండి," అని ప్రార్థించాడు. పెద్దవాణ్ణి ఇవ్వనన్నాడు ఋచీకుడు. అఖరువాణ్ణి ఇవ్వనన్నది ఋచీకుడి భార్య. శునశ్శేపు డనే వాడు రెండోవాడు. వాడు రాజుతో, "మా అమ్మా, నాన్నా నన్ను అమ్మటానికి సిద్ధంగా ఉన్నారని వేరే చెప్పనవసరం లేదు. నన్ను మీ వెంట యజ్ఞపశువుగా తీసుకుపొండి," అన్నాడు.

అంబరీషుడు శునశ్శేపుణ్ణి వెంటబెట్టుకుని మిట్టమధ్యాన్నానికి ఎండదెబ్బ తిని విశ్వామిత్రుడి అశ్రమం చేరుకున్నాడు. శునశ్శేపుడు విశ్వామిత్రుణ్ణి చూస్తూనె అయన ఒళ్ళో పడి, తన కథ చెప్పుకుని, తనను కాపాడమని ఏడ్చాడు.

విశ్వామిత్రుడు వాణ్ణి చూసి జాలిపడి తన నలుగురు కొడుకులతో, "వీడికి బదులుగా మీరు యజ్ఞపశువులై వీణ్ణి కాపాడండి," అన్నాడు. వాళ్ళు తండ్రిని లక్ష్యపెట్టక అయన మాట నిరాకరించారు. విశ్వామిత్రుడు మండిపడి తన కొడుకులను కూడా వసిష్ఠుడి కొడుకులను శపించినట్టె శపించాడు.

తరవాత విశ్వామిత్రుడు శునశ్శేపుడికి రెండు మంత్రాలు ఉపదేశించి, "నిన్ను యజ్ఞపశువును చేసి యూపస్తంభానికి కట్టినప్పుడు ఈ మంత్రాలు చదివితే అగ్నిహోత్రుడు నీకు సుముఖుడవుతాడు," అని చెప్పాడు.

అలాగే జరిగిందికూడా. అంబరీషుడి యజ్ఞంలో శునశ్శేపుడికి ఎర్ర గంధం పూసి, ఎర్రబట్టలు కట్టి, దర్భలతో యూపస్తంభానికి కట్టారు. అప్పుడు వాడు తన మనసులో రెండు మంత్రాలూ జపించుకున్నాడు. ఇంద్రుడు వాడికి ప్రత్యక్షమై దీర్ఘాయువునిచ్చాడు.






విశ్వామిత్రుడు పుష్కరంలో చేసిన తపస్సుకు మెచ్చి ఒకనాడు బ్రహ్మ ప్రత్యక్షమై ఆయనకు ఋషి అనే బిరుదు ఇచ్చాడు.

దానికి కూడా తృప్తిపడని విశ్వామిత్రుడు మరింత దీక్షగా తపస్సు సాగించాడు. ఈ సమయంలో ఆయనకు ఒకనాడు ఒక తీర్థంలో స్నానం చేస్తున్న మేనక అనే అప్సరస కనిపించి మనస్సు చలించింది. ఆయన తన తపస్సు వదిలిపెట్టి, మేనకను తన ఆశ్రమానికి పిలుచుకుపోయి, ఆమెతో పదేళ్ళు సుఖంగా గడిపాడు.

ఆ తరవాత ఆయనకు తన పొరపాటు తెలిసివచ్చింది. తన తపస్సు భంగం చెయ్యటానికి దేవతలు మేనకను పంపారేమోననుకున్నాడు. ఆయనలో మార్పు గమనించి, తనను శపిస్తాడేమోనని మేనక భయపడింది. కాని విశ్వామిత్రుడామెను ఏమీ అనక, 'ఇందులో నీ తప్పేమీ లేదు. తప్పంతా నాదే. ఇక నీవు వెళ్ళిపో' అన్నాడు.

ఆ తరవాత ఆయన ఉత్తర దిక్కుగా బయలుదేరి హిమాలయాలలో కౌశికీ నదీ తీరాన నివసిస్తూ, మహాదారుణమైన తపస్సు చేశాడు. చివరకు బ్రహ్మతో సహా పలువురు దేవతలు వచ్చి ఆయనకు మహర్షి అనే బిరుదు ఇచ్చారు.

విశ్వామిత్రుడు బ్రహ్మను, "ఇప్పుడు నేను ఇంద్రియాలను జయించిన వాణ్ణేనా?" అని అడిగాడు.

"ఇంకా నీవు జితేంద్రియుడవు కావు," అన్నాడు బ్రహ్మ.





జితేంద్రియుడు కావాలని ఆశతో విశ్వామిత్రుడు వాయుభక్షణ చేస్తూ మహాఘోరమైన తపస్సు చేశాడు. ఈ తపస్సు చూసి చాలా దేవతలకూ, ఇంద్రుడికీ భయం పుట్టింది

ఇంద్రుడు రంభను పిలిచి, 'నీవు వెళ్ళి విశ్వామిత్రుడి తపస్సు భంగం చెయ్యాలి. మన్మథుణ్ణి వెంటబెట్టుకుని నేను కూడా నీకు తోడు వచ్చి, కోకిల రూపం ధరించి చూస్తాను.' అన్నాడు. రంభ భయపడుతూనే అందుకు ఒప్పుకున్నది

విశ్వామిత్రుడు తపస్సులో ఉండగా కోయిలకూజితం వినిపించింది. కళ్ళు తెరిచేసరికి ఎదురుగా రంభ కనిపించింది. ఇదంతా దేవతల పన్నాగమని తెలుసుకుని ఆయన రంభను రాయికమ్మని శపించాడు. ఇంద్రుడూ మన్మథుడూ పారిపోయారు..

మరుక్షణమే ఆయన, 'అయ్యో, ఎందుకు శపించాను? కోపాన్ని ఎందుకు నిగ్రహించుకోలేక పోయాను?' అని పశ్చాత్తాప పడ్డాడు. ఎవరేమిచేసినా కోపపడరాదని ఆయన తీర్మానించుకున్నాడు. తపశ్శక్తి చేత బ్రాహ్మణత్వం సాధించి తీరాలని నిశ్చయించుకున్నాడు.

ఈ ఉద్దేశంతో ఆయన ఉత్తరాన్ని విడిచి తూర్పు దిక్కుకుపోయి, మౌనవ్రతం అవలంబించి, తపస్సు సాగించాడు. ఆ తపస్సు యొక్క వేడికి మూడు లోకాలూ దగ్ధమయ్యేటట్లు కనిపించింది. ఆ స్థితిలో ఎంతగానో భయపడి పోయిన దేవతలు బ్రహ్మ వద్దకు వెళ్ళి మొరపెట్టుకోగా, ఆయన వచ్చి విశ్వామిత్రుణ్ణి కలిసి, "బ్రహ్మర్షీ, నీకు బ్రాహ్మణత్వం వచ్చింది." అన్నాడు.

విశ్వామిత్రుడు చాలా సంతోషించి, 'నేను బ్రహ్మర్షినని వసిష్ఠుడు ఒప్పుకుంటేనే తృప్తి పడతాను.' అన్నాడు. దేవతలు వసిష్ఠుణ్ణి ప్రార్థించి ఆయన చేత విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అని ఒప్పించారు. వసిష్ఠ విశ్వామిత్రులకు కలహంపోయి స్నేహం ఏర్పడింది



ఈ విధంగా శతానందుడు విశ్వామిత్రుడి కథ పూర్తి చేసేసరికి అస్తమయమయింది. జనక మహారాజు విశ్వామిత్రుడి రాకకు తన సంతోషం తెలుపుకుని వెళ్ళిపోయాడు. మర్నాడు తెల్లవారగానే ఆయన విశ్వామిత్రుణ్ణీ, రామలక్ష్మణులనూ యజ్ఞశాలకు పిలిపించాడు.

జనకుడు తన వద్ద ఉండే ధనువును గురించి విశ్వామిత్రుడికి చెప్పాడు. దక్షయజ్ఞం నాడు పరమశివుడు ఆ ధనువును ఎత్తి దేవతలను చంపబోయాడు. చివరకు వారి మొర ఆలకించి, ఆ ప్రయత్నం మాని, ఆ ధనువును దేవతలకే ఇచ్చేశాడు. దేవరాతుడనే వాడి కాలం నుంచీ ఆ ధనువు జనక మహారాజు వంశంలోనే ఉంటున్నది. దాన్ని ఎవరూ ఎక్కుపెట్టలేరు, కదిలించను కూడా లేరు.

ఒకప్పుడు జనకుడు యజ్ఞం కోసం భూమి దున్నుతూ ఉండగా చాలులో నుంచి ఒక ఆడశిశువు పైకి వచ్చింది. ఆమెకు సీత అని పేరు పెట్టుకుని, జనకుడు తన కుమార్తెలాగే పెంచుతూ వస్తున్నాడు. శివధనువును ఎక్కుపెట్టినవారికి సీతనిచ్చి పెళ్ళి చెయ్యటానికి ఆయన నిశ్చయించాడు.



ఆ సంగతి తెలిసి ఎందరో రాజకుమారులు వచ్చి, ఆ ధనువును ఎక్కుపెట్టలేక పోయారు

చివరకు ఈ ఓడిపోయిన రాజులు సేనతో దండెత్తి వచ్చి ఒక ఏడాదిపాటు మిథిలను ముట్టడించారు. జనకుడు ఏమీ చెయ్యటానికి శక్తిలేక దేవతలను ప్రార్థించగా వారు సేనలను ఇచ్చి నగరాన్ని ముట్టడించిన రాజకుమారులను పారదోలారు. ఈ వృత్తాంతం విన్న మీదట విశ్వామిత్రుడు జనకుడితో, ఆ ధనువును రాముడికి చూపమన్నాడు. దాన్ని తీసుకురావటానికి జనకుడు మనుషులను నగరంలోకి పంపాడు. ఎనిమిది చక్రాలు గల ఇనప పెట్టెలో ఉండే ఆ శివధనువును నగరం నుంచి యజ్ఞశాల వద్దకు తెచ్చారు.



"దీన్ని ఎత్తటానికి, ఎక్కు పెట్టటానికి నాకు శక్తి ఉందేమో చూస్తాను." అంటూ రాముడు పెట్టె తెరిచి, ధనుస్సును మధ్య భాగం పట్టి పైకెత్తి, అవలీలగా నారి తగిలించాడు. దానికి అతను బాణం పెట్టటానికి ప్రయత్నించగా అది ఉరుములాంటి పెళపెళారావంతో నడిమికి విరిగి పోయింది. అందరూ నిర్ఘాంతపోయారు. జనకుడు పరమానందం చెంది, "సీతను శౌర్యవంతుడికి ఇవ్వాలనుకున్నాను. ఇప్పటికి నా ఆశయం ఈడేరనున్నది. ఈ కుర్రవాడు సీతకు అర్హుడు. వీరిద్దరి వివాహం విషయం ఇప్పుడే అయోధ్యకు కబురు చేస్తాను." అన్నాడు.

జనకుడి దూతలు మూడు రోజులు ప్రయాణం చేసి, నాలుగో రోజు ఉదయానికి అయోధ్య చేరి, దశరథుడితో శివధనుర్భంగ వృత్తాంతం చెప్పి, సీతారాముల వివాహానికి అంగీకరించమని కోరారు.

దశరథుడు ఆ వార్తను వినగానే సంతోషించి తన మంత్రులతో సంప్రదించి, జనక మహారాజుతో సంబంధం ఉచితమని తెలుసుకున్నాడు. వసిష్ఠ, వామదేవ, జాబాలి, కాశ్యప, మార్కండేయాదులను ముందుగా ప్రయాణం చేయమని, తాను తన బలగంతో వెనకగా ప్రయాణమై, నాలుగో రోజుకు దశరథుడు జనకుడి యజ్ఞశాల చేరాడు.



అప్పటికి యజ్ఞం పరిసమాప్తి అయింది. సీతను పెళ్ళియాడిన్న వేళారు కూడా. జనకుడూ, దశరథుడూ ఒకచోట చేరారు. జనకుడి వెంట ఆయన తమ్ముడు కుశధ్వజుడు కూడా ఉన్నాడు. దశరథుడి తరఫున వశిష్ఠుడు జనకుడితో దశరథుడి వంశావళి అంతా సమగ్రంగా చెప్పాడు. తరవాత జనకుడు తన వంశావళిని తానే దశరథుడికి తెలుపుకున్నాడు

రెండూ గొప్ప వంశాలు. వియ్యం పొందదగినవి. జనకమహారాజుకు సీత గాక ఊర్మిళ అనే కుమార్తె ఉన్నది. ఆయన తమ్ముడు కుశధ్వజుడికి మాండవి, శ్రుతకీర్తి అని ఇద్దరు కూతుళ్ళున్నారు. సీతా రాముల వివాహ ముహూర్తానికే లక్ష్మణుడికి ఊర్మిళనూ, భరతుడికి మాండవినీ, శత్రుఘ్నుడికి శ్రుతకీర్తినీ ఇచ్చి చేస్తే బాగుంటుందని జనకుడు సూచించాడు. ఉత్తర ఫల్గుని నక్షత్రంలో ముహూర్తం నిశ్చయమయింది.

పెళ్ళికి ముందే దశరథుడు నాలుగు లక్షల గోవులను దానం చేశాడు. ఆ రోజున భరతుడి మేనమామ అయిన యుధాజిత్తు కూడా మిథిలకు వచ్చాడు. అగ్నిసాక్షిగా నలుగురి వివాహాలూ జరిగిపోయాయి. దశరథుడి కొడుకులు నలుగురూ తమ భార్యలను వెంటబెట్టుకుని తమ విడిదికి వచ్చారు.





పెళ్ళి కాగానే విశ్వామిత్రుడు తన దారిన తాను హిమాలయానికి వెళ్ళిపోయాడు

దశరథుడుకూడా తన బలగంతో అయోధ్యకు బయలుదేరాడు. ఇలా వాళ్ళంతా ప్రయాణం చేస్తూండగా దారిలో అకస్మాత్తుగా చీకటి కమ్మింది. ధూళి లేచింది. పెనుగాలి వీచింది. అదే సమయంలో ప్రళయకాల రుద్రుడి లాగా పరశురాముడు వాళ్ళకి ఎదురు వచ్చాడు. ఆయన భుజాన గండ్రగొడ్డలి, చేతిలో కాంతి వంతమైన ధనుర్బాణాలూ ఉన్నాయి. ఆయన రాముడితో, "రామా, నీవు శివుడి విల్లువిరిచావట, విన్నాను చాలా ప్రజ్ఞగలవాడవు. దానికన్న శక్తివంతమైన ఈ విష్ణుధనువు ఎక్కుపెట్టగలవేమో చూడు. అంతశక్తి నీకున్నట్టయితే నాతో ద్వంద్వయుద్ధం చేతువు గాని!' అన్నాడు

పరశురాముడు రాముడితో విష్ణుధనువు గురించి ఇలా చెప్పాడు. దీనినికూడా విశ్వకర్మ స్వయంగా నిర్మించాడు. శివుని విల్లులాగే ఇది ధనుస్సులలో శ్రేష్ఠమైనది. దీనిని దేవతలు విష్ణువుకు ఇచ్చారు. శివవిష్ణువుల బలాబలాలు తెలుసుకునేటందుకు వారు బ్రహ్మద్వారా ఇద్దరికీ కలహం పెట్టించారు. ఇద్దరికీ చెరొక గొప్ప విల్లూ ఉన్నది. వారు మహా భయంకరమైన యుద్ధం చేశారు.

ఆ యుద్ధంలో విష్ణువుదే పైచెయ్యి అయింది. శివకేశవులలో కేశవుడే ఎక్కువని దేవతలు గ్రహించి, యుద్ధం మానవలసిందిగా ఇద్దరు దేవుళ్ళనూ ప్రార్థించారు. తనకన్న విష్ణువు ఎక్కువగా నిర్ణయం జరిగినందుకు శివుడు ఆగ్రహించి, తన ధనువునూ, బాణాలనూ విదేహదేశపు రాజైన దేవరాతుడికి ఇచ్చేశాడు. విష్ణువు తన ధనుస్సును భృగువంశంవాడైన ఋచీకుడి వద్ద దాచి పెట్టాడు. అది ఋచీకుడి కొడుకైన జమదగ్నికి, ఆయన కొడుకైన పరశురాముడికి సంక్రమించింది.



దశరథుడు భయంతో వణికిపోతూ, పరశురాముడి కాళ్ళపైబడి, 'స్వామీ, ఇరవై ఒక్కసారి క్షత్రియులను నాశనం చేసి, అస్త్రం పట్టనని ఇంద్రుడి వద్ద ప్రతిజ్ఞచేశావు. ఈ నా కొడుకును కాపాడు. లేకపోతే మేమంతా నాశనమైపోతాం.' అన్నాడు.

పరశురాముడు ఆయన మాటలు పెడచెవిని పెట్టాడు. రాముడికి మండిపోయింది. అతను పరశురాముడి నుంచి విష్ణుధనువు తీసుకుని, అవలీలగా వంచి ఎక్కుపెట్టి, బాణం సంధించి, 'ఓ బ్రాహ్మడా, ఈ బాణంతో నీ ప్రాణం తీయగలను. కాని బ్రాహ్మణ హత్య నా కిష్టంలేదు. అందువల్ల దీనితో నీ కాళ్ళు విరగగొట్టమన్నావా? నీవు తపస్సు చేసిన ఉత్తమలోకాలు ధ్వంసం చెయ్యమన్నావా?" అని అడిగాడు.

పరశురాముడు నిర్వీర్యుడైపోయి తన ఉత్తమలోకాలను పోగొట్టుకోవటానికి సిద్ధపడ్డాడు.

రాముడు బాణం వదిలాడు

తరవాత పరశురాముడు మహేంద్రగిరికి వెళ్ళిపోయాడు. రాముడు మూర్ఛపోయిన తన తండ్రిని లేపిన అనంతరం అయోధ్యకు వచ్చేశారు. కొద్దిరోజులు గడిచాయి

యుధాజిత్తు తన మేనల్లుడైన భరతుణ్ణి తన ఇంటికి తీసుకుపోతానన్నాడు. అందుకు దశరథుడు సమ్మతించాడు. భరతుడు శత్రుఘ్నుణ్ణి వెంటబెట్టుకుని తన మేనమామ వెంట వెళ్ళిపోయాడు.

సీతారాములు అన్యోన్య ప్రేమతో దాంపత్య జీవితం గడుపుతున్నారు. వారు తమ ప్రేమను పైకి చూపకపోయినా ఒకరి మనసు ఒకరు బాగా అర్థం చేసుకుంటున్నారు. రాముడు రాచకార్యాలలో తండ్రికి సహాయపడుతున్నాడు. రోజులు సుఖంగా వెళ్ళిపోతున్నాయి

(బాలకాండ సమాప్తం)






భరతుణ్ణి అతని మేనమామ వచ్చి తీసుకుపోయాడు. శత్రుఘ్నుడు వెంట లేనిదే ఎన్ని భోగాలూ తనకు రుచించవు గనక భరతుడు శత్రుఘ్నుణ్ణి తన వెంట తీసుకుపోయాడు. భరతుడి మేనమామ ఇంట వారిద్దరికీ ఏ లోటూ లేకుండానే జరుగుతున్నది. అయితే ముసలివాడైన తండ్రిని విడిచి వచ్చామే అన్నది అప్పుడప్పుడూ వారిని బాధించేది.

అయోధ్యలో దశరథ మహారాజుకూడా తన కొడుకులలో ఇద్దరు దూరమై పోయారే అని చింతించేవాడు. కాని నిజానికి ఆయన పంచప్రాణాలూ రాముడే. అతనిలో లేని సద్గుణం లేదు. ప్రజలకుకూడా రాముడంటే ఎంతో అభిమానం.

"నేను ముసలివాణ్ణి అయిపోయినాను. రాముణ్ణి రాజును చేసి అతను రాజ్యపాలన చేస్తుంటే చూడాలని నా మనసు ఉబలాటపడుతున్నది," అనుకున్నాడు దశరథుడు.

మంత్రులతో ఆలోచిస్తే వారుకూడా ఈ ఆలోచనను ఆమోదించారు. ఇందుకు ప్రజలూ, ఇతర రాజులూ ఏమంటారో తెలుసుకోవలిసి ఉన్నది. అందుచేత దశరథుడు రాజులందరికీ ఆహ్వానాలు పంపాడు. చాలాదూరాన ఉన్న కారణంచేత కైకేయి తండ్రి అయిన కేకయ మహారాజుకూ, సీత తండ్రి అయిన జనక మహారాజుకూ ఆహ్వానాలు పంపక, ఈ శుభవార్త వారికి పట్టాభిషేకం అయినతరవాత తెలుపుదామనుకున్నాడు.







ఆహ్వానాలు అంది రాజులందరూ వచ్చి దశరథుడి కొలువు కూటంలో ఉచితాసనాలపై కూచున్నారు. నగరంలోని పౌరులూ, పల్లెటూళ్ళవాళ్ళూ కూడా సభకు వచ్చారు. దశరథుడు వారితో తాను ఎంత శ్రద్ధగా రాజ్యం చేసినదీ వివరించి, "ఇప్పుడు నేను ముసలివాణ్ణి అయిపోయి విశ్రాంతి కోరుతున్నాను. మీ అందరూ సమ్మతిస్తే నా పెద్ద కొడుకైన రాముణ్ణి రాజుగా అభిషేకించాలని ఉన్నది. రాముడు పరాక్రమశాలి, ఎందులోనూ నాకు తీసిపోడు. అతను మూడు లోకాలూ ఏలదగినవాడు. అతనికి పట్టం గట్టటం రాజ్యానికి గొప్ప మేలు చేయటమే నని నా నమ్మకం. నా ఆలోచన మీకు నచ్చిన పక్షంలో ఇందుకు సమ్మతించండి. సమ్మతించని పక్షంలో మీకు తోచిన మరొక మేలైన మార్గం చెప్పండి," అన్నాడు.

ఈ మాటలు విని సభలో అందరూ పరమానందం చెంది, రాముడి పట్టాభిషేకానికి ఏకగ్రీవంగా ఆమోదించారు. "మహారాజా, ఆ రామపట్టాభిషేక మహోత్సవం ఊరేగింపు త్వరగా మా కళ్ళపడెయ్యండి," అన్నారు.

వెంటనే దశరథుడు అమాయికత్వం నటిస్తూ, "నేనింకా రామపట్టాభిషేకం అని అనకుండానే మీరంతా సమ్మతిస్తున్నారే? ఏమిటి కారణం? నా పరిపాలన మీకు నచ్చలేదా? నేను ఎంతో న్యాయంగా పరిపాలిస్తున్నా మీరు రాముణ్ణి రాజుగా కోరటానికి కారణమేమిటి? మరేమీ లేదు, తెలుసుకోగోరి అడుగుతున్నాను!" అన్నాడు.

ఆయన ఆ మాట అనగానే ఆయనకు కావలిసినది జరిగింది; సభికులు రాముణ్ణి తెగపొగడేశారు. అతన్ని రాజుగా చేస్తే ఇక అంతకంటె ఘనమైన సంగతి ఉండబోదన్నారు.

వారి మాటలన్నీ విని దశరథుడు, "మీరు కూడా నా లాగే భావిస్తున్నందుకు నా కెంతో

"సంతోషంగా ఉంది," అంటూ అప్పుడే తన పురోహితులైన వసిష్ఠ వామదేవాదులను పిలిపించి, "మహామునులారా, ఈ చైత్ర మాసం శుభకార్యాలు చేయదగినది. అందుచేత రామపట్టాభిషేక యత్నాలు సాగించండి, అందుకు కావలిసిన సామగ్రి అంతా తెప్పించండి," అని అందరూ వింటూండగా అన్నాడు.

వసిష్ఠుడు అప్పటికప్పుడే పనివాళ్ళతో ఏయే సామగ్రి సిద్ధం చేయాలో చెప్పేశాడు. పట్టాభిషేక మహోత్సవానికి కావలిసిన సరంజామా అంతా సిద్ధమయింది.



దశరథుడు రాముణ్ణి తన వద్దకు తీసుకు రమ్మని తన సారథి అయిన సుమంత్రుడితో చెప్పాడు సుమంత్రుడు వెళ్ళి రథంలో రాముణ్ణి తెచ్చాడు. దశరథుడు రాముడితో, "నాయనా, నీకు రాజ్యాభిషేకం చేస్తాను. ధర్మాన్ని పాలిస్తూ తగినవిధంగా నీవు రాజ్యం ఏలుకో," అని చెప్పి అతన్ని పంపేశాడు. తరవాత, దూరదేశాల నుంచి వచ్చిన రాజులూ, ప్రజలూ ఎవరి దారిన వారు వెళ్ళిపోయారు. రాముడి మిత్రులు కొందరు కౌసల్యకు ఈ శుభవార్త చెప్పారు. కౌసల్య ఆనందంతో వారికి బంగారమూ, ఆవులూ, రత్నాలూ బహూకరించింది.

అందరూ వెళ్ళాక దశరథుడు తన మంత్రులతో ఆలోచించి, "రేపు పుష్యమి నక్షత్రం. పట్టాభిషేకానికి చాలా బాగుంటుంది. అందుచేత రేపే జరుపుదాం," అని నిశ్చయించి, రాముణ్ణి తీసుకురమ్మని సారథిని సుమంత్రుణ్ణి పంపాడు.

సారథి వచ్చి తండ్రిగారు రమ్మంటున్నారని చెప్పగానే రాముడు, "నే నిప్పుడు అక్కడి నుంచే వస్తున్నాను. మళ్లీ ఎందుకు రమ్మన్నారు?" అని అడిగాడు.

"మహారాజుగారు తమరిని చూడా లన్నారు. వస్తే రండి, లేకపోతే మానండి. అది మీ యిష్టం," అన్నాడు సారథి.







రాముడు తత్తరపడి సారథి వెంట బయలుదేరాడు. పై వాళ్ళెవరూ లేరుగనక దశరథుడు ఈసారి తన కాళ్ళకు నమస్కరించే రాముణ్ణి లేవనెత్తి, ఆలింగనం చేసుకుని, ఉన్నతాసనంపై కూచోబెట్టి, "నాయనా, రామా! నేను ముసలివాణ్ణి కావటం అలా ఉంచి, నా జన్మనక్షత్రంలో దుష్టగ్రహాలు చేరాయని జ్యోతిష్కులు చెబుతున్నారు. పీడకలలు వస్తున్నాయి. కనక నా దేహంలో ఊపిరి ఉండగానే పట్టం కట్టుకో. ఇవాళ పుష్యమి. రేపు పునర్వసు. శుభకార్యాలకు చాలా మంచిది. ఈ రాత్రికి నీవూ, నీ భార్యా దర్భలపై



పడుకుని ఉపవాసం చెయ్యండి. నీ తమ్ముడు భరతుడు తన మేనమామ ఇంటి నుంచి తిరిగిరాక పూర్వమే ఈ పట్టాభిషేకం ముగించటం మంచిదని నాకు తోచింది. వాడైనా పెద్దలంటే భక్తిగలవాడే; ఈ పట్టాభిషేకానికి ఎదురు చెప్పబోడు. అయినా మానవ స్వభావం అమిత చంచలమైనది," అని చెప్పాడు.

రాముడు తండ్రి అనుమతితో అక్కడి నుండి బయలుదేరి తన తల్లి అయిన కౌసల్య మందిరానికి వచ్చేసరికి ఆమె మౌనంతో రాజ్యలక్ష్మిని ప్రార్థిస్తూ కనిపించింది. రాముడు రాకపూర్వమే పట్టాభిషేక వార్త తెలిసి సుమిత్రా లక్ష్మణులు సీతను తమ వెంట కౌసల్య మందిరానికి తెచ్చారు.

రాముడు తల్లికి నమస్కరించి తన పట్టాభిషేక వార్త తెలిపి, "అమ్మా, రేపటి పట్టాభిషేకానికి నేనూ, సీతా ఏమేమి అలంకారాలు చేసుకోవాలో అవన్నీ చేయించు," అని కోరాడు.

రాముడు లక్ష్మణుడితో, "లక్ష్మణా, నాతోబాటు నీవుకూడా ఈ భూమినంతా పాలింతువుగాని. మనిద్దరమూ ఒకటేగదా. నేను రాజయితే నీవూ రాజువే. మనిద్దరమూ





సమస్త సుఖాలూ ఒక్కటిగా అనుభవించుదాం," అన్నాడు.

తరవాత అతను తల్లుల అనుమతి పొంది సీతతోసహా తన మందిరానికి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి రాముడిచేతనూ, సీతచేతనూ ఉపవాసవ్రతం సక్రమంగా చేయించటానికి దశరథుడి కోరికపై వసిష్ఠుడు రథమెక్కి రాముడుండే నగరుకు వెళ్ళి ఆ పని పూర్తి చేసి తిరిగి వచ్చే సమయంలో వీధులన్నీ జనం తండోపతండాలుగా కనిపించాయి. రేపటి ఉత్సవం తాలూకు ఉత్సాహంలో వారు సంతోషధ్వానాలు చేస్తున్నారు. వీధులలో నీళ్ళు చల్లి, పూలదండలు కట్టారు. ప్రతి ఇంటిమీదా జెండా ఎగురుతున్నది. స్త్రీలూ, పిల్లలూ, వృద్ధులూ ఇప్పటినుంచే పట్టాభిషేకానికి ఎదురు చూస్తున్నారు.

వసిష్ఠుడు వెళ్ళిపోయాక రాముడు స్నానం చేసి, సీతతోకూడా హోమం చేసి, హోమశేషం తిని, నిశ్చలమైన మనస్సుతో నారాయణాలయంలో భగవంతుణ్ణి ధ్యానం చేసి అక్కడే పడుకుని ఒక ఝాము సేపు నిద్రపోయి, వందిమాగధుల మేల్కొలుపులకు లేచాడు.

అతను ఉదయం సంధ్యావందనం మొదలైనవి పూర్తి చేసేసరికి తెల్లవారింది. బ్రాహ్మణులు వచ్చి పుణ్యాహవాచనం చేశారు. మంగళవాద్యాలతో అయోధ్య యావత్తూ మారుమోగిపోయింది.

తెల్లవారుతూనే మళ్ళీ పౌరులు తమ ఇళ్ళను అలంకరించసాగారు. ఇళ్ల ముందు నీళ్ళు చల్లి, పువ్వులు చిమ్మారు. సుగంధ ధూపాలు వేశారు. జనం గుంపులుగా గూడి పట్టాభిషేకం గురించే మాట్లాడుకుంటున్నారు. పిల్లలు ఇళ్ళముందు ఆడుకుంటూ, "ఇవాళ పట్టాభిషేకం చూడటానికి నేను కూడా మా అమ్మా, నాన్నా వెంట పోతాను," అని చెప్పుకుంటున్నారు. ఆడేవాళ్ళు ఆడుతున్నారు, పాడేవాళ్ళు పాడుతున్నారు.







కాని ఆ రాత్రే మరొకరకం నాటకం ఆరంభమయింది. కైకేయి వెంట మంథర అనే ఒక గూని దాసి ఆమెకు అరణంగా వచ్చింది. ఆ మంథర ఆ రాత్రి కైకేయి ఉండే మేడ పై అంతస్తుకు వెళ్ళి అక్కడి నుంచి అయోధ్యలో జరిగే సందడి అంతా చూసి ఆశ్చర్యపడింది. తన పక్కనే తెల్ల పట్టుచీరె గట్టి నిలబడి ఉన్న ఒక దాదితో మంథర, "ఈ ఆర్భాటమంతా ఏమిటే? కౌసల్య ఏదన్నా వ్రతంపట్టి జనానికి దాన ధర్మాలు చేస్తున్నదా? లేక దశరథుడు ఏదన్నా ఉత్సవం తలపెట్టాడా?" అన్నది. ఆ దాది పొట్ట చెక్కలయేలాగ నవ్వి,



"తెల్లవారగానే రాజుగారు రాముడికి రాజ్యాభిషేకం చేస్తున్నారు." అని చెప్పింది.

గూని మంథరకు ఈ వార్త కర్ణకఠోర మయింది. ఆమె గబగబా మేడ దిగి, కైకేయి పడుకుని ఉన్న చోటికి వెళ్ళి, "లే, లే! ఏం పడుకున్నావు? నీ కొంప నిలువునా కూలబోతున్నది. ఆ రాజుకు నీ మీద ఉన్న ప్రేమ మరిపరిమిదా లేదని మహా మురిశావు! ఇక ముసుద్ధువుగాని!" అన్నది.

"నీ వాలకం చూస్తే ఏదో జరిగినట్టుందే! అందరూ క్షేమంగానే ఉన్నారు గద!" అన్నది కైకేయి.

"రేపు దశరథమహారాజు రాముడికి రాజ్యాభిషేకం చేయబోతున్నాడు. ఇంకేం జరగాలి. ఈ మాట వినగానే నా గుండె జారిపోయింది. నీ మంచి కోరినదాన్ని గనక ఈ మాట వింటూనే నీ దగ్గిరికి పరిగెత్తు కొచ్చాను," అన్నది మంథర.

"నిజంగానా, మంథరా? ఎంత మంచి వార్త తెచ్చావు!" అంటూ కైకేయి వికసించిన ముఖంతో పక్కమీద లేచి కూచుని, విల వైన ఆభరణం ఒకటి తీసి ఇస్తూ, "ఇంకేం కావాలన్నా ఇస్తాను, అడుగు!" అన్నది.

కైకేయి ధోరణి మంథరకేమీ నచ్చలేదు. ఆమె తన యజమానురాలితో, "మూఢు

రాలా, నీకు రాబోయే విపత్తు అర్థం చేసుకో లేకుండా ఉన్నావు. లేకపోతే దుఃఖించ టానికి బదులు ఆనందిస్తావా? నీకు బదులు కూడా నేనే ఏడుస్తున్నాను. ఎందుకంటావా? రేపీ పట్టాభిషేకం జరగగానే కౌసల్య రాజ మాత అవుతుంది. నీవు ఆమెకు పరిచారిక వవుతావు. రాముడి అంతఃపుర స్త్రీలకు నీ కోడళ్లు దాసీలవుతారు. భరతుడూ, అతని సంతతీ రూపుమాసి పోవలసిందే. నాకు బహుమానం ఇస్తానంటావే? నీకేమి జరిగిందని బహుమానం ఇస్తావు? రాజ్యాభి షేకం భరతుడికి జరిగినప్పుడుగదా నేను నీ బహుమానాలు పొందవలసింది? భరతుడు దూరాన మామగారింట ఉండ బట్టే గాని, దశరథుడు నీపై ప్రేమకొద్దీ అతనికే ఈ పట్టాభిషేకం చేసి ఉండడా? రాముడు రాజయాక భరతుడిక ఇక్కడికి రానవసరంలేదు. అటునుంచి అటే అడవికి పోవటం మేలు. ఎందుకంటే రాముడు అతణ్ణి బతకనివ్వడు. నీ భర్త నీ మీద ఎక్కువ ప్రేమగా ఉంటాడన్న అహం కారంతో ఇంతవరకూ నీవు కౌసల్యను చాలా లోకువగా చూశావు. ఇక ఆవిడ నీపై పగ తీర్చుకోకుండా ఊరుకుంటుందా? నీకు నిజంగా సమర్థతే ఉంటే ఈ పట్టం భరతు డికి కట్టించు! భరతుడికి పోటీ అయిన రాముణ్ణి అడవిలోకి తోలించు! ఇంత రాజ్యానికి భరతుడు రాజవుతాడు, నీవు రాజమాతవై గౌరవం పొందుతావు. రాముడు రాజైతే నీ పతనం తప్పదు. నీ ముఖం చూసేవారుండరు," అని ఎడాపెడా అనేసింది.

ఈ మాటలు కైకేయి తలకెక్కాయి. ఆమె ముఖం జేవురించింది. క్రోధావేశంతో ఆమె మంథరను చూసి, "అవును, భర తుడు రాజు కావలసిందే, రాముడడవి పాలు కావలసిందే! కాని అది ఎలా సాధ్య పడుతుంది?" అన్నది.



# చందమామ

డిసెంబర్ 1961

50 NP





# అయోధ్యా కాండ

"రాముణ్ణి అడవులకు నెట్టి భరతుడికి రాజ్యాభిషేకం జరిగే ఉపాయం నేను చెబుతాను విను. విని నేను చెప్పినట్టు నడుచుకో. ఒకప్పుడు దేవాసుర యుద్ధంలో ఇంద్రుడికి నీ భర్త సహాయం వెళ్ళాడు. ఆయన వెంట నీవూ వెళ్ళావు. దండకారణ్యాలలో మత్స్యధ్వజు డేలే వైజయంతం వద్ద శంబరుడనే మహా బలశాలి అయిన అసురుడితో నీ భర్త గొప్పగా యుద్ధంచేసి గాయపడి మూర్ఛిల్లాడు. అప్పు డాయనను నీవు యుద్ధరంగం నుంచి దూరంగా తీసుకుపోయి ఆయన ప్రాణాలు కాపాడావు. స్పృహ తెలిసినాక ఆయన నీ సేవకు సంతోషించి నీకు రెండు వరాలిచ్చాడు. కాని వాటిని నీవు తరవాత కోరుకుంటానన్నావు. చూశావా? ఇప్పుడా రెండు వరాలూ కోరుకునే సమయం వచ్చింది. రాముణ్ణి పధ్నాలుగేళ్ళు అడవులకు పంపమనీ, భరతుడికి పట్టాభిషేకం చెయ్యమనీ నీ విప్పుడు నీ భర్తను కోరు!" అని మంథర కైకేయికి హితవు చెప్పింది.

కైకేయి, పాపం, సహజంగా మంచి స్వభావం కలదేగాని, మంథర చేసిన బోధలతో ఆమె మనస్సు పెడదారి పడింది. ఆ మంథర తన తలలో ఒక చెడ్డ భావం ప్రవేశపెట్టడంతో బాటు ఆ ఆలోచన సానుకూలమయే ఉపాయం కూడా చెప్పింది.

కైకేయి మంథరను, "ఓసి గూనిదానా! నిజంగా నీ వెంత తెలివిగల దానవే! నా మేలు నీవు కోరినట్టుగా మరెవరూ కోరరు







గదా!" అని ప్రశంసించింది. ఆమె గూని దాని సలహాతో తన నగలన్నీ తీసివేసి, చిరిగిన కోక ఒకటి చుట్టుకుని, కోప గృహానికి వెళ్ళి, కటిక నేల మీద అలిగిన దానిలాగా పడుకున్నది.

"నీ భర్త నిన్ను చూడవచ్చి నప్పుడు కంటికీ మంటికీ ఏకధారగా ఏడు. నీ కోపం గాని, నీ శోకంగాని రాజు కొంచెమైనా భరించ లేడు. వాటిని పోగొట్టటానికి ఆయన తన ప్రాణాలనైనా ఇస్తాడు. నేను చెప్పిన రెండు వరాలూ ఇచ్చినదాకా నీవు మెత్త బడకు! నీకు మణులూ, ముత్యాలూ, బంగారమూ ఇస్తానంటాడు; అక్కర్లేదని బెట్టు చెయ్యి.



ఆలోచించుకో, భరతుడు పధ్నాలుగేళ్ళు రాజ్యపాలన చేసినాక అతన్ని ఎవరూ కదిలించ లేరు," అన్నది మంథర.

"ఆ శంబరాసురుడి కన్న నీ కెక్కువ తంత్రాలు తెలుసు గదే!" అని కైకేయి మంథరను మెచ్చుకున్నది. తన భర్త తనకు వరాలివ్వని పక్షంలో చచ్చి పోవ టానికి కూడా ఆమె నిచ్చయించుకున్నది.

దశరథుడు రామ పట్టాభిషేక యత్నాల కాజ్ఞ ఇచ్చి, ఈ శుభవార్త కైకేయికి తానే స్వయంగా తెలిపే ఉద్దేశంతో కైకేయి శయన గృహానికి వచ్చి, అక్కడ ఆమె లేకపోవటం చూసి ఆశ్చర్యపడి, "కైకేయీ, ఎక్కడున్నావు?" అని పిలిచాడు. జవాబు లేదు. ఆయన అంతఃపుర ద్వారం దగ్గిరికి వచ్చి అక్కడి ద్వారపాలికను, "కైకేయి ఎక్కడ?" అని అడిగాడు.

ద్వారపాలిక భయంతో చేతులు జోడించి, "ప్రభూ, వారు కోపగృహంలో ఉన్నారు," అని చెప్పింది.

దశరథుడు కలవరపడుతూ కోప గృహానికి వెళ్ళి, అక్కడ నేలపైన పడి ఉన్న కైకేయిని చూశాడు. లక్ష వరహాల విలవచేసే ముత్యాలహారాలూ, ఇతర ఆభరణాలూ నేలపై చెల్లా చెదరుగా పడి ఉండి,










ఆకాశంలో నక్షత్రాల లాగా మెరుస్తున్నాయి. దశరథుడు కైకేయిని సమీపించి ఎంతో ప్రేమతో ఆమెను బుజ్జగిస్తూ, "దేవీ, నీ కెందుకిలా కోపం వచ్చింది? ఎవరిమీద? ఎవరన్నా నిన్ను తిట్టారా? అవమానించారా? ఒంట్లో సరిగా లేదా? వైద్యులను పిలిపించనా? ఎందు కేడుస్తావు? ఊరుకో! కావాలంటే నీ యిష్టం వచ్చిన వాళ్ళను దండిస్తాను! నిర్దోషులైనా సరే! నీ కోసం ఏ దరిద్రుణ్ణి అయినా ధనికుణ్ణి చేస్తాను. నీకు నాతోబాటు మిగిలిన వారంతా విధేయులై ఉండగా ఈ దుఃఖం దేనికి? నీ కోరిక ఏమిటో చెప్పు; నాప్రాణాలు ఒడ్డి అయినా సరే ఆ కోరిక తీరుస్తాను! లే, కైకేయీ, లే!" అన్నాడు.

ఈ మాటలు విని కైకేయి, "నా కెవరూ అపకారం చెయ్యలేదు, అవమానమూ చెయ్యలేదు. నా కొక కోరిక ఉన్నది. దానిని మీరు తీరుస్తారని ప్రమాణం చేసేటట్టయితే చెబుతాను," అన్నది.

దశరథు డీ మాటలకు చిరునవ్వు నవ్వి, కైకేయి జుట్టు చేతితో నిమురుతూ, తన ప్రాణంతో సమానమైన రాముడి పైన ఒట్టు పెట్టుకుని, ఆమె కోరిక తీర్చటానికి ప్రమాణం చేశాడు.

అప్పుడు కైకేయి దశరథుడికి శంబరాసురుడితో జరిగిన యుద్ధాన్నీ, మూర్ఛితుడై ఉన్న సమయంలో తాను ఆయనను రక్షించి దూరంగా తీసుకుపోయి పరిచర్యలు చేసిన విషయాన్నీ, ఆ సమయంలో ఆయన రెండు వరాలిస్తాను కోరమంటే తాను తరవాత కోరుకుంటానన్న సంగతీ జ్ఞాపకం చేసింది. తరవాత ఆ వరాలు రెండూ బయట పెట్టింది; రాముడికి జరగబోతున్న పట్టాభిషేకాన్ని భరతుడికి చెయ్యాలి, రాముడు నారబట్టలనూ, కృష్ణాజినాన్నీ, జడలనూ, మునివేషాన్నీ ధరించి పద్నాలుగేళ్ళు దండకారణ్యంలో నివసించాలి!









ఈ మాటలు వింటుంటే దశరథుడి కేదో భయం పుట్టుకొచ్చింది, స్పృహతప్పి నట్టయింది. కాళ్ళూ, చేతులూ వణికాయి. బాధతో నిట్టూర్పులు విడుస్తూ, ఆయన కైకేయిని నానాతిట్లూ తిట్టాడు.

"నీవు రాజకుమార్తె వనుకుని తెచ్చి ఇంట్లో పెట్టుకున్నాను. కాని నీవు విషం కక్కే పామువు. నిన్ను తల్లిగా చూసుకుంటాడు గదా, ఆ రాముడికి ఇంత ద్రోహం ఎలా తలపెట్టావు ? నేను నీకేం ద్రోహం చేశాను ? ఏ మహాపాతకం చేశాడని రామున్ని అడవికి పంపను ? నా ప్రాణాలనైనా వదలగలను గాని రామున్ని చూడకుండా బతకలేనే ! ఈ దిక్కుమాలిన ఆలోచన మానుకో! నీ కాళ్ళు నెత్తిన పెట్టుకుంటాను, నన్ను కరుణించి ఈ వరం అడగకు. భరతుడంటే నాకు ప్రేమ లేదేమోనని పరీక్ష చెయ్యటానికి ఇలా అని ఉంటావు. రాముడు చేసిన సేవలో ఎన్నోవంతు కూడా భరతుడు నీకు చెయ్యలేదు. నీకు రాముడికంటె భరతుడెక్కువ అంటే నేను నమ్మను. నీ మాటలతో నన్ను చాలా బాధపెట్టావు. చూడూ, నేను ముసలివాణ్ణి. కాటికి కాళ్ళు చాచుకొని ఉన్నాను. కావలిస్తే భూమండలమంతా తీసుకో కాని రాముడిపై ఆగ్రహించకు. నీకు చేతులు జోడించి నమస్కారం చేస్తాను," అని కైకేయిని దశరథుడు ఎంతోసేపు వేడుకున్నాడు.

దశరథుడు ఇలా దిగజారిపోతున్న కొద్దీ కైకేయికి ఆగ్రహం రెచ్చింది. మొదట వరాలిస్తాననీ, ఇప్పుడు కోరిక తీరుస్తాననీ ప్రమాణాలు చేసి దశరథుడు బేలగా మాట్లాడటం రాజకులానికే కళంకమని ఆమె అన్నది. తన వరాలను ఉపసంహరించుకోననీ, రాముడి పట్టాభిషేకం జరిగే పక్షంలో తాను చచ్చిపోతాననీ అన్నది.

దశరథుడు మానసిక వేదనతో దహించుకు పోయాడు. ఎటువంటి విషమపరిస్థితి!







"నాయనా, అడవికి పోరా!" అని రాముడితో ఎలా చెప్పటం? కైకేయి కోరిక ప్రకారం రామపట్టాభిషేకం మానేస్తే ఇతర రాజులంతా, "పట్టాభిషేకం చాలా బాగా చేశారే?" అని యద్దేవా చెయ్యరూ? కౌసల్యా ముఖం ఎలా చూడటం? ఆయన తనలో తాను దుఃఖించాడు, కైకేయిని తిట్టాడు, బతిమాలాడు, మధ్య మధ్య మూర్ఛపోయాడు. ఆ రాత్రి ఆయనకు కాలరాత్రి లాగా గడిచి తెల్లవారింది.

వసిష్ఠుడు తన శిష్యులతోసహా రాచనగరుకు వచ్చి, దశరథుడి అంతఃపురం వాకిలి దగ్గిర సుమంత్రు డెదురుకాగా, తాను వచ్చిన సంగతి రాజుగారికి చెప్పమన్నాడు. పట్టాభిషేకం ఏర్పాట్లన్నీ పూర్తి అయాయనీ, రాజుగారు కదిలిరావటమే వ్యవధి అనీ వసిష్ఠుడు చెప్పగా సుమంత్రుడు స్వేచ్ఛగా అంతఃపురం ప్రవేశించాడు. సుమంత్రుడు వృద్ధుడు కావటంచేతా, రాజుగారికి ఆ బాల్యమిత్రుడు గనకా ఆయనను ఎవరూ అడ్డరు. ఆయన తిన్నగా రాజుగారున్న చోటికి వెళ్ళి, రాజుగారి మనస్థితి ఊహించక, ఆయన నిద్రపోతున్నాడనుకుని, "మహారాజా, లేవండి. సూర్యోదయం కూడా అయింది. రామపట్టాభిషేకం జరిపించటానికి అందరూ



తమ రాక కోసం చాలాసేపుగా ఎదురు చూస్తున్నారు," అని చెప్పాడు.

దశరథుడు శోకంతో వాచి ఎర్రగా ఉన్న కళ్ళతో సుమంత్రుణ్ణి చూసి, "ఏమోయ్, నన్ను నీ మాటలతో ఇంకా ఎందుకు దుఃఖపెడతావు?" అన్నాడు. దశరథుడు దుఃఖంలో ఉన్నాడని తెలియగానే సుమంత్రుడు చేతులు జోడించి, రెండడుగులు వెనక్కు వేశాడు. దశరథుడు సుమంత్రుడితో మాట్లాడేస్థితిలో లేనందున కైకేయి, "సుమంత్రుడా, తెల్లవార్లూ మహారాజుకు రామపట్టాభిషేక మన్న ఆనందంతో నిద్ర లేదు. ఇప్పుడే కాస్త కునుకు పట్టింది. నీవు







వెళ్ళి రాముణ్ణి పిలుచుకురా. ఇదే రాజు గారి అజ్ఞ అనుకో," అన్నది.

"రాముడు ఇక్కడికి వచ్చి పట్టాభిషేకం చేసుకుంటాడు కాబోలు!" అనుకుంటూ సుమంత్రుడు అక్కడి నుంచి కదిలాడు. నగరమంతా ఉత్సవంలాగా కోలాహలంగా ఉన్నది. రాజసభ జనంతో కిక్కిరిసి ఉన్నది. సంబారాలన్నీ సిద్ధంగా ఉన్నాయి. రాజులందరూ కానుకలు తెచ్చారు. వారు తమలోతాము, "రాజుగారు కనిపించరు. మనం వచ్చిన సంగతి వారికెలా తెలియడం?" అనుకుంటున్నారు. సుమంత్రుడు మర్యాదగా వారిని పలకరించి,



"తామంతా వచ్చిన సంగతి నేను మహారాజు గారికి తెలియ జేస్తాను. వారి దగ్గిరికి రాముణ్ణి తీసుకు పోతున్నాను," అని చెప్పాడు.

అయన మళ్ళీ వెనక్కు తిరిగి దశరథుడి అంతఃపురానికి వెళ్ళి, దశరథుడు పడుకుని ఉన్న చోటికిచేరి, "దశరథ మహారాజా, విజయీభవ. రాత్రిగడిచి, తెల్లవారి, సూర్యోదయంకూడా అయింది. మీ కోసం బ్రాహ్మణులూ, సేనాపతులూ, పట్టణంలోని పెద్దలూ ఎదురుచూస్తున్నారు. నిద్రమేలుకుని జరగవలసిన కర్మకాండ జరిపించండి," అన్నాడు.

"రాముణ్ణి తీసుకు రమ్మని కైకేయి నీతో చెప్పెనే? తీసుకురాకుండా ఎందుకు వచ్చావు? ఆమె అజ్ఞ నా అజ్ఞకాదా? నేను నిద్రపోవటం లేదు. మేలుకునే ఉన్నాను. వేగిరం రాముణ్ణి తీసుకురా!" అన్నాడు దశరథుడు.

సుమంత్రుడు చిత్తమని చెప్పి, రాజుకు నమస్కారంచేసి, "ఏదో గొప్ప ఏర్పాటే జరగబోతున్నది!" అని తనలో తాను సంతోషపడుతూ, రాజ వీధి వెంట జనం ఉత్సాహంగా పట్టాభిషేకం గురించి అనుకునే మాటలువింటూ రాముడుండే నగరుకు రథం తోలుకుని వచ్చాడు. అక్కడ జనం







గుంపులు గుంపులుగా చేరి ఉన్నారు. రాముడి అంతఃపురంచుట్టూ ఏనుగులూ, గుర్రాలూ, సైనికులూ, మంత్రులూ కిటకిట లాడుతున్నారు. సుమంత్రుడు వారి నందరినీ తోసుకుంటూ వెళ్ళి, రాముడుండే ఏడంత స్తులమేడ ప్రవేశించాడు. తాను వచ్చినట్టు రాముడికి కబురుపంపి, అతని అనుమతితో రాముడుండే చోటికి వెళ్ళాడు.

రాముడు చక్కగా అలంకరించుకుని బంగారు చక్కిపై కూచుని ఉన్నాడు. సీత పక్కనే నిలబడి వింజామర వీస్తున్నది. సుమంత్రుడు అతన్ని సమీపించి, నమస్కరించి, "తండ్రిగారు కైకేయి అంతఃపురంలో ఉన్నారు. నిన్ను చూడాలంటున్నారు," అని చెప్పాడు. ఈ మాటలువిని రాముడు ఆనందంతో పొంగి పోయాడు. అతను సీతను లోపలికి పంపి, పట్టాభిషేకానికి చేసిన అలంకారా లన్నిటితోనూ సుమంత్రుడి వెంట బయలుదేరాడు. అతను పులితోలు పరిచిన రథం ఎక్కి కూచోగానే, లక్ష్మణుడుకూడా వెనకగా ఎక్కి, ఒక చేత్తో అన్నగారికి ఛత్రం పట్టి, రెండవ చేత్తో చామరం వీచాడు.

రాముడి వెనకగా గుర్రాలూ, ఏనుగులూ ఎక్కిన రౌతులూ, కోలాహలంగా వేలకొద్దీ జనమూ నడిచారు.

రాముడి రథం దశరథుడి నగరు ప్రవేశించి, మూడు ప్రాకారాలు దాటి నిలిచి పోయింది. తన వెంట వచ్చిన బలగమూ, ప్రజలూ అక్కడ నిలిచిపోగా, రాముడు కాలినడకను మరి రెండు ప్రాకారాలు దాటి దశరథుడి అంతఃపురం ప్రవేశించాడు.

ఒక అందమైన ఆసనంపైన దశరథుడూ, కైకేయీ కూచుని ఉన్నారు. రాముడు తండ్రి కాళ్ళకూ, తరవాత కైకేయి కాళ్ళకూ నమస్కరించాడు. "రామా," అంటూ ఏదో చెప్పబోయి, దశరథుడు గొంతు పెగలక, కళ్ళు మూతపడి, కన్నీరు కారుస్తూ దుఃఖంతో వివశుడయాడు.






తండ్రిని ఆ స్థితిలో చూడగానే రాముడికి పామును తొక్కినట్టుగా భయం కలిగింది. అతను కళవళపడి కైకేయితో, "అమ్మా, నా వల్ల ఏదైనా తప్పు జరిగిందా? తండ్రిగారు ఇలా కలవర పడటానికి కారణమేమిటి? ఆయనను ఇలా ఎన్నడూ చూడలేదు. నాకేమో ఆందోళనగా ఉన్నది," అన్నాడు.

కైకేయి కొంచెంకూడా బిడియం లేకుండా, "రాజుగారికి కోపమూ లేదు, తాపమూ లేదు. ఆయనకు ఒక కోరిక ఉన్నది. అది నీకు చెప్పటానికి జంకుతున్నాడు. ఒకప్పు డీయనగారు నాకు ఒక వర మిస్తానన్నాడు. ఎందుకన్నానా అని ఇప్పుడు కుళ్ళుతున్నాడు. ధర్మం జరగటం ప్రధానం కద. నీ తండ్రి ఆడినమాట తప్పకుండా చూసేభారం నీమీద ఉన్నది. మంచో, చెడో, ఆయన కోరిక తీర్చుతానని నీవు మాట ఇస్తే అసలు సంగతి చెబుతాను. ఆ సంగతి ఆయన నోటంట రాదు, అందుచేత నేనే చెప్పాలి మరి," అన్నది.

"అదేమిటమ్మా? నన్నలా శంకించవచ్చా? నాయనగారు కోరితే నిప్పులో దూకనా? ఆయన కోరిక ఏమిటో చెప్పు, తప్పక చేస్తాను. నేను ఆడి తప్పను," అన్నాడు రాముడు.

కైక రాముడితో దేవాసుర యుద్ధం నాటి విషయాలుచెప్పి, ఆయన ఆ సమయంలో ఇస్తానన్న వరం ప్రకారం రాముడు పద్నాలుగేళ్ళు అరణ్యవాసానికి పోవలసి ఉంటుందని చెప్పింది.







"ఈ పట్టాభిషేక యత్నం వృథాపోదులే. భరతుడు పట్టాభిషేకం చేసుకుని భూమి నాలుగు చెరగులా పాలిస్తాడు. నీవు నారబట్టలూ, జడలూ ధరించి పధ్నాలుగేళ్ళు అరణ్యావాసం వెళ్ళినట్టయితే నీ తండ్రికి ఆడి తప్పాడన్న అపఖ్యాతి చుట్టుకోకుండా పోతుంది," అన్నదామె.

ఇంత దారుణమైనమాట, ఇంత పరుషంగా చెవిని పడినప్పుడు మరొకడైతే ఎంతో కలవరపడి, మథనపడి, కైకేయి మొహం చూడడానికికూడా సిగ్గుపడి ఉండును. కాని రాముడటువంటి వికారాలేమీ లేకుండా, "అమ్మా, అలాగే కాని. నేను నారబట్టలు



కట్టి అరణ్యానికి పోతాను. భరతుడి కోసం వెంటనే కబురు పంపండి. తండ్రిగారి ప్రతిజ్ఞా, నీ కోరికా ఇదే అయినప్పుడు నేను భరతుడికి రాజ్యం ఇవ్వనంటానా? భరతుడికి పట్టంకట్ట నిశ్చయించానని తండ్రిగారు నాతో అనకపోవటమే నన్ను బాధిస్తున్నది," అన్నాడు.

ఈ మాటలకు కైకేయి సంతోషించి, "మరేం లేదులే. ఆయన మాట దక్కిస్తావో, దక్కించవో అనే జంకుచేతనే ఆయన నీతో ఈ సంగతి చెప్పలేదు. నువ్వు మాత్రం జాగు చేయక అడవికి బయలుదేరు. నీవు వెళ్ళేదాకా మీ తండ్రిగారు స్నాన భోజనాదులు చెయ్యడు," అన్నది.

కైకేయి అన్న ఈ మాటలకు దశరథుడు లోలోపల కుమిలి మూర్ఛపోయాడు. రాముడాయనను లేవదీసి కూచోబెట్టి కైకేయితో, "అమ్మా, నాకు లోపల నిజంగా రాజ్యకాంక్షా, ధనకాంక్షా లేవు. నే నింకేమైనా చేయవలసినది ఉంటే చెప్పు. నీవు రాజుగారిని కోరిన వరాలు చాలా అల్పమైనవి. నీవు నిజంగా కొండనుతవ్వి ఎలుకను పట్టుకున్నావు," అన్నాడు.

దశరథుడు బావురుమని ఏడ్చి స్పృహ తప్పి పడిపోయాడు. రాముడు తండ్రికీ,







కైకేయికీ ప్రదక్షిణ నమస్కారంచేసి అంతఃపురం నుంచి బయటికివచ్చి తన చెలికాళ్ళ కేసిచూసి, పట్టాభిషేక సంబారాలకు ప్రదక్షిణం చేసి బయలుదేరాడు. లక్ష్మణుడు ఆపుకోరాని దుఃఖంతోనూ, ఆగ్రహంతోనూ పెనుగులాడుతూ అన్నను వెంబడించాడు.

రాముడు రథమెక్క లేదు. ఛత్రచామరాలు నిషేధించాడు. సర్వసంగ పరిత్యాగం చేసిన యోగియొక్క మనస్థితి తెచ్చి పెట్టుకుని, ఈ దుర్వార్త చెప్పటానికి కౌసల్య వుంది రానికి బయలుదేరాడు. దశరథుడి అంతఃపుర స్త్రీలు గొల్లున ఏడవటం వినపడింది.

రామలక్ష్మణులు కౌసల్యనగర్షకు వచ్చేసరికి అక్కడ ఎవరికీ జరగబోయేది తెలియదు. రాముడు మొదటి ప్రాకార ద్వారం నుంచి లోపలికి పోతూంటే, అక్కడ ఉండిన ఒక వృద్ధుడూ, మరికొందరూ లేచి నిలబడి విజయధ్వానాలు చేశారు. రెండవ ప్రాకారం వద్ద ఉండే వృద్ధ బ్రాహ్మణులకు నమస్కరించి, మూడో ప్రాకారం చేరాడు. అక్కడి కాపలివాళ్ళంతా స్త్రీలు. వారిలో కొందరు కౌసల్యతో రామలక్ష్మణుల రాక చెప్పటానికి పరిగెత్తారు; మిగిలినవాళ్ళు, "మహారాజుకు జయం కలగాలి!" అని కేకలు పెట్టారు.



రాముడు వచ్చేసరికి కౌసల్య అగ్నిలో హోమం చేస్తున్నది. ఆమె రాముడి కెదురు వచ్చి, కౌగలించుకుని, శిరస్సు ముద్దు పెట్టుకుని, "నాయనా, భోజనం చేద్దువు గాని పద!" అన్నది.

తల్లికి ఈ విషాదవార్త ఎలా తెలపాలో తెలియక తికమకపడుతూ రాముడు, "అమ్మా, నీ కింకా తెలియదులాగుంది. అంతా తారుమారై పోయింది. నేను పద్నాలుగేళ్ళు మునిలాగా, మాంసం వర్జించి, కందమూల ఫలాలు తింటూ దండకారణ్యంలో ఉండబోతున్నాను. నేను కూచునేది సింహాసనం మీద కాదు, దర్భల చాప మీద.



నాన్నగారు భరతుడికి పట్టంగట్టబో తున్నారు," అన్నాడు.

ఈ మాట విని కౌసల్య మొదలు నరికిన అరటి చెట్టులాగా పడిపోయి నేలపై దుఃఖంతో పొర్లింది. రాముడామెను లేవ దీసి కూచోబెట్టి దుమ్మంతా దులిపాడు. కౌసల్య రాముడితో, "నాయనా, నా జన్మకు సుఖం లేదు కాబోలు. నిన్ను కని ఈ బాధ భరించేకన్న గొడ్రాలుగానే ఉండిపోయి నట్టయితే, పిల్లలు లేరన్న చింత ఒక్కటే బాధించేది. ఎన్నడూ నేను సుఖపడి ఎరగను; నీవు రాజువైతే సుఖపడదామను కుంటున్నాను. కావటానికి నేను రాజుగారి



పెద్ద భార్యనే కాని, సవతుల చేత పడరాని మాటలన్నీ పడ్డాను. ఏమంటే నా భర్తకు నేనంటే లక్ష్యంలేదు, నాకు స్వాతంత్ర్యమూ లేదు. ఇక నేను కైకేయి పరిచారికలకంటె హీనంగా బతకాలి. నీవు పుట్టిన ఈ పదిహే డేళ్ళూ నీ వెప్పుడు రాజువవుతావా అని ఎదురు చూస్తూ వచ్చాను. ఆ ఆశకూడా పోయింది. నాకు చావు వచ్చినా బాగుం డును, కాని అది కావాలన్నప్పుడు రాదు. నాయనా, నేనుకూడా నీ వెంటనే అడవులకు వస్తాను," అన్నది.

కౌలస్య మాటలు వింటుంటే లక్ష్మణుడికి ఒక ఆలోచన వచ్చింది. అతడు కౌసల్యతో, "అమ్మా, ఆ కైకేయి మాట విని అన్న అడవికి పోవటం నాకు సవ్యంగా కనపడ లేదు. రాజు ముసలివాడు, ఆయన మనసు దుర్బలమైనది. స్త్రీ వ్యామోహంచేత ఆయన అన్యాయమైన పని చెయ్యమంటే కొడుకుల మైన మేము చేయాలని ఎక్కడ ఉంది?" అని, రాముడితో, "అన్నా, రాజు నిన్ను అడవికి పొమ్మన్నమాట అందరికీ తెలియక ముందే మనం మన శౌర్యంతో రాజ్యాన్ని వశపరుచు కుందాం. నేను విల్లుపట్టి మనని నిరోధించే వాళ్ళందరినీ చంపుతాను. మన తండ్రికూడా మనకు పగవాడే అయినాడు.









ఆయనను చంపినా, కాళ్ళూ చేతులూ కట్టి పడవేసినా తప్పులేదు. మా అందరిలోనూ పెద్దవాడవు. ఈ రాజ్యం నీది? రాజు మాత్రం దీన్ని మరొకరికి ఎలా ఇస్తాడు? నీవేమి అపచారం చేశావని నిన్ను అడవులకు పంపుతాడు? నిన్ను అడవులకు పంపేటంత శక్తిమంతుడా ఈ రాజు? ఇదుగో నా విల్లు! నేను యుద్ధానికి సిద్ధంగా ఉన్నాను," అన్నాడు.

కౌసల్య రాముడితో, "నాయనా, లక్ష్మణుడు చెప్పినట్టు చెయ్యి. నీవు నీ తండ్రి మాటే వినాలని ఏమున్నది? నేను తల్లిని కానా? నీవు అడవులపాలు కావటానికి నేను ఒప్పను. ఒకవేళ వెళ్లావో ఉపవాసాలు చేసి ప్రాణాలు విడుస్తాను. ఆ పాపం నీకు చుట్టుకుంటుంది," అన్నది.

రాముడు తల్లితో, "నేను నాన్నగారి మాట అబద్ధం చేయలేను, జవదాటలేను. పితృవాక్యం పాలించటానికి ఎందరో ఘోరాలు చేశారు. కండుడు అనే ముని గోవధ చేశాడు. పరశురాముడు తల్లినే చంపాడు. మా మూల పురుషుడైన సగరుడి కొడుకులు తండ్రి ఆజ్ఞపై పాతాళానికి పోయి, అరవైవేలమందీ ఒక్కసారిగా మరణించారు. అమ్మా, నేను నిన్ను ధిక్క



రించటానికి అరణ్యానికి పోతున్నానా?" అని, లక్ష్మణుడితో, "లక్ష్మణా, నీకు నాపై గల ప్రేమా, నీ పౌరుషమూ నేనెరగనా? అన్నిటికన్న ధర్మం గొప్పది. దానిని మనం నిలబెట్టాలి. అందుచేత నా బుద్ధి నను సరించే నీవు కూడా ఆలోచించు," అన్నాడు.

తల్లిని సమాధాన పరచటానికి రాముడు ఎన్నో ధర్మాలు చెప్పాడు. కౌసల్య ముసలి భర్తను విడిచి తన వెంట రావటం భావ్యం కాదన్నాడు. అతను లక్ష్మణుడితోకూడా, "ఇది దైవ నిర్ణయం. కాకపోతే, నేనంటే అంత ప్రేమగా ఉండే కైకేయి నన్ను అడవులకు పొమ్మంటుందా? పట్టాభిషేకం









నిలిచి పోయిందంటే నీ కింత బాధగా ఉన్నదే, పట్టాభిషేకం జరుగుతున్నదని తెలిసి ఆమె ఎంత బాధ పడిందో? నేను తండ్రిగారి మనసుగాని, ఆమె మనసుగాని నొప్పించినట్టు నాకు జ్ఞాపకం లేదు. ఇప్పుడా పని చేయలేను," అని చెప్పాడు.

రాముడు తండ్రి ఆజ్ఞ పాలించటానికి గాను అడవికి వెళ్ళే దృఢనిశ్చయం చేసుకున్నాడని గ్రహించి, కౌసల్య అతని క్షేమం కోసం బ్రాహ్మణుల చేత హోమం చేయించి, ఆశీర్వదించి పంపింది.

రాముడు సీతయొక్క అంతఃపురానికి వెళ్ళాడు. అతనికి సీతను చూడగానే



కన్నీరు ఆగలేదు. పట్టాభిషేకం చేసుకునే ఉత్సాహంలేకపోగా, తల వంచి కన్నీరు కార్చుతూ, వెంట ఎవరూ లేకుండా వచ్చే భర్తను చూసి సీతకూడా కంపించింది. ఆమె అతని దిగులుకు కారణం అడిగింది.

జరిగినదంతా చెప్పి రాముడామెతో, "నేను అడవుల నుంచి తిరిగి వచ్చేవరకూ నీవు భరతుడి వద్ద ఉండి అతను చెప్పినట్టు నడచుకో. అతని ఎదట నన్నెప్పుడూ పొగడకు. బంధుత్వం తప్పిస్తే, భరతుడు నిన్ను పోషించ వలసిన కారణం మరొకటి లేదు. అందుచేత నీవు అతను సంతోషించేటట్టు మసలుకో. వృద్ధులైన నా తల్లి దండ్రులను కనిపెట్టి ఉండు," అని చెప్పాడు.

ఈ మాటలు విని సీత, ప్రణయంతో కూడిన కోపంతో, "ఇవేం మాటలు? నన్ను తేలిక జేసి పరాచకాలాడుతున్నావా? ఆడదానికి భర్తే కదా గతి! నిన్ను వనవాసం వెళ్ళమంటే నన్ను వెళ్ళమన్నట్టు కాదా? నీవు అడవిలో సంచరించటమే జరిగితే, ముళ్ళన్నీ నా కాళ్ళతో తొక్కి నీకు దారి చేస్తూ నేను ముందు నడవనా? నీ వంటి పరాక్రమవంతుడి వెంట ఉండగా నాకు అరణ్య భయం ఉండబోదు. అడవిలోని వారందరినీ కాపాడగల వాడివి నన్ను





కాపాడలేక పోవు. అడవిలో నేను, అది కావాలి, ఇది కావాలి అని అడగబోను. నీవు లక చెప్పినా సరే నా మనసు మారదు," అన్నది.

సీత తన వెంట అడవులకు వచ్చి కష్టాలు పడటం రాముడికి కొంచెం కూడా ఇష్టం లేదు. ఆ కష్టాలను వివరించి చెప్పాడు. కాని సీత వాటిని లక్ష్యపెట్టలేదు. "నిన్ను చూసి సాముద్రిక వేత్తలు వనవాస యోగం ఉన్నదని చెప్పినట్టే నన్ను చూసికూడా జ్యోతిష్కులు నాకు వనవాస యోగం ఉన్నదని చెప్పారు. అందుచేత నేను నీ వెంట అరణ్యానికి వచ్చి తీరుతాను," అన్నది.

అప్పటికీ రాముడు ఆమెను తీసుకుపోవటానికి సమ్మతించలేదు. సీతకు కోపమూ, దుఃఖమూ ముంచుకు వచ్చాయి. ఆమె రాముడితో, "అయ్యో, మా నాన్న అయిన జనకమహారాజు, తన అల్లుడు పురుషరూపంలో ఉన్న ఆడదని తెలిస్తే ఏమనుకుంటాడు? నిన్ను శూరుడని తెలియనివారు అనుకుంటున్నారు! నీ భయం దేనికి? నేనేం తప్పు చేశానని నన్ను విడిచిపెట్టి పోవాలనుకుంటున్నావు? నీవు తప్ప నాకు వేరే దిక్కు లేదు గదా, నేను నిన్ను విడిచిపెట్టి వంశానికి కళంకం తీసుకురావాలా? నీ వున్న చోటే నాకు స్వర్గమని చెప్పానే!" అంటూ బోరున ఏడ్చింది.

రాముడామెను రెండు చేతులా దగ్గిరికి తీసుకుని, సముదాయించి, తన వెంట తీసుకు పోతానని మాట ఇస్తూ, "వనవాసానికి సిద్ధంకా! నీ వద్ద ఉన్నదంతా దానం చేసెయ్యి. నీ వస్తు సామగ్రి యావత్తూ ముందు పనివాళ్ళ కిచ్చి, మిగిలినది బ్రాహ్మణుల కియ్యి. సన్యాసులకు భోజనం పెట్టించు, బిచ్చగాళ్ళకు దానాలు చేయించు," అన్నాడు. సీత పరమానందంతో ఆ పనులన్నీ సాగించింది.






ఆ భార్యా భర్తల సంభాషణ అంతా వింటూ ఉండిన లక్ష్మణుడు, "అన్నా! నీవు అరణ్యానికి వెళ్ళటానికే నిశ్చయించినట్టయితే నేను కూడా వస్తున్నాను," అన్నాడు. ఇందుకు రాముడు సమ్మతించక, "నీవూ, నేనూ కూడా వెళ్ళిపోతే మన తల్లులు కౌసల్యా సుమిత్రలు బొత్తిగా దిక్కులేని వాళ్ళవుతారు. వాళ్ళను కని పెట్టుకుని ఉండు," అన్నాడు.

లక్ష్మణుడు ఒప్పుకోలేదు. "నేను రాత్రి, పగలూ నీకు కావలసిన పనులన్నీ చేస్తాను. నేను నీ వెంట వచ్చితీరాలి," అన్నాడు.

రాముడు సంతోషించి సరే నన్నాడు. వసిష్ఠుడి వద్ద ఉండే దివ్యాయుధాలు తీసుకు రమ్మని లక్ష్మణుణ్ణి పంపాడు. వాటిలో అక్షయతూణీరాలూ, భయంకరాకారాలు గల ధనుస్సులూ, దుర్భేద్యమైన కవచాలూ, బంగారు పూతగల రెండు కత్తులూ ఉన్నాయి. లక్ష్మణుడు వెళ్ళి, తాను అడవికి పోతున్న సంగతి తన మిత్రులందరికీ చెప్పి, వసిష్ఠుడి వద్దనున్న ఆయుధాలు తెచ్చాడు.

తరవాత రాముడు యాత్రాదానాలు చేశాడు. వసిష్ఠుడి కొడుకైన సుయజ్ఞుణ్ణి పిలిపించి, ఆయన భార్యకు సీతచేత ఆమె నగలూ, మంచమూ, పరుపులూ దానం చేయించి, తాను శత్రుంజయమనే ఏనుగునూ, అనేక ఇతర ఏనుగులనూ ఇచ్చి పంపాడు. అగస్త్య కౌశికులనే బ్రాహ్మణులకూ, కౌసల్యను ఆశ్రయించుకుని ఉన్న





ఒక వృద్ధ వేద పండితుడికీ, దశరథుడికి ఇష్టుడైన చిత్రరథుడనే సారథికీ, బ్రహ్మచారులకూ అంతులేని గోవులూ, బంగారమూ, మణులూ, బట్టలూ దానం చేశాడు.

అయోధ్యకు సమీపంగా అరణ్యంలో ఒక ముసలి బ్రాహ్మణుడుండేవాడు. ఆయన పేరు త్రిజటుడు. ఆయనకు గంపెడు పిల్లలూ, పడుచు భార్యా ఉన్నారు. ఆయన పరిగ ఏరుకునీ, కందమూలాలు తవ్వుకునీ సంసారం నెట్టుకొస్తున్నాడు.

రాముడు యాత్రాదానాలు చేస్తున్న మాట ఎలాగో తెలిసి త్రిజటుడు, చిరిగిన పై బట్ట కప్పుకుని రాముడి వద్దకు వచ్చి, "రాజపుత్రా, నేను పేదవాణ్ణి. చాలామంది బిడ్డలు గలవాణ్ణి. ఇంత కాలంగా పరిగ ఏరుకు బతుకుతున్నాం. కాస్త నన్ను కటాక్షించు," అన్నాడు.

రాముడాయనతో నవ్వులాటలకు, "అయ్యా, నీవు నీ బలం కొద్దీ కర్ర విసురు. అది ఎంత దూరాన పడుతుందో అంత దూరున గోవుల నిస్తాను," అన్నాడు.

ముసలి త్రిజటుడు నడుము బిగించి, ఒక కర్ర తీసుకుని గిరగిరా తిప్పి విసిరే సరికి, అది సరయూనది అవతలి గట్టున వెళ్ళి పడింది.

రాముడు త్రిజటుణ్ణి ఆప్యాయంగా కౌగలించుకుని, "అయ్యా, నవ్వుల కన్నాను, కోప్పడ వద్దు. నీ తపశ్శక్తి ఎంతో తెలుసుకుందా మనిపించింది. అన్నప్రకారం గోవుల నివ్వటమేగాక ఇంకేమన్నా కావాలన్నా ఇస్తాను" అన్నాడు. త్రిజటుడు రాముణ్ణి దీవించి ఆవుల మందలను తోలుకుని తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

ఈవిధంగా దానాలతో ఆబాలగోపాలాన్నీ తృప్తి పరచి రాముడు సీతా లక్ష్మణులతో తండ్రి నగరుకు బయలుదేరాడు.

వారు ముగ్గురూ వీధులవెంబడి పోతుంటే మేడల మీది నుంచీ, మిద్దెల మీది నుంచీ









చూసే పౌరులకు కడుపు మండిపోయింది. వాళ్ళు రకరకాలుగా తమలో తాము మాట్లాడుకున్నారు:

"చూడండ్రా, రాముడు కాలినడకను భార్యనూ, తమ్ముణ్ణీ వెంటబెట్టుకుని ఎలా పోతున్నాడో! కాకపోయినా ఈ దశరథుడి కేదో దయ్యం పట్టినట్టుంది. ఎంత దుర్మార్గుడైన కొడుకునైనా రాజైనవాడు అడవులకు పంపడుగదా, బంగారంలాటి రాముణ్ణి అడవికి పంపిస్తున్నాడే! మన మందరమూ కుటుంబాలతో సహా రాముడి వెంట పోతే రోగం వదిలిపోతుంది!"

పౌరులు గట్టిగా అనుకునే ఈ మాటలన్నీ వింటూ సీతా రామలక్ష్మణులు దశరథుడి నగరు చేరి, సుమంత్రుడి ద్వారా తాము ఆయనను చూడవచ్చినట్టు రాజుకు కబురు చేశారు.

దశరథుడు సీతా రామలక్ష్మణులను పిలుచుకురమ్మని సుమంత్రుడితో అన్నాడు.

చేతులు జోడించి వచ్చే రాముడు కనబడగానే దశరథుడూ, ఆయన అంతఃపుర స్త్రీలూ లేచి నిలబడ్డారు. దశరథుడు రాముడి కెదురు పోబోయి మధ్య దారిలోనే పడిపోయాడు. ఆయనను ఎత్తి పాన్పుపై పడుకోబెటారు.

స్పృహ వచ్చి దశరథుడు కళ్ళు తెరవగానే రాముడు, "మహారాజా, నేను దండకారణ్యానికి పోతున్నాను. మీరు ప్రభువు గనక మీ అనుమతి కోసం వచ్చాను. నేనెంత చెప్పినా వినక సీతా లక్ష్మణులు నా వెంట బయలు దేరారు. వారి వనవాసానికి కూడా అనుమతి ఇవ్వండి," అన్నాడు.

దశరథుడు రాముడితో, "నాయనా, రామా! కైకేయికి వరమిచ్చి నేను మోసపోయాను. నీవు నా ఆనతి అతిక్రమించి పట్టాభిషేకం చేసుకో!" అన్నాడు.

"మీరు అసత్యదోషం కట్టుకోకండి. అడవికి పోవటానికి నా కేమీ అభ్యంతరం







లేదు. పద్నాలుగేళ్ళూ సుఖంగా వనవాసం చేసి మళ్ళీ మీ దగ్గిరికి వస్తాము," అన్నాడురాముడు.

"మీరు ఇవాళే వెళ్ళాలని ఏమిటి? ఈ రాత్రికి ఇక్కడ ఉండి నా వల్ల మీకు కావలిసిన వన్నీ పొంది, ఈ ఒక్క రాత్రి మమ్మల్నందరినీ సంతోష పెట్టి, రేపు ఉదయం అరణ్యానికి బయలుదేర వచ్చు," అన్నాడు దశరథుడు.

"తండ్రీ, మా కోరికలన్నీ మీరు తీర్చి నట్టే భావించి మమ్మల్ని వెళ్ళ నివ్వండి. మాకు మీ ఆశీర్వాదం ఇచ్చి సంతోషంగా పంపండి. అరణ్యంలో మా కేమీ కష్టాలుండవు. అనేక పర్వతాలూ, సరస్సులూ, వింతలూ చూస్తాం," అన్నాడు రాముడు.

రాము డడవికి పోతున్నందుకు దశరథుడు పొందే సంతాపం చూసి సుమంత్రుడు పట్టరాని అగ్రహం వచ్చినవాడై, కళ్ళ నిప్పులు రాలుస్తూ, పళ్ళు పటపట కొరుకుతూ, కైకేయితో, "దుష్టురాలా! నిన్ను ప్రాణంకన్న ఎక్కువగా చూసుకునే మహారాజు కింత శోకం తెచ్చి పెట్టావే, నీ వింకేమి చెయ్యలేవు? నీ వాలకం చూస్తే భర్తను చంపుకునేదానివిగానూ, వంశనాశనం కలిగించే దానివిగానూ కనిపిస్తున్నావు. అందరిలోకీ పెద్ద కొడుకైన రాముడు పట్టాభిషేకం చేసుకోవటానికి నీ అభ్యంతర మేమిటి? భరతుడు రాజ్యం చేస్తే మేమంతా ఇక్కడ ఉంటామనుకుంటున్నావా? అయోధ్యలో ఒక్క బ్రాహ్మడుంటాడా? ఎందుకు చేస్తున్నావీ పాడుపని? మొత్తానికి ఆ తల్లి కూతురనిపించుకున్నావు! నీ తండ్రి అయిన అశ్వపతికి ఒక మునీశ్వరుడు ఒక అపూర్వమైన శక్తి ఇచ్చాడు. దానితో ఆయన పశు పక్ష్యాదుల భాషలన్నీ నేర్చుకున్నాడు. ఒకనా డాయన మంచం మీద పడుకుని ఉండగా జృంభమనే ఒక చీమ ఏదో అనే సరికి ఆయన పకపకా నవ్వాడు. అది









చూసి మీ అమ్మ, ఎందుకు నవ్వావో చెప్పు అన్నది. ఎందుకు నవ్వానో చెబితే నేను చచ్చి పోతానన్నాడు మీ తండ్రి. నువు చస్తావో, బతుకుతావో నాకు తెలీదు; నన్ను చూసి నవ్వలేదని నా కేమిటి నమ్మకం? అందుచేత నవ్విన కారణం చెప్పాలిసిందే నన్నది మీ అమ్మ. అప్పుడు మీ నాన్న తనకు వరమిచ్చిన ముని దగ్గిరికి పోయి ఆయన సలహా అడిగాడు. నీ భార్య చచ్చి గీపెట్టినా చెప్పకు అన్నాడు ముని. అప్పుడు మీ నాన్న మీ అమ్మను వెళ్ళగొట్టి సుఖంగా ఉన్నాడు. నీ ధోరణి కూడా అలాగే ఉంది. తండ్రిని విడిచి రాముడు అడవికి వెళ్ళాడో గొప్ప ఆపద కలిగి తీరుతుంది. అందుచేత నీ వక్రబుద్ధి మాని రాముడి పట్టాభిషేకానికి ఒప్పుకో!" అని హితవు చెప్పాడు.

ఈ మాటలకు కైక సిగ్గు పడలేదు సరికదా, చలించను కూడా లేదు. దశరథుడు మాత్రం సుమంత్రుడితో, "రాముడి వెంట అడవికి చతురంగ బలాలనూ, విశేషమైన ధనాన్నీ, అందగత్తెలయిన స్త్రీలనూ, సంబారాలతో వర్తకులనూ పంపించు. బళ్లు కూడా వెంట ఇచ్చి పంపించు. రాముడికి రాజ్యం లేదన్న లోపం తెలియకుండా చూడు," అన్నాడు.

సుమంత్రుడి శాపనార్థాలకు చలించని కైకేయి ఈ మాటలు విని తెల్లబోయి, బెదిరి, గొంతు అర్చుకుపోయి, "మహారాజా, అయోధ్యను పాడు బెట్టి అందరూ వెళ్ళిపోతే భరతుడు పాలించడు!" అన్నది.

"ఓసి దుర్మార్గురాలా! నా మీద మొయ్యరానంత బరువు వేసింది చాలక ఈ కొరడా దెబ్బలు కూడా ఏమిటి? ఇదంతా ఆ వరాలలోనే చేర్చి అడగక పోయావా?" అన్నాడు దశరథుడు కోపంగా.

కైకేయి అంతకన్న హెచ్చు కోపంతో, "అది వేరే అడగాలా ఏమిటి? అరణ్యానికి పొమ్మంటే అన్నీ విడిచిపెట్టి పోవటం







కాదా? మీ పూర్వీకుడు. సగర చక్రవర్తి తన పెద్ద కొడుకైన అసమంజుణ్ణి వెళ్ళగొట్టి నప్పుడు వాడి వెనకగా సైన్యాన్ని పంపాడా?" అని అడిగింది.

ఈ మాట విని సిద్ధార్థుడనే మంత్రి, "అమ్మా, అసమంజుడి మాట ఇక్కడ దేనికి? వాడు పరమ దుష్టుడు. వాడు వీధుల్లో ఆడుకునే పిల్లలను తీసుకుపోయి సరయూ నదిలో పడేసి వాళ్ళు ఎలా చస్తారో చూసి ఆనందించే పాపాత్ముడు. అందుచేత పౌరులు కడుపుమంటతో రాజువద్దకు వెళ్ళి, 'అయ్యా, తమరు అసమంజుణ్ణి వెళ్ళగొడతారా, మమ్మల్ని దేశం విడిచి వెళ్ళి



పొమ్మన్నారా? ఏదో ఒకటి తేల్చి చెప్పండి!' అని అడగగా సగర మహారాజు జనద్రోహి అయిన తన కొడుకునూ, వాడి భార్యనూ, పరివారాన్నీ వెళ్ళగొట్టి, వాణ్ణి తిరిగి రాజ్యంలో అడుగు పెట్టనివ్వ వద్దని కట్టుదిట్టం చేశాడు. జనద్రోహి అసమంజుడికీ జనప్రియుడైన రాముడికీ సాపత్యం చెప్పావే!" అన్నాడు.

ఈ మాటలకు కైక చలించక పోవటం చూసి దశరథుడు, "ఓసి పాపాత్మురాలా! నిన్ను చూస్తే నీకు హితం తల కెక్కేటట్టు లేదు. నేను కూడా రాముడి వెంట అడవికి పోతాను. నీవూ, భరతుడూ సుఖంగా రాజ్యమేలండి," అన్నాడు.

ఈ సంభాషణ అంతా వింటున్న రాముడు తండ్రితో, "మహారాజా, అన్ని సుఖాలూ విడిచి, అడవిలో కందమూలాలు తినబోయే నా వెంట సేన కూడా దేనికి? ఏనుగును దానం చేసి కట్టుతాడు దగ్గిర లోభించే పద్ధతి మానండి. మాకు నార బట్టలూ, దుంపలు తవ్వుకునే పరికరాలూ, ఒక బుట్టా ఇప్పించండి, చాలు," అన్నాడు.

మానాభిమానాలు విడిచిపెట్టిన కైకేయి, "ఇదుగో, నారబట్టలు తెస్తున్నాను," అంటూ వచ్చింది. రామలక్ష్మణులు తమ మేలి వస్త్రాలు విప్పేసి, తండ్రి ఎదటనే నార









బట్టలు ధరించారు. సీతకు మాత్రం అవి ఎలా కట్టుకోవాలో తెలియక రాముడి కేసి చూసింది. తరవాత ఒక బట్ట మెడకు చుట్టుకుని, మరొకటి చేత పట్టుకుని, సిగ్గుతో తల వంచి నిలబడింది. అప్పుడు రాముడు చప్పున ఆమె వద్దకు వెళ్ళి, ఆమె చేతిలో ఉన్న నార చీరె తీసుకుని, ఆమె కట్టుకుని ఉన్న పట్టు చీరె పైన దానిని చుట్టాడు.

ఇది చూసి దశరథుడి భార్యలు కన్నీరు కారుస్తూ, "నాయనా, నీవు తండ్రి మాట ప్రకారం అడవికి వెళ్ళదలిచావు, వద్దన్నా మానవు. కాని సీతను కూడా ఎందుకు తీసుకు పోతావు? ఆమె వనవాసం చెయ్యా లేదు. మా వద్ద విడిచిపెట్టి వెళ్ళు, నాయనా. నీకు బదులుగా ఆమెను చూసుకుంటూ ఉంటాం," అన్నారు.

ఈ లోపల వసిష్ఠుడు సీతకు నార చీరె లిస్తున్న కైకేయితో, "గుణ హీనురాలా, నీ సాహసానికి అంతు లేకుండా ఉన్నదే. సీత అడవికి వెళ్ళవలసిన అవసరమే మున్నది? రాముడి కోసం సిద్ధం చేసిన పట్టాభిషేకం ఆమెకు జరిపి రాజ్యం పాలించేటట్టు చేయవచ్చు, తెలుసా? సీత ఈ నార చీరెలు కట్టవలసిన అవసరం లేదు సరే కదా, ఆమె తన వెంట వాహ



నాలూ, వస్తువులూ, బట్టలూ, పరిచారికలూ, సమస్తమూ తీసుకు పోవచ్చును. భరతుడు సంతోషిస్తాడని నీవు చేసిన ఈ దుర్మార్గం అతనికి ఎంత మాత్రమూ రుచించదు. అతను దశరథుడి కొడుకే అయితే, తన తండ్రి వ్యథకు కారణమైన రామ వనవాసానికి ఎంత మాత్రమూ సమ్మతించడు!" అన్నాడు.

చుట్టూ ఉన్నవారు, "ఛీ, ఛీ!" అను కోవటం దశరథుడు విన్నాడు. ఆయన సీతను చూసి, "సుకుమారి, చిన్న పిల్ల! ఆ సీత మునిపత్నిలాగా నార చీరె గట్టి ఎలా వెలవెల పోతున్నదో చూడండి! ఆమె నార చీరెలు కట్టటానికి వీల్లేదు," అన్నాడు.





రాముడు బయలుదేరే ప్రయత్నంలో తండ్రికి అప్పగింతలు చెప్పి, తన తల్లి అయిన కౌసల్యను కాపాడమని కోరాడు. దశరథుడు సుమంత్రుడితో, "మంచి గుర్రాలను పూన్చిన మేలైన రథంలో వీళ్ళ నెక్కించి, నగరం బయట అరణ్యంలో విడిచి పెట్టిరా!" అన్నాడు. ధనాధికారిని పిలిచి, "పద్నాలుగేళ్ళ పాటు సీతకు సరిపోయే మేలైన చీరెలూ, నగలూ తీసుకురా," అని అజ్ఞాపించాడు.

సీత పెళ్ళికి పోతున్న దానిలాగా వికసించిన ముఖంతో తన కోసం తెచ్చిన నగలు పెట్టుకుంటూంటే కౌసల్య ఆమెను రెండు చేతులా ఆలింగనం చేసుకుని, "సీతా, నీ భర్త పేదవాడై పోయినాడని వనవాస కాలంలో అశ్రద్ధగా చూడకమ్మా!" అంటూ నీతిబోధ చేసింది.

రాముడు తల్లి దండ్రులకు ప్రదక్షిణ నమస్కారం చేసి, తల్లితో, "అమ్మా దిగులు పడక తండ్రిగారిని కనిపెట్టుకుని ఉండు. పద్నాలుగేళ్ళంటే ఎంత? కన్నుమూసి తెరిచేసరికి గడిచిపోతాయి," అన్నాడు. లక్ష్మణుడు కూడా తల్లి దండ్రులకు మొక్కి తన తల్లి అయిన సుమిత్ర వద్ద సెలవు తీసుకున్నాడు. ఆమె, "లక్ష్మణా, ఇక నీకు రాముడే తండ్రి, సీతే తల్లి, అరణ్యమే అయోధ్య! అన్నను అపద రాకుండా చూసుకో, నాయనా!" అని చెప్పింది.

ముగ్గురూ బయటికి వచ్చారు. పెళ్ళి కూతురులాగా అలంకరించుకున్న సీత తాను వనవాసం వెళుతున్నాననే చింత కొంచెమైనా లేకుండా, ముందుగా రథమెక్కి కూచున్నది. తరవాత రామలక్ష్మణు లెక్కి కూచున్నారు.

సుమంత్రుడు రథంలో సీతకు దశరథుడిచ్చిన వస్త్రాభరణాలూ, ఆయుధాలూ, కవచాలూ, చిన్న గునపమూ, బుట్టా ఉంచాడు. రథం కదిలింది.






వీధిలో పౌరులందరూ దైన్యంతో నిలబడి చూస్తున్నారు. కొందరు రథం వెనక పరిగెత్తుతున్నారు. కొందరు రథం పక్కలు పట్టుకుని వేళ్ళాడుతున్నారు. కొందరు రథానికెదురుగా వచ్చి సుమంత్రుణ్ణి, "మళ్ళీ ఎప్పటికి చూస్తామో, కాస్సేపు చూడనియ్యి. రథం మెల్లిగా తోలు, బాబూ!" అని బతిమాలారు.

ఉన్నట్టుండి దశరథుడు, "నేను రాముణ్ణి చూడాలి!" అంటూ తన యింటి నుంచి బయటికి వచ్చి వీధిన పడ్డాడు. ఆయనతో బాటు ఆయన భార్యలు కూడా వీధి వెంట పరిగెత్తసాగారు.

"సుమంత్రుడా, రథం కాస్త ఆపు!" అనే కేక పెట్టాడు దశరథుడు. ఆయన కొంత దూరం పరిగెత్తి పడిపోయాడు.

వెనక్కు తిరిగి చూస్తున్న రాముడికి దృశ్యం దుర్భరమయింది. అతను సుమంత్రుడితో, "రథం వేగంగా తోలు. ఈ దుఃఖాన్ని ఎంతసేపు చూడగలను? ఎలా చూడటం? అంతగా మహారాజు అడిగితే, జనం చేసే గోలలో ఆయన కేక వినిపించ లేదని చెంకు," అన్నాడు.

రాముడు రథాన్ని వెన్నంటి వచ్చేవారి వద్ద సెలవు పుచ్చుకున్నాక సుమంత్రుడు గుర్రాలను వడిగా తోలాడు.

దశరథుడితో మంత్రులు, "మహారాజా, వాళ్ళు త్వరగా రావాలనుకున్నట్టయితే వారిని ఎక్కువదూరం సాగనంప గూడదు," అని చెప్పారు. దశరథుడు శరీర మంతా చెమటలు దిగ గారుతూ, భార్యలతో సహా







అక్కడే నిలబడి, క్రమంగా దూరమై పోతున్న రథాన్ని చూశాడు.

రాముడు వనవాసానికి బయలుదేరి వెళ్లి పోవటంతో దశరథుడి అంతఃపురం రోదన ధ్వనులతో నిండి పోయింది. దానితోబాటే అయోధ్యా నగరమంతా పాడు పడినట్టయి పోయింది. ఎక్కడి పను లక్కడ ఆగి పోయాయి. జనులంతా ఏదో ఉపద్రవం జరిగి పోయినట్టుగా విస్తుపోయారు.

రాముడి వెనుక కొంతదూరం వెళ్ళి దారిలో పడిపోయిన దశరథుణ్ణి కౌసల్యా, కైకేయీ చెరొక రెక్క పట్టుకుని నిల బెట్టారు. దశరథుడు కైకేయితో, "నన్నం



టకు. నేను నీ భర్తను కాను. నిన్ను విడిచి పెట్టేశాను. నీ కొడుకు నాకు తిలోదకా లిస్తే అవి నాకు ముట్టవు," అన్నాడు. ఆయన రాముడి కోసం ఇంకా ఏడుస్తూ కౌసల్య ఇంటికి వచ్చేశాడు.

ఆ రాత్రి రాముడి కోసం విలపించే కౌసల్యా దశరథులను సుమిత్ర తగిన విధంగా ఊరడించింది.

ఈ లోపల సీతా రామ లక్ష్మణు లెక్కిన రథం సూర్యాస్తమయ వేళకు తమసా నదీ తీరం చేరింది. పురజనులు అక్కడిదాకా రథాన్ని వెంబడించి వచ్చారు. వారు రాముణ్ణి అరణ్యావాసం వెళ్లవద్దని నిర్బంధం చెయ్యసాగారు. రాము డెన్ని చెప్పినా వారు వినిపించుకోలేదు.

సుమంత్రుడు గుర్రాలను విప్పి, కడిగి, నీరు తాగించి, నది ఒడ్డున తిరగనిచ్చి, తరవాత కట్టివేసి మేత పెట్టాడు. సుమం త్రుడూ, లక్ష్మణుడూ తయారుచేసిన ఆకుల పక్కమీద పడుకుని రాముడూ, సీతా నిద్ర పోయారు. సుమంత్రుడూ, లక్ష్మణుడూ రాత్రి అంతా కబుర్లతో గడిపారు.

రాముణ్ణి వెంబడించి వచ్చిన పౌరులు కూడా నది ఒడ్డునే నడుములు వాల్చి నిద్ర పోయారు. తెల్లవారుతూండగా రాముడు









లేచి, ఇళ్ళు వాకిళ్ళు విడిచిపెట్టి చెట్ల కింద నిద్ర పోతున్న పౌరులను చూసి, లక్ష్మణుడితో, "వీరంతా లేవకముందే మనం రథమెక్కి సాగిపోవటం మంచిది. లేకపోతే వీరు మనని వదలరు. మనతోపాటే వచ్చేస్తారు," అన్నాడు.



సుమంత్రుడు రథం సిద్ధంచేసి తెచ్చాడు. రాముడు సుమంత్రుడితో, "రథాన్ని అన్ని వైపులా తిప్పి తీసుకురా. అప్పుడు జనం మనం వెళ్ళిన జాడ తెలుసుకోలేక పోతారు," అన్నాడు. సుమంత్రుడు రథాన్ని అలాగే తిప్పి తెచ్చినాక సీతా రామ లక్ష్మణులు దానిపై ఎక్కి కూచుని ఉత్తరంగా బయలుదేరారు.

తెల్లవారి జనం నిద్రలేచి చూస్తే రథం లేదు, సీతా రామ లక్ష్మణులు లేరు. తమను వంచించిన నిద్రనూ, దైవాన్నీ తిట్టుకుంటూ వారు అయోధ్యకు తిరిగి వెళ్లారు.

తెల్లవారే సరికే రాముడి రథం చాలా దూరం వెళ్ళిపోయింది. అది దక్షిణ కోసల దేశాన్ని గడిచి, కోసలకు దక్షిణంగా ప్రవహించే గంగానదిని చేరవచ్చింది. గంగానది సమీపాన శృంగిబేర పురమనే చోట సుమంత్రుడు ఒక పెద్ద గార చెట్టు కింద రథాన్ని నిలిపి, గుర్రాలను విప్పి, వాటికి మేతపెట్టాడు. సీతా రామ లక్ష్మణులు చెట్టు కింద కూచున్నారు.

ఇంతలో గుహుడనే బోయరాజు, రాముడికి మంచి స్నేహితుడు, రాముడి రాక గురించి తెలిసి, తన మంత్రులతోనూ, కుల పెద్దలతోనూ చూడ వచ్చాడు. అతన్ని దూరాన చూస్తూనే రాముడు లక్ష్మణుడితో కూడా ఎదురు వెళ్ళి, గుహుణ్ణి ఆలింగనం చేసుకున్నాడు. గుహుడు విచారంతో, "రామా, ఇదే అయోధ్య అనుకో! నీవు అతిథిగా రావటం నా అదృష్టం," అన్నాడు.

తరవాత గుహుడు రాముడికీ, లక్ష్మణుడికీ, సీతకూ మంచి భోజనం సిద్ధంచేయించి,








"రామా, నీకు ఏ లోపమూ జరగదు. ఈ రాజ్యాన్ని నీవే ఏలుతూ ఉండిపో," అన్నాడు. రాముడు అతన్ని గాఢంగా ఆలింగనం చేసుకుని, "గుహా, నా కోసం కాలినడకన వచ్చావు. అంతకన్న ఇంకేంకావాలి? నీ రాజ్యం నీవే ఏలుకో. నేను నారబట్టలు ధరించి అరణ్యవాసం చెయ్యక తప్పదు," అని నచ్చచెప్పాడు.

ఆ రాత్రి రాముడూ, సీతా ఆ గార చెట్టు కిందనే పడుకుని నిద్రపోయారు. వారికి రక్షగా మేలుకుని ఉన్న లక్ష్మణుడితో గుహుడు, "నాయనా, నీవుకూడా పడుకుని విశ్రాంతి తీసుకో. తెల్లవార్లూ మీకు మేము



కాపు ఉంటాంలే. అరణ్యంలో ఉండే మాకిది పరిపాటే," అన్నాడు. కాని లక్ష్మణుడు అలా చెయ్యక గుహుడితో తెల్లవార్లూ మేలుకుని కూచుని, జరిగినదాన్ని గురించీ, జరగబోయేదాన్ని గురించీ మాట్లాడాడు. అంతా విని గుహుడు చాలా దిగులుపడ్డాడు.

ఆ రాత్రి గడిచి మర్నాడుదయం రాముడు కోయిల కూతలకూ, నెమళ్ళ కూతలకూ మేల్కొన్నాడు. అతను లక్ష్మణుడితో, "సూర్యోదయం అవుతున్నది. మనం గంగానది దాటి వెళ్ళిపోదాం," అన్నాడు. లక్ష్మణుడు వెళ్ళి బోయ రాజైన గుహుణ్ణీ సారథి అయిన సుమంత్రుణ్ణీ పిలుచుకు వచ్చాడు. రాముడు గుహుడితో తాము గంగానది దాటాలని చెప్పాడు.

గుహుడు తన మనుషులను పంపి గంగ దాటటానికి మంచి పడవనూ, నావికుణ్ణీ సిద్ధంచెయ్యమన్నాడు.

రాముడు సుమంత్రుడితో, "సారథీ, నీ విక నగరానికి తిరిగి వెళ్ళు. మా తండ్రి గారితోనూ, తల్లులతోనూ మా క్షేమం గురించి తెలిపి, పధ్నాలుగేళ్ళూ తీరగానే తిరిగి వస్తామని చెప్పు. తరవాత భరతుణ్ణి మేనమామ ఇంటి నుంచి తీసుకు వచ్చి రాజ్యాభిషేకం చేయించు," అన్నాడు.











సుమంత్రుడు, "రామా, రణరంగంలో యోధుడు పడిపోగా సారథి ఉత్త రథాన్ని తీసుకుపోయినట్టుగా, మీరు ముగ్గురూ ఎక్కి వచ్చిన రథాన్ని ఖాళీగా అయోధ్యకు తీసుకుపోతే ప్రజల గుండెలు పగలవా? ఉత్త రథంతో తిరిగి వెళ్ళి మీ తల్లులకు నా మొహం ఎలా చూపించను? నేనుకూడా ఈ పధ్నాలుగేళ్ళూ మీ వెంటనే ఉండి మీకు వన మృగాలను వేటాడి పెడుతూ ఉంటాను," అన్నాడు.

"అలా కాదు, సారథీ. నీ విక్కడే ఉండి పోతే మేము అరణ్యానికి వెళ్ళినట్టు కైకేయికీ, తమ ఆజ్ఞ పాలించినట్టు తండ్రిగారికీ ఎలా తెలుస్తుంది? కనక, నీవు తిరిగి వెళ్ళి తీరాలి," అన్నాడు రాముడు.

తరవాత రాముడి కోరికపై గుహుడు మర్రిపాలు తెచ్చాడు. దానితో రామలక్ష్మణు లిద్దరూ మునులలాగా జడలు కట్టుకున్నారు. లక్ష్మణుడు సీతను ముందుగా పడవలోకి ఎక్కించి తరవాత తానుకూడా ఎక్కాడు. రాముడు గుహుడికి వీడ్కోలు చెప్పి ఆఖరున పడవలో ఎక్కికూచున్నాడు. గుహుడి బంధువులు తెడ్లువేసి పడవను గంగకు అడ్డంగా నడిపారు. పడవ నడి ప్రవాహంలో ఉండగా సీత గంగకు నమస్కరించి, "గంగాదేవీ, పధ్నాలుగేళ్ళ అనంతరం మేము క్షేమంగా తిరిగి వచ్చేటప్పుడు బ్రాహ్మణులకు లక్ష గోవులూ, వస్త్రాలూ దానం చేస్తాను, అన్నదానం చేస్తాను. నీకు మాంసంతో వండిన అన్నమూ, వెయ్యి కుండల మద్యమూ నైవేద్యం పెడతాను. నీ గట్టున ఉండే అన్ని దేవాలయాలకూ మొక్కుతాను. మేము సుఖంగా తిరిగి వచ్చేటట్టు అనుగ్రహించు," అని దణ్ణం పెట్టుకున్నది.

త్వరలోనే పడవ గంగ యొక్క దక్షిణపు గట్టు చేరింది. సీతారామలక్ష్మణులు వత్స దేశంలో అడుగుపెట్టి కాలి నడకన బయలు











దేరారు. ముందు లక్ష్మణుడూ, అతని వెనక సీతా, సీత వెనకగా రాముడూ—ఈ విధంగా వారు నడక సాగించారు.

గంగ ఉత్తరపు గట్టున నిలబడి ఉన్న సుమంత్రుడు వారు కనపడకుండా వెళ్ళిన దాకా చూసి కంట తడిపెట్టుకున్నాడు.

రామలక్ష్మణులు ఆ రోజు ఒక పందినీ, ఒక మనుబోతునూ, రెండు దుప్పులనూ చంపి, వాటి మాంసం తిని ఆకలి తీర్చుకుని, ఆ రాత్రికి ఒక చెట్టు కింద చేరారు. తన స్థితి తలుచుకుని రాముడు వశం తప్పి మాట్లాడసాగాడు.

ఇదే అరణ్యవాసానికి మొదటిరాత్రి. ఇకనుంచీ సుమంత్రుడుకూడా తోడుండడు. నిద్రపోకుండా మేలుకుని ఉండి తానూ, లక్ష్మణుడూ సీతను జాగ్రత్తగా కాపాడుకోవాలి...ఇప్పుడు దశరథుడు పుట్టెడు దిగులుతో పడుకుని ఉంటాడు. కైకేయికి మాత్రం చాలా సంతోషంగా ఉంటుంది. దుర్మార్గురాలు భరతుడి కోసం ముసలి రాజును చంపెయ్యదుగద!...ధర్మార్థ కామాలలో కామమే బలమైనది లాగుంది. కాకపోతే తన వంటి ఇష్టుడైన కొడుకును ఏ తండ్రి అయినా అడవికి తోలేస్తాడా? భరతుడు హాయిగా, సుఖంగా రాజ్యమేలు తాడుగద! అసలు ఈ కైకేయి దాపరించింది దశరథుడి కీడుకూ తనను అడివికి పంపటానికీనూ! నీచురాలు!...అమ్మ ఏ జన్మలోనో తల్లి కొడుకులకు ఎడబాటు కలిగించి ఉంటుంది. తాను తలుచుకుంటే, ఒక్క అయోధ్య ఏమిటి, భూమండలమంతా జయించ గలడు!—తండ్రి మాటకు లోబడి, ధర్మం కోసం పట్టాభిషేకం మాను కున్నాడు గాని!

రాముడికి నిద్రరాలేదు. అతను కన్నీరు కారుస్తూ ఇదే ధోరణిలో మాట్లాడుకు పోతూ ఉండటం చూసి లక్ష్మణుడు అతన్ని ఊరడించాడు. ఆ మాటలతో రాముడి మనసు







కాస్త స్థిమితపడి, వనవాస దీక్ష అతనిలో దృఢపడింది. పక్కనే ఒక మర్రిచెట్టు కింద లక్ష్మణుడు ఆకులు పరిచి పక్క సిద్ధం చేశాడు. సీతారాములు ఆ రాత్రికి ఆ పక్కపైన పడుకున్నారు.

తెల్లవారుతూనే ముగ్గురూ లేచి గంగా యమునా సంగమమైన ప్రయాగ కేసి నడిచారు. అక్కడ భరద్వాజముని ఆశ్రమం ఉన్నది. వారు ఆశ్రమం చేరేసరికి సూర్యాస్తమయమయింది. రాముడు భరద్వాజుడితో క్లుప్తంగా తన కథ చెప్పుకున్నాడు.

"అవును, నీ తండ్రి నిన్ను అకారణంగా అడవులకు పంపాడని విన్నాను. నీ విక్కడికి వచ్చావు గనక నిన్ను చూడగలిగాను. ఈ ఆశ్రమంలోనే ఒక పర్ణశాల వేసుకుని పధ్నాలుగేళ్ళూ ఇక్కడే ఉండిపోవచ్చు. ఇక్కడ నీకు సుఖంగా ఉంటుంది. ఈ ప్రదేశంకూడా చాలా పవిత్రమైనది," అన్నాడు భరద్వాజుడు.

దానికి రాముడు, "మునీంద్రా, మేమీ ఆశ్రమంలో ఉన్నామని తెలిస్తే మా ప్రజలు నన్ను చూసి పోవటానికి సులువుగా వస్తూ పోతూ ఉంటారు. అందుచేత ఇంకా దూరంగా, మాకు వాసయోగ్యమైన ప్రదేశం ఉంటే చెప్పండి. సీత తండ్రి ఇంట ఎంతో సుఖంగా పెరిగినది. ఆమెకు చూడ ముచ్చటగా ఉండే చోటు చెప్పారంటే, అక్కడే ఆశ్రమం నిర్మించుకుని ఉండిపోతాము," అన్నాడు.

"ఇక్కడ ఉండటం ఇష్టంలేక పోతే ఇక్కడికి పదికోసుల దూరాన చిత్రకూటమనే కొండ ఉన్నది. అది చాలా రమ్యమైన ప్రదేశం. ఆ పర్వతం మీద కొండముచ్చులూ, కోతులూ, ఎలుగుబంట్లూ ఉంటాయి. కొన్నివేల ఏళ్ళుగా ఋషులు అక్కడ తపస్సు చేసుకుంటున్నారు. అక్కడ ఆశ్రమం ఏర్పాటు చేసుకోవచ్చు," అన్నాడు భరద్వాజుడు.






ఆ రాత్రి వారు ముగ్గురూ భరద్వాజుడు చెప్పిన కథలు అనేకం విని సుఖంగా నిద్ర పోయారు. మర్నాడు ఉదయం భరద్వాజుడు వారిని కొంతదూరం సాగనంపి, చిత్రకూటానికి తాను అనేక మార్లు వెళ్ళి వచ్చిన త్రోవ గుర్తులు చెప్పాడు. సీతారామ లక్ష్మణులు ఆయన వద్ద సెలవు పుచ్చుకుని ఆయన చెప్పిన దారివెంట నడుస్తూ యమునా నదిని దాటవలసిన రేవు వద్దకు వచ్చారు. అక్కడ లక్ష్మణుడు కొయ్యలమీద ఎండిన వెదుళ్ళతో ఒక విశాలమైన తెప్ప తయారు చేశాడు. దానిపైన నేరేడు కొమ్మలతోనూ, పువ్వుల తీగలతోనూ ఒక సుఖమైన ఆసనం సీత కోసం అమర్చాడు. తెప్ప మీద తమ వస్తువుల నన్నిటిని ఉంచి, తాము కూడా ఎక్కి నదిని దాటారు. ప్రవాహ మధ్యంలో సీత యమునా నదికి నమస్కరించి ఆవులూ, వెయ్యి కడవల కల్లూ ఇస్తానని, గంగకు మొక్కుకున్నట్టే మొక్కుకున్నది.

వసంతకాలం కావటంచేత అడివి చెట్లు పుష్పించి మహాశోభగా ఉన్నాయి. మోదుగు చెట్లనిండా ఎర్రటి పూలున్నాయి. సీత అప్పుడు ఆ వసంత శోభను చూసి ఆనందించటం ప్రారంభించింది. లక్ష్మణుడు ఆమె ముందు నడుస్తూ, ఆమె కోరిన ప్రతి పువ్వూ, ప్రతి పండూ కోసి తెచ్చి ఇస్తూ, ఆమె చెట్లను గురించి అడిగే ప్రశ్నలన్నిటికీ సమాధానాలిచ్చాడు. ఆ రోజు వారు మరి కొన్ని మృగాలను చంపి వాటి మాంసంతో ఆకలి తీర్చుకున్నారు.



ఆ రాత్రికి వారు ఒక చదునైన చోటు చూసుకుని అక్కడ నిద్రపోయారు.

తెల్లవారుతూనే రాముడు లేచి లక్ష్మణుణ్ణి లేపి చిత్రకూటానికి ప్రయాణం సాగించాడు. చిత్రకూట ప్రాంతంలో రాముడు ఒక స్థలం చూసి అక్కడ పర్ణశాల నిర్మిద్దా మన్నాడు. లక్ష్మణుడు మంచి గుంజలు నరికితెచ్చి, వాటితో దృఢమైన పర్ణశాలా, దానికి అవసరమైన విభాగాలూ నిర్మించాడు. గృహదేవతకు బలి ఇవ్వటానికి అతను ఒక నల్ల ఇర్రిని పట్టి తెచ్చి, చంపి, దాన్ని ఖండించకుండానే అగ్నిలో కాల్చాడు. ఆ పర్ణశాలలో సీతారామలక్ష్మణులు శాస్త్రో



క్తంగా గృహప్రవేశం చేసి, పక్కనే ప్రవహించే మాల్యవతి నదిలో స్నానాలుచేస్తూ, చుట్టూ ఉండే అందమైన అరణ్య ప్రాంతంలో విహరిస్తూ, పట్టణ జీవితాన్ని మరిచి సుఖంగా కాలం గడపసాగారు.

అక్కడ శృంగిబేరపురంలో గుహుడూ, సుమంత్రుడూ గంగ ఒడ్డున నిలబడి సీతా రామ లక్ష్మణులు కనుమాటు అయినదాకా చూసి గుహుడి ఇంటికి వెళ్ళిపోయారు. రాముడు మనసు మార్చుకుని తిరిగి వస్తాడేమోనని మూడు రోజులు చూసి సుమంత్రుడు ఖాళీ రథంతో అయోధ్యకు బయలుదేరి, రాముడు అయోధ్య విడిచి వెళ్ళిన అయిదు రోజులకు తిరిగివచ్చాడు. దారిలో పౌరులు ఖాళీగా రథం తిరిగి రావటం చూసి ఎవరికి తోచినట్టు వారు మాట్లాడుకున్నారు. సుమంత్రుడు తిన్నగా కౌసల్య ఇంటికి వెళ్ళి, సింహాసనంపైన కూర్చుని ఉన్న దశరథుడితో రాముడు చెప్పి పంపిన మాటలు చెప్పేశాడు. దశరథుడు శోకోద్రేకంలో స్పృహతప్పి కింద పడిపోయాడు.

కౌసల్యా సుమిత్ర సహాయంతో దశరథుణ్ణి లేవదీస్తూ, "మహారాజా, రాముణ్ణి అరణ్యంలో దింపి వచ్చిన సుమంత్రుడికి











జవాబైనా చెప్పరేం? కైక ఏమన్నా అనుకుని పోతుందనా? ఆవిడగారికక్కడ లేదుగా!" అని చెప్పింది. దశరథుడితో పాటు కౌసల్యా, ఇతర అంతఃపుర కాంతలూ రోదనాలు చేశారు.

"నా ఆజ్ఞకు ఎంత విలువ ఉన్నదో నాకు తెలియదు; నీవు మళ్ళీ వెళ్ళి రాముణ్ణి తీసుకురా! లేదా నన్ను ఆ రాముడి దగ్గిరకైనా తీసుకుపో," అన్నాడు దశరథుడు.

కౌసల్యకూడా సుమంత్రుడితో గర్భశోకంతో తనను రాముడున్న చోటికి తీసుకుపొమ్మన్నది. సుమంత్రుడు కౌసల్యను ఊరడిస్తూ, రామలక్ష్మణులు సులువుగా అరణ్యవాసవ్రతం పూర్తి చేయగలరనీ, ఆ సీతకు అది అరణ్యంలాగా ఉన్నట్టే లేదనీ, రాముడు లేని అయోధ్య ఆమెకు అరణ్య మనిపించి ఉండేదనీ అన్నాడు.

మర్నాడంతా కౌసల్య దశరథుణ్ణి దెప్పుడు మాటలతో బాధించింది. ఆ విధంగా తాను పడుతున్న బాధను కొంత బయట పెట్టుకున్నది. అసలే బాధ పడుతున్న తనను దెప్పుడు మాటలతో హింసించవద్దని దశరథుడు చేతులు జోడించి కౌసల్యను వేడుకున్నాడు. కౌసల్య పుత్రశోకానికి తోడు పశ్చాత్తాపంతో కుమిలిపోయింది.

రాముడు వెళ్ళిపోయిన ఆరో రోజు రాత్రి, తన చావు కొన్ని ఘడియలలో ఉన్న దనగా దశరథుడికి తన చిన్ననాటి వృత్తాంతం జ్ఞాపకం వచ్చింది. ఇంకా కౌసల్యను పెళ్ళాడక పూర్వమే దశరథుడు పుత్రశోకంతో మరణించేటట్టు ఒక ముని వల్ల శాపం పొందాడు. అప్పుడాయన కౌసల్యకు ఆ సంఘటన గురించి చెప్పాడు:

ఆ రోజులలో దశరథుడు యవ్వనంలో ఉన్నాడు. ఆయనకు శబ్దమును బట్టి బాణం గురి చేసి కొట్టటంలో చాలా నేర్పుండేది. ఈ శబ్ద వేధిత్వాన్ని అందరూ మెచ్చుకునేవారు. అందుచేత యువరాజై









ఉన్న దశరథుడు తరుచు రాత్రివేళ సరయూ నదీ తీరానికి వెళ్ళి, అక్కడ వన్య మృగాలు నీరు తాగటానికి వచ్చే రేవు కనిపెట్టి సమీపంలో దాక్కుని, నీటి చప్పుడును బట్టి బాణం వేసి ఏనుగులనూ, సింహాలనూ, ఇతర మృగాలనూ వేటాడుతూ ఉండేవాడు.

ఇలా ఉండగా ఒకసారి, వానకాలంలో రాత్రివేళ దశరథుడు గాఢాంధకారంలో మృగాల కోసం నదీతీరాన పొంచి చూస్తున్నాడు. ఆ సమయంలో నది నీటిలో బుడబుడమని చప్పుడయింది. అడవి ఏనుగు అయి ఉంటుందనుకుని దశరథుడు చప్పుడును గురి చేసి తీవ్రమైన బాణం ఒకటి వదిలాడు.

మరుక్షణమే మనిషి ఆక్రోశం వినిపించింది. "అయ్యయ్యో, తపస్సు చేసుకునే మా లాటివాళ్ళ మీద ఈ బాణం పడటమేమిటి? నేను ఎవరికి అపకారం చేశాను? నన్ను చంపిన వాడికి ఏం లాభిస్తుంది? ఎవరోగాని, ఒక్క బాణంతో మూడు ప్రాణాలు తీశాడే! నేను పోతే, ముసలి వాళ్ళూ, గుడ్డి వాళ్ళూ అయిన నా తలిదండ్రు లెంతకాలం బతుకుతారు? ఎలా బతుకుతారు?" అన్న మాటలు దశరథుడి చెవులబడ్డాయి.

ఆయన దగ్గిరికి వెళ్ళి చూసేసరికి తన బాణం తగిలి ఒక ముని కుమారుడు కొలను ఒడ్డున బాధతో గిలగిల లాడిపోతున్నాడు. అతను నీటిలో ముంచిన పాత్ర పక్కనే పడి ఉంది.

మతిపోయి, చెయ్యీ కాలూ ఆడక నిలబడి ఉన్న దశరథుడితో ఆ ముని కుమారుడు, "ఎందుకు చేశావీ పాడు పని? నే నిక్కడ ఉన్నట్టు నా తండ్రికి నీవే వెళ్ళి చెప్పు. లేకపోతే ఆయనకు తెలిసే మార్గం లేదు. తెలిసినా ఆయన రాలేడు. దాహం జాస్తిగా ఉన్నదంటే నీరు తీసుకు పోదామని









వచ్చి నీ బాణం వాత పడ్డాను. ఈ బాధ భరించ లేను. ముందు ఈ బాణం లాగి మరీ వెళ్ళు," అన్నాడు.

కుర్రవాడు బాధపడి పోతున్నాడు, బాణం లాగేస్తే చస్తాడేమోనని దశరథుడు మొదట తటపటాయించినా, చివరకు ఆ కుర్రవాడి ప్రోద్బలం మీదనే బాణం లాగేశాడు. వెంటనే ముని కుమారుడు ప్రాణాలు వదిలాడు.

తరవాత దశరథుడు ఆ కుర్రవాడి పాత్రలో నీరు ముంచుకుని, అతను చెప్పిన దారినే అతని తల్లి దండ్రులుండే కుటీరానికి వెళ్ళాడు.



దశరథుడి అడుగుల చప్పుడు విని తన కొడుకే ననుకుని ఆ కుటీరంలో ఉండే వృద్ధుడు, "నాయనా, ఎప్పుడో అనగా మంచినీటి కోసరం వెళ్ళిన వాడివి ఇంత ఆలస్యం చేశావేం? లోపలికి రా! త్వరగా నీరు ఇయ్యి!" అన్నాడు.

"నేను మీ అబ్బాయిని కాను, దశరథుణ్ణి, క్షత్రియుణ్ణి," అంటూ, తన బాణంతో దశరథుడు తాను చేసిన ఘోరం కాస్తా ఆ వృద్ధ దంపతులకు చెప్పేశాడు. వారి దుఃఖానికి అంతు లేదు. దశరథుడి సహాయంతో వారిద్దరూ తమ కొడుకు కళేబరం వద్దకు వెళ్ళి, దాని మీద పడి పెద్ద పెట్టున ఏడ్చారు.

ముసలి ముని దశరథుడితో, "మా కున్న ఒక్క కొడుకునూ అకారణంగా చంపి మాకు తీరని పుత్రశోకం కలిగించావు గనక నీవు కూడా పుత్రశోకంతోనే మరణించా లని నిన్ను శపిస్తున్నాను," అన్నాడు.

తరవాత ఆ వృద్ధ దంపతులు తమ కొడుకు చితిలోనే కాలి చనిపోయారు. ఎన్నడో జరిగిన ఈ సంఘటన దశరథుడికి ఇప్పుడు, తన ఆయువు తీరిపోయే దశలో, జ్ఞాపకం వచ్చింది. దానిని ఆయన కౌసల్యకు చెప్పాడు.









కౌసల్యతో మాట్లాడుతుండగానే దశరథుడికి చూపు మందగించింది. క్రమంగా శ్రవణశక్తికూడా పోయింది. బుద్ధి వికలమై పోసాగింది. ఆయన రాముణ్ణి కేకలు పెడుతూ, కైకేయిని తిడుతూ అర్ధరాత్రివేళ ప్రాణాలు వదిలాడు. అది రాముడు బయలుదేరి వెళ్ళిన ఆరో రోజు అర్ధరాత్రి. ఆ సమయానికి అంతఃపుర స్త్రీ లందరూ, కౌసల్యా సుమిత్రలు సహితం, నిద్ర పోతున్నారు.

రాజు మరణించిన సంగతి మర్నాడు తెల్లవారిగాని అంతఃపుర కాంతలకు తెలియలేదు. అంతఃపురంలో 'శోకాలు' సాగినాకపై వారికి జరిగిన సంగతి తెలిసింది.

త్వరలోనే వసిష్ఠుడు మొదలైనవారు వచ్చారు. దశరథుడికి అంత్యక్రియలు జరపటానికి ఆయన కొడుకులలో ఒక్కడైనా దగ్గిర లేడు. రామలక్ష్మణులు అరణ్యానికి వెళ్ళారు. భరత శత్రుఘ్నులు భరతుడి మేనమామ అయిన కేకయరాజు ఇంట ఉన్నారు. అందుచేత దశరథుడి శరీరాన్ని తైలంలో ఉంచారు.

సిద్ధార్థుడు, విజయుడు, జయంతుడు, అశోకుడు, నందనుడు అనే వారిని పిలిచి వసిష్ఠుడు వారితో, "మీరు వేగంగల గుర్రాల



పైన కేకయ రాజుండే రాజగృహానికి వెళ్ళండి. భరతుడితో ఇక్కడ ఒక ముఖ్యా కార్య మున్నదనీ, మేము రమ్మన్నామనీ చెప్పండి. మీరు అతనితో రాముడు అడవికి వెళ్ళిన వృత్తాంతంగాని, రాజుగారు చనిపోయిన సంగతిగాని చెప్పనే వద్దు," అని చెప్పి, భరతుడికి మేలిమి వస్త్రాలూ, ఆభరణాలూ ఇచ్చి పంపాడు.

వాళ్ళు అనేక నదులూ, పర్వతాలూ దాటి, దీర్ఘ ప్రయాణం చేసి, భరతుడి మేనమామగారి దేశం చేరి, అతని మేనమామకూ, తాతగారికీ కానుకలుగా తెచ్చిన వస్త్రాభరణాలు భరతుడికి అందించి,







వసిష్ఠుడు చెప్పమన్న మాటలు అదే విధంగా చెప్పారు.

భరతుడు పెద్దవాళ్ళ అనుమతి తీసుకుని, అయోధ్య నుంచి తన కోసం వచ్చిన వారి వెంబడి, పెద్ద బలగంతో సహా బయలు దేరాడు. మిగిలిన పరివారాన్ని నింపాదిగా వెనక రానిచ్చి, భరత శత్రుఘ్నులు రథంలో ముందుగా అయోధ్యా నగరం చేరుకున్నారు. వారు ఏడు రోజులు ప్రయాణించారు.

దూతలు అయోధ్య నుంచి వచ్చిన రాత్రే భరతుడికి ఒక పీడ కల వచ్చింది. అది వచ్చినప్పటి నుంచి అతని మనసులో ఏదో ఆందోళనగానే ఉన్నది. అయోధ్య ప్రవేశించగానే అతని ఆందోళన తిరిగి వచ్చింది. ఎందుకంటే నగరంలో సాధారణంగా ఉండే ఉత్సాహమూ, ఉల్లాసమూ లేవు. జనం నిరసించి నట్టున్నారు. నగరం పాడు పడినట్టున్నది.

భరతుడు ముందు తన తండ్రి నగరుకు వెళ్ళి అక్కడ ఆయన కనిపించక పోయే సరికి తన తల్లి ఇంటికి వచ్చాడు. కొడుకును చూస్తూనే కైకేయి ఆసనం మీదనుంచి లేచి, తన కాళ్ళకు నమస్కారం చేసిన భరతుణ్ణి తన చెంత కూచోబెట్టుకుని ఇలా ప్రశ్నలు చేస్తూ, "నీవు బయలుదేరి ఎన్నాళ్ళయింది, నాయనా? నీ మామా, తాతా క్షేమంగా ఉన్నారా? నీ కక్కడ సుఖంగా జరిగిందా?" అని ప్రశ్నించింది.

భరతుడు అన్నిటికీ సమాధాన మిచ్చి, "అమ్మా, నాన్నగారెక్కడ? పెద్దమ్మ కౌసల్య ఇంట ఉన్నారా? నే నాయన కాళ్ళకు మొక్కాలి!" అన్నాడు.

"ఆయన పెద్దల్లో కలిసిపోయారు, నాయనా," అంటూ కైకేయి చావు కబురు చెప్పింది. ఈ మాట వినగానే భరతుడు కుప్పకూలి పోయాడు. కైకేయి అతన్ని ఊరడించ యత్నించింది.








కొంతసేపు భరతుడు తండ్రి కోసం శోకించి, "అయితే, అమ్మా, ఆయన ఆఖరు క్షణంలో నా కేమన్నా చెప్పాడా? ఆయన ఆఖరు మాటలేమిటి?" అని అడిగాడు.

"'ఓ రామా, ఓ లక్ష్మణా, ఓ సీతా' అంటూ ప్రాణాలు వదిలారు, నాయనా," అన్నది కైకేయి. భరతుడు ఆశ్చర్యంతో, "అదేమిటి? రాముడూ, సీతా, లక్ష్మణుడూ దగ్గిర లేరా?" అని అడిగాడు.

"అరణ్య వాసానికి వెళ్ళారుగా, నాయనా? రాముడు నారబట్టలూ, జడలూ ధరించి అరణ్యానికి వెళుతుంటే, సీతా, లక్ష్మణుడూ కూడా వెళ్ళారు," అన్నది కైకేయి.

భరతుడు మరింత ఆశ్చర్యపడి, "ఏం? రాముడు ఏం పాపం చేశాడు? అతను పాడుపనులేవీ చేయడే! బ్రూణహత్య చేసిన వాడికి విధించినట్టు అతనికి అరణ్య వాస శిక్ష ఎందుకు వేశారూ?" అన్నాడు.

"అదేం కాదులే! మహారాజు రాముడికి పట్టాభిషేకం చేసే యత్నంలో ఉన్నట్టు విని, నేనాయనను రెండు వరాలు కోరాను: ఆ పట్టాభిషేకం నీకు చేసి, రాముణ్ణి పద్నాలుగేళ్ళు అరణ్య వాసానికి పంపమన్నాను. మహారాజు సరే నన్నారు. కనక వసిష్ఠుడు మొదలైన వారంతా చెయ్యవలసిందంతా చేస్తారు, నీవు చక్కగా పట్టాభిషేకం చేసుకో!" అన్నది కైకేయి.

కైకేయి చెప్పిన ఈ మాటలు విని భరతుడు మండిపడి పెట్టవలసిన నాలుగు మాటలూ పెట్టాడు. "నీవు మొగుణ్ణి



చంపావు, రాముణ్ణి అడవికి పంపావు, నీ ముఖం చూస్తే పాపం!" అన్నాడు. "జ్యేష్ఠుడికి రాజ్యాభిషేకం జరగటం క్షత్రియవంశ ధర్మ మని నీకు తెలియదా? రామలక్ష్మణులు లేకుండా నేనీ రాజ్యభారం ఎలా మోయగల ననుకున్నావు?" అని అడిగాడు. "నే నిప్పుడే వెళ్ళి ఆ రాముణ్ణి పిలుచుకు వచ్చి రాజ్యాభిషేకం చేసి అతనికి దాస్యం చేస్తాను," అని తల్లితో చెప్పాడు. ఇంత పని చేసినందుకు కైకేయిని నిప్పుల్లో పడమన్నాడు, లేదా అరణ్యానికి వెళ్ళమన్నాడు, అదీ కాకపోతే గొంతుకు ఉరిపోసుకు చావమన్నాడు.

ఇంతలో మంత్రులు వారున్న చోటికి వచ్చారు. భరతుడు వారితో తనకు రాజ్యాకాంక్ష ఏమీ లేదనీ, రాజ్యం కావాలని తాను తన తల్లితో చెప్పి ఉండలేదనీ, కైకేయి తన తండ్రిని వరాలు కోరటంగానీ, సీతా రామ లక్ష్మణులు అరణ్యానికి వెళ్ళిపోవటంగానీ, దూరదేశంలో ఉన్న తనకూ, శత్రుఘ్నుడికీ తెలియనే తెలియవనీ స్పష్టంగా చెప్పేశాడు.

తరవాత భరత శత్రుఘ్నులు కౌసల్యవద్దకు వెళ్ళారు. ఆమెను ఆలింగనం చేసుకుని ఆమెతోబాటు తాముకూడా ఏడ్చారు. ఆమె భరతుడితో కైకేయి తనకు చేసిన ద్రోహం గురించి చెబుతూంటే భరతుడికి తననుకూడా తన తల్లితో జతచేసినట్టు అనిపించింది. రాముడి అరణ్యవాసానికి తాను సమ్మతించలేదని అతను ఘోరమైన ఒట్లు పెట్టుకుని వేదన పడ్డాడు. కౌసల్య అతన్ని ఊరడించింది.

దుఃఖ సముద్రంలో ఉన్న భరతుడితో వసిష్ఠుడు, "నాయనా, ఈ విచారం కట్టిపెట్టి దశరథ మహారాజుకు ఉత్తర క్రియలు చెయ్యి," అని హెచ్చరించాడు. తైలభాండం నుంచి పైకి తీసిన తండ్రి శవాన్ని చూసి భరతుడు, "నాయనా, నీవు





పోయావు, రాము డడవిలో ఉన్నాడు, ఈ రాజ్యభారం ఎవరు మోస్తారు ?" అని దుఃఖించాడు.

దశరథుణ్ణి పల్లకీలో ఎక్కించి నగరం బయటకి తీసుకు పోయారు. శవానికి ముందుగా పురజనులు, వెండి బంగారు నాణాలు వెదజల్లుతూ, చందనమూ, అగరూ, గుగ్గిలమూ, మొదలైన ధూపాలు వేస్తూ నడిచారు. దశరథుడి భార్యలు పల్లకీలలో వెళ్ళారు. శవాన్ని చితిపై పెట్టినాక దశరథుడి భార్యలు భరతుడితో బాటు చితి చుట్టూ అప్రదక్షిణంగా తిరిగారు. భరతుడు తండ్రికి నిప్పు పెట్టినాక అందరూ నగరానికి తిరిగి వచ్చారు.

భరతుడు తండ్రికి పది దినాలు మైల పట్టి తరవాత రెండు రోజులపాటు శ్రాద్ధాలు చేశాడు. బ్రాహ్మణులకు అన్న దానమూ, వస్త్ర దానమూ, ఇతర దానాలూ చేశాడు. పదమూడో రోజు అస్థిసంచయనం చేసేటప్పుడు భరతుడూ, అతనితోపాటు శత్రుఘ్నుడూ తండ్రిని తలుచుకుని వివశులై విలపించారు.

తరవాత ఒక చోట భరత శత్రుఘ్నులు జరిగిన దాన్ని గురించి మాట్లాడుకుంటున్నారు; తన అన్న అయిన లక్ష్మణుడు



తన తండ్రికి ఎందుకు అడ్డుపడలేదా అని శత్రుఘ్నుడు ఆశ్చర్యం వెలిబుచ్చుతూండగా, మంథర మహారాణీలాగా అలంకరించుకుని ఆట కోతిలాగా తయారై అటుగా వచ్చింది. ద్వారపాలకులు దాన్ని పట్టుకుని శత్రుఘ్నుడి దగ్గిరికి తెచ్చి, "ఇదుగో! అన్ని పాపాలకూ మూలమైన మంథర!" అన్నారు. శత్రుఘ్నుడు కోపావేశంలో మంథరను పట్టుకుని దాన్ని హతమార్చే ఉద్దేశంతో జరజరా ఈడ్చుకుపోసాగాడు. మంథర వెంట ఉండే దాసీలు బెదిరిపోయి కౌసల్య దగ్గిరికి పరిగెత్తారు. మంథర కప్పు ఎగిరిపోయేటట్టు కేకలు







పెట్టసాగింది. కైకేయి మంథరను విడిపించటానికి వస్తే శత్రుఘ్నుడామెను నోటికి వచ్చినట్టు తిట్టాడు.

అప్పుడు కైకేయి పరిగెత్తి వెళ్ళి భరతుణ్ణి పిలుచుకు వచ్చింది.

భరతుడు శత్రుఘ్నుడితో, "ఆడదాన్ని చంపుతావా? ఈ మాట తెలిస్తే రాముడు మన ముఖం చూస్తాడా? రాముడి ఆగ్రహానికి గురికావలిసి వస్తుందని ఆగాను కాని, నేను కైకేయిని ఎప్పుడో చంపకపోయానా? ఆ గూనిదాన్ని వదిలిపెట్టు," అన్నాడు.

దశరథుడు పోయిన పధ్నాలుగో రోజు ఉదయం పెద్దలందరూ భరతుడి వద్దకు వచ్చి, "రాజపుత్రా, రాజ్యానికి నాయకుడు లేడు. అదృష్టవశాత్తూ జనంలో అరాజకం సాగలేదు. నీవు వెంటనే పట్టాభిషేకం చేసుకోవటం మంచిది," అన్నారు.

భరతుడు వారితో, "జ్యేష్ఠుడే రాజు కావటం మా వంశాచారం. అందుచేత నన్ను రాజు కమ్మని మీరు కోరటం ఉచితం కాదు. నా తల్లి కోరిందిగదా అని పట్టం కట్టుకోను. నేను అరణ్యానికి వెళ్ళి జ్యేష్ఠుడైన రాముణ్ణి రాజును చేసి తీసుకువచ్చి, అతనికి బదులుగా నేనే అరణ్యవాసం చేస్తాను. రాజ్యాభిషేకం అరణ్యంలోనే జరుగుతుంది గనక అభిషేక సంబారాలన్నీ నా వెంట తీసుకు పోవటానికీ, నాతోబాటు చతురంగబలాలతో కూడిన సేనను వెంటబెట్టుకు వెళ్ళటానికి అవసరమైన ఏర్పాట్లు చేయండి," అన్నాడు.

భరతుడి ప్రయాణానికి బ్రహ్మాండమైన ప్రయత్నాలు జరిగాయి. అరణ్యం మధ్యగా చెట్లు నరికి, భూమి చదును చేసి దారులు వేశారు. నదులపై వంతెనలు కట్టారు. దారిలో అడ్డు వచ్చిన గోతులూ, చెరువులూ పూడ్చారు. దారి పొడుగునా అక్కడక్కడా బావులు తవ్వారు. విడిదికి తగిన స్థలాలు చూసి అక్కడ వీధులూ, ఇళ్ళూ గలిగిన

శిబిరాలు నిర్మించారు. ఇలాటి శిబిరాలు సరయూ నదీ తీరం నుంచి గంగా తీరం వరకూ ఏర్పాటు చేశారు.

ఆ రాత్రి శంఖాలు మోగటమూ, భేరి వాయింపూ, వందిమాగధుల స్తోత్రాలూ విని భరతుడు నిద్ర లేచి, కంట నీరు పెట్టుకుని, "నేను రాజునుగాను. నాకు స్తోత్ర పాఠాలూ, మంగళ వాద్యాలూ వద్దు," అని వాటిని నిలిపించాడు.

వసిష్ఠుడు తన పరివారంతో రాజసభకు వచ్చి, భరతుడి పట్టాభిషేకం జరిపించే ఉద్దేశంతో పురప్రముఖులనూ, మంత్రులనూ, గణనాయకులనూ, భరతుణ్ణీ, శత్రుఘ్నుణ్ణీ, ఇతర ముఖ్యులనూ వెంటనే పిలుచుకు రమ్మని దూతలను పంపాడు. త్వరలోనే అందరూ వచ్చి సభను అలంకరించారు. దశరథుడు జీవించి ఉన్నప్పటి లాగే సభ కళకళలాడింది.

అప్పుడు అందరి సమక్షంలోనూ వసిష్ఠుడు భరతుణ్ణి రాజ్యాభిషేకం చేసుకోవలిసిందిగా కోరాడు. భరతుడు పెద్దలతో చెప్పిన మాటలే పేరోలగంలో మళ్ళీ చెప్పి, "నేను మీ అందరి సమక్షంలోకి రాముణ్ణి తీసుకురావటానికి శాయశక్తులా యత్నిస్తాను. అతను రాకపోతే లక్ష్మణుడిలాగే నేను



కూడా రాముడితోపాటు వనవాసం ఉండిపోతాను. నా ప్రయాణానికి ఏర్పాట్లు ఇదివరకే ఆరంభమయాయి. మార్గం వేసేవారూ, మార్గరక్షకులూ మొదలైనవారు ముందే వెళ్ళిపోయారు. ఇంక నేను బయలుదేరటమే తరవాయి," అన్నాడు.

ఈ మాటలకు అందరూ సంతోషించారు. ప్రయాణానికి సేనలను ఆయత్తం చేయవలసిందిగా సుమంత్రుడు సేనాధ్యక్షులకు చెప్పాడు. అయోధ్యా నగరానికి మళ్ళీ ప్రాణం వచ్చినట్టయింది.

మర్నాడు భరతుడు పెందలాడే లేచి ప్రయాణమయాడు. అతని వెంట తొమ్మిది







వేల ఏనుగులూ, అరవైవేల రథాలూ, లక్ష గుర్రాలూ యోధులతో సహా కదిలాయి. కౌసల్యా, సుమిత్రా, కైకేయీ వాహనాలలో బయలుదేరారు. కైకేయికి పట్టిన దయ్యం దిగిపోయింది. తాను చేసినదానికి పశ్చాత్తాపపడుతూ ఆమె మిగిలినవారి కంటె ముందు కదిలింది. పౌరులు గుంపులు గుంపులుగా భరతుణ్ణి వెంబండించారు. రాముడికి ఇష్టులైనవారూ, వర్తకులూ, ఇతరులూ రాముణ్ణి చూడటానికి తాము కూడా ప్రయాణం కట్టారు. అనేక వేలమంది బ్రాహ్మణులు ఎడ్లబళ్లెక్కి భరతుడి వెంట ప్రయాణమయారు.

ఇంత పెద్ద బలగాన్ని వెంటబెట్టుకుని భరతుడు గంగాతీరాన్ని శృంగిబేరపురం వద్ద చేరుకుని, తన సైన్యాన్ని నది వెంబడి అక్కడక్కడా విడియమని ఉత్తరు విచ్చాడు. అతను మంత్రులతో, "మనం ఈ రాత్రికి ఈ తీరాన విశ్రమించి రేపు ఉదయానే గంగ దాటుదాం. నే నిప్పుడు నదిలో దిగి మా తండ్రికి తర్పణాలు వదులుతాను," అన్నాడు.

మహా సముద్రంలాటి సేన ఒకటి వచ్చి గంగ ఒడ్డు వెంబడి విడియటం గుహుడు గమనించాడు. రథంయొక్క టెక్కెం గమనించి ఆ రథం భరతుడిది అయి ఉంటుందని తెలుసుకున్నాడు. అతను తన అప్తులను చేరబిలిచి, "భరతుడు ఇంత సేనతో ఎందుకు బయలుదేరి వచ్చి వుంటాడంటారు? రాముడు వనవాసం పూర్తిచేసి వచ్చి రాజ్యం అడుగుతాడేమో, అతన్ని అరణ్యంలోనే చంపేద్దామని వచ్చివుంటాడు. మనం రాముణ్ణి ఎలాగైనా రక్షించాలి. అతను నా మిత్రుడు. అందుచేత మన వాళ్ళను అయిదు వందల పడవలు సిద్ధం చెయ్యమనండి. ఒక్కొక్క పడవలోనూ నూరేసిమంది యువకులను ఏర్పాటు చేసి, పడవలు గంగకు అడ్డంగా ఉంచి, అందు





లోనే మాంసమూ, ఇతర ఆహారాలూ, ఉంచుకుని జాగ్రత్తగా ఉండండి. భరతుడికి రాముడి పట్ల ద్రోహబుద్ధి లేకపోతే అతన్నీ, అతని సైన్యాన్నీ నిరాటంకంగా నది దాటనిద్దాం, లేకపోతే మన పడవలతో అటకాయింతాం," అన్నాడు.

గుహుడు ఈ కట్టుదిట్టాలు చేసిన అనంతరం చేపలూ, మాంసాలూ, తేనే కానుకగా తీసుకుని భరతుడి వద్దకు వెళ్ళాడు. గుహుడు వస్తూండటం ముందుగానే తెలుసుకుని సుమంత్రుడు భరతుడితో, "నిన్ను చూడటానికి బోయ రాజైన గుహుడు వస్తున్నాడు. ఇతను బలవంతుడు, సమర్థుడు, రాముడికి మంచి స్నేహితుడు. అతన్ని తగిన విధంగా గౌరవించి నట్టయితే రామలక్ష్మణులు అరణ్యంలో ఎటు వెళ్ళారో వారి జాడకూడా తెలుస్తుంది," అన్నాడు.

"అయితే ఆ గుహుణ్ణి వెంటనే నా దగ్గిరికి తీసుకురా," అని భరతుడు సుమంత్రుణ్ణి పంపాడు. గుహుడు భరతుడి సమక్షానికి వచ్చి, తాను తెచ్చిన కానుకలు ఇచ్చి, "తమరు వస్తారని ముందుగా తెలిసివుంటే మంచి ఆతిథ్యమూ, స్వాగతమూ ఏర్పాటు చేసి ఉండేవాణ్ణి. ఈ రాత్రికి మా ఆతిథ్యం స్వీకరించి రేపు ముందుకు సాగిపోదురుగాని," అన్నాడు.

భరతుడు గుహుడికి సంతోషం కలిగేటట్టుగా, "రాజా, ఇంత సేనకు నీవు ఒక్కడవే ఆతిథ్యం ఇస్తానన్నావు, ఆ మాటకన్న మాకు నీ నుంచి హెచ్చు గౌరవం ఇంకేం కావాలి? మేము భరద్వాజ ముని ఆశ్రమానికి వెళ్ళాలి, దారి చెప్పగలవా? ఇక్కడినుంచి దారి చాలా కష్టమని విన్నాను," అన్నాడు.

"బాణాలు ధరించి మా బోయలు మీ వెంట వస్తారులెండి. నేనుకూడా వెంట ఉంటాను. అందుచేత మీకు దారి వెతుక్కునేపని ఉండదు," అన్నాడు గుహుడు.






గుహుడు భరతుడికి సహాయం చేస్తానన్నాడేగాని అతన్ని సందేహం ఇంకా బాధిస్తూనే ఉన్నది. అతను భరతుడితో, "అయ్యా, నీ సేనా, అట్టహాసమూ చూస్తే నా కేదో అనుమానంగా ఉన్నది. నీవు వెళ్ళేది రాముడికి ద్రోహం తలపెట్టి కాదు గద?" అని అడిగాడు.

ఈ మాటకు భరతుడు బాధపడి, "నీకీ అనుమానం కలగటం కన్న పెద్ద కష్టం నా కేమి ఉంటుంది? పెద్ద అన్న అయిన రాముడు నాకు తండ్రితో సమానం కాదా? రాముణ్ణి తీసుకురావటానికే నేను పోతున్నాను. నా మాట నమ్ము," అన్నాడు.

"మంచిమాట అన్నావు, బాబూ. నీలాగా చేతికందిన రాజ్యాన్ని విడిచి పుచ్చేవాళ్ళు ప్రపంచంలో ఎక్కడా ఉండరు. నీ కీర్తి శాశ్వతం," అన్నాడు గుహుడు.

అస్తమయమై చీకటి పడింది. ఆ రాత్రి భరతశత్రుఘ్నులు పడుకుని రాముణ్ణి గురించి చాలా దుఃఖించారు. వారి వెంట ఉన్న గుహుడు వారిని ఓదార్చాడు. అతను లక్ష్మణుణ్ణి గురించి గొప్పగా చెప్పాడు: "రాముడు నిద్రపోతున్నప్పుడు తాను మేలుకునే ఉన్నాడు. మేమందరమూ మేలుకుని ఉండి రాముడికి ఏ భయమూ లేకుండా కాపాడతాను, నిద్రపొమ్మని చెప్పాను. కాని విన్నాడు కాడు. రాముడూ, సీతా కటిక నేలపై పడుకున్నందుకే తన ప్రాణాలు కొట్టుకుపోతూ ఉంటే ఇక నిద్ర ఎలా పడుతుందని అడిగాడు. రాముణ్ణి









చెట్టు కింద పడుకున్న చోటుకూడా చూపాడు. దశరథ మహారాజు పెద్దకొడుకు ఆ చెట్టు కింద దర్భలు పరుచుకుని పడుకోవటం భరతుడు ఊహించనైనా లేక పోయాడు. ఆ రాత్రి గడిచినాక గుహుడు వచ్చి భరతుడికి నమస్కారంచేసి, "రాత్రి సుఖంగా గడిచిందా?" అని అడిగాడు.

"మాకు ఏలోటూ జరగలేదు. మమ్మల్ని త్వరగా నది దాటించే ఏర్పాట్లు చేయించు," అన్నాడు భరతుడు.

గుహుడు అయిదువందల పడవలూ, స్వస్తికా అనే పేరు గల మేలుజాతి ఓడలూ సిద్ధం చేయించాడు. తెల్ల కంబళి పరిచిన ఒక స్వస్తికంలో భరతశత్రుఘ్నులూ, వసిష్ఠుడూ, రాజభార్యలూ ఎక్కారు. భరతుడి సేనా, రథాలూ, బళ్ళూ, వాటినిలాగే జంతువులూ, సంబారాలూ, సమస్తమూ పడవల లోకి ఎక్కించారు. పడవలు నది దాటాయి. ఏనుగులు నదికి అడ్డంగా ఈదాయి. అలాగే కొందరు మనుషులుకూడా ఈదారు. మరి కొందరు తెప్పలమీదా, కుండల సహాయం తోనూ నది దాటారు.

తరవాత భరతుడు ప్రయాగవనానికి సపరివారంగా చేరుకుని, వసిష్ఠాదుల సలహాతో భరద్వాజ మహర్షిని చూడ

వదిలి దశరథుడు ఒక్కరోజు బతుకుతాడా అన్నాడు. పధ్నాలుగేళ్ళు వనవాసం చేసి మేము మళ్ళీ అయోధ్యకు తిరిగిపోతామా అని చింతించాడు. అదుగో, ఆ మర్రిచెట్టు కిందనే రామలక్ష్మణులు జడలు ధరించారు. తెల్లవారినాక నేను వారి చేత గంగ దాటించాను."

గుహుడు ఈ విధంగా చెప్పుకుపోతూ ఉంటే భరతుడికి దుఃఖం హెచ్చిపోయింది. కౌసల్యా, సుమిత్రా, కైకా కూడా అతనున్న చోటికి వచ్చారు. వారి ఆసక్తి చూసి గుహుడు వారితో రాముణ్ణి గురించి ప్రతి వివరమూ చెప్పాడు. సీతారాములు గార









బయలుదేరాడు. భరద్వాజాశ్రమం కోసు దూరంలో ఉండగానే సైన్యమంతా ఆగిపోయింది. భరతుడు తన ఆయుధాలూ, ఆభరణాలూ తీసివేసి, పట్టుబట్టలు కట్టుకుని, వసిష్ఠుణ్ణీ, మంత్రులనూ వెంటబెట్టుకుని ఆశ్రమానికి వెళ్ళాడు. మంత్రులు ఆశ్రమంలో నిలిచిపోయారు, వసిష్ఠ భరతులు భరద్వాజుడి కుటీరానికి వెళ్ళారు. వారిని చూస్తూనే భరద్వాజుడు, "అర్ఘ్యం తీసుకు రండి," అని కేకపెట్టి లేచి నిలబడ్డాడు. భరతుణ్ణి వసిష్ఠుడు పరిచయంచేసినాక భరద్వాజుడు క్షేమసమాచారాలడిగి, "నాయనా, నీవు రాజ్యంచేసుకోక ఇలా ఎందుకు వచ్చావు?" అన్నాడు. భరతుడు రామలక్ష్మణులకు ద్రోహం తలపెట్టి వచ్చాడన్న అనుమానం ఆయనకుకూడా కలిగింది. భరతు డిందుకు ఎంతో నొచ్చుకుని, గుహుడికి చెప్పినట్టే భరద్వాజుడితో కూడా తన ఉద్దేశం చెప్పాడు. అంతా విని భరద్వాజుడు సంతోషించి, "సీతారామలక్ష్మణులు చిత్రకూటంలో ఉంటున్నారు. ఇవాళ ఇక్కడ ఉండి, రేపు పోదువుగాని," అన్నాడు. ఇందుకు భరతుడు సమ్మతించాడు. "నీ సేనలకన్నిటికీ నేను విందు చేయాలనుకుంటున్నాను. వారి నందరినీ



దూరాన ఎందుకు ఉంచి వచ్చావు? ఇక్కడికి వారిని కూడా నీ వెంట తేవలిసింది," అన్నాడు భరద్వాజుడు.

"మహాత్మా, ముని ఆశ్రమాలకు సేనలు దూరంగా తొలగివెళ్ళాలన్న నియమాన్ని బట్టి సేనను దూరంగా ఉంచాను," అని భరతుడు సవినయంగా చెప్పాడు.

"ఫరవాలేదు, నీ సేనను పిలిపించు," అని భరతుడితో చెప్పి భరద్వాజుడు తన అతిథులకు అపూర్వమైన ఆతిథ్యం ఏర్పాటుచేశాడు. విశ్వకర్మ వచ్చి క్షణంలో ఇళ్ళు ఏర్పాటుచేశాడు. నదులన్నీ వచ్చి నీరూ, మైరేయం అనే మద్యమూ సిద్ధం









చేశాయి. దిక్పాలకులు పిలిపించబడ్డారు. పాటలు పాడటానికి విశ్వావసువూ, హాహా, హూహూ అనే గంధర్వులూ, అనేకమంది అప్సరసలూ పిలిపించబడ్డారు. చంద్రుడు వచ్చి చతుర్విధాన్నాలు, పుష్పమాలలూ, పానీయాలూ, మాంసాలూ సిద్ధంచేశాడు.

మయుడు నిర్మించిన అద్భుతమైన భవనాలలో ఒక రాజగృహంలాటిది భరతుడికి ప్రత్యేకించబడింది. అందులో సింహాసనంతో కూడిన రాజసభ ఉన్నది. భరతుడు సింహాసనం మీద కూచోక మంత్రుల ఆసనం పైన కూచుని తన పరివారాన్నీ, గుహుణ్ణీ యథోచితస్థానాలలో కూచోబెట్టాడు.



బ్రహ్మదేవుడూ, కుబేరుడూ, దేవేంద్రుడూ తలా ఒక ఇరవైవేల మంది అప్సరసలనూ పంపారు. భరతుడు కొలువుతీరి ఉండగా నారద తుంబుర గోపులనే గంధర్వ రాజులు గానం చేశారు. అలంబుస, మిశ్రకేశి, పుండరీక, వామన అనే అప్సరసలు భరతుడి ముందు నృత్యం చేశారు.

భరద్వాజాశ్రమంలో గల చెట్లూ, పొదలూ, లతలూ స్త్రీ రూపాలు ధరించి భరతుడి సైనికులకు స్నానాలు చేయించాయి; "మీ ఇష్టం వచ్చినట్టు తాగండి, తినండి," అని వారిని హెచ్చరించాయి. సైనికులకు ఏలోటూ లేదు. వారు బాగా తిని, తాగి ఆనందపారవశ్యంలో మైమరచి, "మేము అయోధ్యకూ పోము, దండకారణ్యానికీ పోము, ఇక్కడే ఉంటాము. రాముడూ, భరతుడూ క్షేమంగా ఉంటారు గాక!" అన్నారు. కొందరు, "స్వర్గమంటే ఇదే!" అని కేకలుపెట్టారు. వాళ్ళు పూల మాలలు ధరించి అటూ ఇటూ పరిగెత్తారు, పాటలు పాడారు, నృత్యాలుకూడా చేశారు. రకరకాల మాంసాలతో, పాయసంతో, మజ్జిగ పెరుగులతో దివ్యంగా తయారు చేసిన ఆహారాన్ని ఎంతతిన్నా వారికి తనివి తీరలేదు. ఆ రాత్రి అలా గడిచిపోయింది.









మర్నాడు భరతుడు భరద్వాజుడి దర్శనం చేసుకుని, తమకు జరిగిన అతిథ్యానికి కృతజ్ఞత చెప్పుకుని, రాముణ్ణి చేరటానికి మార్గం అడిగాడు. చిత్రకూటానికి వెళ్ళటానికి దక్షిణంగా ఒక మార్గమూ, నైరృతీ దిశగా ఒక మార్గమూ ఉన్నాయనీ, సేనలు నడవటానికి ఏది యోగ్యమో చూసుకుని వెళ్ళమనీ భరద్వాజుడు సలహా ఇచ్చాడు.

దశరథుడి భార్యలు ముగ్గురూ మునికి మొక్కారు. భరతుడు తగిన రీతిగా వారిని మునికి పరిచయం చేశాడు. తన తల్లిని పరిచయం చేసేటప్పుడు అతను పరుషంగా మాట్లాడుతూ, కోపంతో దహించుకు



పోయాడు. అది చూసి భరద్వాజుడు, "రాముడు అడవికి వెళ్ళటం కైకేయి దోషం చేతనని ఒక్కనాటికి అనుకోకు. అందువల్ల ముందు ముందు చాలా లాభం కలుగుతుంది," అన్నాడు.

తరవాత భరతుడు భరద్వాజముని వద్ద యథోచితంగా సెలవు తీసుకుని తన బలగంతో చిత్రకూటానికి బయలుదేరాడు. వారు చివరకు మందాకినీ నదినీ, దానికి దక్షిణంగా ఉన్న చిత్రకూట పర్వతాన్నీ చేరవచ్చారు. రామలక్ష్మణులు ఎక్కడ ఉన్నదీ జాడ తెలుసుకు రమ్మని భరతుడు సైనికులను పంపాడు. కొందరు సైనికులు అడవి ప్రవేశించి ఒక చోట పొగ వస్తూండటం గమనించి ఆ సంగతి భరతుడితో చెప్పారు.

ఆ పొగ వచ్చేచోట ఎవరో ఉన్నారు. అయితే వారు రామలక్ష్మణులు కావాలి. లేదా రామలక్ష్మణుల జాడ ఎరిగిన మునులైనా కావాలి. భరతుడు సేనను నిశ్శబ్దంగా ఉండమని హెచ్చరించి, సుమంత్రుణ్ణీ, వసిష్ఠుణ్ణీ మాత్రమే వెంట తీసుకుని సైనికులు చెప్పిన దిక్కుగా బయలుదేరాడు.



రాముడు చిత్రకూటానికి వచ్చి నెల అయింది. ఈ రోజే అతను తన పర్ణశాల









విడిచి సీతతో సహా కొండ మీద విహరించటానికి బయలుదేరాడు. చిత్రకూటపర్వతం చాలా అందమైనది. అక్కడి చెట్లూ, పక్షులూ, మృగాలూ, చిత్రవిచిత్రమైన ధాతువులూ, పక్కనే ప్రవహించే మందాకినీ నదీ, మనోహరమైన దృశ్యాలూ చూస్తూ వారిద్దరూ చాలాసేపు విహరించారు. రాముడు సీతతో, "నీవూ, లక్ష్మణుడూ నా వెంట ఉంటే ఈ దృశ్యాలు చూసి ఆనందిస్తూ ఎన్ని ఏళ్ళపాటయినా ఇక్కడే ఉండిపోగలను," అన్నాడు.



ఇలా చాలాసేపు విహరించిన పిమ్మట సీతారామలక్ష్మణులు ఒకచోట కూచున్నారు. రాముడు కులాసాగా కబుర్లు చెబుతూ సీత చేత మాంసఖండాలు తినిపించాడు. అదే సమయంలో రాముడికి పరిగెత్తిపోతున్న అడవి ఏనుగులు కనిపించాయి. అవి చేసే అరుపులు వింటే భయపడి పరిగెత్తుతున్నట్టు కనబడ్డాయి. నిజానికవి భరతుడి వెంట ఉండే సేనను చూసి బెదిరినవే. రాముడు లక్ష్మణుడితో, "చూడు, లక్ష్మణా! ఏనుగులూ, ఎనుబోతులూ; సింహాలూ కూడా బెదిరి పారిపోతున్నాయి. ఎవరైనా రాజు వేటాడుతున్నాడా? లేక ఈ అడవి మృగాలను మించిన క్రూరమృగ మేదైనా వచ్చిందా? కారణ మేమిటో చూడు!" అన్నాడు. లక్ష్మణుడు ఎత్తయిన చెట్టెక్కి అన్ని దిక్కులా కలయజూసే సరికి ఉత్తర దిక్కుగా పెద్ద సేన కనబడింది. అతను రాముడితో, "ఏదో పెద్ద సేన మనకేసి వస్తున్నది. అగ్ని చల్లార్చి, సీతను గుహలో దాచి, కవచం తొడిగి, ధనుర్బాణాలు తీసుకో," అన్నాడు.

"సరిగా చూడు, లక్ష్మణా! అది ఎవరి సేనలాగుంది?" అన్నాడు రాముడు.

లక్ష్మణుడు సేన మధ్య కనిపించే రథాలకు కట్టిన ధ్వజాలను గుర్తించి, "భరతుడు తల్లి ధర్మమా అంటూ రాజ్యాభి







షేకం చేసుకుని, అంతటితో తృప్తిచెందక తన రాజ్యం నిష్కంటకం చేసుకోవటానికై మనని చంపటానికి వస్తున్నాడు. మనం పర్వతం మీద దాక్కుందామా? లేక యుద్ధ సన్నద్ధులమై ఇక్కడే ఉందామా?" అని రాముణ్ణి అడిగాడు.

అతను అంతటితో ఆగక, "ఇప్పుడు భరతుడు మనకు చిక్కబోతున్నాడు. మనకి కష్టాలన్నీ తెచ్చిపెట్టిన ఈ భరతుణ్ణి తప్పక చంపేస్తాను. అందులో తప్పేమీ లేదు. పైగా భరతుడు చస్తే నీవు షాయిగా రాజువు కావచ్చు. కైకేయినీ, ఆ మంథరనూ, వాళ్ళవాళ్ళ నందరినీ కూడా చంపేస్తాను. అటువంటి పాపులు బతికి ఉండరాదు," అన్నాడు.

ఈ మాటలు విని రాముడు తన తమ్ముణ్ణి మెత్తగా చివాట్లు పెట్టాడు: "తనకుతానై భరతుడు మనను చూడవస్తూ ఉంటే యుద్ధం చేస్తానంటా వేమిటి? తండ్రి మాట నిలబెట్టటానికి ఇక్కడికి వచ్చినవాణ్ణి, భరతుణ్ణి చంపేసి లోకనిందకు పాలు కమ్మంటావా? కొంచెం నష్టం కలగగానే తండ్రినీ, తమ్ములనూ చంపుకుంటారా? భరతుణ్ణి ఎందుకు శంకిస్తున్నావు? అతను ఎన్నడైనా అనుమానించదగిన మాటలైనా నీతో అన్నాడా? అతను మామగారి ఇంటి నుంచి అయోధ్యకు వచ్చి, మన సంగతి విని మనని తిరిగి తీసుకుపోయే ఉద్దేశంతో వస్తూ ఉంటాడని నా నమ్మకం. నీకు నిజంగా రాజ్యకాంక్ష ఉంటే చెప్పు, భరతుడు రాగానే రాజ్యం నీకిమ్మంటాను. అతను నా మాట కాదనడు."

ఈ మాటలకు లక్ష్మణుడు సిగ్గు పడి తల వంచుకుని, "మన తండ్రే మనని చూడటానికి వస్తూ ఉండవచ్చు," అని మాట మార్చాడు.

రాముడు లక్ష్మణున్ని చెట్టు దిగి రమ్మన్నాడు. లక్ష్మణుడు దిగి వచ్చాడు.






ఈ లోపుగా భరతుడు రామాశ్రమాన్ని అంతదూరంలో చూసి, తన తల్లులను తీసుకు రమ్మని వసిష్ఠుడికి చెప్పి, సుమంత్రుణ్ణీ, శత్రుఘ్నుణ్ణీ వెంట బెట్టుకుని ముందుకు వచ్చాడు. పర్ణశాల పరిసరాలలో మార్గం తెలిపే గుర్తులూ, పేర్చిన కట్టెలూ, పిడకల పోగులూ, చెట్లకు గుర్తుగా కట్టిన పేలికలూ ఉన్నాయి.

త్వరలోనే భరతుడు పర్ణశాలను సమీపించి, దానికి ఈశాన్యాన అగ్ని వేదికను చూశాడు. తరవాత పర్ణశాలలో తాపసి వేషంలో ఉన్న రాముణ్ణి చూశాడు. పక్కనే సీతా లక్ష్మణులున్నారు రాముణ్ణి చూడగానే భరతుడికి పుట్టెడు దుఃఖం వచ్చింది. అతను రాముడి దగ్గిరికి పరిగెత్తుకుపోయి, కన్నీరు కారుస్తూ, రాముడి పాదాలు కనబడక నేలపై బోర్లాపడ్డాడు. అతని నోట మాట రాలేదు. శత్రుఘ్నుడు కూడా ఏడుస్తూ రాముడి కాళ్ళకు వందనం చేశాడు. రాముడు భరతశత్రుఘ్నుల నిద్దరినీ కౌగలించుకుని కన్నీరు కార్చాడు.

అతను భరతుడిపై ప్రశ్నల వర్షం కురిపించాడు: "నాయనా, చాలా కాలానికి నిన్ను చూశాను. మారిపోయావు. గుర్తించలేక పోయాను. చాలా సంతోషం. ఇప్పుడెందు కిలా ఈ అరణ్యానికి వచ్చావు? నాయనగారు విచారం లేకుండా ఉన్నారా? తల్లులందరూ క్షేమమా? నీవు రాజధర్మాలు చక్కగా పాటిస్తూ పరిపాలన చేస్తున్నావా? నీ రాజ్యం ఎవరూ అపహరించలేదు గద?







మంత్రులు అన్ని వేళలా నీకు సహాయంగా ఉంటున్నారా ?"

భరతుడు రాజ్యాభిషేకం చేసుకున్నా డనుకుని రాముడు వేసిన ప్రశ్నలన్నిటికీ సమాధానంగా, "అన్నా, మన వంశంలో పెద్ద కొడుకుండగా చిన్నవాడు అభిషేకించుకునే ఆచారం ఎన్నడన్నా ఉన్నదా? నా వెంట అయోధ్యకు వచ్చి రాజ్యాభిషేకం చేసుకుని, మన వంశాన్ని తరింపజెయ్యి. ఇప్పుడు మన తండ్రికూడా లేడు. నే నింకా కేకయరాజు నగరంలో ఉండగానే ఆయన పోయాడు. నీవూ, సీతా, లక్ష్మణుడూ వెళ్ళి పోయిన దుఃఖం ఆయనను తన పొట్టన



పెట్టుకున్నది. ముందు తండ్రిగారికి జల తర్పణాలు చెయ్యి. నిన్నే తలచుకుంటూ పోయిన ఆత్మకు నీ జలతర్పణాలే ఫల ప్రదమవుతాయి," అన్నాడు.

తండ్రి మరణ వార్త విని రాముడు మూర్ఛపోయాడు. సీతా భరతలక్ష్మణ శత్రుఘ్నులు చన్నీరు చల్లి రాముడికి మూర్ఛ తెలిసేటట్టు చేశారు. రాముడి విచారానికి అంతులేదు. తన కోసం దుఃఖించి తండ్రి చనిపోయినందుకూ, ఆయనకు తాను ఉత్తరక్రియలు చెయ్యనందుకూ తనను తాను తిట్టుకున్నాడు. తరవాత అతను తండ్రికి ఉదకదానం చెయ్యటానికి బయలు దేరుతూ, స్త్రీలూ పిల్లలూ ముందు నడవాలి గనక, సీతనూ లక్ష్మణుణ్ణీ ముందుగా నదికి బయలుదేరమన్నాడు.

సీతారామలక్ష్మణులు మందాకినీ నది రేవులో స్నానాలుచేసి దశరథుడికి నీళ్ళు వదిలారు. తరవాత రాముడు తండ్రికి సపిండీకరణం చేశాడు, గార గానుగుపిండిని రేగుపళ్ళతో కలిపి ముద్దలుచేసి దర్భలపై ఉంచాడు. తరవాత వారు ముగ్గురూ పర్ణ శాలకు తిరిగివెళ్ళారు.

అంతవరకూ దూరాన ఉండిపోయిన జనం పర్ణశాల నుంచి రోదన ధ్వనులు విన









గానే అటుకేసి పరిగెత్తుకుంటూ వచ్చి ముని వేషంలో ఉన్న రాముణ్ణీ, అతని తమ్ములనూ, సీతనూ ఒక్కచోట చూశారు. రాముడికి కొందరు నమస్కారాలు చేశారు. కొందరిని రాము డాలింగనం చేసుకున్నాడు.

ఈ లోపల దశరథుడి భార్యలు వసిష్ఠుడి వెంట మెల్లిగా నడుచుకుంటూ మందాకిని ఒడ్డు మీదుగా పర్ణశాల కేసి వచ్చారు. వారికి స్నానాలరేవూ, దానికి ఎడంగా రాముడు తండ్రి నిమిత్తం పెట్టిన పిండాలూ కనిపించాయి. కౌసల్య సుమిత్రతో, "మన వాళ్ళు ఇక్కడే స్నానం చేస్తారు కాబోలు. నీ కొడుకు రాముడి కోసం ఇక్కడినుంచే నీళ్ళు తీసుకుపోతాడు కాబోలు. ఇక లక్ష్మణుడి కష్టాలు తీరాయిలే. భరతుడు రాముణ్ణి తీసుకువచ్చి రాజ్యాభిషేకం చేయిస్తున్నాడుగా! ఈ గార గానుగుపిండి ముద్దలు చూశావా? భూమండలమంతా ఏలిన దశరథ మహారాజుకు ఈ ముద్దలేమిటి, ప్రారబ్ధంగాకపోతే? పాపం, రాముడిదే తింటున్నాడు కాబోలు. తలుచుకుంటే నా గుండె పగిలిపోతున్నది!" అన్నది వచ్చే దుఃఖాన్ని అపుకుంటూ.

వారు పర్ణశాల చేరగానే రాముడు లేచి ముగ్గురు తల్లులకూ సాష్టాంగ నమస్కారం



చేశాడు. సీత కూడా వారికి నమస్కరించి ఎదురుగా నిలబడింది. వనవాసంతో చిక్కిపోయి ఉన్న సీతను కౌసల్య కౌగలించుకుని, "జనకమహారాజు కూతురూ, దశరథ మహారాజు కోడలూ అయి ఉండి నీకీ వనవాసం గతి పట్టిందా, తల్లీ?" అని ఎంతగానో వాపోయింది.

రాముడూ వసిష్ఠుడూ దగ్గిరగా కూచున్నారు. రాముడికి మరొక పక్కగా భరతుడూ, మంత్రులూ, పురప్రముఖులూ కూచున్నారు. భరతుడు తాను వచ్చినపని బయటపెట్టే సమయం వచ్చింది, ఏమంటాడా అని అందరూ ఆత్రంగా వింటున్నారు.





రాముడే విషయం కదిపాడు. "భరతా, నీవు జడలూ, నారబట్టలూ, కృష్ణాజినమూ ధరించి ఈ అరణ్యానికి రావటానికి కారణ మేమిటి? వినాలని ఉన్నది," అన్నాడతను.

భరతు డిలా చెప్పాడు: "మన తండ్రి నిన్ను అడవికి పంపి నీ వియోగం భరించ లేక కాలధర్మం చేశాడు. ఆయన ఈ పాపపు పని చేయటానికి ప్రేరణ ఇచ్చినది నా తల్లి కైకేయి. అందు కామె ఘోరనరకం ఎలాగూ అనుభవిస్తుంది. ఆమె కొడుకు నైన నన్ను నీవు అనుగ్రహించాలి. వచ్చి రాజ్యాభిషేకం చేసుకో. ఇందుకే మన తల్లులూ, ఈ ప్రజలూ కూడా నిన్ను వెతుక్కుంటూ వచ్చారు. వారి కోరిక తీర్చు. ఇంతమంది కోరికను తోసిపుచ్చకు."

ఈ మాటలు చెప్పి భరతుడు తన తల రాముడి పాదాలకు తగిలేలాగా సాష్టాంగ పడ్డాడు. రాముడు భరతుణ్ణి కౌగలించు కుని నిట్టూర్చుతూ, "నాయనా, నీవు చిన్న తనం చేత నీ తల్లిని నిందించావు. పెద్దవారికి చిన్నవారిని ఎలా శాసించటానికైనా అధి కారం ఉన్నది. దశరథుడికి నన్ను అడ వికి పంపే అధికారం ఉన్నది. తండ్రి మీద లాగే తల్లి మీదా గౌరవం ఉంచాలి. పెద్దలు నన్ను అడవికి పొమ్మంటే నేను రాజ్యం ఎలా చేస్తాను? నీవు అయోధ్యకు వెళ్ళి



రాజ్యం చెయ్యాలి, నేను నారబట్టలు కట్టి వనవాసం చెయ్యాలి. ఇది మన తండ్రి ప్రజల సమక్షంలో ఏర్పరచిన నియమం. పద్నాలుగేళ్ళూ వనవాసం ముగించినాక తండ్రి ఆజ్ఞ ప్రకారం రాజ్యం చేస్తాను. తండ్రి అనతి నెరవేర్చటంకంటె నాకు రాజ్యం ఏలటం ఎక్కువైనది కాదు," అన్నాడు. ఆ రాత్రి అలాగే గడిచిపోయింది. మర్నాడు అందరూ స్నానాలూ, జప హెూమాలూ పూర్తిచేసి మళ్ళీ రాముడి చుట్టూ చేరారు. ఎవరూ మాట్లాడలేదు. ఆ నిశ్శబ్దం మధ్య భరతుడు రాముడితో, "నా తల్లిని గౌరవించి, నాకు రాజ్యం ఇచ్చావు. దాన్ని నీ కిస్తున్నాను, తీసుకుని సుఖంగా ఏలుకో. ఈ రాజ్యభారం మొయ్యటానికి నీవే సమర్థుడవు. గుర్రంలాగా గాడిదె నడవలేదు గదా! మన తండ్రి నీకు చిన్నతనం నుంచీ ఎంతో శ్రమపడి రాజుకు అవసరమైన శిక్షణ ఇచ్చాడు. నీవు రాజువు కాకుండాపోతే ఆయన పడిన శ్రమ అంతా వృథా అవుతుంది," అన్నాడు.

భరతుడు చెప్పిన ఈ మాటలకు చుట్టూ చేరినవారంతా ఎంతో సంతోషం వెలిబుచ్చి, ప్రశంసించారు.

అప్పుడు రాముడు భరతుడికి కొంత తత్వబోధ చేశాడు. ప్రాణులకు మరణం





నిత్యం. మనిషి ఏ పని చేస్తున్నా ఒక్కొక్క క్షణమే మృత్యువు దగ్గిరపడుతూ ఉంటుంది. ముసలివాడై అసమర్థుడైనవాడు చేయగలది లేదు; యౌవనం ఉండగానే ఆత్మవిచారం చెయ్యాలి. గడచిన క్షణం మరిరాదు. చనిపోయినవారి కోసం ఎంత చింతించీ లాభంలేదు. ఏ ప్రాణి కూడా తన యిష్టంవచ్చినట్టు నడుచుకోలేదు. దశరథుడు ఎన్నో పుణ్యకార్యాలు చేసి స్వర్గానికి వెళ్ళాడు. అందుచేత భరతుడు మనో వైకల్యం మాని తండ్రి ఆజ్ఞను శిరసావహించి, తండ్రి జాడలలోనే నడుచుకుంటూ రాజ్యం చెయ్యటం ధర్మం. అలాగే



రాముడు తండ్రి ఆజ్ఞ మీరక వనవాసం జరపటం ధర్మం.

అంతా విని భరతుడు, "నేను ధర్మానికి వెరిచే నా తల్లిని శిక్షించలేదు, తండ్రిని బహిరంగంగా దూషించలేదు. కాని ఆయన తన భార్యకు దాసుడై, ఆమె విషం తాగుతానంటే బెదిరి, రాజ్యం చేయవలసినవాణ్ణి అరణ్యానికి పంపటం అధర్మం కాదా? తండ్రి చేసిన అన్యాయాన్ని సరిచేసి తండ్రికి నరకప్రాప్తి కలగకుండా కొడుకు చూడవద్దా? వచ్చి రాజ్యంచేసి, తండ్రి చేసిన అన్యాయాన్ని సరిచెయ్యి," అన్నాడు.

రాముడు ఇందు కెంతమాత్రమూ ఒప్పక, కైకేయిని పెళ్ళాడేటప్పుడు దశరథుడు తన మామగారితో ఆమెకు పుట్టే కొడుకుకే పట్టం కడతానని మాట ఇచ్చిన సంగతి చెప్పాడు.

అప్పుడు అక్కడ ఉన్నవారిలో జాబాలి అనే బ్రాహ్మణుడు రాముడితో, "వెర్రివాడా? ఎవరు తండ్రి? ఎవరు కొడుకు? చచ్చిపోయినవారి తృప్తి కోసం తద్దినాలు పెట్టేవాళ్ళూ, ఈ లోకంలో కష్టాలుపడేవారూ మూఢులు. పరలోకం ఎక్కడున్నది? నీవు వెళ్ళి హాయిగా రాజ్యంచేసి సుఖపడు. ప్రతి ప్రాణీ ఒంటరిగా పుట్టు





తుంది, ఒంటరిగా చస్తుంది. బతికున్నంత కాలమూ ఈ ప్రపంచం ఒక మజిలీ. ఇదే నిజం, మిగిలినదంతా భ్రమ," అన్నాడు.

"ఇవి నాస్తికు లనవలిసిన మాటలు. నీవు నాస్తికుడవని తెలియక మా తండ్రి నిన్ను చేరదీశాడు," అని రాముడు జాబాలిని నిందించాడు.

వసిష్ఠుడు అడ్డువచ్చి, "నాయనా, జాబాలి నాస్తికుడు కాడు. నీచేత రాజ్యాభిషేకానికి ఒప్పించటానికే అతను అలా చెప్పాడు," అన్నాడు. వసిష్ఠుడు కూడా పట్టం కట్టుకోమని రాముడికి ఎంతగానో చెప్పాడు. కాని రాముడు తన నిశ్చయాన్ని మార్చుకోలేదు.

అప్పుడు భరతుడు సుమంత్రుడితో, "వెంటనే వెళ్ళి దర్భలు తెచ్చి ఈ పర్ణశాల వాకిలికి అడ్డంగా పరు. రాముడు నా కోరిక తీర్చేదాకా నేను వాటిపై పడుకుని లేవను," అన్నాడు.

సుమంత్రుడు "ఏం చెయ్యమంటావు?" అన్నట్టు రాముడి కేసి చూశాడు. అది గమనించి భరతుడు తానే స్వయంగా దర్భలు తెచ్చి వాటిని పర్ణశాల వాకిలికి అడ్డంగా పక్క వేసుకుని పడుకున్నాడు.

అది చూసి రాముడు భరతుడితో, "నాయనా, ఈ పనిచేసేవారు అప్పులు వసూలు చేసుకోలేకపోయిన బ్రాహ్మణులు. ఇది క్షత్రియులు చేసేపనికాదు. అదీగాక నేను నీ కేమీ ద్రోహం చేశానని వాకిలికి అడ్డం పడుకుంటావు? లే, అయోధ్యకు తిరిగివెళ్ళి పో," అన్నాడు.

భరతుడు దర్భల మీది నుంచి లేవకుండానే చుట్టూ మూగిన జనాన్ని చూసి, "మీరందరూ ఊరుకుంటారేం? రాముడికి చెప్పరేం?" అని అడిగాడు.

"రాముడు తండ్రి ఆజ్ఞ పాలించి తీరాలని పట్టుపడుతున్నప్పుడు చేసేదేముంది?" అన్నారు వారు.






భరతుడు రాముడి ఆజ్ఞానుసారం లేచి జలం స్పృశించి రాముణ్ణి తాకి అందరి తోనూ ఈ విధంగా అన్నాడు : "మీరంతా వినండి. నేను నా తండ్రిని రాజ్యం కోర లేదు, నా తల్లినీ కోరలేదు. రాము డడవికి వెళ్ళటం నాకు సమ్మతంకాదు. రాముడి బదులు నేను పధ్నాలుగేళ్ళు వనవాసం చేస్తాను, నాకు బదులు రాముణ్ణి రాజ్యం చెయ్యమనండి. తండ్రి ఆజ్ఞ పాలించి నట్టవుతుంది."

ఈ మాటలు విని రాముడు నిర్ఘాంత పోయి, "ఇలా రాజ్యాన్ని, వనవాసాన్ని మార్పు చేసుకోవటం పితృవాక్య పరిపాలన ఎలా అవుతుంది? నేను వనవాసం చెయ్యటం మాని రాజ్యం ఏలటం కన్న ఘోరమైన తప్పు ఉండదు. ఈ పధ్నాలు గేళ్ళు పూర్తికాగానే నేనూ భరతుడూ కలిసి రాజ్యంచేస్తాం," అన్నాడు.

చుట్టూ చేరిన వారు రాముడి మాటలకూ, భరతుడి మాటలకూ కూడా సంతోషిం చారు. వారు భరతుడితో, "నాయనా, రాముడు చెప్పినట్టు చెయ్యి. అతన్ని తండ్రి రుణం తీర్చుకోనీ!" అన్నారు. రాముడు సంతోషించాడు గాని భరతుడి గుండెలో రాయిపడింది.

చివర కతను రాముణ్ణి పాదుక లిమ్మని అడిగాడు. రాముడు ఆ పాదుకలను కాళ్ళకు వేసుకుని భరతుడికి ఇచ్చాడు. భరతుడు రాముడితో, "నీవు కాకపోతే నీ పాదుకలే లోకాన్ని రక్షిస్తాయి. నేను







మునివేషంతో, ఫలమూలాలు తింటూ, రాజ్యభారం ఈ పాదుకలకు అప్పగించి, ఊరి బయట ఉండి నీ రాక కోసం ఎదురు చూస్తూ ఉంటాను. పధ్నాలుగేళ్ళూ దాటిన మర్నాడు నీవు రాకపోయావో, అగ్నిప్రవేశం చేస్తాను," అన్నాడు.

రాముడిందుకు సరేనని, భరతుణ్ణి కౌగలించుకుని, "నీ తల్లిని రక్షించు. ఆమె మీద ఆగ్రహించావో నా మీదా, సీత మీద ఒట్టు! ఇక వెళ్ళి రా," అంటూ కన్నీరు కార్చాడు.

భరతుడు బంగారు అలంకారాలు గల రామపాదుకలను పూజించి, రాముడికి ప్రదక్షిణం చేశాడు. తరవాత రాముడు తన తల్లులనూ, ఇతరులనూ సాగనంపి పర్ణశాలకు తిరిగివచ్చాడు.

భరతుడు రాముడి పాదుకలను నెత్తిన పెట్టుకుని, శత్రుఘ్నుడితో సహా రథమెక్కాడు. వసిష్ఠ వామదేవ జాబాలి మొదలైన వారు ముందు సాగారు. భరతుడు సపరివారంగా తిరుగుప్రయాణంలో భరద్వాజాశ్రమానికి వచ్చాడు. ఆయనతో జరిగినదంతా చెప్పి, ఆయన వద్ద సెలవు పుచ్చుకున్నాడు. శృంగిబేరపురం మీదుగా ప్రయాణించి అతను చివరకు అయోధ్య చేరుకున్నాడు. అయోధ్య వీధుల కుండా రథమెక్కి వస్తుంటే అతనికి నగరం నిర్జీవంగా కనబడింది. అతను శత్రుఘ్నుడితో, "అయోధ్య కళ అంతా రాముడితోనే పోయింది," అన్నాడు.

భరతుడు తన తల్లులను అయోధ్యకు తెచ్చి వసిష్ఠుడు మొదలైన వారితో, "రాముడు లేని అయోధ్యలో ఉండలేను, నందిగ్రామానికి పోయి, అక్కడినుంచే రాజ్యం చూస్తూ రాముడి రాకకు ఎదురు చూస్తూ ఉంటాను," అన్నాడు. ఈ ఏర్పాటుకు మంత్రులు కూడా సమ్మతించారు. భరతుడు తల్లుల దగ్గిర సెలవు పుచ్చుకుని,







శత్రుఘ్నుడితో బాటు రథమెక్కి, మంత్రులనూ, వసిష్ఠుణ్ణీ వెంటబెట్టుకుని నంది గ్రామానికి బయలుదేరాడు.

తన వెంట రమ్మని అతను ఆజ్ఞాపించక పోయినప్పటికీ సేన కూడా అతని వెంట నంది గ్రామానికి కదిలింది.

నందిగ్రామంలో పాదుకలకు శ్వేతచ్ఛత్రమూ ఇతర రాజమర్యాదలూ జరగాలని భరతుడు ఉత్తరు విచ్చాడు. తన తల్లి మూలంగా తనకు కలిగిన అపకీర్తి పోగొట్టుకోవటానికి మహాత్ముడైన భరతుడు జడలు ధరించి, నారబట్టలు కట్టి, మునివేషం వేసుకుని నందిగ్రామంలో ఉండి కోసలదేశాన్ని పరిపాలించాడు. రాజతంత్రం ప్రతిదీ ఆ పాదుకలకు చెప్పుకునేవాడు. సామంతులు తెచ్చిన కానుకలను పాదుకలకు నైవేద్యం పెట్టేవాడు. రాముడికి జరగవలిసిన పట్టాభిషేకం ఈ విధంగా రామ పాదుకలకు జరిగింది.

భరతుడు వెళ్ళినాక రాముడు కొంత కాలం ఆ పర్ణశాలలోనే ఉన్నాడు. క్రమంగా అతనికి ఒక విషయం తెలిసివచ్చింది: ఆ ప్రాంతంలో ఉండే ఆశ్రమాలకు చెందిన మునులు రాముణ్ణి చూపించి ఏవో గుసగుసలాడుకుంటున్నారు. దీనికి తోడు



వారంతా తమ ఆశ్రమాలు విడిచి వెళ్ళి పోబోతున్నారని కూడా తెలిసింది.

ఇదంతా ఏమిటో తేల్చుకోవాలనుకుని రాముడు మునులకు కులపతి అయిన ముసలి ముని వద్దకు వెళ్ళి, "మీరంతా ఆశ్రమాలు విడిచిపోతున్నారట. నేనుగాని, నా తమ్ముడుగాని, నా భార్యగాని తెలియక చెయ్యగూడని పని ఏదైనా చేయులేదు గద?" అని అడిగాడు.

దానికి కులపతి, "మీరేమీ చెయ్యలేదు గాని, నీ కారణంగా రాక్షసులు మునులకు మహాభయం కలిగిస్తున్నారు. రావణుడి తమ్ముడు ఖరుడనే వాడు జనస్థానంలో చేరి







అక్కడి మునులను పారదోలాడు. ఎప్పుడో మాకూ పీడ చుట్టుకుంటుంది. అందుచేత ఈ ప్రాంతం వదిలి పోవాలనుకుంటున్నాం. యోధుడివి, అందులోనూ భార్యతో ఉంటున్నవాడివి; నీకైనా ఈ చోటు వదలటమే మంచిది," అన్నాడు.

తరవాత అక్కడి మునులు చాలా దూరాన ఉండే మరొక ఆశ్రమానికి వెళ్ళిపోయారు. రాముడు మాత్రం కొంతకాలం అక్కడే ఉండి తాను కూడా ఆ ప్రాంతం విడిచిపెడితే మంచిదని నిశ్చయించుకున్నాడు. ఆ ప్రకారమే అతను సీతాలక్ష్మణులతో బయలుదేరి అత్రిమహాముని ఆశ్రమానికి వెళ్ళాడు. ఆయన వారిని తన బిడ్డలలాగా ఆదరించి, తానే స్వయంగా వారికి అతిథి సత్కారాలు చేశాడు.

తరవాత అత్రిమహాముని జగద్విఖ్యాతురాలైన తన భార్య అనసూయను పిలిచి, ఆమెకు వారిని పరిచయం చేశాడు. అనసూయ ఇప్పుడు చాలా వృద్ధురాలు. జుట్టంతా తెల్లబడిపోయింది, అవయవాలు సడలిపోయాయి. కాని ఆమె తపశ్శక్తి సాటిలేనిది.

అత్రిమహాముని రాముడితో, "ఒకప్పుడు వర్షంలేక పదేళ్ళపాటు కరువువస్తే ఈమె తన తపశ్శక్తితో గంగను ప్రవహింప జేసి





మునులకు ఫల మూలాలు ఉత్పత్తి అయే టట్టు చేసింది. పదిరాత్రులు ఒకే రాత్రిగా ఉండేలాగ మరొక సందర్భంలో చేసింది. సీతను ఈమెకు నమస్కారం చెయ్య మను," అన్నాడు.

రాముడు సీతతో, "ఈ మహాత్ముడి మాట విన్నావు కదా, అనసూయాదేవికి నమస్కరించు. అందువల్ల నీకు శ్రేయస్సు కలుగుతుంది," అన్నాడు.

సీత అనసూయకు తన పేరు చెప్పుకుని నమస్కారం చేసి ఆమెను కుశల మడి గింది అనసూయ సీతను చూసి ఎంతో ముచ్చటపడి, "తల్లీ, నీవు బంధువులనూ, ఐశ్వర్యాన్నీ, అహంకారాన్నీ, సమస్తాన్నీ విడిచి భర్త వెంట పాతివ్రత్య ధర్మంగా అరణ్యాలకు వచ్చావే, నీ భాగ్యమే భాగ్యం! అమ్మా, నేను ఎంతగానో ఆలోచించి చూశాను, స్త్రీని సమస్తవేళలా భర్తలాగా రక్షించేవారు మరెవరూ లేరు. నీ విలాగే భర్తను అనుసరించి ఉంటూ పాతివ్రత్య ధర్మం నెరవేర్చు," అని చెప్పింది.

"నా భర్త గుణవంతుడు, దయా మయుడు, ధర్మాత్ముడు, నా మీద అచం చలమైన ప్రేమగలవాడు, నాకు తల్లి వంటి వాడు, తండ్రి వంటివాడు, మోహనా కారుడు; అటువంటి భర్తను సేవించ





కానికేం? నేను చిన్నతనం నుంచీ పతివ్రతా ధర్మాలు తెలుసుకున్నాను. అడవికి వచ్చేటప్పుడు నా అత్త కౌసల్య కూడా నాకా ధర్మం బోధించింది. ఇప్పుడు మీ నోట కూడా అవే వింటున్నాను," అన్నది సీత ఎంతో వినయంగా.

సీత తియ్యగా మాట్లాడుతూంటే అనసూయకు ఎంతో ముచ్చట అయింది. ఆమె సీతతో, "అమ్మా, నీ కేమైనా కోరిక ఉంటే చెప్పు, నేను తీర్చుతాను," అన్నది.

సీత ఈ మాట విని ఆశ్చర్యపడి, "మీరా మాట అనటమే నాకు పదివేలు," అని సమాధాన మిచ్చింది.

"అయినా నా సంతోషం కొద్దీ ఇచ్చేది నీవు తీసుకోవాలి," అంటూ అనసూయ సీతకు ఒక దివ్యమైన పుష్పమాలా, ఒక చీరా, కొన్ని ఆభరణాలూ, శరీరానికి పూసుకునే పూతా, మంచి పరిమళగంధమూ ఇచ్చింది.

తరవాత అనసూయ సీతతో, "నీ భర్త నిన్ను స్వయంవరంలో పెళ్ళాడాడని విన్నాను. ఆ కథంతా చెబుతావా, అమ్మా?" అని అడిగింది.

సీత తన వృత్తాంతమంతా అనసూయకు చెప్పింది: "మా తండ్రి జనకమహారాజు మిథిలకు రాజు. ఆయన యాగం కోసం నాగలితో భూమిని దున్నుతూ ఉండగా మట్టిలోనే నాయనకు దొరికాను. ఆయన కప్పటికి సంతానం లేకపోవటం చేత నన్ను తన కుమార్తెగా భావించి, పెంచమని తన పెద్ద భార్య కిచ్చాడు. నాకు పెళ్ళియీడు వచ్చాక ఆయనకు పెద్ద విచారం పట్టుకున్నది. ఎంత ఆలోచించినా నాకు తగిన భర్త ఆయనకు దొరకలేదు. అప్పు డాయన నాకు స్వయంవరం చేద్దామని నిశ్చయించి, తన ఇంటనున్న గొప్ప విల్లును ఎక్కుపెట్టిన వాడికి నన్నిచ్చి పెళ్ళిచేయ నిర్ణయించాడు. ఎందుకంటే, దైవాంశ ఉన్నవారు తప్ప





మామూలు మనుష్యులు దానిని ఎత్తనైనా శక్తిలేని వారవుతారు. ఎందరో రాజులు స్వయంవరానికి వచ్చి, ధనుస్సును ఎత్త లేక దణ్ణంపెట్టి వెళ్ళిపోయారు. అంతలో విశ్వామిత్రమహాముని రామలక్ష్మణులతో సహా యజ్ఞం చూడవచ్చాడు. విశ్వామిత్రుడు కోరగా మా తండ్రి ఆ ధనుస్సును తెప్పించి వారికి చూపాడు. రాముడా ధనువును అవ లీలగా ఎత్తి, తాడు తగిలించి లాగేసరికి ధనుస్సు పెళపెళా నడిమికి విరిగిపోయింది. వెంటనే నా తండ్రి కన్యాదానం చెయ్యా టానికి జలకలశం తెప్పించాడు. కాని రాముడు తన తండ్రి అనుమతి లేకుండా నన్ను పెళ్ళాడనన్నాడు. తరవాత మా తండ్రి అయోధ్యకు కబురు చేసి దశ రథ మహారాజును రప్పించినాక మా కిద్దరికీ పెళ్ళి జరిగింది.''

ఈ కథ విని అనసూయ ఎంతో సంతో షించింది. ఆమె సీతను తన ఎదటనే అలంకరించుకోమని చెప్పి, తరవాత ఆమెను రాముడి వద్దకు పంపింది. రాముడు ఆమె అలంకరణలన్నీ చూసి, ''ఇవన్నీ ఎక్కడివి?'' అని అడిగితే అనసూయ ఇచ్చిన కానుకలని సీత చెప్పింది. రామ లక్ష్మణులు పరమానందం పొందారు.

సీతారామలక్ష్మణులు ఆ రాత్రి అత్రి మహాముని ఆశ్రమంలో గడిపి, మర్నాడు సూర్యోదయం వేళ అత్రిమహాముని వద్ద సెలవు తీసుకున్నారు.

''నాయనా, ఈ అరణ్యంలో నరభక్షకు లైన రాక్షసులు కూడా ఉన్నారు. మునులు ఫలాల కోసం అడవికి వెళ్ళి వచ్చేదారి చూపుతాను, ఆ దారినే వెళ్ళండి,'' అని అత్రి చెప్పాడు.

ఆయన చూపిన మార్గాన బయలుదేరి సీతారామలక్ష్మణులు భయంకరమైన దండ కారణ్యం ప్రవేశించారు.

[అయోధ్యాకాండ సమాప్తం]





# అరణ్యకాండ

రాముడు సీతా లక్ష్మణులతో సహ మహా భయంకరమైన దండకారణ్యం ప్రవేశించాడు. అరణ్యం అంచునే ఋష్యాశ్రమాలున్నాయి. ఆశ్రమాలుండే ప్రాంతం అందంగానూ, వాసయోగ్యంగానూ ఉన్నది.

అక్కడి ఋషులు సీతా రామలక్ష్మణులకు చక్కని ఆతిథ్య మిచ్చి, "రామా, రాజు దుష్ట శిక్షణ చేస్తాడు గనక ప్రజలకు తండ్రి వంటి వాడు. మేము నీ రాజ్యంలో ఉన్నాం. నీవు పట్టణములో ఉన్నా, అరణ్యంలో ఉన్నా మాకు రాజువే. అందుచేత నీవే మమ్మల్ని ఎల్లప్పుడూ రక్షిస్తూ ఉండాలి," అన్నారు.

రాముడు ఆ ఆశ్రమాలలో రాత్రి గడిపి ఉదయం కాగానే సీతా లక్ష్మణులతో సహా నిర్జనమైన భీకరారణ్యం ప్రవేశించాడు. ఈ భయంకరారణ్యంలో అందమన్నది లేదు. ఎటు చూసినా భయంకరమైన దృశ్యాలే. చెట్లు చీకాకుగా ఉన్నాయి. నీటి మడుగులు అసహ్యం పుట్టిస్తున్నాయి. సమస్త భీకర జంతువులూ ఆ అరణ్యంలో తిరుగాడుతున్నాయి.

దారిలేని ఆ అరణ్యంలో పడి వారు పోతూండగా వారి కొక రాక్షసుడు ఎదురయాడు. వాడు చాలా ఎత్తుగా ఉన్నాడు. పెద్ద నోరు; పెద్ద పొట్ట; చూస్తేనే రోత పుట్టే ఆకారం! వాడి చేతిలో ఒక పెద్ద శూలం ఉన్నది. దానికి సింహాలూ, పులులూ, తోడేళ్ళూ, జింకలూ, ఒక ఏనుగు తలా గుచ్చి ఉన్నాయి. ఆ రాక్షసుడు సీతా రామ







లక్ష్మణులను చూస్తూనే యముడిలాగా మీదికి వచ్చి, సీతను అవలీలగా ఎత్తి చంకన పెట్టుకుని, "మీరు ఆయువు తీరి ఈ అరణ్యంలోకి వచ్చినట్టున్నారు. మీరు చూస్తే ఋషి వేషాలు ధరించారు, మరి మీ వెంట ఈ ఆడది ఎందుకున్నది? నేను దీన్ని పెళ్ళాడేస్తాను. ఋషులను తినటం నాకు అలవాటే, అందు చేత మిమ్మల్ని చంపి మీ రక్తం తాగేస్తాను," అన్నాడు.

రాక్షసుడి చంకలో చిక్కి గిలగిలా కొట్టుకుంటున్న సీతను చూడగానే రాముడికి దుఃఖంతో నోరార్చుకు పోయింది. అతను లక్ష్మణుడితో, "ఏ ఉద్దేశంతో కైకేయి నన్ను అడవికి పంపిందో ఆ ఉద్దేశం కొంచెం కొంచెమే నెరవేరుతున్నది. లక్ష్మణా, తండ్రి చనిపోయినా, రాజ్యం పోయినా కలగని బాధ వీడు సీతను తాకటం చేత కలుగుతున్నది!" అన్నాడు కన్నీరు కార్చుతూ.

రాముడి దుఃఖం చూసి లక్ష్మణుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. "నేను పక్కన ఉండగానే అలా విచారిస్తావేమిటి? ఒక్క బాణంతో నేను వీడి ప్రాణాలు తీస్తాను," అని అతను రాముడితో అని రాక్షసుడితో వెటకారంగా, "నాయనా, ఈ అరణ్యంలో సుఖంగా తిరిగే నువ్వెవడవు?" అన్నాడు.

"అడిగేవాణ్ణి నేను, చెప్పేది మీరు! ఇటుకేసి ఎక్కడికి పోతున్నారు?" అన్నాడు రాక్షసుడు.

"మేము క్షత్రియులం. సదాచారం గల వాళ్ళం. అరణ్యవాసం చేస్తున్నాం. నీ సంగతి చెప్పు," అన్నాడు రాముడు.

"నా సంగతి చెబుతా విను. నా తండ్రి జయుడు, తల్లి శతహ్రద. నా పేరు విరాధుడు. బ్రహ్మను గురించి పెద్ద తపస్సు చేసి నేను ఏ ఆయుధంతోకూడా చావకుండా వరం పొందాను. అందుచేత మీరీ ఆడదాని మీద ఆశ వదులుకుని, పారిపోయి







ప్రాణాలు రక్షించుకోండి. మీ ప్రాణాలు తీస్తే నా కేం లాభం?" అన్నాడు రాక్షసుడు.

రాముడి కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. "నీచుడా, పర స్త్రీహరణం చేస్తావా? నీకు కాలం మూడింది," అంటూ అతను విల్లు ఎక్కుపెట్టి ఏడు కరుకైన బాణాలు రాక్షసుడి శరీరంలో దిగిపోయేటట్టు కొట్టాడు.

విరాధుడు ఎగతాళిగా నవ్వుతూ సీతను కింద దించి, ఒక్కసారి ఒళ్ళు విరుచుకునే సరికి ఏడు బాణాలూ వాడి శరీరం నుంచి బయటికి వచ్చి, కింద పడిపోయాయి. వాడు కోపంతో శూలం ఎత్తి రామలక్ష్మణుల పైకి వచ్చాడు.



రాముడు రెండు బాణాలతో వాడి శూలాన్ని ముక్కలు చేశాడు.

కాని విరాధుడు లక్ష్య పెట్టక వారిని పట్టుకోపటానికి యత్నించాడు. రామలక్ష్మణులు కత్తులు దూసి వాణ్ణి ఎన్నో పోట్లు పొడిచారు. ఆ పోట్లనుకూడా లక్ష్య పెట్టక వాడు ఆ ఇద్దరినీ అవలీలగా చెరొక భుజం మీదికీ ఎత్తుకుని అరణ్యానికి అడ్డం పడి నడవసాగాడు.

"వీడిలా మనని ఎక్కడికి తీసుకు పోతాడో చూద్దాం," అని రాముడు లక్ష్మణుడితో అన్నాడు.

కాని సీత మాత్రం వాడి చేతులు పట్టుకుని, గట్టిగా ఏడుస్తూ, "అయ్యో, ఈ రాక్షసుడు రామలక్ష్మణులను ఎత్తుకుపోతున్నాడు. నన్ను తోడేళ్ళో పెద్దపులులో మింగేస్తాయి!...ఓ రాక్షసుడా, నీకు దణ్ణం పెడతాను. వారిని వదిలేసి నన్ను తీసుకుపో!" అన్నది.

సీత చేసిన ఆర్తనాదం వినగానే రామలక్ష్మణులు కూడ బలుక్కుని, తమ చేతులలో ఉన్న కత్తులతో విరాధుడి భుజాలు రెండూ నరికేశారు. వాడు కాస్తా పర్వతం కూలినట్టు కూలాడు. అలా కింద పడిన ఆ రాక్షసుణ్ణి రామలక్ష్మణులు పిడికిళ్ళ









తోనూ, మోకాళ్ళతోనూ కుమ్మి మున్నంలోకి ఎముక లేకుండా చితక బొడిచారు. అప్పటికీ వాడి ప్రాణం పోలేదు.

విరాధుడు కదలకుండా వాడి కంఠంపైన కాలువేసి బలంగా తొక్కి పట్టి, రాముడు, "లక్ష్మణా, వీణ్ణి ఇలాగే పూడ్చేద్దాం. ఒక పెద్ద గొయ్యి తవ్వు," అన్నాడు. లక్ష్మణుడు వాడి పక్కనే గొయ్యి తవ్వాడు. రామలక్ష్మణులు వాణ్ణి ఆ గోతిలోకి బలాత్కారంగా తోసేశారు. గోతిలో పడిపోతూ వాడు పెట్టిన పెడబొబ్బకు అరణ్యమంతా దద్దరిల్లింది. తరవాత రామలక్ష్మణులు గుంటను రాళ్ళతో పూడ్చేశారు.



రాముడు సీతను కౌగలించుకుని, ధైర్యం చెప్పి, లక్ష్మణుడితో, "మనం ఇలాటి అరణ్యానికి అలవాటుపడిన వాళ్ళం కాదు. అందుచేత ఇక్కడ ఉండటం మంచిది కాదు. త్వరగా శరభంగ మహాముని ఆశ్రమానికి పోదాం," అన్నాడు.

వారు శరభంగ మహాముని ఆశ్రమాన్ని చేరవస్తూ ఉండగా రాముడి కొక వింత దృశ్యం కనిపించింది. భూమికి ఎత్తుగా ఒక కాంతివంతమైన రథం కనిపించింది. దానికి ఆకు పచ్చని గుర్రాలు కట్టి ఉన్నాయి. సూర్యుడులాగా వెలిగి పోతున్న ఒక మహాపురుషుడు, కాంతివంతమైన ఆభరణాలూ, స్వచ్ఛమైన బట్టలూ ధరించి, నేలను అంటకుండా ఆశ్రమంకేసి పోవటం కనిపించింది. ఆయన వెంట ఆయనలాటి వాళ్ళే అనేక మంది పరివారంగా ఉన్నారు. అందరూ పాతికేళ్ళ వయస్సుగల వాళ్ళే.

రాముడు లక్ష్మణుడికి ఈ దృశ్యం చూపించి, "లక్ష్మణా, అది దేవేంద్రుడులాగుంది. నేను వెళ్ళి తెలుసుకువస్తాను. నీవూ, సీతా ఇక్కడే ఉండండి," అంటూ శరభంగాశ్రమం కేసి బయలుదేరాడు.

ఆ వచ్చినది నిజంగా దేవేంద్రుడే. శరభంగ మహామునిని బ్రహ్మలోకానికి తీసుకు








వెళ్ళటానికి స్వయంగా తన రథంలో వచ్చాడు. రాముడు తన కోసం వస్తున్నాడని గ్రహించి ఇంద్రుడు శరభంగుడితో, "రాముడు నన్ను కలుసుకోవటానికి వస్తున్నాడు. అతనివల్ల ఒక మహాకార్యం జరగాలి. అది ముగిసినదాకా అతనికి కనపడటం నా కిష్టం లేదు," అని చెప్పి తన రథ మెక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

తన ప్రయత్నం విఫలంకాగా రాముడు సీతా లక్ష్మణులను కలుపుకుని శరభంగుడి వద్దకు వచ్చి నమస్కరించాడు. అప్పటికే శరభంగుడు అగ్ని ప్రవేశం చెయ్యటానికి ఏర్పాట్లన్నీ చేసుకుని ఉన్నాడు.



రాముడు దేవేంద్రుణ్ణి గురించి అడగగా ఆయన, "అవును, నేను తపశ్శక్తి చేత బ్రహ్మలోకం సాధించుకున్నాను. నన్ను తీసుకు పోవాలని ఇంద్రుడు వచ్చాడు. నీవు నా కోసం వస్తున్నావని తెలిసి, నిన్ను చూసి మరీ పోదామనుకున్నాను. నేను సాధించిన బ్రహ్మలోక, స్వర్గలోకాలను నీకు దానం చేస్తాను, పుచ్చుకో," అన్నాడు.

"స్వామీ, నాకు కావలిసిన లోకాలను నేనే సంపాదించుకుంటాను. ప్రస్తుతం ఈ అరణ్యంలో నాకు వాసయోగ్యమైన చోటేదో చెప్పండి," అన్నాడు రాముడు.

"ఈ యేటి వెంబడే పోతే సుతీక్ష్ణ మహాముని ఆశ్రమం వస్తుంది. ఆయన నీకు తగిన చోటు చూపించ గలుగుతాడు. పాము కుబుసాన్ని విడిచినట్టు నేనీ దేహాన్ని విడవటం చూసి మరీ వెళ్ళండి," అంటూ శరభంగ మహాముని అగ్నిలో అజ్యం పోసి అందులో ప్రవేశించాడు. ఆయన శరీరం అస్థికలతో సహా దగ్ధమయాక, ఆయన ఇరవై అయిదేళ్ళ ప్రాయంగల దివ్య శరీరంతో అగ్ని నుంచి వెలువడటం చూసి సీతా రామలక్ష్మణులు నివ్వెర పోయారు.

శరభంగుడు దేహం చాలించగానే ఆశ్రమంలోని మునులందరూ రాముడి











వద్దకు వచ్చి, "రామా, పంపాతీరంలోనూ, చిత్రకూటంలోనూ, మందాకినీ తీరంలోనూ ఉండే ఋషులను రాక్షసులు చెప్పరాని హింసలు పెడుతున్నారు. వాళ్ళచేత చచ్చి పోయిన మునుల శరీరాలు ఎలా పడి ఉన్నాయో చూడు. క్రూరులైన - ఈ రాక్షసుల బారి నుంచి ఋషులను నీవే కాపాడాలి," అన్నారు.

"నేను అరణ్యవాసం రావటంలో తండ్రి ఆజ్ఞను పాలించే మేలు ఒకటే అనుకున్నాను. ఇప్పుడు నాకు మీ మూలంగా మరొక మేలు కూడా చేకూరుతుందన్న మాట. నేను తప్పక రాక్షసుల బారి నుండి మునులను కాపాడతాను," అని రాముడన్నాడు.

రాముడు సుతీక్షుడి ఆశ్రమానికి బయలు దేరుతుంటే వైఖానసుడు మొదలైనవారు అతని వెంట కదిలారు. వారందరూ కొన్ని నదులను దాటి, ఒక పర్వతం పక్కగా నున్న అరణ్యం ప్రవేశించారు. ఆ అరణ్యం లోనే సుతీక్ష మహాముని ఆశ్రమం ఉన్నది.

రాముడు తన పేరు చెప్పుకుని నమస్కారం చెయ్యగానే సుతీక్షు డతన్ని గుచ్చి కౌగలించుకుని, "రామా, నీవు చిత్రకూటం చేరినప్పటి నుంచీ నీ వార్తలు వింటూనే ఉన్నాను. నేను చాలా తపస్సు చేశాను. అదంతా నీ కిస్తాను, సీతా లక్ష్మణులతో అన్ని లోకాలూ అనుభవించు," అన్నాడు.

"స్వామీ, లోకాలన్నీ నేనే సంపాదించు కుంటాను. నా కీ అరణ్యంలో నివాసయోగ్య మైన స్థానం ఉంటే చెప్పండి చాలు," అన్నాడు రాముడు.

"కావాలంటే ఈ ఆశ్రమంలోనే ఉండ వచ్చు. ఇక్కడ మృగ బాధ తప్ప మరే బాధా లేదు," అని సుతీక్షుడు చెప్పాడు.

"నేను పొరపాటున ఆశ్రమ మృగాలను చంపినట్టయితే మీకు కోపం రావచ్చు. అందుచేత ఈ ఆశ్రమం నాకు వద్దు," అన్నాడు రాముడు.






సీతారామ లక్ష్మణులు ఆ రాత్రి అక్కడే సుఖంగా గడిపారు. మర్నాడు ఉదయం కాల కృత్యాలు ముగించి సుతీక్ష్ణుడితో, "స్వామీ, నా వెంట వచ్చిన మునులు తొందర చేస్తున్నారు. మాకు సెల విప్పించండి," అన్నాడు.

సీత రామలక్ష్మణుల ఆయుధాలు తెచ్చి ఇచ్చింది. దారిలో సీత రాముడితో, "ప్రపంచంలో మూడు మహా పాపాలు: అబద్ధం చెప్పటమూ, పర స్త్రీని కోరటమూ, అకారణ వైరమూనూ. అన్నిటిలోకీ అకారణ వైరం చాలా చెడ్డది. మొదటి రెండు పాపాలూ నిన్నంటలేవు, నాకు తెలుసు. కాని మనకు ఏ కీడూ చేయని రాక్షసులను నీ వెందుకు చంపాలి? వారిని చంపుతానని ఈ ఋషుల కెందుకు మాట ఇవ్వాలి? అసలు ఆయుధాలు వెంట ఉండటమే ఒక కీడు. పూర్వం ఒక ముని తపస్సు చేసుకుంటూ ఉంటే తపోభంగం కలిగించటానికి ఇంద్రుడు ఒక భటుడి రూపంలో వచ్చి తన కత్తిని భద్రంగా దాచి ఉంచమనీ, మళ్ళీ వచ్చి తీసుకుంటాననీ చెప్పాడట. ఆ ముని ఆ కత్తిని కాపాడటానికి వెంట ఉంచుకుని తిరుగుతూ, మొదట్లో పళ్ళూ ఫలాలూ కోశాడట. కాని రానురాను అతడి బుద్ధి హింసవైపు మళ్ళి, చివరకు చచ్చి నరకానికి వెళ్ళాడట. అందుచేత మనం కనీసం ఈ అరణ్యవాస కాలంలో నైనా ఆయుధాలు విసర్జించి తపస్సు చేసుకుందాం. తిరిగి అయోధ్యకు వెళ్ళాక క్షత్రియధర్మం పాటించవచ్చు. ఇది ఆదేశం కాదు, సూచన మాత్రమే," అన్నది.

రాముడు సీతతో, "ఆ మును లందరూ ప్రాధేయ పడితే వారి కోరికపై, రాక్షసులను చంపి వారి తపస్సు నిర్విఘ్నంగా కొనసాగిస్తానని మాట ఇచ్చాను. నిన్నూ, లక్ష్మణుణ్ణీ, నా ప్రాణాలనూ వదులుతాను గాని చేసిన ప్రతిజ్ఞ విడవను," అన్నాడు.





# అరణ్యకాండ

ముందు రాముడూ, వెనక సీతా, సీత వెనకగా అస్త్రాలు చేపట్టి లక్ష్మణుడూ నడుస్తూ మునులను వెంటబెట్టుకుని అనేక పర్వతాలూ, నదులూ, సరస్సులూ, కొలనులూ, పక్షుల సమూహాలూ, ఏనుగుల మందలూ, ఎనుబోతుల మందలూ, అడవి పందుల మందలూ చూశారు.

సూర్యాస్తమయ సమయానికి వారు ఒక అందమైన సరస్సు చేరుకున్నారు. సరస్సు అడుగు నుంచి చక్కని గీతవాద్య ధ్వనులు రావటం చూసి రామ లక్ష్మణులు ఆనందాశ్చర్యాలు పొంది, ధర్మభృత్తనే మునిని, "ఏమిటీ వింత? రహస్యం కాని పక్షంలో చెప్పండి, విని ఆనందిస్తాము," అని అడిగారు.

వారికి ధర్మభృత్తు ఆ సరస్సు పుట్టు పూర్వోత్తరాలు తెలిపాడు. ఆ సరస్సు పేరు పంచాప్సరం. దీనిని మాండకర్ణి అనే మహాముని తన తపశ్శక్తి చేత నిర్మించాడు. ఆ మహాముని వాయు భక్షణచేస్తూ పదివేల సంవత్సరాలు అతి దారుణమైన తపస్సు చేసే సరికి, అగ్ని మొదలుగాగల దేవతలు భయపడి, ఆ ముని తమలో ఎవరిస్థానమో కాజేస్తాడని రూఢి చేసుకుని, తపో భంగం చెయ్యటం కోసం మెరుపు తీగల్లాటి అయిదుగురు అప్సరసలను ఏరి మాండకర్ణి వద్దకు పంపారు. వారి ఎత్తు పారింది. మాండకర్ణి వారి వ్యామోహంలో పడి, తన తపశ్శక్తి ధారపోసి ఈ సరస్సు సృష్టించి, తాను యౌవన దేహం ధరించి, నీటి అడుగున







అప్సరసల నిమిత్తం అదృశ్య హర్మ్యాలు నిర్మించి, వారిని భార్యలుగా చేసుకుని నృత్యగాన వినోదాలతో కాలక్షేపం చేస్తున్నాడు.

ధర్మభృత్తు చెప్పిన ఈ కథ వింటూ సీతా రామ లక్ష్మణులు ఆశ్రమ సమూహా లను చేరుకున్నారు. ఆశ్రమవాసులు రాముడికి గొప్పగా అతిథ్యం ఇచ్చారు. రాముడు తన భార్యతోనూ, తమ్ముడితోనూ ఒక్కొక్క ఆశ్రమంలోనూ తన ఇష్టానుసారం ఒక సంవత్సరమో, ఎనిమిది మాసాలో, ఆరు మాసాలో, మూడు మాసాలో ఉంటూ సుఖంగా పది సంవత్సరాలు గడిపాడు.

పది సంవత్సరాల అనంతరం రాముడు సీతా లక్ష్మణులతో తిరిగి సుతీక్ష్ణ మహా ముని ఆశ్రమానికి వచ్చాడు. అక్కడ ఉంటూ అతను ఒకనాడు మహామునితో, "ఈ మహారణ్యంలో ఎక్కడో అగస్త్యుల వారు ఉంటున్నారని వారూ వారూ అనగా విన్నాను. కాని స్పష్టంగా వారి ఆశ్రమం ఎక్కడ ఉన్నదీ చెప్పినవారు లేరు. మీరు తెలిపినట్టయితే మేము ముగ్గురమూ వెళ్ళి వారి దర్శనం చేసుకుంటాము. ఆయనకు శుశ్రూష చేయాలని నాకు చాలా కుతూహలంగా ఉన్నది," అన్నాడు.

ఈ మాట వినగానే సుతీక్ష్ణుడు, "నేను కూడా నీకు అదే సలహా ఇవ్వాలనుకుంటున్నాను. ఇంతలో నీవే అడిగావు. ఇక్కడికి దక్షిణంగా నాలుగామడలు పోతే అగస్త్యుడి తమ్ముడి ఆశ్రమం వస్తుంది. అక్కడికింకా ఒక ఆమడ దూరంలో అగస్త్యుడి ఆశ్రమం ఉన్నది. అవి చాలా అందమైన ఆశ్రమాలు. అక్కడ మీ ముగ్గురికీ చాలా ఆనందంగా ఉంటుంది. వెళ్ళాలని ఉంటే వెంటనే బయలుదేరండి," అన్నాడు.

రాముడాయనకు నమస్కారం చేసి సీతా లక్ష్మణులతో బయలుదేరి అగస్త్య మహాముని తమ్ముడి ఆశ్రమానికి చేరాడు.





అ సమయంలోనే రాముడు లక్ష్మణుడికి అగస్త్య మహిమ చెబుతూ వాతాపి ఇల్వలుల వృత్తాంతం చెప్పాడు.

ఇల్వలుడూ, వాతాపీ అని ఇద్దరు రాక్షసులుండేవారు. వారు ఎందరో బ్రాహ్మణులను మోసగించి చంపేశారు. ఇల్వలుడు బ్రాహ్మణ వేషం ధరించి, సంస్కృత భాషలో మాట్లాడుతూ బ్రాహ్మణుల వద్దకు వెళ్ళి, "అయ్యా, ఇవాళ మా ఇంట శ్రాద్ధం. తమరు భోక్తగా దయచెయ్యాలి," అని కోరేవాడు. నిజమే ననుకుని బ్రాహ్మణులు వచ్చేవారు. ఈ లోపుగా వాతాపి మేకరూపం ధరించేవాడు. ఇల్వలు డా మేకను కోసి బ్రాహ్మణులకు పెట్టేవాడు. బ్రాహ్మణులా మేకను పూర్తిగా తిన్నాక ఇల్వలుడు, "వాతాపీ, ఇక వచ్చెయ్యి," అనేవాడు. అప్పుడు వాతాపి మేకలాగా అరుచుకుంటూ ఆ బ్రాహ్మణుల పొట్టలు చీల్చుకుని వచ్చేవాడు.

ఈ విధంగా వారు అనేక వేల బ్రాహ్మణులను చంపిన మీదట ఇల్వలుడికి అగస్త్య మహాముని తటస్థపడ్డాడు. ఇల్వలుడి కోరికపై ఆయన భోజనానికి వచ్చి అతడు పెట్టిన మేక మాంసం తిన్నాడు. ఆయన తృప్తిగా భోజనం చేశానన్న అనంతరం



ఇల్వలు డాయనకు హస్తోదకం ఇచ్చి, "ఇక రా వాతాపీ!" అని కేకపెట్టాడు.

అగస్త్యుడు నవ్వుతూ, "ఇంకెక్కడి వాతాపి? వా డప్పుడే జీర్ణమై, యముడి ఇంటికి చేరుకున్నాడు!" అన్నాడు. ఇల్వలుడు తన తమ్ముడు చచ్చాడని తెలిసి మండిపడి అగస్త్యుడి పైకి లేచి ఆయన చూపుల వేడికే బూడిద అయిపోయాడు.

రాముడీ కథ చెప్పి లక్ష్మణుడితో, "అంత శక్తిమంతుడైన అగస్త్యులవారి తమ్ముడి ఆశ్రమం ఇది," అన్నాడు. అప్పటికే సూర్యాస్తమయ మయింది. అగస్త్యుడి తమ్ముడు సీతారామ లక్ష్మణులకు అతిథ్యం







ఇచ్చాడు. వారా రాత్రి అక్కడే గడిపి, మర్నాడు ఉదయం ఆయన వద్ద సెలవు పుచ్చుకుని అగస్త్యాశ్రమానికి బయలు దేరారు. దారిలో వారికి ఏనుగులు విరిచేసిన చెట్లు కనబడ్డాయి, మనోహరంగా పక్షులు పాడే పాటలు వినపడ్డాయి. అగస్త్యాశ్రమం పరిసరాలు అరణ్యంలాగా లేక ప్రశాంతంగానూ, అందంగానూ ఉండటం రామ లక్ష్మణులు గమనించారు.

రాముడు లక్ష్మణుడితో, "అగస్త్యుడు మహిమాన్వితుడు. సూర్యుడి మార్గానికి అడ్డంగా పెరుగుతూ వచ్చిన వింధ్య పర్వతాలను నిగ్రహించాడు. ఆయన దక్షిణ దేశానికి వచ్చి స్థిరపడినాక, దక్షిణానికి అగస్త్యుడి దిక్కనే పేరు వచ్చింది. ఆయన ఆశ్రమం అతి పవిత్రమైనది; అందులో క్రూరులూ, వంచకులూ, పాపులూ నివసించలేరు. అలాటి చోటికి చేరుకున్నాం. లక్ష్మణా, నీవు ముందు వెళ్ళి, నేనూ సీతా వస్తున్నామని అగస్త్యులవారితో చెప్పు," అన్నాడు.

లక్ష్మణుడు ఆశ్రమం ప్రవేశించి, అగస్త్యుడి శిష్యులలో ఒకణ్ణి పట్టుకుని, "నేను దశరథమహారాజు కొడుకును, లక్ష్మణుడనే వాణ్ణి. నేనూ, మా అన్న అయిన రాముడూ, ఆయన భార్య అయిన సీతా అగస్త్యులవారి దర్శనార్థం వచ్చాం. కనుక వారితో ఈ సంగతి చెప్పు," అన్నాడు.

అగ్నిహోత్ర గృహంలో ఉన్న అగస్త్యుడికి శిష్యుడీ వార్త చెప్పాడు. వెంటనే అగస్త్యుడు, "వారు వస్తారని అనుకుంటూనే ఉన్నాను. వారు ఆశ్రమంలోకి రాదగినవారే; నీవు అప్పుడే తీసుకురావలిసింది. వెంటనే వెళ్ళి వారిని లోపలికి తీసుకురా," అన్నాడు. శిష్యుడు గబగబా వచ్చి లక్ష్మణుడితో, "ఆ సీతారాములెక్కడ ఉన్నారు? వెంటనే రమ్మనండి," అన్నాడు.

ఇద్దరూ కలిసి ఆశ్రమ ద్వారం వద్దకు వెళ్ళారు. శిష్యుడు అతి వినయంగా సీతా





రాములకు స్వాగతం చెప్పి లోపలికి తీసుకు వచ్చాడు. అగస్త్యుడు సూర్య తేజస్సుతో వెలిగిపోతూ శిష్యులతో సహా ఎదురు వచ్చాడు. అగస్త్యుణ్ణి రాముడు ఆ తేజస్సు చేతనే గుర్తించాడు. సీతారామ లక్ష్మణు లాయన కాళ్ళకు వందనం చేసి, చేతులు మోడ్చి నిలబడ్డారు.

అగస్త్యుడు వారిని అతిథులుగా స్వీక రించి, ఆసనాలూ, అర్ఘ్యపాద్యాలూ యిచ్చి, కందమూల ఫలభోజనం వారికి పెట్టాడు.

అగస్త్యుడి వద్ద ఒక అపూర్వమైన ధను వున్నది. అది విష్ణువుది; బంగారు నగిషీలు కలిగి, రత్నాలు పొదిగినది. దానిని విశ్వ కర్మ తయారుచేశాడు. బ్రహ్మదేవు డిచ్చిన ఒక అపూర్వమైన బాణమూ, ఇంద్రు డిచ్చిన రెండు అక్షయబాణ తూణీరాలూ, బంగారు ఒరగల ఒక ఖడ్గమూ ఉన్నాయి. వీటి నన్నిటినీ అగస్త్య మహాముని రాముడికి కానుకగా ఇచ్చేశాడు.

తరవాత ఆయన రాముడితో, "నాయనా, నాకు నమస్కారం చెయ్యటానికి మీరు ఇంత దూరం వచ్చారు, చాలా సంతోషం. మీరంతా బడలి ఉంటారు. అతి సుకుమారి, కష్ట సమయంలోకూడా భర్తను విడవని మహా పతివ్రత, సీత మరింత అలసి



ఉంటుంది. కనుక మీరంతా విశ్రాంతి తీసుకోండి," అన్నాడు.

"నా అరణ్యవాస దీక్ష పూర్తి అయేదాకా మేము ఆశ్రమం నిర్మించుకుని నివసించ టానికి యోగ్యమైన స్థలం ఉంటే చెప్పండి," అని రాముడు అగస్త్యుణ్ణి అడిగాడు.

"ఇక్కడికి రెండామడల దూరంలో పంచవటి ఉన్నది. నీరూ, దుంపలూ సమృద్ధిగా ఉన్నాయి. లేళ్ళుకూడా జాస్తి. అక్కడ నీవు ఆశ్రమం ఏర్పరచుకోవచ్చు. నీ వనవాసం చాలాభాగం అయేపోయింది. ఆ మిగిలినది కాస్తా పూర్తి కాగానే తిరిగి అయోధ్యకు వెళ్ళి సుఖంగా రాజ్యం చేసు







కుంటావు. కావలిస్తే నీవు నా ఆశ్రమంలోనే ఉండవచ్చు. కాని నీకు వేరే ఆశ్రమంలో ఉండాలని ఉన్నట్టున్నది. అందుచేత పంచవటి పేరు చెప్పాను. అది చాలా అందమైన చోటు, సీతకు చాలా బాగుంటుంది. అదుగో, ఆ కనిపించే ఇప్ప చెట్ల సమూహానికి ఉత్తరంగా వెళితే ఒక మర్రిచెట్టు వస్తుంది. దాన్ని దాటి మరి కొంతదూరం పోతే ఒక ఎత్తు ప్రదేశం వస్తుంది. ఆ మిట్ట ఎక్కి చూస్తే ఒక పర్వతమూ, దాని పక్కన గోదావరీనదీ, దాని ఒడ్డున పంచవటీ కనిపిస్తాయి," అని అగస్త్యుడు చెప్పాడు.



సీతారామ లక్ష్మణులు అగస్త్యుడికి నమస్కరించి ఆయన అనుజ్ఞ పొంది ఆయన చెప్పినదారినే పంచవటికి బయలు దేరారు. దారి మధ్యలో వారికొక బ్రహ్మాండమైన గద్ద కనబడింది. దాన్ని చూసి రామ లక్ష్మణులు ఎవరో రాక్షసుడనుకుని, "ఎవరు నీవు?" అని ప్రశ్నించారు. ఆ గద్ద వారితో చాలా మంచిగా, "నాయనలారా, నేను మీ తండ్రి దశరథ మహారాజు స్నేహితుణ్ణి. నా కులగోత్రాలు చెబుతాను. దక్షప్రజాపతికి అరవైమంది కూతుళ్ళు. వారిలో ఎనిమిది మందిని కశ్యపుడు పెళ్ళాడాడు. వారిలో తామ్ర అనే ఆమె అయిదుగురు ఆడ పిల్లలను కన్నది. వారిలో ఒకతె శుకి. శుకి కూతురు నత. నత కూతురు వినత. వినతకు గరుడుడూ, అరుణుడూ అని ఇద్దరు కుమారులు. అరుణుడు మా తండ్రి, శ్యేని మా తల్లి. నాకు సంపాతి అని అన్న ఉన్నాడు. నా పేరు జటాయువు. ఇది చాలా భయంకరమైన అరణ్యం. ఎన్నో క్రూరమృగాలు, ఎందరో రాక్షసులు. అందుచేత మీ కభ్యంతరం లేకపోతే మీ వెంట ఉండి మీరిద్దరూ ఎక్కైనా వెళ్ళినప్పటికీ సీతకు నేను అండగా ఉంటాను," అన్నది.







జటాయువు వృత్తాంతం విని రాముడు చాలా సంతోషించి అతణ్ణి కౌగలించుకుని, తన తండ్రిని గురించి కబుర్లాడుతూ, సీతా లక్ష్మణ జటాయువులతో సహ పంచవటి చేరుకున్నాడు.

పంచవటి విషసర్పాలతోనూ, క్రూర మృగాలతోనూ, బాగా పూచిన చెట్లతోనూ నిండి ఉన్నది.

"లక్ష్మణా, ఇదే పంచవటి. నీకూ, నాకూ, సీతకూ సుఖంగానూ, నీటికీ, ఇసక దిబ్బలకూ, దర్భలు మొదలైన వాటికీ దగ్గిర గానూ ఉండే చోటు చూసి పర్ణశాల నిర్మించు," అన్నాడు రాముడు.

"అన్నా, నీవే అలాటి చోటు చూసి, పర్ణశాల నిర్మించమని ఆజ్ఞ ఇయ్యి, నీ ఆజ్ఞ నిర్వర్తిస్తాను." అన్నాడు లక్ష్మణుడు.

రాముడు ఒక సమప్రదేశం చూసి అక్కడ పర్ణశాల నిర్మించమని లక్ష్మణుడికి చెప్పాడు. ఆ ప్రదేశం గోదావరికి సమీపంగా ఉన్నది. లక్ష్మణుడు మట్టి తవ్వి గోడలు పెట్టాడు; వెదురు స్తంభాలు బలమైనవి నిలబెట్టి, వాటిపైన జమ్మికొమ్మలు పరిచి, తాళ్ళతో గట్టిగా కట్టి, వాటిపైన రెల్లుతోనూ, దర్భలతోనూ మంచి కప్పు వేశాడు; పర్ణశాల అందంగా కుదిరింది. లక్ష్మణుడు పర్ణశాల లోపలి నేల అంతా చక్కగా చదునుచేశాడు.

రాముడు గోదావరికి వెళ్ళి, స్నానం చేసి పద్మాలూ, ఫలాలు తెచ్చాడు. లక్ష్మణుడు పర్ణశాలకు పుష్పబలి చేసి శాంతి జరిపాడు.

ఇంతపనీ చేసినందుకు రాముడు లక్ష్మణుణ్ణి అప్యాయంగా కౌగలించుకుని, "లక్ష్మణా, నీవు నన్ను ఇలా కనిపెట్టి ఉంటే నాకు మన తండ్రి జీవించి ఉన్నట్టే ఉన్నది," అన్నాడు.

ఆ పర్ణశాలలో సీతారామలక్ష్మణులు సుఖంగా నివసించారు.





# అరణ్యకాండ

పంచవటిలో ఆశ్రమం కల్పించుకుని తమ పర్ణశాలలో సీతా రామ లక్ష్మణులు సుఖంగా ఉంటున్నారు. హేమంత ఋతువు వచ్చింది. ఒకనాటి తెల్లవారుఝామున వారు ముగ్గురూ స్నానం చెయ్యటానికి గోదావరి వద్దకు పోతూ ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెప్పు కోవటంలో లక్ష్మణుడు భరతుణ్ణి మెచ్చుకుని, అటువంటి వాడికి తల్లి అయికూడా దుర్మార్గురాలయినందుకు కైకేయిని నిందించాడు. రాముడు అడ్డం వచ్చి, "కైకేయిని తిట్టటం మానేసి భరతుణ్ణి గురించే మాట్లాడు," అన్నాడు. తాను భరత లక్ష్మణ శత్రుఘ్నులతోనూ సీతతోనూ కలిసి ఎప్పుడు రాజ్యం చేస్తానో గదా అని రాముడు విచారించాడు.

వారు ముగ్గురూ గోదావరిలో స్నానాలు చేసి, ఆశ్రమానికి తిరిగి వచ్చి, ఉదయం చేయవలసిన కర్మకాండ అంతా ముగించుకుని పర్ణశాలలో కూచుని ఉండగా అటుగా ఒక రాక్షస స్త్రీ వచ్చింది. ఆమె రావణుడి చెల్లెలైన శూర్పణఖ. దాని ముఖం వికారం. దాని కొక పెద్ద పొట్టా, ఎర్రని జుట్టూ, భయంకరమైన గొంతూ ఉన్నాయి. వయను మళ్ళినది. ఆ అనాకారి రాముణ్ణి చూస్తూనే మోహించింది. ఆమె రాముణ్ణి పలకరిస్తూ, "వేషం చూడబోతే మునివి. వెంట ఆయుధాలున్నాయి, భార్య ఉన్నది. నీవు మా రాక్షసుల దేశాని కెలా వచ్చావు?" అన్నది.

రాముడు మంచిగా ఆమెకు తన వాస్తవ వృత్తాంతం చెప్పాడు. సీత సంగతి కూడా











చెప్పి అతను, "ఇంతకూ నీ వెవరు? ఎవరి కుమార్తెవు?" అని అడిగాడు.

"నా పేరు శూర్పణఖ. కామరూపినిని. ఒంటరిగా అరణ్యమంతా తిరుగుతూ ఉంటాను. నీవు రావణుడి పేరు వినే ఉంటావు. గొప్ప బలపరాక్రమాలు గలవాడు; విశ్వవసుడి కుమారుడు; రాక్షసరాజు. అతడు నా అన్న. ఎప్పుడూ నిద్రపోయే కుంభకర్ణుడు కూడా నా సోదరుడే. విభీషణుడు నా సోదరుడే గాని, అతడికి రాక్షస లక్షణాలు లేవు. మహా పరాక్రమవంతులు ఖర దూషణులు నా సోదరులు. నిన్ను చూస్తుంటే ఈ నా వా రందరినీ వదిలేసి నీకు భార్యగా ఉండిపోవా లనిపిస్తున్నది. నేను శక్తిగల దాన్ని. ఈ సీతను విడిచిపెట్టి నన్ను కట్టుకో. ఈమె వికారంగా ఉంది; కురూపి; నీకు తగదు. మనిద్దరికీ ఈడూ జోడూగా ఉంటుంది. మనం హాయిగా ఈ దండకారణ్యమంతా విహరించుదాం," అన్నది శూర్పణఖ.

రాముడు శూర్పణఖతో, "నా కొక భార్య ఉండనే ఉన్నది. నా భార్య అంటే నాకు చాలా ఇష్టంకూడానూ. నీవు చూడబోతే గొప్ప వంశానికి చెందినదానివి. నీకు సవతి ఉండటం ఉచితం కాదు. ఇతను, చూడు, నా తమ్ముడు. అందగాడు, పరాక్రమవంతుడు; భార్యను వెంటపెట్టుకు రాకుండా వచ్చి, బ్రహ్మచారిగా ఉంటున్నాడు. ఇతన్ని కట్టుకున్నావంటే నీకు సవతి పోరు తప్పుతుంది," అన్నాడు.

శూర్పణఖ వెంటనే రాముణ్ణి వదిలి లక్ష్మణుడి వద్దకు వెళ్ళి, తనను భార్యగా చేసుకోమన్నది.

లక్ష్మణుడు నవ్వుతూ, "అయ్యో, ఎంతో సుకుమారివి. నేనే సేవకుడిలాగా జీవిస్తున్నాను. నన్ను పెళ్ళాడితే నీవు కూడా దాసీదానివై పోతావు. నా యజమాని రాముడు. అతనికే రెండవ భార్యవుగా







ఉండటం మంచిది. నీ వంటి సుందరాంగిని పెళ్ళాడినాక రాముడు తన మొదటి భార్యను వదిలేస్తాడు. ఎందుకంటే, ఆమె వికారంగా ఉంటుంది, అంతేకాక ముసలిది," అన్నాడు.

రామ లక్ష్మణులు తనను వేళాకోళం పట్టిస్తున్నారని శూర్పణఖ గ్రహించలేక పోయింది. ఆమె రాముడి దగ్గిరికి పోయి, "ఈ ముసలి కురూపిని కట్టుకుని నా అందాన్ని కాలదన్నుతున్నావు. దీన్నిప్పుడే తినేస్తాను. ఆ తరవాత సవతి బెడద లేకుండా మనిద్దరమూ సుఖంగా ఉండవచ్చు," అని చెప్పి సీత మీదికి వెళ్ళింది. సీత భయపడి పరిగెత్తితే శూర్పణఖ ఆమె వెంట పడింది.

రాముడు లక్ష్మణుడితో, "దుష్టులతో పరిహాసం ఎంత చెడ్డదో చూశావా? సీతకు అపాయం రాకుండా చూడు. ఈ శూర్పణఖను అంగహీనగా చెయ్యి," అన్నాడు. లక్ష్మణుడు రాముడి పక్కనే ఉన్న కత్తి తీసుకుని శూర్పణఖ ముక్కూ, చెవులూ కోసేశాడు.

శూర్పణఖ బాధతో పెద్దపెట్టున అరిచి, తాను వచ్చిన దారినే మహారణ్యంలో పడి పారి పోయింది.



జనస్థానంలో ఖరుడు అనేకమంది ఇతర రాకసులతో సహా కూచుని ఉన్న చోటికి, రక్తం కారుతూ శూర్పణఖ వచ్చి చేరి నేల మీద పడిపోయింది. నెత్తురు వరదలు కారుతూ వికార రూపంలో తన చెంత వచ్చి పడిన శూర్పణఖను చూసి ఖరుడు, "నన్ను చూసి మూడు లోకాలవారూ భయపడతారు గదా, నిన్నీ విధంగా చేసి తన ప్రాణాల మీదికి తెచ్చుకున్న వాడెవడు?" అని అడిగాడు.

శూర్పణఖ అతనితో సీతా రామ లక్ష్మణులను గురించీ, వారు తనకు చేసిన పరాభవం గురించీ చెప్పి, "నీవు వారి







ముగ్గురినీ చంపి వారి రక్తం తెప్పిస్తే తాగేస్తాను. ఇదే నా కోరిక," అన్నది.

ఖరుడు తన అనుచరులలో పధ్నాలుగు మందిని ఏరి, "మీరు వెళ్ళి, శూర్పణఖ చెప్పే ముగ్గురినీ చంపి, వాళ్ళ రక్తం శూర్పణఖ కివ్వండి," అని ఆజ్ఞాపించాడు. వారు పధ్నాలుగురూ శూర్పణఖను వెంట బెట్టుకుని రాముడి పర్ణశాలకు వచ్చారు. శూర్పణఖ సీతా రామ లక్ష్మణులను వారికి చూపి, "ఆ ముగ్గుర్నీ వెంటనే చంపెయ్యండి," అన్నది.

వారంతా ఆయుధాలతో సహా రావటం గమనించి రాముడు, లక్ష్మణుడితో, "వీళ్ళ సంగతి నేను చూస్తాను. నీవు సీత వెంట ఉండు," అని చెప్పి, రాక్షసుల కెదురు వెళ్ళి, "మీరంతా ఏమని నా మీదికి దండెత్తి వచ్చారు? ఇక్కడి మునులను రాక్షస బాధ నుండి కాపాడతానని మాట ఇచ్చి ఈ ధనుర్బాణాలు వెంట పెట్టుకుని ఉన్నాను. నా చేతిలో చావాలని లేనట్టయితే వెంటనే పారిపొండి," అని చెప్పాడు.

రాక్షసులా మాటలు విని మండిపడి, "నీవు మా దొర అయిన ఖరుడికి కోపం తెప్పించావు. నిన్ను చంపి పోవటానికే వచ్చాం. మేము చాలా మందిమి; నీవు ఒక్కడివి. అందుచేత నీకు చావు తప్పదు," అంటూ పధ్నాలుగు మందీ తమ చేతుల్లో ఉన్న శూలాలు రాముడి పైన విసిరారు. రాముడు పధ్నాలుగు బాణాలతో ఆ శూలాలన్నిటినీ దారిలోనే ఖండించి, వాటినే మళ్ళీ తీసుకుని వింటితో ఎక్కుపెట్టి పధ్నాలుగు మంది రాక్షసులనూ కొట్టాడు. అందరూ పడిపోయి ప్రాణాలు వదిలారు.

ఇది చూసిన శూర్పణఖ కంగారు పడి, పెద్దపెట్టున అరుస్తూ, పరిగెత్తి పోయి మళ్ళీ ఖరుడి సమీపాన కుప్పకూలిపోయింది. ఖరుడామెను చూసి చిరాకు పడుతూ, "ఇంకా ఎందుకు ఏడ్చి, పొర్లిగింతలు పెడుతున్నావు?









ఇప్పుడే గద నీ పని చేసుకు రమ్మని పధ్నాలుగు మంది మెరికలలాటి వాళ్ళను పంపాను? వాళ్లు అజేయులు. ఇక ఊరడిల్లు!" అన్నాడు.

"నీవు పంపనూ పంపావు, వారంతా ఆ రాముడి చేత చావనూ చచ్చారు. నేను ఏడుస్తున్నానంటే, నాకు భయం ముంచుకొచ్చింది. ఆ రాముడు సామాన్యుడు కాడు. అతనూ, లక్ష్మణుడూ మహా పరాక్రమవంతులు. నా పగా, చచ్చినవాళ్ళ పగా తీర్చ దలిస్తే నీవే వచ్చి ఆ రాముణ్ణి చంపు. ఆ పని చెయ్యాకపొయ్యావో నీ శూరత్వం కేవలం దంభమే; అసలు నీవీ జనస్థానంలో ఉండటానికి కూడా అర్హుడవు కావన్న మాట. ఎందుకంటే ఎప్పటికైనా ఆ రాముడు వచ్చి నీ ప్రాణాలు తీసితీరుతాడు. కాదు, రాముడంతటి బలం నీకూ ఉన్నదంటావా, వెంటనే వచ్చి అతణ్ణి చంపు. చంపలేక పోతే అతని చేతిలో చావనన్నా చావు!" అంటూ శూర్పణఖ భోరున ఏడ్చింది.

శూర్పణఖ అందరు రాక్షసుల మధ్య తనను ఇలా అవమానించే సరికి ఖరుడికి పౌరుషం వచ్చింది. "రాముడి పరాక్రమం నేను లెక్కచేస్తానా? నీకు జరిగిన అవమానం తలుచుకుంటే నాకు పట్టరాని కోపం వచ్చేస్తున్నది. ఆ రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ నేనే స్వయంగా నరికేస్తాను. నీవు వారి రక్తం తాగు," అన్నాడు ఖరుడు.

ఖరుడి వద్ద పధ్నాలుగు వేల మందితో కూడిన రాక్షస సేన ఉన్నది. దానికి నాయకుడు దూషణుడు. దూషణుడు ఆ సేనను ఆయత్త పరిచాడు. ఖరుడు రథమెక్కి, సేనతో సహా రాముడి పైకి యుద్ధానికి బయలుదేరాడు.

ఖరుడి వెంట పన్నెండు మంది రాక్షస ప్రముఖులూ, దూషణుడి వెంట మరి నలుగురు సేనాపతులూ ఉన్నారు.







తన పైకి ఒక పెద్ద రాక్షససేన వస్తున్నట్టు గ్రహించి రాముడు సీతను లక్ష్మణుడి వెంట ఒక రహస్యమైన గుహకు పంపాడు. వారు వెళ్ళాక రాముడు తన కవచం ధరించి రాక్షసుల రాకను ఎదురు చూడ సాగాడు.

ఇంతలో కోలాహలంగా అరుస్తూ, భేరులు మోగిస్తూ, అరణ్యమంతా మారుమోతలు వస్తూండగా, రాక్షస సైన్యం రానే వచ్చింది. రాముడికి ఎటు చూసినా రాక్షసులు కాన వచ్చారు. ఖరుడి రథం రాముడి వద్దకు, పర్ణశాల సమీపానికి వచ్చింది. రాక్షసులు రాముడి మీద బాణవర్షం కురిపించారు.



వాటిలో కొన్నిటిని రాముడు తన బాణాలతో కొట్టేశాడు. కాని రాక్షసులు ప్రయోగించిన ఆయుధాలు కొన్ని రాముణ్ణి గాయపరిచాయి. అయినా అతను పర్వతంలాగా చలించక నిలబడ్డాడు. అయితే రాముడు ప్రయోగించిన తీవ్రమైన బాణాలకు రాక్షసులు చావనారంభించారు.

అనేకమంది రాక్షసులు రాముడి చేత చావగా కొందరు భయపడి ఖరుణ్ణి శరణుజొచ్చారు. దూషణుడు వారికి ధైర్యం చెప్పి తాను రాముడి పైకి వచ్చాడు. అలా వచ్చిన దూషణుడి పైనా, అతని వెంట వచ్చిన రాక్షసుల పైనా రాముడు గాంధర్వాస్త్రం ప్రయోగించాడు. వేలకు వేలు బాణాలు వచ్చి రాక్షసులకు తగిలి వారి ప్రాణాలు హరించాయి. రాముడికీ దూషణుడికీ యుద్ధమయింది. ఈ యుద్ధంలో రాముడు దూషణుడి సారథినీ, గుర్రాలనూ, చివరకు దూషణుడి రెండు చేతులనూ బాణాలతో నరికేశాడు; దూషణుడి వెంట వచ్చిన అయిదు వేల మంది రాక్షసులనూ చంపేశాడు.

క్రమంగా రాముడు, తాను ఒంటరిగాడై ఉండికూడా, పద్నాలుగు వేల మంది రాక్షసులనూ చంపేశాడు. వారిలో ఖరుడూ,







త్రిశిరు డనేవాడూ మాత్రమే మిగిలారు. ఖరుడి ఆగ్రహానికి అంతు లేదు. అతడు రాముడిపైకి పోతూండటం చూసి త్రిశిరుడు అడ్డుపడి, "రాముణ్ణి నేను చంపుతాను. నీవు చూస్తూ ఉండు. ఒకవేళ రాముడే నన్ను చంపితే తరవాత నీవు అతన్ని చంపవచ్చు," అని బతిమాలాడు. ఖరుడు సరే నన్నాడు.

త్రిశిరుడికీ రాముడికీ భయంకరమైన యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో త్రిశిరుడు తన గుర్రాలనూ, సారథినీ, ధ్వజాన్నీ పోగొట్టుకుని, రొమ్మున బాణాలు తగిలి మూర్ఛపోయాడు. ఆ స్థితిలో రాముడు మూడు బాణాలు వేసి త్రిశిరుడి తల నరికేశాడు.

తరవాత రాముడికి ఖరుడితో యుద్ధం జరిగింది. ఖరుడు రాముడి చేతి బాణాన్ని విరగగొట్టటమే గాక, అతని కవచాన్ని ముక్కలు ముక్కలు చేసి, రాముడి మర్మస్థానాలను తన బాణాలతో ఛేదించాడు. రాముడు నిలువునా రక్తం కారుతూ, అగస్త్యుడిచ్చిన విల్లు తీసుకుని భయంకరమైన బాణాలు ప్రయోగించి ఖరుణ్ణి విరథుణ్ణి చేశాడు. ఖరుడు తన గదను రాముడి పైకి విసిరివేశాడు. అది రాముడి బాణాలతో తుత్తునియలు కాగా, సమీపంలో ఉన్న చెట్టును పెరికి, దాన్ని రాముడిపై వేశాడు. రాముడు దాన్నికూడా తన బాణాలతో ఖండించి, ఖరుణ్ణి ఒక్క క్షణంలో చంపేశాడు.

రాముడిలా ఖర దూషణులనూ, పధ్నాలుగు వేల మంది రాక్షసులనూ చంపెయ్యటంతో దండకారణ్యానికి రాక్షస భయం తీరిపోయింది.

యుద్ధం అయిపోయినట్టు గ్రహించి, సీత గుహలో నుంచి బయటికి వచ్చి, రాముణ్ణి గట్టిగా ఆలింగనం చేసుకుని ఎంతో సంతోషం పొందింది.






ఖర దూషణులూ, త్రిశిరుడూ మొదలైన రాక్షసవీరులు తమ పధ్నాలుగువేల రాక్షస బలగంతో రాముడి ప్రతాపాగ్నిలో మాడి మసి అయిపోగా అకంపనుడనే రావణుడి చారుడు ప్రాణాలతో తప్పించుకుపోయి రావణుడి దర్శనం చేసుకున్నాడు.

"రావణరాజేశ్వరా, జనస్థానంలో ఉండే మన రాక్షసు లందరూ యుద్ధంలో వధ అయారు. నేను మాత్రం ఎలాగో ప్రాణాలతో బయటపడి ఈ వార్త చెప్పటానికి వచ్చాను," అని అకంపనుడు అంటూండగానే రావణుడు కళ్ళెర్రజేసి అగ్నిహోత్రుడులా అయిపోయి, "ఎవడికి కాలం మూడింది? నేను అగ్నినే దగ్ధం చేస్తాను, మృత్యువునే చంపగలను. సూర్య చంద్రులు కూడా నేను ఆగ్రహిస్తే భస్మమై పోతారు," అని రంకెలు పెట్టాడు.

ఈ అట్టహాసం గమనించి అకంపనుడు ముందుగా రావణుడి వద్ద అభయం పొంది, రాముడు జనస్థానంలోని రాక్షసులందరినీ ఎలా చంపిందీ వివరించి చెప్పాడు.

రావణు డంతా విని బుసకొడుతూ, "ఆ రాముడికి దేవతలందరూ సహాయం వచ్చారు కాబోలు?" అన్నాడు.

"లేదు, లేదు. రాముడు పరాక్రమంలో దేవేంద్రుడికి తీసిపోడు. అగ్నికి వాయువు తోడైనట్టు రాముడికి తోడుగా అతని తమ్ముడు లక్ష్మణు డొకడున్నాడు. జనస్థానంలో ఉండే రాక్షసులను చంపినవాడు రాముడొక్కడే!" అన్నాడు అకంపనుడు.







"అలా అయితే నేను జనస్థానానికి వెళ్ళి ఆ రాముణ్ణీ లక్ష్మణుణ్ణీ చంపేస్తాను," అన్నాడు రావణుడు.

అకంపనుడు లబలబలాడుతూ, "ఆ రాముడి బలపరాక్రమాలు నేను సరిగా చెప్పలేకపోయాను. అతడికి చెలియలి కట్టను భేదించి ప్రపంచమంతా సముద్రంలో ముంచే శక్తి ఉన్నది. ఆకాశాన్ని నక్షత్రాలతో సహా నాశనం చెయ్యగలడు. మూడు లోకాలూ నిర్మూలించి, కొత్తసృష్టి ప్రారంభించగలడు? రాముడు నీ చేతిలో ఎన్నటికీ చావడు. అతడు చావటానికి ఒక్కటే ఉపాయం: అతడి భార్య సీత అప్సరసలను మించిన సౌందర్యవతి; సర్వాంగ సుందరి. ఆమె అంటే ఆ రాముడికి ప్రాణంతో సమానం. ఆమెను ఎత్తుకువస్తే ఆ రాముడు కుమిలి కుమిలి చస్తాడు!" అని సలహా ఇచ్చాడు.

రావణుడు కొంచెం ఆలోచించి, తల పంకించి, "మంచిది, రేపు ఉదయమే బయలుదేరి వెళ్ళి ఆ సీతను తీసుకువచ్చేస్తాను," అన్నాడు.

మర్నాడు ఉదయానే అతను ప్రకాశవంతమైన రథానికి గాడిదలను పూన్చి దానిలో ఎక్కి మారీచుడి ఆశ్రమానికి వెళ్ళాడు. తాటక కొడుకైన మారీచుడు రాక్షసరాజుకు చక్కగా భోజనంపెట్టి, "ఇలా తలవని తలంపుగా వచ్చారు, రాక్షసులందరూ క్షేమమే గదా?" అని అడిగాడు.

ఆ మాటకు రావణుడు, "మారీచా, జనస్థానంలో ఉన్న నా బంధువు లందరినీ రాముడు వధించాడు. అతడి భార్యను ఎత్తుకుపోదామని వచ్చాను. నీ సహాయం కావాలి," అన్నాడు.

"అయ్యో, హితం కోరినవాడిలాగా వచ్చి నీకు సీత మాట చెప్పిన దుర్మార్గు డెవరు? నిశ్చయంగా నీ నాశనం కోరే, వాడు నిన్ను





సీతాపహరణానికి ప్రేరేపించి ఉంటాడు. ఈ పిచ్చి ఆలోచన కట్టిపెట్టి, లంకకు వెళ్ళి నీ భార్యలతో సుఖంగా ఉండు; ఈ దండకారణ్యంలో ఆ రాముణ్ణి తన భార్యతో సుఖంగా ఉండనీ. ఆ రాముడి జోలికి పోవటం నిద్రించే సింహాన్ని లేపగొట్టటమే!" అన్నాడు మారీచుడు.

మారీచు డింతగా చెప్పినాక రావణుడు తన యత్నం మానుకుని లంకకు వెళ్ళిపోయాడు. ఇంతలో శూర్పణఖ కూడా లంకకు వెళ్ళింది. నిండు కొలువులో ఉన్న రావణుడి వద్దకు వెళ్ళి, పరుషంగా మాట్లాడుతూ, "భోగలాలసుడవై మదించి నీకు వచ్చిపడే ఘోరాన్ని కూడా తెలుసుకోకుండా ఉన్నావు! నీ కన్న పసిపిల్లలు నయం! జనస్థానంలో రాముడు ఋషుల కోరికపై నీ వాళ్ళనందరినీ చంపి, దండకారణ్యంలో రాక్షసపురుగు లేకుండా చేస్తే నీకా సంగతి చెప్పటానికి చారులు కూడా లేరు; నీ వింకేం రాజ్యం చేస్తావు? ఈ రాజ్యం ఉండదు; నీవు త్వరలోనే నశిస్తావు!" అన్నది.

రావణుడీ మాటలు సహించలేక రోషంతో, "ఎవడీ రాముడు? ఎక్కడి నుంచి వచ్చాడు? ఎలా ఉంటాడు? ఏపాటి



పరాక్రమం గలవాడు?" అని శూర్పణఖను అడిగాడు.

"రాముడు దశరథుడి కొడుకు. ఆజానుబాహువు. నవమన్మథుడు. అతడు యుద్ధం చెయ్యటం నేను కళ్ళారా చూశాను. వర్షం లాగా బాణాలు వచ్చిపడటం నాకు కనిపించిందేగాని, అతను బాణాలు తీయటమూ, ఎక్కుపెట్టటమూ, విడవటమూ నాకు కనిపించలేదు. ఒక్కడే క్షణంలో పద్నాలుగు వేలమంది రాక్షసులను చంపేశాడు. ఆడదాన్ని గదా అని నన్ను చంపక అవమానించి పంపాడు. రాముడి తమ్ముడు లక్ష్మణుడు ముక్కోపి. మహాబలశాలి. అన్నకు







కుడిభుజం. ఇక రాముడి భార్య సీత! ఇంతంత కళ్ళు! నిండు చంద్రుడులాటి ముఖం! బంగారువంటి శరీరచ్ఛాయ! సన్నటినడుము! చక్కని పిరుదులు! అటువంటి భార్య ఉంటే వేరే స్వర్గం దేనికి? ఆ సీతను ఎలాగైనా ఇక్కడికి తీసుకువచ్చి నీకు భార్యను చేతామని ప్రయత్నించేసరికి లక్ష్మణుడు నన్నిలా ముక్కు చెవులు కోశాడు. సీతను ఒక్కసారి చూస్తే నీవు మరవలేవు. ఆ రాముణ్ణి చంపేసి నీవాళ్ళ కోసం పగతీర్చుకో, సీతను తెచ్చుకుని భార్యగా ఏలుకో. వెంటనే బయలుదేరు!" అని శూర్పణఖ రావణుణ్ణి రెచ్చగొట్టింది.



రావణుడు సభ చాలించి ఒంటరిగా కూచుని సీతాపహరణం గురించి వివరంగా ఆలోచించాడు. సీతను పరాక్రమంతో తీసుకురావటం కన్న దొంగతనంగా తీసుకురావటమే మేలని అతనికి అనిపించింది. ఎందుకంటే అంతమంది రాక్షసులనూ, రాక్షసవీరులనూ చంపినవాణ్ణి ఓడించి సీతను ఎత్తుకురావటం మాటలు కాదు. అయితే రావణుడు తన ఆలోచనను మండోదరికి గాని మంత్రులకు గాని చెప్పలేదు; వారు నివారిస్తారని భయపడ్డాడు.

రథం సిద్ధం చెయ్యమని రావణుడు తన సారథితో చెప్పి, అందులో ఎక్కి, కామగమనం చేత సముద్రాన్నిదాటి మారీచుడి ఆశ్రమానికి వచ్చిచేరాడు. మారీచుడు అతనికి అతిథి సత్కారాలుచేసి, "ఇంతలోనే మళ్ళీ రావటాని కేమి కారణం? లంకలో అందరూ క్షేమమా?" అని అడిగాడు.

"రాముణ్ణి క్షమించటానికి వీల్లేదు. వాడు దుష్టుడు, క్రూరుడు, మూర్ఖుడు, లుబ్ధుడు. మన రాక్షసుల నందరినీ నాశనం చెయ్యటమేగాక నా చెల్లెలు శూర్పణఖ ముక్కు చెవులు కోయించాడు. సీతను అపహరించ దలిచాను. నాకు నీ సహాయం







కావాలి. నీవు పరాక్రమం గలవాడవు, యుక్తిపరుడవు. నీకు మాయలు తెలుసు. నీ వల్ల కావలిసిన సహాయం చెబుతాను విను. నీవు వెండిచుక్కలు గల బంగారు లేడి రూపం ధరించి రామాశ్రమంలో సీతకు కనపడేలాగా తిరుగు. నిన్ను పట్టితెమ్మని సీత రామలక్ష్మణులను తప్పక పంపుతుంది. ఆ సమయంలో నేను సీతను ఎత్తుకుపోతాను. సీత పోయినాక రాముడు విచారంతో కృశించిపోతాడు. ఆ స్థితిలో అతను యుద్ధానికి వచ్చినా సునాయాసంగా ఓడించేస్తాను," అని రావణుడు చెప్పాడు.



ఈ మాటలు విని మారీచుడికి భయంతో నోరెండిపోయింది. అతను చేతులు జోడించి, "రాక్షసరాజా, ఈ లోకంలో ఇష్టమైన మాటలు చెప్పేవారు కొల్లలు. నచ్చక పోయినా హితమైన మాట చెప్పేవారుండరు, ఒకవేళ చెప్పేవారున్నా వినేవారుండరు. రాముణ్ణి గురించి నీ వసుకునేదంతా అబద్ధం. అతను దుష్టుడూ, మూర్ఖుడూ, లుబ్ధుడూ, క్రూరుడూ ఎంత మాత్రమూ కాడు. అతను ఎవరి జోలికీ వెళ్ళలేదు. శూర్పణఖ సీతను తరిమితే పరాభవించి పంపాడు. ఖరదూషణులు తన పైకి వచ్చి పడితే వారిని చంపాడు; తప్పా? ఈ రాముడు మీసకట్టు కూడా రాని వయసులో, వెయ్యి ఏనుగుల బలంగల నన్ను వెయ్యి యోజనాలు వెళ్ళి సముద్రంలో పడేలా కొట్టాడు. అంతటితో బుద్ధిరాక నేను మరి ఇద్దరు రాక్షసులతోబాటు జింకరూపు దాల్చి, మునిలాగా ఉన్నాడు కదా, ఏం చెయ్యగలడు లెమ్మని అతని ఆశ్రమం మీద పడి అతన్ని చంపబోయాను. రాముడు మూడు బాణాలు ఎక్కుపెట్టాడు. వాటిని చూడగానే నేను తప్పుకుని పారిపోయాను; కాని నా వెంట జింకల రూపంలో ఉన్న రాక్షసు లిద్దరూ చచ్చారు. నాకు బుద్ధి వచ్చింది. నా కిప్పుడు రాముడంటే సింహ





స్వప్నం. ఎక్కడ చూసినా నాకు రాముడే కనిపిస్తాడు. రకారంతో ప్రారంభమయే మాటలు వింటేనే గుండె లవిసిపోతాయి. నామానాన నేను తపస్సు చేసుకుంటు న్నాను. నీకు కాలంమూడి రాముడితో తల పడాలని ఉంటే తలపడు. నన్ను మాత్రం ఇందులోకి ఈడవకు. నీ మేలు కోరి నేను చెప్పేది వినకపోతివో నీకు సర్వ నాశనం తప్పదు," అన్నాడు.

రావణుడి కీ మాటలు తల కెక్కలేదు. అతను మారీచుడితో, " దేవతలంతా వచ్చి చెప్పినా నా నిశ్చయం మారదు. నా నిర్ణయం మంచిదా, చెడ్డదా అని నేను నిన్నడిగానా? అడగని మాట లెందుకు చెబుతావు? నేను నిన్నొకటి చెయ్యమని అడిగినప్పుడు నీవు చెయ్యవలిసిందే గాని బదులాడరాదు. నేను చెప్పినట్టు బంగారు లేడి రూపం ధరించి సీతను ఆకర్షించి, ఆ తరవాత నీదారిన నీవు వెళ్ళి పో. నిన్ను పట్టటానికి రాముడు ఒక్కడే వస్తే అతని కంఠధ్వనితో, 'అయ్యో! సీతా! లక్ష్మణా!' అని అరు. అప్పుడు లక్ష్మణుడు కూడా కదులుతాడు. సీత నాకు దక్కుతుంది. ఈ ఉపకారం చేస్తివా నీకు నా అర్థరాజ్య మిస్తాను. నిరాక రించావో, ఇప్పుడే నీ ప్రాణాలు తీస్తాను.



రాముడు నిన్ను చంపటం అబద్ధమూ, నేను చంపటం నిజమూ అవుతుంది," అన్నాడు.

మారీచుడికి మండిపోయింది. "నన్ను చంపుతానంటున్నావు గాని నీ కీ ఆలోచన చెప్పిన దుర్మార్గుల నెందుకు చంపవు? ఇటువంటి మతిలేని ఆలోచన చేస్తూంటే నీ మంత్రులు నిన్నెందుకు నివారించలేదు? దైవికంగా ఇది వచ్చిపడటంచేత నేను చస్తే అంత ప్రమాదంలేదు. కాని నా తరవాత నీవూ, రాక్షసవంశమూ, లంకానగరమూ కూడా నాశనంకాక తప్పదే, అది ఎంత ఘోరం!" అని మారీచుడు రావణుడితో అని, పోదాం పద మన్నాడు.





అనరాని మాటలన్నీ అన్నప్పటికీ చివరకు తన మాట పాటించాడన్న ఆనందంతో రావణుడు మారీచుణ్ణి ఆలింగనం చేసుకుని, విమానంలాటి తన రథంలో అతన్ని ఎక్కించుకుని, అరటిచెట్ల మధ్యనున్న రామాశ్రమం దగ్గిర అతన్ని దించాడు.

వెంటనే మారీచుడు ఒక ఆకర్షవంతమైన, అపూర్వమైన లేడిరూపం ధరించి, గరికమేస్తూ మెల్లిగా రామాశ్రమం ప్రవేశించి అక్కడే తారట్లాడాడు. ఈ మాయాలేడి శరీరం బంగారు రంగులోనూ, దాని మీది చుక్కలు వెండిరంగులోనూ, పొట్ట తెల్లగానూ, గిట్టలు నిగనిగలాడే నలుపు రంగులోనూ, తోక పంచవర్ణాలలోనూ, కొమ్ముల చివరలు నీలం రంగుగానూ, నోరు కెంపు రంగుగానూ ఎంతో అందంగా ఉన్నాయి. అది కాస్సేపు మేస్తూ, మధ్య మధ్య పచ్చికపై పడుకుంటూ, ఆ ప్రాంతంలోనే చాలాసేపు తిరిగింది.

చివరకు సీత పూలు కోయటానికి చెట్ల మధ్యకు వచ్చి ఆ లేడిని చూడనే చూసింది. చూసి పరమాశ్చర్యం చెంది ఆమె రామలక్ష్మణులను కేకపెట్టింది. ఆమెను సమీపిస్తూ వారుకూడా మాయలేడిని చూశారు. చూస్తూనే లక్ష్మణుడు రాముడితో, "ఈ లేడి చూస్తే మారీచుడి లాగుంది. వాడు మాయారూపంలో వేటకువచ్చిన రాజులను తిన్నాడు. ఎందరో మునులను తిన్నాడు. ఇలాటి లేడి ఎక్కడా ఉండదు," అన్నాడు.

సీత లక్ష్మణుణ్ణి ఊరుకోమని, రాముడితో, "ఆ లేడి నాకు కావాలి. తీసుకు రా. చక్కగా ఆడుకుందాం. దాని అందం ఏమందం! దీన్ని ప్రాణాలతో తెస్తే, మనతో బాటు అయోధ్యకు తీసుకుపోదాం; భరతుడూ, అత్తలూ చూసి ఎంతో మురిసి పోతారు. ఒకవేళ ఇది ప్రాణంతో చిక్కక పోతే చంపి అయినా తీసుకు రావాలి. దీని చర్మాన్ని నేను ఉంచుకుంటాను," అన్నది.






ఆ మాయలేడిని చూస్తుంటే రాముడికి కూడా సీతకు కలిగినట్టే దాని పైన భ్రమ పుట్టుకొచ్చింది. అతను లక్ష్మణుడితో, "నీవూ, జటాయువూ సీతను చూసుకోండి. నేను ఈ లేడిని పట్టి తెస్తాను," అని కత్తీ, విల్లంబులూ పుచ్చుకుని బయలుదేరాడు.

మారీచుడు తన పని శక్తి వంచన లేకుండా నిర్వహించాడు. అతను లేడి రూపంలో కనిపిస్తూ, మాయమవుతూ, ఒకసారి దూరమవుతూ, ఒకసారి దగ్గరలోనే ఉంటూ రాముణ్ణి ఆశ్రమం నుంచి చాలా దూరం తీసుకుపోయాడు. ఇక ఆ లేడి తనకు ప్రాణాలతో చిక్కదని తోచి రాముడు ఒక తీవ్రమైన బాణం ఎక్కుపెట్టి ఆ లేడి గుండెలో దూసుకు పోయేటట్టు కొట్టాడు. మారీచుడు వెంటనే లేడి రూపు వదిలి తన రాక్షసరూపుతో కిందపడిపోతూ, "అయ్యో! సీతా! లక్ష్మణా!" అని రాముడి గొంతుతో అరిచి ప్రాణాలు వదిలాడు. ఆ అరుపు రాముడి చెవికి అశుభంగా తోచింది. మాయలేడి మారీచుడే! అస్పష్టమైన భయాలు మనసును ఆవరించగా రాముడు మరొక లేడిని చంపి, దాని మాంసం తీసుకుని వేగంగా తమ పర్ణశాల కేసి నడవసాగాడు.

"లక్ష్మణా, అది నీ అన్న చేసిన ఆర్తనాదం. నాకేమో భయంగా ఉంది. నీవు వెంటనే వెళ్ళి రాముణ్ణి కాపాడు," అన్నది సీత ఆశ్రమంలో.







సీత ఎంతగా విలవిలలాడుతున్నప్పటికీ చలించక లక్ష్మణుడు, "దేవ మానవ గంధర్వ రాక్షసులలో అన్నను భయపెట్ట గలవా రెవరూ లేరు. ఇది రాక్షస మాయ. అన్న నన్ను నీకు తోడుగా ఉండమన్నాడు. నేను వెళ్ళను," అన్నాడు.

"ఆయన ఆపదలో ఉంటేకూడా పోనం టావే, నీ వాయనకు మిత్రుడవా, శత్రుడవా? నీవు కోరేది రాముడి నాశనం లాగుందే! నా మీద దురాశపెట్టుకున్నావా? రాముడికి నిజంగా ఆపదే కలిగితే నేను మరుక్షణం నశిస్తాను. నన్ను నీవు రక్షించేదేమిటి?" అన్నది సీత.

లక్ష్మణుడు ఎన్నోవిధాల సీత భయాన్నీ, అనుమానాన్నీ పోగొట్ట యత్నించాడు. కాని అతని ప్రయత్నం ఫలించలేదు. ఆమె అతన్ని బాగా ఎత్తి పొడిచింది. "నీవు ఎవరి కోసం రాముడి వెంటపడి వచ్చావు? నీ కోసమా, భరతుడి కోసమా? నేను నీకు గాని, భరతుడికి గాని దక్కుతానని కలలో కూడా అనుకోవద్దు," అన్నది.

చివరకు లక్ష్మణుడు చిరాకుపడి, "అన రాని మాటలనటం స్త్రీలకు సహజమే. నన్నిన్ని మాటలన్నందుకు నీకు కీడు తప్పదు. నేను వెళ్ళినాక నీకు దేవతలే దిక్కు," అంటూ అయిష్టంగా అన్న కోసం బయలుదేరాడు.

అతను అలా వెళ్ళాడో లేదో రావణుడు సన్న్యాసి రూపంలో ఒంటరిగా ఉన్న సీత వద్దకు వచ్చాడు. అతను సన్నని కాషాయ వస్త్రం ధరించి, గొడుగు వేసుకుని, పావు కోళ్ళు కాళ్ళకు ధరించి, దండానికి కమం డలం తగిలించి ఎడమ భుజానికి ఆన్చి, వేదాలు చదువుతూ వచ్చి, కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తున్న సీతను పరిశీలించి చూశాడు. ఆమె పచ్చని పట్టుచీర కట్టుకొని ఉన్నది. ఆమె సర్వావయవాలలోనూ సౌందర్యం తొణికిసలాడుతున్నది. ఆమె





మెడలోని రత్నహారాలు మెరుస్తున్నాయి. రావణుడు సీతను పలకరించి, "అమ్మాయీ, నీ వెవరు? పార్వతివా? అప్సరవా? లక్ష్మీదేవివా? కాంతిదేవతవా? మానవ దేవ యక్ష కిన్నర గంధర్వులలో నీ వంటి సుందరిని నే నెన్నడూ చూడలేదు. ఇంత సుకుమారివి, సుందరివి, చిన్నదానివి ఈ రాక్షస మయమైనచోట ఏంచేస్తున్నావు? ఒంటరిగా ఎందుకున్నావు?" అని అడిగాడు.

సీత రావణుణ్ణి చూసి నిజమైన సన్యాసి అనుకుని అర్ఘ్యపాద్యాదు లిచ్చి అతిథి సత్కారాలు చేసి, పీట వేసి, వంట సిద్ధంగా ఉన్నది, భోజనం చెయ్యమని ఆహ్వానించింది. ఆమె ఆ సన్యాసి అడిగిన ప్రశ్నలకు సమాధానం చెబుతూ, తన వివాహం జరగటమూ, తాను పన్నెండేళ్ళు కాపరం చేసిన అనంతరం తన మామగారు తన భర్తకు పట్టాభిషేకం తల పెట్టటమూ, కైకేయి ఆ ప్రయత్నాన్ని భగ్నం చేసి తన భర్తను అడవులకు పంపటమూ మొదలైన వృత్తాంత మంతా చెప్పింది. అంతా చెప్పి ఆమె రావణుణ్ణి, "మీ పేరేమిటి? గోత్ర మేమిటి? మీరీ దండకారణ్యంలో ఒంటిగా ఎందుకు తిరుగుతున్నారు?" అని అడిగింది.

సీత ఈ ప్రశ్న అడగగానే రావణుడు, "నేను రాక్షసరాజును, రావణుణ్ణి. నాకు





ఎందరో భార్యలున్నారు గాని ఒక్కరూ నీతో సమానం కారు. నేనుండే లంకా పట్టణం సముద్రం మధ్య ఎత్తయిన పర్వతం మీద ఉన్నది. ఈ అరణ్యం వదిలిపెట్టి నాతో వచ్చెయ్యి. ఉద్యాన వనాలలో విహరింతాం. నీకు అయిదువేల మంది దాసీలను ఏర్పాటు చేస్తాను," అన్నాడు.

ఈ మాటలు విని సీత భయపడటానికి బదులు మండిపడింది. రావణుణ్ణి తిట్టింది, బెదిరించింది. రాముడి పరాక్రమం వివరించింది. అంతా విని రావణుడు తన పరాక్రమం చెప్పుకున్నాడు. తాను కుబేరుడి తమ్ముణ్ణనీ, కుబేరుడి పుష్పక విమానాన్ని లాక్కున్నాననీ, తన పేరు చెబితేనే సమస్త దేవతలూ భయపడతారనీ అన్నాడు. రాముడు అసమర్థుడు గనకనే రాజ్యం వదిలిపెట్టి అడవులలో అష్టకష్టాలూ పడుతున్నాడన్నాడు. "నీవు రాముడికి భయపడి నాతో వచ్చెయ్యటానికి జంకుతున్నావేమో, నా వెంట ఉన్న నిన్ను రాముడేమీ చేయలేడు. అతడు నా గోరికి చాలడు," అన్నాడు.

"కుబేరుడి తమ్ముణ్ణని చెప్పుకుంటూ ఇలాటి పాపపు బుద్ధు లేమిటి? నీకి పరస్త్రీ వాంఛ పోకపోతే నీవూ, నీ రాక్షసులూ నాశనం కాక తప్పదు," అన్నది సీత.

రావణుడు మండి పడి చేతులు చరిచి తన నిజ రూపం ధరించి భయంకరంగా సీత ఎదట ప్రత్యక్షమయాడు. అతని కళ్ళు చింత నిప్పుల్లాగున్నాయి, శరీరం నల్లగా ఉన్నది. చెవులకు బంగారు పోగులున్నాయి. అతను సీతతో, "పిచ్చిదానా, నీకు నాకన్న ఖ్యాతి గల భర్త ఎక్కడ దొరుకుతాడు? ఇప్పుడు నన్ను నిరాకరించి తరవాత పశ్చాత్తాప పడతావు," అంటూ ఆమెను పట్టుకున్నాడు. ఎడమచేత్తో సీత జుట్టూ, కుడిచేత్తో తొడలూ పట్టుకుని రావణుడు ఆకాశానికి ఎగిరాడు. సీత గిలగిలా తన్ను





కుంటూ రాముణ్ణి కేక పెట్టింది, లక్ష్మణుణ్ణి పిలిచింది. "రావణుడు సీతను ఎత్తుకు పోయినాడని రాముడితో చెప్పండి," అని చెట్లతో మొర పెట్టుకున్నది.

ఇంతలో ఒక చెట్టు పైన సీతకు జటాయువు కనిపించాడు.

సీత జటాయువుతో, "నాయనా, జటాయూ! నన్ని రాక్షసుడు బలాత్కారంగా తీసుకు పోతున్నాడు. ఈ మాట రాముడికి చెప్పు," అన్నది.

చెట్టు మీద కునికిపాట్లు పడుతున్న జటాయువు ఈ మాటలకు ఉలిక్కి పడి కళ్ళు తెరిచి చూసి రావణుడితో ఇలా అన్నాడు:

"రావణా, నీవు చేసేది చాలా తప్పు పని. మామూలు మనుషులు తమ భార్యలను పర పురుషుల నుంచి ఎలా కాపాడు కుంటారో రాజైనవాడు ఇతరుల భార్యలను కూడా అలా కాపాడాలి. నేను సౌమ్యుణ్ణి, వృద్ధుణ్ణి, నిరాయుధుణ్ణి. నీవు యువకుడివి, ఆయుధాలు కలవాడివి. అయినా నిన్ను సీత నెత్తుకు పోనివ్వను. రామలక్ష్మణులు దూరాన ఉన్నప్పుడు పిరికిగా నీవీ పని చేస్తున్నావు."

ఈ మాట లంటూనే జటాయువు రావణుడిపై తలపడ్డాడు. రావణుడు తన రథంలో ఉండి ధనుర్బాణాలతో పోరాడు





తుంటే మహా బలశాలి అయిన జటాయువు తన గోళ్ళతోనూ, కాళ్ళతోనూ, ముక్కుతోనూ కలియబడి రావణుడి కవచాన్ని నిర్మూలించాడు. అతని శరీరాన్ని చీరాడు, అతని ధనువులను విరిచాడు, రథపు గాడిదలనూ, సారధినీ కూడా చంపాడు. చివరకు రథాన్నే విరిచాడు.

రావణుడు విరథుడై సీతను చంకన పెట్టుకుని భూమి పైకి దిగవలిసి వచ్చింది. ఇంత చేసిన మీదట జటాయువు అలిసిపోయాడు. అది గమనించి రావణుడు సీతతో సహా మళ్ళీ ఆకాశానికి ఎగిరాడు. కాని జటాయువు ఎగిరి వెళ్ళి రావణుడికి అడ్డు తగిలాడు. అతను రావణుడితో, "ఛీ, ఛీ! నీవు వీరుడివి కావు, పిరికిపందవు. వీరుడివైతే రామలక్ష్మణులు వచ్చినదాకా ఉండి వారితో యుద్ధం చెయ్యి," అన్నాడు.

రావణుడు వినిపించుకోక ముందుకు సాగిపోయాడు. జటాయువు రావణుడి వెన్నంటి, అతని వీపుమీద వాలి తన గోళ్ళతో గీరసాగాడు, రావణుడి వెంట్రుకలు పీకాడు. రావణుడు మండిపడి సీతను నేలపై దించి జటాయువుతో కలియబడ్డాడు. ఇద్దరికీ తీవ్రమైన యుద్ధం జరిగింది. చివరకు రావణుడు కత్తి దూసి జటాయువు రెక్కలూ, పక్కలూ, పాదాలూ నరికేశాడు. జటాయువు కొన ఊపిరితో నేల మీద పడిపోయాడు. సీత వలవలా ఏడుస్తూ జటాయువు దగ్గిరికి పరిగెత్తింది. జటాయువును కౌగలించుకుని ఘోరున ఏడ్చింది. "రామా, లక్ష్మణా! ఇప్పుడన్నా వచ్చి నన్ను రక్షించండి!" అని కేక పెట్టింది. రావణుడు తన కేసి రావటం చూసి సీత లతలను పట్టుకునీ, చెట్లను పట్టుకునీ వేళ్ళాడింది. "చాలించు ఈ వేషాలు," అంటూ రావణుడు ఆమె జుట్టు పట్టుకుని ఆమెను తన ఒడిలో పెట్టుకుని తిరిగి ఆకాశ గమనం సాగించాడు.





రావణుడు అతివేగంగా పోతూంటే సీత యొక్క ఆభరణాలు కొన్ని భూమి మీద పడి పోయాయి. సీత రావణుణ్ణి పిరికివాడని అవమానించింది, దొంగ అన్నది, తిట్టింది, ఇప్పటికైనా తనను వదిలేస్తే రాముడు క్షమిస్తాడని ఆశ పెట్టింది; "ఏది కోరి నన్ను ఇలా తీసుకు పోతున్నావో అది నీకు ఒనగూడదు; ఎందుచేతనంటే నేను రాముణ్ణి విడిచి ఎంతో కాలం బతకను," అని కూడా చెప్పి చూసింది. రావణుడీ మాట లేవీ పట్టించుకోలేదు.

ఆకాశంలో పోతున్న సీతకు ఒక కొండ శిఖరం మీద అయిదుగురు వానరులు కనిపించారు. "వీరు నా సంగతి రాముడితో ఒక వేళ చెబుతారేమో," అనుకుని సీత తన పసుపుపచ్చని పైబట్టలో తన ఆభరణాలు కట్టి ఆ వానరుల మధ్య పడేలాగా వేసింది. ఈ సంగతి రావణుడు గమనించలేదు. కాని వానరులు మాత్రం సీతను చాలా సేపు కళ్ళార్పకుండా చూస్తూ ఉండిపోయారు.

రావణుడు పంపా సరస్సు దాటి, సముద్రాన్ని చేరి, దాన్నికూడా దాటి తనపాలిటి మృత్యువైన సీతతో సహా లంకను చేరాడు.

లంకాపురం అతి అందమైన నగరం. అక్కడి రాజమార్గాలు తీర్చిదిద్దినట్టుగా ఉంటాయి. అనేక ప్రాకారాలతో కూడి ఉన్న అంతఃపురంలోకి రావణుడు సీతతో సహా ప్రవేశించాడు. అతను భయంకరాకారాలు గల అక్కడి రాక్షస స్త్రీలను పిలిచి, "నా అనుమతి లేకుండా ఒక పురుషుడు గాని, స్త్రీగాని ఈ సీతను చూడరాదు. ముత్యాలో, రత్నాలో, బంగారమో, బట్టలో – ఈమె ఏమి కోరితే అది ఎల్లా నాతో చెప్పకుండానే ఈమెకు ఇచ్చెయ్యాలి. ఈమె మనస్సుకు కష్టం కలిగించే మాట ఒక్కటి ఎవరైనా అన్నారో తక్షణం వాళ్ళ ప్రాణాలు తీస్తాను," అని హెచ్చరించాడు.






తరవాత రావణుడు అంతఃపురం నుంచి బయటికి వచ్చి జట్టీలలాటి ఎనిమిదిమంది రాక్షసులను పిలిచి, "మీరు అన్ని రకాల ఆయుధాలూ పట్టుకుని జనస్థానానికి వెళ్లాలి. ఒకప్పు డక్కడ ఖరుడుండేవాడు. అక్కడి రాక్షసులంతా చావటం చేత ఇప్పు డెవరూ లేరు. ఖర దూషణులనూ, రాక్షస సేననూ రాముడు చంపేశాడు. ఆ రాముడికీ మనకూ మధ్య ఇప్పుడు గొప్ప వైరం ఏర్పడింది. అందుచేత ఆ రాముణ్ణి చంపేదాకా నేను నిద్రపోను. ఈ లోపుగా మీరేం చెయ్యాలంటే, ఆ జనస్థానంలో ఉండి, రాముడు ఎప్పుడేం చేసేదీ నాకు ఎప్పటికప్పుడు తెలుపుతూ ఉండాలి. మీరు ఒక్క క్షణం కూడా ఏమరుపాటన్నది లేకుండా, రాముణ్ణి చంపే ప్రయత్నంలోనే ఉండాలి. మీ బల పరాక్రమాలు నేను అనేక పర్యాయాలు చూశాను గనక మీ కీ పని ఇస్తున్నాను," అని చెప్పాడు.

రాక్షసులు వెళ్ళిపోయారు. తరవాత రావణుడి బుద్ధి సీత మీదికి వెళ్ళింది. అతను త్వరగా తన అంతఃపురానికి తిరిగి వచ్చి, రాక్షసస్త్రీల మధ్య కూచుని దుఃఖ సముద్రంలో మునిగి ఉన్న సీతను చూశాడు. సీత వద్దు మొర్రో అంటున్నా వినకుండా అతను సీతను బలవంతంగా తీసుకుపోయి తన భవనమంతా చూపించాడు. అది దేవతాగృహాలలాటిది. అందులో అనేకవేల మంది స్త్రీ లున్నారు. రకరకాల పక్షులున్నాయి. ఎక్కడ చూసినా రత్నాలూ,








దంతంతో చేసిన భాగాలూ, స్ఫటికశిలలూ, వెండితో చేసినవీ, వజ్రవైడూర్యాలు తాపడం చేసిన అందమైన స్తంభాలు ఉన్నాయి. బంగారు ద్వారం గల అద్భుతమైన మెట్ల వరస మీదుగా ఇద్దరూ ఎక్కారు. మెట్ల పక్కన వెండి కిటికీలూ, దంతపు కిటికీలూ ఉన్నాయి. మేడ మీద బంగారు కిటికీలున్నాయి. కొన్నిచోట్ల గోడలో రత్నాలు పొదిగారు. తన ఐశ్వర్యంతో సీతను భ్రమింప జెయ్యటానికిగాను రావణుడు ఇవన్నీ సీతకు చూపాడు.

అతను సీతతో, "నీవు నాకు ప్రాణం కన్న ఎక్కువైన దానివి. నా భార్యవయావో నా మిగతా భార్యలందరికీ రాణిని చేస్తాను. ఈ మహానగరం దేవతలకు కూడా గెలవ రానిది. నిన్ను ఇక్కడి నుంచి తీసుకు పోగలవాడు మూడు లోకాలలోనూ లేడు. నన్నుకూడా దాసుడుగా చేసుకుని ఈ లంకా రాజ్యాన్ని నీవే ఏలు. ఎప్పుడో ఏదో పాపం చేసి వనవాసం అనుభవించావు. ఇక నీ పుణ్యం అనుభవించు. విమానంలో మనం ఇష్టం వచ్చినట్టు విహరింతాం. దుఃఖిస్తుంటే నీ అందమైన ముఖం కళారహితంగా ఉన్నది. అందుచేత విచారం మాను!" అన్నాడు.

ఇంత చెప్పినా సీత చలించలేదు. ఆమె తనకూ రావణుడికీ మధ్య ఒక గడ్డిపోచ అడ్డంగా పట్టుకుని, అతని కేసి చూస్తూ, "నాకు ఒకడే దేవుడు. అతడు నా భర్త అయిన రాముడు. అతని చేతిలో నీకు చావు రాసిపెట్టి ఉన్నది. ఈ లంకకు వైధవ్యప్రాప్తి తప్పదు. నా శరీరాన్ని బంధించు, కోసుకుతిను గాక, నేను పాతివ్రత్య భంగం సహించను," అని జవాబిచ్చింది.

రావణుడు మండిపడి, "అయితే నా మాట విను. నీకు పన్నెండు మాసాలు గడు విచ్చాను. ఈ లోపుగా నీవు నా కోరి







కను అమోదించకపోతే నా వంటవాళ్ళచేత నిన్ను ముక్కలు ముక్కలుగా కోయించి ఫలహారం వండిస్తాను!" అన్నాడు.

తరవాత అతను రాక్షసస్త్రీలను పిలిచి, "ఈమెను అశోకవనానికి తీసుకుపోయి మీరంతా చుట్టూ ఉండి జాగ్రత్తగా రక్షించండి. నయానో భయానో ఈమెను దారికి తీసుకు రండి," అని ఆజ్ఞాపించాడు.

ఆ ప్రకారమే రాక్షసస్త్రీలు సీతను అశోకవనానికి తీసుకువెళ్లారు. ఆ వనంలోని చెట్లు ఎల్లప్పుడూ పూలతోనూ, పళ్ళతోనూ నిండి ఉంటాయి. వనం నిండా పక్షులున్నాయి. రాక్షసస్త్రీలు సీతను అక్కడికి చేర్చి చుట్టూ కూచున్నారు. ఆమెకు దుఃఖమూ, భయమూ పట్టుకున్నాయి. ఆమె రాముణ్ణి తల్చుకుని దుఃఖం పట్టలేక మూర్ఛపోయింది.

అక్కడ రాముడు మాయలేడి రూపంలో వచ్చిన మారీచుణ్ణి చంపి ఆశ్రమానికి తిరిగి వస్తూండగా వెనక నుంచి నక్క ఒకటి కూసింది. ఈ దుశ్శకునంతో కలవరపడి రాముడు, "సీతను ఏ రాక్షసులో తిని ఉండరు గద!" అని భయపడ్డాడు. లేడి రూపంలో ఒక రాక్షసుడు వచ్చి తనను ఆశ్రమానికి దూరంగా తీసుకుపోవటమూ, చస్తూ కూడా వాడు తన గొంతుతో ఆర్త



నాదం చెయ్యటమూ చూస్తే తన కేదో ద్రోహం తలపెట్టి రాక్షసులు పన్నాగం చేశారని అతనికి నమ్మకం కలిగింది. సీతకు లక్ష్మణుడు రక్షగా ఉన్నాడన్న ధైర్యం అవలంబించేటందుకు కూడా అవకాశం లేకుండా ఆ లక్ష్మణుడే తనకు ఎదురు వస్తూ కనిపించాడు!

రాముడి ఆందోళన రెట్టింపయింది. అతను లక్ష్మణుడి చెయ్యి పట్టుకుని, "ఇదేమిటి, లక్ష్మణా? సీతను ఆశ్రమంలో ఒంటిగా విడిచి వచ్చావా? సీతను మళ్ళీ మనం ప్రాణాలతో చూస్తామా? సీతకు ఏమన్నా జరిగిందో నా ప్రాణాలు నిలవవు!







నేనుపోయాక నీవు అయోధ్యకు తిరిగిపోతే, కైకేయి తన కోరిక పూర్తిగా ఫలించినందుకు సంతోషిస్తుంది కాబోలు! ఆ రాక్షసుడి కేకకు శూరుడవైన నీవు కూడా భయపడ్డావా? నేను ఖరదూషణాది రాక్షసులను చంపానేమో, వారు పగపట్టి ఉన్నారు; సీతను తప్పక చంపేస్తారు. లక్ష్మణా, నాకు అపశకునాలు కనిపిస్తున్నాయి. దుఃఖంలో మునిగి ఏమీ చేయలేని స్థితిలో పడ్డాను," అన్నాడు.

లక్ష్మణుడు సీత అన్న కఠోరవచనాలు వివరించి చెప్పి, ఆ పరుషాలు సహించలేక బయలుదేరి వచ్చానన్నాడు.

"సీత అజ్ఞానం చేత ఏవేవో అన్నదని ఆగ్రహించి నీవు నా ఆజ్ఞను ఉల్లంఘించటం చాలా తప్పు! నా కే ప్రమాదమూ రాదని తెలిసిన వాడవు సీత వెంటనే ఉండవలిసింది," అన్నాడు రాముడు.

రాముడు భయపడ్డంతా అయింది. సీత పర్ణశాలలో లేదు. ఆమె మామూలుగా తిరిగేచోట్లలో కూడా లేదు. ఆశ్రమం బావురుమంటున్నది. అతనికి దుఃఖం ముంచుకు వచ్చింది. అతను సీత కోసం వెతుకుతూ అడవిన పడ్డాడు. "సీత ఎక్కడ ఉన్నది?" అని అరణ్యవృక్షాలను పేరుపేరునా అడిగాడు. దుఃఖాతిశయంతో అతనికి మతి



పోయింది. అంత దూరాన సీత కనిపించి నట్టూ, తనకు అందకుండా పారిపోతు న్నట్టూ, భ్రమ కలిగింది; సీతను కేకపెట్టి పిలిచాడు. ఉన్నట్టుండి అతనికి సీత ఎక్కడో దాక్కుని తనను ఏడిపిస్తున్నదన్న అనుమానం వచ్చింది; కనిపించమని ఆమెను వేడుకున్నాడు.

లక్ష్మణుడు రాముడి దీనస్థితి గమనించి, "అన్నా, దుఃఖించి లాభంలేదు. చుట్టు పక్కల అరణ్యమంతా వెతుకుదాం. సీత ఎంతోదూరం వెళ్ళి ఉండకపోవచ్చు," అని ధైర్యం చెప్పాడు. పరిసరారణ్యమంతా వెతికినా వారికి సీత జాడ తెలియులేదు. రాముడికి మళ్ళీ అధైర్యం పట్టుకున్నది; అతని దేహంలో శక్తి లేకుండా పోయింది. అతను నిస్త్రాణగా కూలబడిపోయాడు.

అన్న సీతను తలుచుకుని పెద్దపెట్టున శోకాలు పెట్టుతూండటం చూసి లక్ష్మణుడు అతన్ని ఓదార్చటానికి ఎంతగానో ప్రయత్నించాడు. కాని ఆ మాట లేవీ రాముడి చెవి కెక్కలేదు. అతను లక్ష్మణుడితో, "సీతను రాక్షసుల పాలుకా నిచ్చిన నన్ను లోకం నిర్వీర్యుడి కింద జమ కడుతుంది. సీత లేకుండా నేను అయోధ్య కెలా వెళ తాను, సీత లేని శూన్యాంతఃపురంలో ఎలా ప్రవేశిస్తాను? నేను వచ్చానని తెలిసి జనక





మహారాజు వస్తే ఆయనకు నా ముఖం ఎలా చూపిస్తాను ? సీత లేక నేను బతికే మాట అబద్ధం. అందుచేత నన్నిక్కడే వదిలి నీవు అయోధ్యకు వెళ్ళు. భరతుణ్ణే రాజ్యం పాలించమన్నానని చెప్పు. నేను సీతా ఎలా నాశనమయామో మా తల్లికి చెప్పు," అన్నాడు. రాముడు స్థితి చూసి లక్ష్మణుడు చాలా బాధపడ్డాడు.

చివరకు లక్ష్మణుడి ప్రోత్సాహంతో రాముడు సీతను మరింత ఓపికగా వెతక టానికి నిశ్చయించాడు. ఒకచోట వారికి సీత ధరించిన పూలు నేలపై కనిపించాయి; వాటిని రాముడు గుర్తించాడు. మరికొంత దూరాన రాక్షసుడి అడుగులూ, సీత అడుగులూ కనిపించాయి; అక్కడనే సీత రావణుడికి అందకుండా పారిపోవ యత్నించింది. ఆ ప్రాంతంలోనే రక్తపు మరకలూ, విరిగిపోయిన రథమూ, గొడుగూ, గాడిదలూ, సారథి కళేబరమూ, బంగారు విల్లూ మొదలైనవి కనిపించాయి. ఆ రక్తం సీతదే ననుకున్నాడు రాముడు.

అప్పటివరకూ రాముడికి రాక్షసులపైన ప్రత్యేకించి పగలేదు; కాని ఆ క్షణంలో రాక్షసనిర్మూలనం చెయ్యాలనే నిశ్చయం అతనిలో ఏర్పడింది. "నా సీతను నాకు వెంటనే ఇవ్వకపోతే మూడు లోకాలనూ ఒక్క బాణంతో భస్మీపటలం చేస్తాను," అని రౌద్రంగా అన్నాడు.

లక్ష్మణుడు రాముణ్ణి వారిస్తూ, "ఈ యుద్ధం జరిగినచోట ఒక్క మనిషి అడుగు జాడలే ఉన్నాయి. ఒక్కడు చేసిన తప్పుకు మూడు లోకాలను శిక్షించటం అన్యాయం. ఎవడు సీతను అపహరించాడో వాడి కోసం అన్నిచోట్లా వెతుకుదాం," అన్నాడు.

ఇంతలోనే వారికి చావ సిద్ధంగా ఉన్న జటాయువు శరీరం ఎత్తుగా కనిపించింది. "ఇదుగో, వీడే సీతను తినేసి హాయిగా కూచున్నాడు! వీడి ప్రాణాలు తీసేస్తాను,"





అంటూ రాముడు జటాయువుపై బాణం ఎక్కుపెట్టాడు.

"నాయనా, నన్ను రావణుడు చంపనే చంపాడు. నీవు మళ్ళీ ఎందుకు చంపుతావు? వాడు సీతను ఎత్తుకుపోతుంటే అడ్డుపడి వాడి వింటినీ, రథాన్నీ, గాడిదలనూ, సారథినీ ధ్వంసం చేశాను. వాడు కత్తితో నా రెక్కలు నరికేశాడు. తరవాత సీతను తీసుకుని ఆకాశమార్గాన వెళ్ళిపోయాడు," అని జటాయువు చెప్పాడు.

ఈ మాటలు రాముడి చెవులకు శుభవార్తలాగా వినిపించాయి. ఎందుకంటే సీతను రాక్షసులు చంపి తినలేదు; ఆమెను ఎత్తుకుపోయిన వాడెవడో కూడా తెలిసింది. రాముడు తన విల్లును వదిలిపెట్టి జటాయువును కౌగలించుకుని దుఃఖించాడు. అతను జటాయువును, "రావణుడికి నే నేమి అపకారం చేశాను? సీత నెందుకు అపహరించాడు? అత నుండే చోటేది? అతను ఎలా ఉంటాడు? ఎలాటి పరాక్రమం కలవాడు? వాడు తీసుకుపోతూ ఉంటే సీత ఏ స్థితిలో ఉన్నది? ఏమి చెప్పమన్నది? నీకు శక్తి ఉన్నట్టయితే నాకు సమస్తమూ సవిస్తరంగా చెప్పు," అని అడిగాడు.

కొనప్రాణాలతో ఉన్న జటాయువు, "ఆ రావణుడు ఇలా దక్షిణంగా వెళ్ళాడు. వాడు కుబేరుడి తమ్ముడు," అని మాత్రం చెప్పి ప్రాణాలు వదిలాడు. ఎంతో కాలం గొప్పగా జీవించి తన కోసం ప్రాణాలర్పించిన జటాయువుకు రాముడు శాస్త్రోక్తంగా అంత్యక్రియలు జరిపాడు, పిండప్రదానానికి కేసరీ మృగమాంసం సంపాదించాడు. అనంతరం రామలక్ష్మణులు గోదావరిలో స్నానాలు చేసి జటాయువుకు జలతర్పణాలు వదిలారు. తరవాత వారిద్దరూ జటాయువు చెప్పిన ప్రకారం సీతను వెతుకుతూ బయలుదేరారు.







# అరణ్యకాండ

చెట్లూ, పొదలూ నరికి కీకారణ్యం మధ్యగా దారి చేసుకుంటూ రామలక్ష్మణులు జనస్థానం దాటి మూడుకోసుల దూరం వెళ్ళి క్రౌంచారణ్యం ప్రవేశించారు. వారు దారిలో మధ్యమధ్య విశ్రాంతి తీసుకుంటూ, దారి పొడుగునా సీతను వెతుకుతూ క్రౌంచారణ్యం దాటి మతంగాశ్రమ ప్రాంతం చేరి అక్కడ ఒక పెద్ద గుహను చూశారు. అది చీకటి గుహ.

రామలక్ష్మణులు ఆ గుహ దగ్గిరికి వెళ్ళే సరికి అందులో వారికి ఒక వికారమైన పెద్దరాక్షసి కనిపించింది. దాన్ని చూస్తేనే మామూలు మనుషులు దడుచుకుంటారు, అసహ్యపడతారు. పెద్ద నోరూ, పెద్ద కళ్ళూ, పెద్ద పొట్టా, కోరలూ, గరుకైన చర్మమూ గల ఆ రాక్షసి సింహాలనూ, పులులనూ పీక్కు తింటూ రామలక్ష్మణులను చూసింది. వెంటనే అది, పరిగెత్తుకుని, ముందు నడిచే లక్ష్మణుడి వద్దకు వచ్చి, అతన్ని మోహించి పట్టుకున్నది.

అది లక్ష్మణుడితో, "నా పేరు అయోముఖి. ఇంతకాలానికి నాకు నచ్చినవాడవు దొరికావు. మనిద్దరమూ పెళ్ళాడి అరణ్యమంతా విహరించుదాం, నాతో రా!" అన్నది. లక్ష్మణుడికి ఆగ్రహం వచ్చి కత్తి దూసి దాని ముక్కూ, చెవులూ నరికేశాడు. అసలే వికారంగా ఉన్న ఆ రాక్షసి మరింత భయంకరంగా అయి, పెడబొబ్బలు





పెడుతూ అరణ్యంలోకి పారిపోయింది. తరవాత వారిద్దరూ సీత కోసం ఆ వన మంతా వెదక నారంభించారు. ఇంతలో ఉన్నట్టుండి ఒక భయంకరమైన ధ్వని పుట్టి ఆకాశానా, దిక్కులా మారుమోగింది. రామలక్ష్మణులా ధ్వని వచ్చిన దిక్కుగా వెళ్ళి గుబురుగావున్న ఒక పొదలో ఒక వింత ఆకారాన్ని చూశారు.

ఆ ఆకారం చిన్నకొండ ప్రమాణంలో ఉన్నది. నల్లగా ఉన్నది. దానికి తలా, మెడా, కాళ్ళూ లేవు. వక్షస్థలంలో ఒక పెద్ద కన్ను కాంతివంతంగా ప్రకాశిస్తున్నది. దాని కొక పెద్దరెప్ప కూడా ఉన్నది. దానికి కిందుగా పొట్టలో పెద్ద నోరున్నది. మొండెం లాగున్న ఈ ఆకారానికి అతిదీర్ఘమైన చేతులు మాత్రం ఉన్నాయి.

ఈ వింత అవతారం కబంధుడనే రాక్షసుడు. అలా ఒకే చోట కదలకుండా ఉండి, అతి దీర్ఘమైన చేతులు చాచి, ఎంతో దూరాన ఉన్న జంతువులనూ, మనుషులనూ కూడా పట్టి భక్షిస్తూ ఉంటాడు.

రామలక్ష్మణులు తన ఎదటికి రాగానే కబంధుడు ఇద్దరినీ చెరొక చేత్తోనూ బలంగా పట్టేసి, తన కేసి లాక్కోసాగాడు. ఎంతో బలమూ, ఆయుధాలూ ఉండి కూడా ఆ అన్నదమ్ములు వాడి చేతిపట్టు వదిలిం



ఛుకోలేక పోయారు. లక్ష్మణుడు భయపడి పోయి, "అన్నా, నన్ను వీడికి బలి ఇచ్చి నీ ప్రాణాలు కాపాడుకుని, వెళ్ళి సీతను వెతుకు!" అన్నాడు.

రాముడు లక్ష్మణుడికి భయపడ వద్దని ధైర్యం చెప్పాడు.

ఇంతలో కబంధుడు భయంకరమైన గొంతుతో, "ఇద్దరూ బలిసిన అబోతుల్లాగున్నారు. మిమ్మల్ని విడవను. నా నోటికి చిక్కారు," అన్నాడు.

ఆ మాటలు వినగానే రాముడికి భయంతో నోరెండుకు పోయింది. క్షణం క్రితం లక్ష్మణుడికి ధైర్యం చెప్పినవాడు కాస్తా నీరు కారి పోయి, "మన రోజులు బాగాలేవు. అన్నీ కష్టాలే. మన కిలాంటి ఘోర మరణం రాసిపెట్టి ఉన్నదికాబోలు. కాలం తీరితే ఎంతెంత మహావీరులు కూడా యుద్ధంలో చావటం లేదా?" అన్నాడు.

అంతలో లక్ష్మణుడికి పరాక్రమం వచ్చేసింది. అతను రాముడితో, "వీడు మనని తినటానికి సిద్ధంగా ఉన్నాడు. వీడి బలమంతా చేతుల్లోనే ఉంది. వీడి చేతులు రెండూ నరికేద్దాం!" అన్నాడు.

కబంధు డీ మాటలు విని మండిపడి నోరు తెరిచి ఇద్దరినీ మింగబోయాడు. సరిగా ఆ క్షణంలోనే రాముడు వాడి కుడిచేతినీ,





లక్ష్మణుడు వాడి ఎడమచేతినీ నరికేశారు. ఆ దెబ్బతో కబంధుడు పెడబొబ్బలు పెడుతూ పడిపోయాడు.

వాడు రామలక్ష్మణులను, "మీ రెవరు?" అని అడిగాడు. లక్ష్మణుడు వాడికి తమ సంగతి చెప్పి, "ఈ వింత ఆకారం గల నీ వెవడవు? ఈ వనంలో ఎందుకున్నావు?" అని అడిగాడు.

"మీ రిద్దరూ రామలక్ష్మణులా? మీరు ఈ అరణ్యానికి రావటం నాకు చాలా మంచి దయింది. నా కథ చెబుతాను వినండి," అంటూ కబంధుడు తన వృత్తాంతం వారికి యిలా చెప్పాడు:

ఒకప్పుడు ఈ కబంధుడు ఇంద్రుడికి తీసిపోని దేవరూపం గలవాడు. అయితే అతను భయంకరమైన ఈ రూపం ధరించి వనాలలో ఉండే మునులను భయపెట్టుతూ వచ్చాడు. ఇలా చేస్తూండగా ఒకసారి స్థూలశిరుడనే మహాముని తటస్థపడి, "నీకీ రూపమే శాశ్వతంగా ఉండిపోవు గాక!" అని శపించాడు. అప్పు డీ కబంధుడు మునికి క్షమాపణ చెప్పుకుని శాప విముక్తి ఎలాగని అడిగాడు. "ఎప్పుడు రాముడు అడవికి వచ్చి, నీ చేతులు నరికి నీకు దహనక్రియలు చేస్తాడో అప్పుడు నీకు యథారూపం వస్తుంది," అని ముని చెప్పి వెళ్ళిపోయాడు. స్థూలశిరు డిచ్చిన ఈ శాపం అతి విచిత్రంగా ఫలించింది. శాపం తగలక మునుపే కబంధుడు బ్రహ్మను గురించి అతి దారుణమైన తపస్సు చేశాడు. బ్రహ్మ అతడి తపస్సు మెచ్చుకుని అతనికి దీర్ఘాయువు వరంగా ఇచ్చాడు. "బ్రహ్మదేవుడు నాకు దీర్ఘాయు విచ్చాడు గనక నన్నిక దేవేంద్రుడు కూడా ఏమీ చేయలేడు," అని గర్వించి, అతను ఇంద్రుణ్ణి యుద్ధానికి పిలిచాడు. ఇంద్రుడు వజ్రాయుధంతో అతని తలనూ, కాళ్ళనూ శరీరంలోకి తోసేసి మొండెంలాగా తయారుచేశాడు.





ఆ రూపంతో ఎలా బతకటం? అందు చేత అతను ఇంద్రుణ్ణి ఎంతగానో వేడుకుని తన ప్రాణాలు తీసెయ్యమన్నాడు. "బ్రహ్మ దేవుడు నీకు దీర్ఘాయు విచ్చి ఉండగా నేను నీ ప్రాణాలెలా తియ్యను? నేనా పని చెయ్యను," అన్నాడు ఇంద్రుడు.

"తిండి తినటానికి నోరుకూడా లేకుండా నేను దీర్ఘకాలం ఎలా జీవిస్తాను?" అని కబంధుడు అడిగాడు.

అప్పు డింద్రుడు అతనికి అతి దీర్ఘమైన చేతులూ, కడుపులో పదునైన కోరలు గల నోరూ ఏర్పాటు చేశాడు. అతడికి కబంధ రూపం ఏర్పడింది. ముని శాపం ఫలించింది. ఆ తరవాత కబంధుడు అక్కడే ఉండిపోయి అందిన ప్రతి ప్రాణినీ తింటూ వచ్చాడు. కబంధు డీ కథంతా చెప్పినాక రాముడు, "నా భార్య అయిన సీతను రావణు డనేవాడు ఎత్తుకుపోయాడు. అతని పేరు తెలుసే తప్ప, ఎక్కడ ఉంటాడో, ఎవడో, అతని శక్తి ఎటువంటిదో మాకు తెలియదు. అష్ట కష్టాలూ పడి సీతను వెతుకుతున్న మాకు నీబోటివాడు సహాయం చెయ్యటం భావ్యం," అన్నాడు.

దానికి కబంధుడు, "నా కిప్పుడు దివ్య జ్ఞానం ఏమీలేదు. నన్ను మీరు దహించి నట్టయితే నిజరూపం పొంది మీకు చేతనైన





రాజ్యాన్నీ, భార్యనూ పోగొట్టుకుని, అన్న భయం చేత పంపాసరోవర సమీపాన ఋశ్య మూకపర్వతం మీద నలుగురు అనుచరులతో ఉంటున్నాడు. అతను సుగ్రీవు డనే పేరు గల వానరరాజు, వాలి అనేవాడి తమ్ముడు, సత్యసంధుడు, సమర్థుడు, పరాక్రమశాలి. సీతను వెదకటానికి అతను సహాయపడగలడు. నీవు ముందుగా అతని వద్దకు వెళ్ళి అగ్నిసాక్షిగా అతనితో స్నేహం చేసుకో. అతను కోరిన సహాయం చెయ్యి, అతని నుంచి సహాయం పొందు. అతని భటులైన వానరులు సీత ఎక్కడ వున్నదీ తప్పక తెలుసుకోగలరు."

కబంధు డీ మాటలు చెప్పి, ఋశ్య మూకానికి వెళ్ళే మార్గం వివరించి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

సుగ్రీవుణ్ణి కలుసు కోవటం లక్ష్యంగా పెట్టుకుని రామలక్ష్మణులు పంపాసరోవరం కేసి బయలుదేరారు. వారు మర్నాటికి పంపాసరస్సు యొక్క పడమటి గట్టు చేరుకుని, అక్కడ చెట్ల మధ్య అందమైన శబరి ఆశ్రమం చూశారు.

ఈ ఆశ్రమంలో మతంగమహాముని ఉండేవాడు. ఆయన వద్ద తపశ్శక్తిసంపన్నులైన శిష్యులుండేవారు. శబరి అనే సన్యా

సహాయం చేస్తాను, సలహా ఇవ్వగలుగుతాను," అన్నాడు.

రామలక్ష్మణులు ఒక పల్లపు ప్రదేశంలో చితిపేర్చి దానిపైన కబంధుణ్ణి పెట్టి దహనం చేశారు. కొద్దిసేపట్లో ఆ చితిని తోసుకుని ఒక దివ్యపురుషుడు స్వచ్ఛమైన బట్టలు కట్టుకుని, అనేక దివ్యాభరణాలతో పైకి వచ్చాడు. అతను హంసలతో అలంకరించబడిన విమానంలో కూచుని ఆకాశంలోకి లేచి, రాముడితో ఇలా అన్నాడు.

"రామా, సీతను తిరిగి సంపాదించుకోవటానికిగాను నీకు ఒక వ్యక్తి సహాయం చెయ్యగలడు. అతడు కూడా నీలాగే





సిని ఆ శిష్యులకు సేవచేస్తూ తాను కూడా తపస్సు చేసింది. రాముడు చిత్రకూటానికి వచ్చిన సమయంలో ఆ మతంగ శిష్యులు ఐహికజీవితం చాలించి స్వర్గానికిపోతూ శబరితో, "రాముడు నీ ఆశ్రమానికి రాగలడు. అతనికి చక్కగా అతిథి సత్కారాలు చేసి పుణ్యలోకాలు పొందు," అని చెప్పారు. వారు వెళ్ళినాక వృద్ధురాలైన శబరి రాముడి రాకకు ఎదురుచూస్తూ, వన్యాహారాలూ, ఫలాలూ అతని కోసం దాచి ఉంచింది.

శబరి రామలక్ష్మణులకు వందనం చేసి ఈ సంగతి తెలిపింది. రాముడి కోరికపై ఆమె రాముడికి తపోవనమంతా చూపింది. అక్కడ మునులు తమ తపశ్శక్తి చేత సప్త సముద్రాలూ సృష్టించుకున్నారు. వారి యాగవేదిక చెక్కుచెదరకుండా ఉన్నది. ఏనాడో ఆ మునులు కట్టిన పుష్పమాలలు వాడకుండా నిలిచి ఉండటం రాముడు చూశాడు. ఇలా అక్కడి వింతలన్నీ చూపించి శబరి రాముడితో, "ఇంక నేను దేహం చాలించి నా యజమానులైన మహా మునులను చేరుకుంటాను," అన్నది. తరవాత ఆమె అగ్నిప్రవేశం చేసి ఊర్ధ్వలోకాలకు వెళ్ళిపోయింది.

రాముడు ఆ వనం చూసి, అక్కడి సప్తసముద్రాలలో స్నానం చేసి, తర్పణాలు విడిచిన మీదట అతనికి మనశ్శాంతి కలిగింది, భవిష్యత్తు గురించి ఆశ పుట్టుకొచ్చింది. అతను లక్ష్మణుడితో సహా ఆ ఆశ్రమం దాటి పంపా సరస్సుకు వెళ్ళాడు. దానికి సమీపంలోనే మతంగ సరస్సున్నది. రాముడు అందులో స్నానం చేసి లక్ష్మణుడితో, "లక్ష్మణా, ఈ సమీపంలోనే ఋశ్యమూకపర్వతం పైన సుగ్రీవుడుంటాడు. నీవు బయలుదేరి అతని వద్దకు వెళ్ళు," అన్నాడు.

[అరణ్యకాండ సమాప్తం]








# కిష్కింధా కాండ

వసంతకాలం. పంపాసరస్సులోని జలం నిర్మలంగా ఉన్నది. అందులో కమలాలూ, నల్ల కలువలూ పూస్తున్నాయి. సరస్సు చుట్టూ ఉండే అరణ్యం అత్యంత మనోహరంగా ఉన్నది. గండు కోయిలలు కూస్తున్నాయి. నెమళ్లు నాట్యం చేస్తున్నాయి.

ఈ వసంత శోభను గమనించి రాముడు ఒక వంక ఆనందమూ, మరొక వంక సీతకై విరహమూ పొంది తన స్థితికి ఎంతగానో విలపించాడు. ఎటు చూసినా, దేన్ని చూసినా అతనికి సీతే జ్ఞాపకం వచ్చింది. అతను లక్ష్మణుడితో నిరాశాపూరితంగా మాట్లాడాడు. "లక్ష్మణా, ఈ మనోహరమైన ప్రాంతంలో నా వెంట సీతే ఉంటే జీవితంలో ఇంకేమీ కోరను. కాని సీత లేకుండా జీవించటం అసంభవంగా ఉన్నది. నేను ప్రాణాలు వదిలేస్తాను, నీవు భరతుడి వద్దకు వెళ్ళి పో," అని పెద్ద పెట్టున ఏడవసాగాడు.

లక్ష్మణుడు రాముడికి హితం చెప్పాడు. సీతపై గల అమితమైన ప్రేమచేతనే దుఃఖం కలుగుతున్నదనీ, ఆ ప్రేమనూ, విరహాన్నీ దూరంగా ఉంచమనీ, రావణుడి జాడ తెలుసుకుని సీతను తెచ్చుకోవలసి ఉన్నదనీ, రావణుడు మంచిగా సీత నివ్వకపోతే అతణ్ణి వధించవలసి ఉంటుందని, ఇందుకు ధైర్యం అవసరమనీ, దుఃఖం కార్యనాశకమనీ లక్ష్మణుడు రాముడికి చెప్పి ధైర్యం కలిగించాడు. వారిద్దరూ ఆ వనమంతా తిరగసాగారు.









సుగ్రీవుడు తన మంత్రులతో, "వీరెవరో నారబట్టలు కట్టి, మారు వేషాలు వేసుకుని, పని బెట్టుకుని ఈ అరణ్యంలోకి వచ్చారు. ఎందుకో తెలుసా? వాలే వీరిని పంపి ఉంటాడు," అన్నాడు. ఆ మాటలు విని అందరూ భయపడ్డారు.

అప్పుడు, సుగ్రీవుడి మంత్రులలో ఒక డైన హనుమంతుడు, "మీరంతా ఎందుకిలా భయపడుతున్నారో తెలియకుండా ఉంది. ఈ ఋశ్యమూకం మీదికి వాలి రాడు, అతని జాడకూడా ఏమీ కనిపించలేదు. రాజైన వాడికి ఇలాటి చపలచిత్తం కూడదు," అని చెప్పాడు.

రామలక్ష్మణులు పంపాసరస్సు వద్దకు వచ్చిన క్షణం నుంచీ, ఋశ్యమూక పర్వతం మీద ఉంటున్న సుగ్రీవుడనే వానరరాజు వారిని చూస్తూనే ఉన్నాడు. ఏనుగు గున్నల్లా గున్న ఆ ఇద్దరూ ఆ ప్రాంతానే తచ్చాడుతూ ఉండటం చూసి సుగ్రీవుడికి దడ పుట్టు కొచ్చింది. తనకు కీడు చేసే ఉద్దేశంతో తన అన్న అయిన వాలి వారిని పంపి ఉంటా డనుకుని సుగ్రీవుడు తన మంత్రులైన వానరులతో సహా మతంగాశ్రమంలోకి వెళ్ళి కూచున్నాడు. ఎందుకంటే అక్కడ వారికి వాలి భయం లేదు. వాలి తాలూకు మను షులు కూడా అక్కడికి రాలేరు.

ఆ మాట విని సుగ్రీవుడు, "వాలి ఇక్కడికి వచ్చాడని నే ననలేదు. ఆ మనుషులను చూడు; పొడుగైన వాళ్ళ చేతులు చూడు, ఆ చేతుల్లో ఉండే కత్తులూ, వారి విల్లంబులూ చూడు! వారిని చూస్తే ఎవరికైనా భయం కలుగుతుంది. వాలే వారిని తప్పక పంపి ఉంటాడని నా అను మానం. వాలి రాజు గనక అతనికి ఎందరో సహాయకులుంటారు. మనం ఎంతో జాగ్రత్తగా ఉండాలి. లేకపోతే మనని శత్రువులు ఏమార్చి నాశనం చేసేస్తారు. వాలి మహాదక్షుడు. అందుచేత నీవు మాకు







వేషంతో వెంటనే వారి వద్దకు వెళ్ళి, వారితో మాట్లాడి వారి రహస్యం ఏమిటో తెలుసుకు రావాలి," అన్నాడు.

తమ రాజైన సుగ్రీవుడి అభిప్రాయం తెలుసుకుని హనుమంతుడు వానర రూపం వదిలి బ్రహ్మచారి రూపం ధరించి రామ లక్ష్మణుల వద్దకు వెళ్ళి, వినయంతో వారికి నమస్కారం చేసి, "అయ్యలారా, మీరు వ్రతదీక్ష బూని తపస్సు చేసుకునే రాజర్షు ల్లాగా కనిపిస్తున్నారు; ఎక్కడో రాజ్యాలేల వలసిన మీరు ఈ పంపా సరోవర ప్రాంతాన, నారబట్టలు కట్టి ఎందుకు తిరుగుతున్నారు? మీ రెవరు? మా రాజైన సుగ్రీవుడనే వానరుడు అన్న చేత వెళ్ళగొట్టబడి, దీనుడై తిరుగుతున్నాడు. నే నాయన మంత్రిని. నా పేరు హనుమంతుడు. నా తండ్రి వాయుదేవుడు. సుగ్రీవుడి కోరికపై నేను ఈ బ్రహ్మచారి రూపు ధరించి ఋశ్యమూక పర్వతం నుంచి వచ్చాను. నాకు కామరూప, కామగమన శక్తులున్నాయి," అని చెప్పాడు.

హనుమంతుడి మాటలు వింటూంటే రాముడి ముఖాన ఆనంద రేఖలు గోచ రించాయి. అతను లక్ష్మణుడితో, "ఇతనికి నీవే సమాధానం చెప్పు. ఇతని మాటల తీరు చూడగా మంచి భాషా జ్ఞానమూ,



పాండిత్యమూ కలవాడుగా కనిపిస్తున్నాడు. ఇలాటి దూతలు గల రాజే రాజు," అన్నాడు.

అప్పుడు లక్ష్మణుడు హనుమంతుడి కేసి తిరిగి, "హనుమంతుడా, వానర రాజైన సుగ్రీవుణ్ణి గురించి మాకు బాగా తెలుసు. మే మాయనకోసమే వెతుకుతూ వస్తున్నాము. ఈయన మా అన్న రాముడు. ఇతనికి మీ సుగ్రీవుడి సహాయం కావలసి ఉన్నది. సుగ్రీవుడికి ఈయన తిరిగి రాజ్యం ఇప్పించ గలడు," అంటూ తమ కథ యావత్తూ హనుమంతుడికి సవిస్తరంగా చెప్పేశాడు. చిట్టచివరకు, "రాముడి భార్యను తీసుకు పోయిన రాక్షసుడి జాడ సుగ్రీవుడు చెప్ప







గలడని కబంధుడి ద్వారా మాకు తెలిసింది. సీతను వెదకటానికి సుగ్రీవుడు మాకు సహాయపడాలి. అడిగిన వారికి అంతులేని దానాలు చేసిన ఈ రాముడు ఈ సహాయం కోసం సుగ్రీవుడి శరణు జొచ్చాడు," అని లక్ష్మణుడు హనుమంతుడితో అన్నాడు. ఈ మాటలు నోటి వెంట అనటానికి లక్ష్మణుడికి ఎంతో దుఃఖం కలిగింది.

హనుమంతుడు లౌక్యంగా, "మీరు మహానుభావులు. మిమ్మల్నే సుగ్రీవుడు వెతుక్కుంటూ రావలిసింది. ఆయన పుణ్యవశాన మీరే ఆయనను వెతుక్కుంటూ వచ్చారు. సీతాదేవిని వెతకటానికి సుగ్రీవుడు పూర్తిగా మీకు సహకరిస్తాడు. ఇంక మనం సుగ్రీవుడి వద్దకు పోదామా?" అన్నాడు.

హనుమంతుడు నమ్మదగిన వాడేననీ, అతను నిజమే చెబుతున్నాడనీ తృప్తి కలిగి రామలక్ష్మణులు అతని వెంట వెళ్ళటానికి సిద్ధపడ్డారు. హనుమంతుడు బ్రహ్మచారి రూపు వదిలిపెట్టి వానర రూపం ధరించి, రామలక్ష్మణులను తన వీపు మీద ఎక్కించుకుని ఋశ్యమూక పర్వతానికి వెళ్ళాడు. సుగ్రీవుడు ఋశ్యమూకం మీద లేడు, మలయపర్వతం మీద ఉన్నాడు; హనుమంతుడు అక్కడికి వెళ్ళి రామలక్ష్మణులు వచ్చి ఉన్నారనీ, సుగ్రీవుడు వచ్చి వారితో స్నేహం చేసుకోవటం లాభకరమనీ చెప్పాడు. రామలక్ష్మణులకు సుగ్రీవుడి వల్ల కావలిసిన సహాయంకూడా వివరించాడు.

హనుమంతుడి మాటలు విన్నాక సుగ్రీవుడి భయం తీరిపోయింది. అతను సంతోషించి, తన వానరరూపు విడిచి అందమైన మానవరూపు ధరించి రామలక్ష్మణులను చూడవచ్చాడు. ఆయన రాముడితో, "మిమ్మల్ని గురించి హనుమంతుడు అంతా చెప్పాడు. మహారాజువైన నీవు నా స్నేహం కోరి రావటం వానరుణ్ణయిన నాకు ఎంతో గౌరవం, ఎంతో లాభకరం," అంటూ స్నేహ





చిహ్నంగా చెయ్యి చాచాడు. రాముడు సుగ్రీవుడి చేతిని పట్టుకుని తన స్నేహ భావాన్ని అతడికి స్పష్టం చేశాడు. తరవాత రాముడు సుగ్రీవుణ్ణి గాఢంగా ఆలింగనం చేసుకున్నాడు.

హనుమంతుడు అరణులు మథించి అగ్ని చేసి, ముందుగా తానా అగ్నిని పూజించి తెచ్చి రామ సుగ్రీవుల మధ్య ఉంచాడు. వారిద్దరూ ఆ అగ్నికి ప్రదక్షిణం చేసి అగ్ని సాక్షిగా మైత్రి చేసుకున్నారు. ఇకనుంచీ ఒకరి సుఖదుఃఖాలు మరొకరివని ప్రమాణం చేసుకున్నారు. సుగ్రీవు డొక మద్దికొమ్మ విరిచి తెచ్చాడు. రాముడూ అతనూ ఆ కొమ్మమీద కూచున్నారు. అలాగే హను మంతు డొక చందనపు చెట్టుకొమ్మ విరిచి తెచ్చి లక్ష్మణుణ్ణి దానిపై కూచోబెట్టాడు. అప్పుడు సుగ్రీవుడు రాముడితో, "రామా, నా అన్న అయిన వాలి నాకు అన్యాయం చేశాడు, నా భార్యను అపహరించాడు. వాలి భయంతో ఇలా అడవులు పట్టి తిరుగు తున్న నాకు అభయం ఇవ్వాలి," అన్నాడు.

"సుగ్రీవా, నీ స్నేహానికి ప్రత్యుపకారంగా నేను నీ అన్న అయిన వాలిని చంపేస్తాను. అతని చావు నా బాణాలలోనే ఉన్నది," అని రాము డన్నాడు.



"నీ అనుగ్రహంతోనే నేను రాజ్యాన్నీ, నా భార్యనూ తిరిగి పొందవలసి ఉన్నది. మీరు ఏ పని మీద ఈ నిర్జన వనాల్లో తిరుగు తున్నారో అదంతా హనుమంతుడు చెప్పాడు. నీవూ, నీ తమ్ముడూ లేని సమయం చూసి ఒంటిగా ఉన్న సీతాదేవిని బలాత్కారంగా రావణుడు ఎత్తుకుపోయాడు. తనకు అడ్డు తగిలిన జటాయువును కూడా అతను చంపేశాడు. నీకు త్వరలోనే భార్యా వియోగం పోతుంది. సీతాదేవి మూడు లోకాలలో ఎక్కడ ఉన్నప్పటికీ ఆమెను తెచ్చి నీకు అప్పగిస్తాను. ఇప్పుడు నాకు అర్థమయింది, నేనా నాడు చూసినది సీతా







దేవినే, సందేహం లేదు. రావణుడి ఒడిలో కూచుని ఏడుస్తూ ఆకాశ మార్గాన పోతున్న సీతను నేను చూశాను. ఆవిడకూడా నన్నూ, నా వెంట ఉన్న నలుగురు వానర వీరులనూ చూసింది; చూసి, తన ఆభరణాలను పై బట్టలో మూట గట్టి మా కేసి విసిరింది. ఆ ఆభరణాలను ఇంత కాలంగా భద్రంగా ఉంచాము. వాటిని చూసి నీవు గుర్తు పట్ట వచ్చు," అన్నాడు.

రాముడీ మాట విని ఆ ఆభరణాలు చూడటానికి తహతహ లాడాడు. సుగ్రీవుడు లేచి ఒక గుహలోకి వెళ్ళి, సీత ఆభరణాల మూటతో తిరిగి వచ్చాడు. మూటను



చూస్తూనే రాముడు సీత ధరించిన పై బట్టను గుర్తించి శోకావేశంతో కూలిపోయాడు. అతను కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ, "లక్ష్మణా, రావణుడు ఎత్తుకుపోయేటప్పుడు సీత పడవేసిన ఈ పై బట్టా, నగలూ చూడు. వీటిని దట్టమైన పచ్చిక మీద వేసిందికాబోలు, కొంచెంకూడా దెబ్బ తగల కుండా ఎలా ఉన్నాయో!" అన్నాడు.

లక్ష్మణుడు సీత ఆభరణాలు చూసి, "ఈ కేయూరాలూ, కుండలాలూ నేను గుర్తించలేదు గాని, సీత కాళ్ళకు నమస్క రించేటప్పుడు కనిపించిన అందెలు మాత్రం ఇవే," అన్నాడు.

రాముడు సుగ్రీవుడి కేసి తిరిగి, "నీవు చూస్తూండగానే గదా ఆ రాక్షసుడు ప్రాణ సమానురాలయిన నా భార్యను ఎత్తుకు పోయాడు! వాడెక్కడికి వెళ్ళాడు? దయ చేసి చెప్పు, వాడి ప్రాణాలు ఇప్పుడే తీస్తాను," అన్నాడు.

రావణుణ్ణి గురించి తనకు ఏమీ తెలియ దన్నాడు సుగ్రీవుడు; అయితే సీత దొరక గలందులకు తగిన ప్రయత్నాలన్నీ తాను చేస్తానని ప్రతిజ్ఞ చేశాడు. తరవాత అతను రాముడికి ధైర్యం చెబుతూ, "వానర మాత్రుణ్ణి అయి ఉండికూడా నేను భార్య







కోసం ఇలా దుఃఖంతో కుంగి పోలేదు. దుఃఖం వల్ల ప్రయోజనం లేదు, పౌరుషం అవలంబించాలి, ధైర్యంగా ఉండాలి," అని హితవు చెప్పాడు.

ఈ మాటలు విని రాముడు ధైర్యం తెచ్చుకుని, కళ్ళు తుడుచుకుని సుగ్రీవుడితో, "నీవు నిజమైన మిత్రుడనదగిన మాట అన్నావు. కష్ట సమయంలో నీలాటి ఆప్తుడు దొరకటం కష్టం. నీవు మాత్రం సీతను వెతికే ప్రయత్నం తప్పక చేయాలి. ఇప్పుడు నేను నీకు చెయ్యవలసిన సహాయం గురించి చెప్పా. ఆ సహాయం నా వల్ల అవుతుందో కాదోనన్న సందేహమేమీ పెట్టుకోకు. వాలిని చంపుతానని మాట ఇచ్చానే. అందులో అబద్ధమేమీ లేదు. నే నెన్నడూ అబద్ధ మాడినవాణ్ణి కాను," అన్నాడు.

రాముడి మాటలకు వానరులు పరమానందం చెందారు. తరువాత రామ సుగ్రీవులు ఏకాంతంగా సంభాషించుకుని తమతమ కష్టాలు ఒకరికొకరు చెప్పుకున్నారు. సుగ్రీవుడు రాముడితో, "నా అన్న వాలి బలశాలి. యువరాజుగా ఉన్న నన్ను తిట్టి, రాజ్యం నుంచి వెళ్ళగొట్టాడు. ప్రాణాల కన్న ఎక్కువైన నా భార్యను హరించాడు. నా స్నేహితులను కారాగృహంలో పెట్టాడు. నన్ను చంపే ఉద్దేశంతో ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నాడు. అతను పంపిన వానరులను ఎంతమందినో నేను చంపాను. మా అన్న భయంతోనే నేను మిమ్మల్ని చూడగానే మీ ఎదటికి రాలేదు. నా కిప్పుడున్నదల్లా ఈ హనుమంతుడు మొదలైనవారే. వారి చలవవల్లనే నే నింకా బతికి ఉన్నాను. నాకు పరమ విరోధి అయిన ఆ వాలి చస్తే తప్ప నాకు జీవితం లేదు, సుఖం లేదు. ఇది నా విషాదగాథ. కష్టాలు మిత్రులకే చెప్పుకోవాలిగద," అన్నాడు.






సుగ్రీవుడి మాటలు విని రాముడు "మీ ఇద్దరి మధ్యాగల వైర కారణమేమిటో తెలుసుకోవాలని ఉన్నది. ఆ కారణమూ, మీ బలాబలాలూ తెలుసుకున్న మీదట నీకు సుఖం కలిగే మార్గం ఆలోచించ గలుగుతాను," అన్నాడు.

దానికి సుగ్రీవు డిలా చెప్పాడు.

"మా అన్న అయిన వాలిని నా తండ్రీ, నేనూ ఎంతో గౌరవంతో చూసే వాళ్ళం. మా తండ్రి పోయాక, పెద్దవాడు గనక వాలి రాజ్యానికి వచ్చాడు. నేను వాలికి సేవకుడు లాగా ఎంతో వినయ విధేయతలు చూపే వాణ్ణి. దుందుభి అనేవాడి పెద్ద కొడుకు మాయావి అనే రాక్షసుడు చాలా గొప్ప పరాక్రమశాలి. ఒక స్త్రీ విషయంలో మాయావికీ, వాలికీ తగాదా వచ్చింది. ఒకనాటి అర్ధరాత్రివేళ ఆ మాయావి కిష్కింధా ద్వారం వద్దకు వచ్చి, పెద్ద పెట్టున గర్జిస్తూ వాలిని యుద్ధానికి పిలిచాడు. వాలి నిద్ర మేలుకొని మాయావి మదం అణచటానికి బయలుదేరాడు. నేనూ, ఆడ వాళ్ళూ ఎంత ఆపినా వాలి ఆగలేదు. అతను ఒంటరిగా పోతున్నాడే అని నేను కూడా వెంట వెళ్ళాను.

"మాయావి మా అన్నను చూస్తూనే భయపడి పారిపోసాగాడు. మేమతని వెంట పడ్డాం. ఇంతలో చంద్రోదయం కూడా అయింది. మాకూ తనకూ ఉండే దూరం







క్రమంగా తగ్గుతూండటం చూసి మాయావి ఒక బిలంలో దూరాడు.

"వాలి ఆ బిలంలోకి వెళ్ళి మాయావిని చంపివస్తాననీ, తాను వచ్చేదాకా నన్ను బిలం వెలపల ఉండమనీ చెప్పాడు. నేను కూడా వస్తానంటే వినక, తన పాదాలమీద ప్రమాణం చేయించుకుని వాలి ఆ బిలం ప్రవేశించాడు.

"మా అన్న కోసం ఆ బిల ద్వారం వద్ద పూర్తిగా ఒక సంవత్సరం కాచుకుని ఉన్నాను. వాలి జాడలేదు. వాలి చనిపోయి ఉంటాడేమోనని నాకు భయమూ, అనుమానమూ కలిగాయి. నా భయానికి



తగ్గట్టుగా బిలం నుంచి నురుగుతో కూడిన ఎర్రని రక్తం రాసాగింది. లోపల నుంచి గర్జనలూ, ఆక్రందనలూ వినిపించాయి. ఆక్రందన ధ్వని వాలిదిలాగా నాకు తోచింది. ఈ లక్షణాలన్నీ గమనించి వాలి చని పోయాడనుకుని నాకు భయమూ, దుఃఖమూ కలిగాయి. నేను ఆ బిల ద్వారాన్ని పెద్ద కొండరాయితో మూసి, వాలికి జలతర్పణాలు విడిచి కిష్కింధకు తిరిగి వచ్చాను.

"వాలి మరణ వార్త నేనై చెప్పకపోయి నప్పటికీ మంత్రులు నా నుంచి రాబట్టి, తమలో తాము ఆలోచించుకుని నాకు పట్టాభిషేకం చేశారు. నేను రాజ్యపాలన చేస్తూండగా వాలి మాయావిని చంపేసి తిరిగి వచ్చాడు.

"నేను రాజు నయానని తెలిసి వాలి మండి పడ్డాడు. మంత్రులను బంధించాడు. నన్ను నానా మాటలూ అన్నాడు. నేను గౌరవంగా వాలికి నమస్కారం చేశాను. అతను నన్ను ఆశీర్వదించ లేదు. నా కిరీటం తీసి అతని పాదాల దగ్గిర పెట్టాను. కాని అతని కోపం చల్లారలేదు. అతన్ని రాజ్యం చెయ్యమని వేడుకున్నాను. బిలం దగ్గిర నేను చూసినదీ, విన్నదీ చెప్పాను. బిలానికి రాయి ఎందుకు అడ్డంగా పెట్టానో చెప్పాను.







నేను రాజ్యాభిషేకం కోరలేదనీ, రాజ్య క్షేమం కోరి మంత్రులే నాకు పట్టం గట్టారనీ అన్నాను. నీవు లేనప్పుడు రాజుగా పని చేశానుగాని, ఇప్పుడు నీకు యువరాజు నేనని కూడా చెప్పాను.

"వాలి ఇదేదీ లక్ష్య పెట్టాడుకాడు. తన కిష్టులైన మంత్రుల ముందు నన్ను నానా దుర్భాషలూ ఆడాడు. అతను బిలంలో ప్రవేశించాక ఒక ఏడాదిపాటు మాయావి కనిపించనే లేదట. తరవాత వాణ్ణీ, వాడి బంధువుల నందరినీ చంపాడట. రక్తం ప్రవహించ నారంభించగానే దుర్గంధం భరించలేక బిల ద్వారం వద్దకు వచ్చి నన్ను పిలిచాడట. నేను తన కోసం వేచి ఉండక పోగా, తనను బిలంలో బంధించటానికి రాయి అడ్డు పెట్టానని వాలి తన మంత్రు లతో అన్నాడు. ఇలా నాపై నింద మోపిన అనంతరం అతను నన్ను కట్టు బట్టతో కిష్కింధ నుండి వెళ్ళ గొట్టేశాడు. నా భార్యను కాజేశాడు.

"ఈ విధంగా అన్న చేత వెళ్ళగొట్టబడి నేను ప్రపంచమంతా తిరిగాను. చిట్టచివరకు నాకీ ఋశ్యమూకం మీద నిలవ నీడ దొరికింది. ఎందుకంటే ఒకానొక కారణం చేత వాలి ఈ పర్వతం పైన అడుగు పెట్ట



లేడు. నా వల్ల ఏ తప్పూ లేకపోయినప్పటికీ నేనిలా కష్టాల పాలయాను.

"ఇక వాలియొక్క శక్తి సామర్థ్యాలు చెబుతాను. అతను సూర్యోదయానికి పూర్వమే నాలుగు దిక్కుల సముద్రాలూ సునాయాసంగా చుట్టి వస్తాడు. పర్వత శిఖరాలపై కెక్కి కొండరాళ్ళను బంతుల్లాగా ఎగరేసి పట్టుకుంటాడు. పెద్ద పెద్ద అడవి మానులను అవలీలగా విరిచెయ్యగలడు.

"ఇంకొక కథ చెబుతాను. దున్నపోతు రూపంలో దుందుభి అనే రాక్షసుడు మహా బలశాలి ఉండేవాడు. వాడిది వెయ్యి ఏనుగుల బలం. వాడు బల గర్వితుడై







సముద్రుడి వద్దకు వెళ్ళి తనతో యుద్ధానికి రమ్మని పిలిచాడు. సముద్రుడు మానవ రూపంలో పైకి వచ్చి దుందుభితో, 'నీ బోటి యుద్ధ విశారదుడితో యుద్ధం చేసే శక్తి నాకైతే లేదుగాని అలాటి శక్తి గల వాడెవడైనా ఉంటే అది హిమవంతుడు. నీవు అతనితో యుద్ధం చేస్తే బాగుంటుంది,' అని చెప్పాడు.

"దుందుభి శరవేగంతో హిమాలయానికి వెళ్ళి, తన కొమ్ములతో గుండురాళ్ళను విరజిమ్ముతూ, రంకెలు పెట్టి హిమవంతుణ్ణి యుద్ధానికి పిలిచాడు. హిమవంతుడు దుందుభితో, 'నాయనా, నేను నీతో యుద్ధం చెయ్యలేను, నన్నెందుకు బాధిస్తావు? అదీ



గాక ఇక్కడ ఎందరో మునులు తపస్సు చేసుకుంటున్న కారణం చేత యుద్ధానికి వీలుపడదు. కిష్కింధలో వాలి అనే వానర శ్రేష్ఠుడున్నాడు. యుద్ధంలో అతను నీ తీట తీర్చగలడు,' అని చెప్పాడు.

"దుందుభి కిష్కింధకు వచ్చి ద్వారం వద్ద నేలను గిట్టలతో గీరుతూ ఆర్భాటం చేశాడు. వాడు చేసే ఆగడం సహించలేక వాలి అంతఃపుర కాంతలతో సహా బయలుదేరి వచ్చాడు. అతను దుందుభితో, 'ఓరీ, నేను నిన్నెరుగుదును. ఎందుకు రంకెలు పెడుతున్నావు? ప్రాణాల మీద ఆశ లేదా?' అన్నాడు. దుందుభి మండిపడి, 'స్త్రీల ఎదట బీరాలు పలకటం కాదు, నాతో యుద్ధం చెయ్యి. ఇప్పుడు కాకపోతే, ఈ రాత్రి అంతా సుఖంగా గడిపి, నీ వానరుల కందరికీ అప్పగింతలు చెప్పి, నీ స్థానంలో మరొక రాజును ఏర్పాటు చేసుకుని, ఆఖరుసారి కిష్కింధ అంతా చూసుకుని రేపు ఉదయం యుద్ధానికి రా! అంతదాకా నీకు గడువిస్తాను,' అన్నాడు.

"వాలి దుందుభిని చూసి హేళనగా నవ్వి, తార మొదలైన అంతఃపుర స్త్రీలను పంపేసి, తనకు ఇంద్రుడిచ్చిన కాంచన మాలను మెడలో వేసుకుని యుద్ధానికి







వచ్చాడు. ఇద్దరికీ భయంకరమైన యుద్ధం జరిగింది. వస్తూనే వాలి దుందుభి కొమ్ములు పట్టుకుని గిరగిరా తిప్పి విసిరి నేలకేసి కొట్టాడు. ఆ దెబ్బకు దుందుభి చెవుల నుంచి రక్తం కారింది. క్రమంగా వాలి బలం హెచ్చింది, దుందుభి బలం క్షీణించింది. చివరకు వాలి ఆ రాక్షసుణ్ణి ఎత్తి నేలకు వేసి కొట్టి చంపాడు. అలా చచ్చిన దుందుభి కళేబరాన్ని వాలి ఎత్తి ఆమడ దూరాన వెళ్ళి పడేలాగా విసిరి వేశాడు. ఆ కళేబరం నోట కారే రక్తపు చుక్కలు మతంగ మహాముని ఆశ్రమంలో పడ్డాయి. ఆ నెత్తురు చుక్కలు చూసి మతంగుడు మండిపడి ఆశ్రమం దాటి వచ్చి దుందుభి కళేబరాన్ని చూసి, 'ఈ రాక్షస కళేబరాన్ని ఇక్కడికి విసిరిన వాడుగాని, వాడి అనుచరులుగాని ఈ వనంలోకి వస్తే చస్తారు!' అని శపించాడు.

"మతంగ మహాముని శాపం విని ఆ ప్రాంతాల ఉండే వాలి అనుచరులు భయపడి వెళ్ళిపోయి, వాలితో ఈ సంగతి చెప్పారు. శాప విమోచనం చెయ్యమని వాలి వేడుకున్నప్పటికీ మతంగుడు అనుగ్రహించ లేదు. అది మొదలు వాలి ఈ ఋశ్యమూకం చాయలకు రాడు. ఆ సంగతి తెలిసి నేను నా మంత్రులతో ఇక్కడ తల





దాచుకున్నాను. అదుగో, గుట్టలాగా కనిపించే దుందుభి కళేబరం!

"వాలి బలానికి మరొక ఉదాహరణ కూడా చెబుతాను. ఆ కనిపించే ఏడు సాల వృక్షాలున్నాయే, వాటిలో దేని కాండంలో నుంచి అయినా దూసుకుపోయేలాగా వాలి బాణం వేయగలడు. ఇంత శక్తి మంతుణ్ణి నీవు ఏ విధంగా వధిస్తావో!"

సుగ్రీవుడు చెప్పినదంతా విని లక్ష్మణుడు నవ్వుతూ, "రాముడు ఏం చేస్తే నీకు నమ్మకం కలుగుతుంది?" అని అడిగాడు.

సుగ్రీవుడు లక్ష్మణుడితో, "నాకు వాలి బల పరాక్రమాలు తెలుసును. అతను ఎన్నడూ ఓటమి ఎరగినవాడు కాడు. అందుచేతనే అతనికి వెరిచి ఇక్కడ ఉన్నాను. నాకు రాముడి పరాక్రమం తెలియదుగద!" అన్నాడు.

రాముడు దుందుభి కళేబరాన్ని సమీపించి కాలి బొటన వేలితో ఎత్తి పైకి కిందికీ ఆడించి విసిరే సరికి అది పది ఆమడల దూరాన వెళ్ళి పడింది.

అది చూసి సుగ్రీవుడు ఆశ్చర్య పడటానికి మారుగా, "రామా, దీన్ని ఆమడ దూరం విసిరి వేసినప్పుడు వాలి యుద్ధం చేసి బాగా అలిసి ఉన్నాడు. అదీగాక అప్పుడది కొత్త కళేబరం, ఇప్పుడది ఎండిపోయి తేలిక అయింది. అందుచేత నీకూ వాలికీ గల తారతమ్యం నాకు స్పష్టంగా తెలియలేదు. ఈ సాల వృక్షాలలో దేన్నిగాని దూసుకు పోయేలాగా నీవు బాణం వేసినట్టయితే మీ ఇద్దరి బలా బలాలు తెలుసుకోగలుగుతాను," అన్నాడు.

రాముడు సరేనని ఒక తీవ్రమైన బాణం ఎక్కుపెట్టేసరికి అది ఏడు సాల వృక్షాల కాండాలలో నుంచీ దూసుకు పోయి, కొండలోకి చొచ్చుకు పోయి, భూమిని పగలగొట్టుకుని మళ్ళీ పైకి వచ్చి రాముడి అంబుల పొదిలో ప్రవేశించింది.





ఇది చూసి సుగ్రీవుడు నిర్ఘాంత పోయి, "రామా, వాలి మాట దేనికి, దేవేంద్రుడు దేవతలందరితో కలిసి వచ్చినా నీ ఎదట నిలవలేడు. నీ మైత్రి కలగటం నా అదృష్టం! ఇంక నా శత్రువైన వాలిని ఇప్పుడే వధించు," అంటూ రాముడి ముందు సాష్టాంగ పడి నమస్కరించాడు. రాముడు సుగ్రీవుణ్ణి కౌగలించుకుని, "ఇప్పుడే కిష్కింధకు పోదాం. నీవు మా కన్న ముందు వెళ్ళి వాలిని యుద్ధానికి పిలు," అన్నాడు.

రామ లక్ష్మణులు సుగ్రీవుడు మొదలైన వారందరూ కిష్కింధకు వెళ్ళారు. మిగిలిన వారంతా దట్టమైన చెట్ల చాటున దాక్కున్నారు, సుగ్రీవుడు మటుకు దట్టీ బిగించి, వాలికి వినపడేలాగా భయంకరమైన గర్జనలు చేశాడు.

తమ్ముడి గర్జనలు విని మండి పడుతూ వాలి వచ్చాడు. అన్నదమ్ము లిద్దరూ ఘోరంగా తన్నుకున్నారు. రాముడు విల్లూ, బాణమూ పట్టుకుని కూడా, వారిద్దరిలో ఎవరు వాలి అయినదీ, ఎవరు సుగ్రీవుడైనదీ తెలుసుకోలేక చూస్తూ ఉండిపోయాడు.

ఈలోపల సుగ్రీవుడు వాలి చేత చావు దెబ్బలు తిని, ఒళ్ళంతా నెత్తురు కారుతూ ఆయాసంతో అటూ ఇటూ చూసి, రాముడు కనబడకపోయేసరికి పారిపోసాగాడు. వాలి అతని వెంట పడ్డాడు. సుగ్రీవుడు వాలికి చిక్కకుండా పారిపోయి ఋశ్యమూకం చేరుకున్నాడు. "బతికి పోయావు పో!" అని వాలి వెనక్కు తిరిగి వచ్చేశాడు.

తరవాత రామ లక్ష్మణులూ, హనుమంతుడూ కూడా ఋశ్యమూకానికి తిరిగి వెళ్ళారు. సుగ్రీవుడు రాముణ్ణి చూసి అవమానంతో తల వంచుకుని, "ఇదేంపని? నన్ను తన్నించటానికా వాలిని యుద్ధానికి పిలవమన్నావు? వాలిని చంపటం చేతకాదని చెప్పి ఉంటే నేను ఇక్కడ నుంచి కదలనే కదలను గద!" అన్నాడు.





# కిష్కింధా కాండ

జరిగిన దానికి చింతిస్తూ రాముడు, "సుగ్రీవుడా, నా మీద ఆగ్రహించకు. మీ రిద్దరూ ఒక్కటిగానే ఉన్నారు. మీ కంఠ స్వరాలు కూడా ఒకటిగానే ఉన్నాయి. ఎవరు ఎవరో తెలియక నేను బాణం వెయ్య లేదు. నా అజ్ఞానం చేత నీకు అపాయం కలిగింది. మన్నించు. నీవు ఏదైనా గుర్తు ధరించి మళ్ళీ వాలితో యుద్ధం చేసినట్టయితే ఒక్క బాణంతో అతన్ని పడగొట్టుతాను, నా మాట నమ్ము," అన్నాడు.

కొండచరియ పైన గజపుష్పి అనే లత పూలతో సహా పెరుగుతున్నది. లక్ష్మణుడు దాన్ని పెరికి తెచ్చి సుగ్రీవుడి మెడకు చుట్టాడు. అందరూ మరొకసారి కిష్కింధకు బయలుదేరి వెళ్ళారు.

గజపుష్పి మెడకు చుట్టుకున్న సుగ్రీవుడి వెంట నళుడూ, నీలుడూ, తారుడూ కూడా ఉన్నారు. కిష్కింధకు వెళ్ళే దారిలో రాముడికి చెట్లతో దట్టంగా ఉన్న ఒక వనం కనిపించింది. రాముడు దాన్ని గురించి సుగ్రీవుడి ద్వారా తెలుసుకున్నాడు. అది ఒక ఋష్యాశ్రమం. సప్త జనులనే పేరు గల ఏడుగురు ఋషులు ఆ ఆశ్రమంలో తీవ్రమైన తపస్సు చేశారు; నీటిలో తల కిందులుగా నిలబడి, వాయుభక్షణ చేస్తూ తపస్సు చేసి, శరీరాలతో స్వర్గానికి వెళ్ళి పోయారు. ఆ ఆశ్రమంలోకి మనుషులు కారు గదా, పశుపక్ష్యాదులు కూడా ప్రవేశించ లేవు; తెలియక లోపలికి వెళితే తిరిగి బయటికి రావటమంటూ ఉండదు.







రామలక్ష్మణు లిద్దరూ సప్తజన మహర్షు లను తలుచుకుని ఆ ఆశ్రమానికి సమస్క రించి ముందుకు పోయారు. చాలాదూరం వెళ్ళాక వారు కిష్కింధ చేరుకున్నారు. సుగ్రీవుడు రాముడితో, "వాలిని చంపుతా నని మాట ఇచ్చావు. ఆ పని శీఘ్రంగా చెయ్యాలి," అన్నాడు.

"ఈసారి వాలిని ఒక్క బాణంతో నిశ్చ యంగా పడగొట్టుతాను. ఒకే రూపు గల మీ ఇద్దరిలో తారతమ్యం తెలియటానికి ఈసారి నీ మెడలో గజ పుష్పిలత ఉన్నది కద. అందుచేత నీ కేమీ జంకు వద్దు. వాలిని యుద్ధానికి పిలు," అని రాముడు చెప్పాడు. చుట్టూ ఉండే దట్టమైన అరణ్యంలో అందరూ దాగారు.

సుగ్రీవుడు ఆ అరణ్యాన్ని ఒక్కసారి కలయ జూసి భయంకరంగా గర్జించి వాలిని యుద్ధానికి పిలిచాడు.

ఈ గర్జన వింటూనే వాలికి పట్టరాని ఆగ్రహావేశం వచ్చేసింది. అతను యుద్ధానికి బయలుదేరాడు. ఇది చూసి తార చప్పున లేచి వాలిని పట్టుకుని, ఇలా అన్నది:

"ఈ రాత్రివేళ నీవు వెళ్ళి సుగ్రీవుడితో యుద్ధం చెయ్యవద్దు. కావలిస్తే రేపు ఉదయం వెళుదువుగాని. ఈలోపుగా నీ బలం తరిగి పోదు, సుగ్రీవుడి బలం హెచ్చి పోదు. ఇంతలో వచ్చిన తొందర ఏమిటి? కొంచెం ఆలోచించు! నేను అకారణంగా నిన్ను అడ్డగించటం లేదు. ఒకసారి నీ చేత చావు దెబ్బలు తిని దిక్కు తెలియకుండా పారిపోయిన సుగ్రీవుడు ఇప్పుడు ఏ ధైర్యంతో నిన్ను యుద్ధానికి పిలుస్తున్నాడు? ఎవరి అండో చూసుకునే అతను నిన్ను కవ్వి స్తున్నాడు. వారెవరో కూడా నాకు తెలుసు. అయోధ్య రాజైన దశరథుడి కొడుకులు రామ లక్ష్మణులు సుగ్రీవుడుండే ఋశ్య మూకానికి వచ్చి అతనితో సఖ్యం చేశారట. వారు ఇదివరకే విరాధుణ్ణీ, ఖర దూషణు





లనూ, కబంధుణ్ణీ చంపారట. చాలా పరాక్రమవంతులు. వారిని గురించి మన అంగదుడికి చారులు చెప్పారు. సుగ్రీవుడు చాలా గడుసువాడు. ఒకంతట ఇతరులను నమ్మడు. రాముడి అండ చూసుకునే అతను ఇప్పుడు వచ్చాడు; అందుకేమీ సందేహం లేదు. నీ మేలుకోరి ఇంకొక మాటకూడా చెబుతాను. ఇప్పుడు సుగ్రీవుడు నీ కన్న బలవంతుడని తెలుసుకో. అతన్ని పిలిచి యువరాజుగా అభిషేకించు. నీ తమ్ముడే కదా, కిష్కింధలోనే ఉండనీ. నీకు రాముడి స్నేహం కూడా కలిసి వస్తుంది. సుగ్రీవుడితో యుద్ధమంటే రాముడితో యుద్ధమే. రాముడితో యుద్ధం నీకు క్షేమకరం కాదు."

తార చెప్పిన ఈ మాటలు వాలికి కొంచెంకూడా రుచించలేదు. అతను ఆమెతో, "తారా, నీవు నా మేలుకోరే ఈ మాట లన్నావు, కాని పిరికి దానివైన నీ మాటలు విని సుగ్రీవుడి ధూర్తత్వాన్ని సహిస్తానా? మహామహా వాళ్ళకే నేను భయపడలేదు, సుగ్రీవుడికి భయపడతానా? రాముడు నన్నెందుకు చంపుతాడు? అతనికి నేనేమీ ద్రోహం చెయ్యలేదుగద. సుగ్రీవుణ్ణి నేను చూస్తూ చూస్తూ చంపుతానా? శరీరమంతా నజ్జుగా కొట్టి బుద్ధి చెప్పి పంపేసి



మళ్ళీ వస్తాను. నీవూ, మిగిలిన స్త్రీలూ నా వెంట పడి రాకండి; వెనక్కు వెళ్ళిపొండి," అన్నాడు.

స్త్రీలు వెళ్ళిపోయారు. వారు భయపడతారని అంతదాకా తన ఆగ్రహాన్ని అణచుకుని ఉన్న వాలి భయంకరాకారం ధరించి, కిష్కింధా నగరద్వారం దాటి వచ్చి, నడుము బిగించి తనకోసం ఎదురు చూస్తున్న సుగ్రీవుణ్ణి చూశాడు. వెంటనే తానుకూడా నడుము బిగించి, "నీ ప్రాణాలు తీస్తాను," అంటూ వాలి సుగ్రీవుణ్ణి తన పిడికిలితో కొట్టాడు. ఇద్దరూ చెట్లు పీకి, వాటితో ఒకరి నొకరు చావగొట్టుకున్నారు. వాలి అలిసి

పోయాడు గాని సుగ్రీవుడు మరింత హెచ్చు అలిశాడు, భయంతో నలు దిక్కులు చూడసాగాడు.

సుగ్రీవుడి క్షీణస్థితి గమనించి రాముడు కాలసర్పంలాటి బాణాన్ని ఏరి, ఎక్కు పెట్టి చెవిదాకా లాగి, వాలి ఎదురు రొమ్ముకు గురి చేసి విడిచాడు. వాలి దాని దెబ్బకు కింద పడిపోయాడు. అనేక సువర్ణాభరణాలూ, ఇంద్రుడిచ్చిన కాంచనమాలికా ధరించి నేలపై పడి ఉన్న వాలి వద్దకు రామలక్ష్మణులు వెళ్ళారు.



వాలి మెల్లిగా కళ్ళు తెరిచి రామలక్ష్మణులను చూసి రాముడితో, "నీవు మహారాజు కొడుకువు, గొప్ప వంశంలో పుట్టిన వాడవు, ధర్మాచరణ చేసే వాడివి, నేను మరొకరితో యుద్ధం చేస్తూండగా నన్ను బాణం వేసి కొట్టటం నీకేమంత ఖ్యాతికరం? తార నన్ను యుద్ధానికి వెళ్ళ వద్దని చెబితే నీ వంశాన్నీ, గుణాలనూ నమ్మి, నన్నేమీ చేయవనుకుని వచ్చాను. నేను నీ దేశానికి రాలేదు. నీకేమీ అపకారం చెయ్యలేదు. నిన్ను యుద్ధానికి పిలవలేదు. వానర మాత్రుణ్ణి, అందులోనూ మరొకరితో పోరుతున్నవాణ్ణి. నన్ను నీ వెందుకు హత్య చేస్తున్నావు? నీవు దుర్బుద్ధివి. విల్లు పట్టుకు తిరిగే హంతకుడివి. నీకు ధర్మమన్నది లేదు. నన్ను జంతువు లాగా వేటాడావనుకుందామన్నా నా చర్మం ధరించటానికి పనికిరాదు. నా రోమాలూ, ఎముకలూ ఉపయోగపడవు. నా మాంసం తినటానికి పనికిరాదు. నీవు నిజంగా పరాక్రమం కలవాడవయితే రావణుడు మొదలైన వారిని చంపరాదా? నా ఎదటికి వచ్చి యుద్ధం చేస్తే ఈపాటికి యముడి వద్ద ఉండేవాడవు. సీతను వెతకమని నన్నే కోరి ఉంటే ఒక్క రోజులో నీ భార్యను తెచ్చి నీకిచ్చి ఉందును. అందుకేగదా నీవు సుగ్రీవుడికి ఉపకారం చెయ్యబోయి నన్ను చంపావు?" అన్నాడు.







వాలి చేసిన ఈ ఆక్షేపణకు రాముడీ విధంగా జవాబు చెప్పాడు: "నీకు ధర్మార్థ కామాలకు సంబంధించిన ఆచారాలు తెలియవు. సమస్త భూమండలానికీ ఇక్ష్వాకులు రాజులు. భూమండలంలో అధర్మాన్ని శిక్షించే బాధ్యత ఇక్ష్వాకు రాజులది. ప్రస్తుతం భూమి కంతకూ భరతుడు రాజు. నా బోటి క్షత్రియులం అతని ఆజ్ఞకు బద్ధులమై అధర్మాన్ని శిక్షిస్తున్నాము. వానరుడవు కావటంచేతనూ, వానరుల సాంగత్యం కలిగి ఉంటటం చేతనూ నీకు ధర్మ సూక్ష్మాలు తెలియవు. నీవు నీ తమ్ముడి భార్యను పరిగ్రహించావు. ఇది మహా పాపం. అందుకు



మరణమే శిక్ష. నిన్ను శిక్షించక వదిలితే నేను ధర్మం తప్పిన వాణ్ణవుతాను. అదీ గాక నేను సుగ్రీవుడితో చేసిన మైత్రి లక్ష్మణుడికీ నాకూ గల బాంధవ్యంలాటిది. నేను భార్య నిమిత్తమూ, అతను రాజ్యం నిమిత్తమూ ఈ సఖ్యం చేసుకున్నాము. నిన్ను చంపుతానని వానరుల ముందు నేను ప్రతిజ్ఞ చేశాను. నేను చేసిన ప్రతిజ్ఞ తప్పటానికి వీలులేదు. అందుచేత నిన్ను వధించటంలో నేను అధర్మం అణుమాత్రం కూడా చెయ్యలేదు. నీవు కొన్ని మానవ ధర్మాలు అచరించటం చేత పై విధంగా చెప్పాను. కోతివిగా చూస్తే నిన్ను నేను ఏ సమయంలోనైనా వేటాడ వచ్చు. అభక్ష్య మృగాలను కూడా వేటాడుతారు. అవి ఏ మరుపాటున ఉన్నవా, పారిపోతున్నవా, నిర్భయంగా ఉన్నవా అని చూడరు. కోతివైన నిన్ను నేను నాతో యుద్ధం చేస్తేనే చంపాలన్న నియమం ఎక్కడా లేదు."

రాముడు చెప్పినదంతా విని వాలి తాను రాముణ్ణి నిందించి నందుకు పశ్చాత్తాప పడ్డాడు. అతను రాముడితో, "నాకు చచ్చిపోతున్నానని దిగులు లేదు. నీ చేతిలో చావాలనే తార వద్దన్నా వినకుండా సుగ్రీవు







డితో ద్వంద్వ యుద్ధానికి వచ్చాను. నాకు అంగదుడు ఒక్కడే కొడుకు. వాణ్ణి గురించే నాకు దిగులు. వాణ్ణి సుగ్రీవుడు సరిగా చూసేలాగు చూడు. సుగ్రీవుడికి నా భార్య అయిన తారపై కక్ష ఉండవచ్చు. అతను ఆమెను అవమానించకుండా చూడు," అన్నాడు. అతనికి స్పృహ తప్పింది.

రాముడి బాణంతో వాలి దెబ్బ తిన్న వార్త తారకు తెలిసింది. ఆమె దుర్భరమైన దుఃఖంతో తన కొడుకుతో సహా కిష్కింధ నుంచి వచ్చింది. రాముడి చేత దెబ్బ తిన్న వాలిని చూసి భయపడి కొందరు వాలి అనుచరులు పారిపోయి వస్తూ, తారకు ఎదురయారు. వారు తారతో, "అమ్మా, నీ కొడుకింకా బతికి ఉన్నాడు. వాణ్ణి కాపాడు కోవటానికి తిరిగి వెళ్ళిపో. మృత్యువు రాముడి రూపంలో వచ్చి వాలిని తీసుకు పోతున్నది. అంగదుడికి పట్టాభిషేకం చెయ్యాలి. కిష్కింధ ద్వారం మూసి జాగ్రత్తగా రక్షించాలి. అలా చేయని పక్షంలో నీవు కిష్కింధను శత్రువులకు విడిచి పారిపో," అన్నారు.



"అంతటి భర్తే పోతుంటే ఇక నాకీ రాజ్యమూ, ఈ కొడుకూ, ఈ శరీరమూ పట్టుతాయా? నేను నా భర్త పాదాల దగ్గిరికే పోతాను," అని వలవలా ఏడుస్తూ తార వాలి పడి ఉన్న చోటికి వెళ్ళింది. ఆమె రామలక్ష్మణులనూ, సుగ్రీవుణ్ణీ దాటి వెళ్ళి వాలిని చేరుకుని, అతనికి స్పృహ లేకపోవటం చూసి ప్రాణం పోయిందనుకుని మూర్ఛపోయింది. తరవాత స్పృహ నుంచి తేరుకుని భర్తను కౌగలించుకుని పెద్ద పెట్టున ఏడవసాగింది.

వాలి సమీపంలోనే నిలబడి ఉన్న హనుమంతుడు తారను ఓదార్చ యత్నించాడు. అంతలో వాలి కళ్ళు తెరిచి ఎదురుగా ఉన్న సుగ్రీవుణ్ణి చూసి, "సుగ్రీవా, మనం అన్న దమ్ములుగా సఖ్యం కలిగి, రాజ్య భోగాలను





కలిసి అనుభవించటానికి నోచుకోలేదు. అందుచేతనే నిన్ను వెళ్ళగొట్టాను. నీ భార్యను అపహరించానని నాపై కోపం ఉంచుకోకు. నా కొడుకు అంగదుణ్ణి నీకు అప్పగిస్తున్నాను. వాణ్ణి నేను చూసినట్టుగానే చూడు, నేను లేని లోటు రానియ్యకు. ఇక వానర రాజ్యం నీవే ఏలుకో. నా ప్రాణాలు పోయేలోపుగా ఈ కాంచనమాలికను తీసుకో," అన్నాడు. తరవాత అతను అంగదుడితో, "నాయనా, ఇక నుంచీ నీవు మీ పినతండ్రి చెప్పినట్టు నడుచుకో. అతని శత్రువులతోగాని, వారి మిత్రులతోగాని చేరకు. నన్ను ఎలా చూసుకున్నావో, అలాగే ఇక ముందు సుగ్రీవుణ్ణికూడా చూసుకో," అని చెప్పి ప్రాణాలు వదిలాడు. వానరులందరూ ఒక్కసారి గొల్లున ఏడిచారు. తార తన భర్త కళేబరాన్ని కౌగలించుకుని మూర్ఛపోయింది.

తరవాత నీలుడు వాలి రొమ్మున నాటుకున్న రాము బాణాన్ని లాగేశాడు. అంగదుడు తండ్రి పాదాలకు నమస్కారం చేశాడు. సుగ్రీవుడు కళ్ళ నీరు కారుస్తూ రాముణ్ణి సమీపించి, "రామా, నీవు అన్న ప్రకారం వాలిని వధించావుగాని నాకు భోగాల మీదా, జీవితం మీదా కూడా విరక్తి కలిగింది. ఈ తారా, కిష్కింధలోని వానరులూ, అంగదుడూ ఈ దుఃఖ సముద్రంలో మునిగి ఉండగా నాకు రాజ్యమేమిటి? వాలి నన్ను పెట్టిన కష్టాలు తలుచుకున్న కోపంతో అతని చావు కోరాను. ఇప్పుడు పశ్చాత్తాపం నన్ను దహించేస్తున్నది. వాలి దొడ్డ బుద్ధిగలవాడు, నన్ను చంపటానికి ఎన్నడూ యత్నించలేదు. అతణ్ణి చంపాలన్న కోరిక మహా పాపినైన నాకే కలిగింది. నేనుకూడా వాలితోపాటు దహనమైపోతాను. వానరులు నీ కోసం సీతను అన్వేషిస్తారు," అన్నాడు.






రాముడు దుఃఖంతో మూర్ఛపోయి ఉన్న తారను చూశాడు. అది గమనించి వానరులు తారను వాలి శరీరం మీది నుంచి పట్టి లేవదీశారు. తార రాముణ్ణి చూసి అతన్ని సమీపించి, "రామా, నా భర్త ప్రాణాలు తీసిన బాణంతోనే నన్ను కూడా చంపి, నా భర్త వద్దకు చేర్చు. సీత కోసం నీవు ఎలా తపిస్తున్నావో, వాలి నా కోసం ఆ లోకంలో అలా తపిస్తాడు. భార్యా వియోగం ఏమిటో నీకు తెలుసుగదా! వాలి పోయాక నేను జీవచ్ఛవాన్నే గనక స్త్రీ హత్యాదోషం నిన్నంటదు," అంటూ ఏడ్చింది. రాముడు తారనూ, సుగ్రీవుణ్ణీ యథోచితంగా ఊరడించాడు. వాలి దహన క్రియల పని చూడమని లక్ష్మణుడు సుగ్రీవుణ్ణి హెచ్చరించాడు. తారుడు కిష్కింధకు వెళ్ళి వాలిని మొయ్యటానికి ఒక పల్లకీ తెచ్చాడు. సుగ్రీవుడూ, అంగదుడూ వాలిని ఎత్తి పల్లకీలో పడుకో బెట్టారు. బలిష్ఠులైన వానరులు పల్లకి మోస్తూ వెళ్ళారు. వెనక కిష్కింధా నగర స్త్రీలు ఏడుస్తూ వెళ్ళారు. ఒక వాగు ఒడ్డున ఇసుక ప్రదేశంలో వాలికి చితి ఏర్పాటయింది. అంగదుడు శాస్త్రోక్తంగా చితికి నిప్పు పెట్టాడు. తరవాత వానరులు వాలికి జలతర్పణాలు విడిచారు.

ఉత్తరక్రియలు పూర్తి కాగానే సుగ్రీవుడు తడి బట్టలతో, తన మంత్రులను వెంట బెట్టుకుని రాముడి వద్దకు వచ్చాడు.







అప్పుడు హనుమంతుడు రాముడితో, "మీ అనుగ్రహం చేత సుగ్రీవుడు వానర రాజ్యాన్ని పొందగలిగాడు. అతనిక రాజ్య భారం వహించవలిసి ఉన్నది. అందుచేత మీరు వచ్చి అతనికి సక్రమంగా పట్టాభిషేకం చేయించండి," అన్నాడు.

దానికి రాముడు, "హనుమంతుడా, తండ్రి అనతి ప్రకారం నేను పధ్నాలుగేళ్ళ పాటు గ్రామాలలోకీ, నగరాలలోకీ అడుగు పెట్ట వీలులేదు. అందుచేత మీరంతా సుగ్రీవుణ్ణి కిష్కింధకు తీసుకుపోయి శాస్త్ర ప్రకారం పట్టాభిషిక్తుణ్ణి చెయ్యండి," అన్నాడు. రాముడు సుగ్రీవుడితో అంగదుణ్ణి యువరాజును చెయ్యమనీ, వర్షాకాలం ఆరంభం కాబోతున్నది గనుక వానలు పోయేదాకా తానూ, లక్ష్మణుడూ ఋశ్యమూకం మీది గుహలో ఉంటామనీ, కార్తికమాసం ఆరంభమయేటప్పుడు సుగ్రీవుడు రావణుడిపై యుద్ధ యత్నాలు ఆరంభించవలిసి ఉంటుందనీ చెప్పాడు.

సుగ్రీవుడు కిష్కింధకు వెళ్ళి యథావిధిగా పట్టాభిషేకం చేసుకున్నాడు. కిష్కింధ వాసులందరు సంతోషించారు. గజుడూ, గవాక్షుడూ, గవయుడూ, శరభుడూ, గంధమాదనుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ, నళుడూ బంగారు కలశాలతో సుగ్రీవుణ్ణి అభిషేకించారు.

తన పట్టాభిషేకం పూర్తి కాగానే సుగ్రీవుడు అంగదుడికి యౌవరాజ్య పట్టాభిషేకం చేసి, అంగదుడిపై ఆదరాభిమానాలు గల కిష్కింధ పౌరులకు ఆనందం కలిగించాడు. తరవాత అతను రామలక్ష్మణుల వద్దకు వెళ్ళి జరిగినదంతా చెప్పి, కిష్కింధకు తిరిగి వచ్చి తన భార్య అయిన రుమతో సుఖంగా కాలం గడపసాగాడు.

సుగ్రీవుడు రాజ్యాభిషిక్తుడైనాక రామలక్ష్మణులు తమ నివాసాన్ని ప్రస్రవణ పర్వతం పైన ఉండే ఒక విశాలమైన గుహకు





మార్చుకున్నారు. ఈ గుహ అన్ని విధాలా సౌకర్యంగా ఉన్నది. గుహలోకి వాన జల్లు రాదు, ఈదురుగాలి రాదు. పరిసరాలు ఎంతో అందంగా ఉన్నాయి. సమీపంలోనే నది ఉన్నది. అదీకాక ఈ గుహ కిష్కింధకు చాలా దగ్గిర; కిష్కింధలోని గీత వాద్య ధ్వనులూ, వానరుల కేకలూ ఆ గుహకు వినిపిస్తున్నాయి.

ఇలాటి గుహలో రాముడు అహెూరాత్రాలు సీతకై విరహం పొందుతూ, లక్ష్మణుడి చేత హెచ్చరించబడుతూ, సుగ్రీవుడు ప్రత్యుపకారం చెయ్యకపోతాడా అని ఆశ్చర్యపడుతూ, ఈ నాలుగు మాసాలూ గడిచి శరత్కాలం ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తూ కాలం గడపసాగాడు.

వానాకాలం వచ్చింది, వెళ్ళింది. సుగ్రీవుడు తన భార్య అయిన రుమతోనూ, వాలి భార్య అయిన తారతోనూ భోగాలలో మునిగి తేలుతూ, రాజ్యభారం మంత్రులపై వేసి, రామకార్యం నిర్వర్తించే సమయం వచ్చిందన్న మాటకూడా తలపెట్టలేదు.

అందుచేత హనుమంతుడు సుగ్రీవుడి వద్దకు వచ్చి, "నీకు రాజ్యమూ, కీర్తీ లభించాయి. శత్రుభయం ఏమీలేదు. కాని మన మిత్రుల పని చూడవలిసిన బాధ్యత



అలాగే ఉండిపోయింది. ఇలాటి పనులలో జాప్యం కూడా తప్పే. అందుచేత వెంటనే సీతను వెతికే పని ప్రారంభించు. నీ సహాయం కోసం ఎంత ఆత్రంగా ఎదురు చూస్తున్నప్పటికీ, భార్యా వియోగంతో ఎంతగా తపించి పోతున్నప్పటికీ రాముడు నీ బాధ్యతను జ్ఞాపకం చెయ్యటం లేదు. అతను అడగక ముందే మనం పని ప్రారంభిస్తే మనకు అలక్ష్యదోషం ఉండదు. నీ మాట నీవు నిలబెట్టుకుంటావనే ఉద్దేశంతో అతను ఎదురు చూస్తున్నాడు. ఇంక అలస్యం చెయ్యటం భావ్యం కాదు," అన్నాడు. ఈ హెచ్చరికతో సుగ్రీవుడు చైతన్యం









పొందాడు. అతను నీలుణ్ణి పిలిచి సైన్యా లన్నిటినీ రప్పించమని ఆజ్ఞాపించాడు; ఏ వానరుడు గాని పదిహేను రోజుల లోపుగా కిష్కింధకు చేరకపోతే వాడికి మరణ దండన విధించమన్నాడు; జాంబవంతాదుల దగ్గిరికి అంగదుణ్ణి వెంట బెట్టుకుని నీలుణ్ణి స్వయంగా వెళ్ళమన్నాడు.

ఒకనాడు లక్ష్మణుడు ఫలాల కోసం కొండ కోనలన్నీ చెడతిరిగి వచ్చేసరికి రాముడు అగాధమైన దుఃఖంలో మునిగి ఉన్నాడు. అతనికి శరత్కాలంతోబాటు సీతా వియోగ బాధ కలిగి దుఃఖం ముంచు కొచ్చింది. లక్ష్మణుడు తన అలవాటు ప్రకారం రాముణ్ణి ఊరడించి, దుఃఖం నిరుపయోగ మనీ, కర్తవ్యం నెరవేర్చటానికి ధైర్యమూ, ఉపాయమూ కావాలనీ జ్ఞాపకం చేశాడు.

అంతా విని రాముడు, "లక్ష్మణా, వానా కాలం వెళ్ళి శరత్కాలం వచ్చింది. ఈ నాలుగు నెలలూ ఎంతో బాధతో గడిపాను. రాజులు యుద్ధాలకు బయలుదేరే సమయం వచ్చినా సుగ్రీవుడి జాడలేదు. అతను ఏ ప్రయత్నంలోనూ ఉన్నట్టు కనపడడు. అతనికి నా మీద ఇంకా దయ రాలేదు. 'రాముడు దిక్కులేనివాడు, రాజ్యభ్రష్టుడు, అడవుల పాలై, భార్యను రావణు డపహ రించగా దైన్యంతో మన శరణు జొచ్చాడు,' అని సుగ్రీవుడు నన్ను అనాదరంగా చూస్తు న్నట్టున్నాడు. లేక తన పని గడిచిందిగదా అని తాను చేసిన వాగ్దానాన్ని మరిచాడో! నీవు కిష్కింధకు వెళ్ళి నేను చెప్పినట్టుగా అతనితో చెప్పు; అన్న మాట నిలబెట్టుకోని వాడు పురుషాధముడు. ప్రత్యుపకారం చెయ్యని వాడి శవాన్ని కాకులూ గద్దలూ కూడా ముట్టవు. అతనికి నా బాణంయొక్క ధ్వని మళ్ళీ వినాలని ఉన్నదేమో! ఇందుకేనా ఈ సుగ్రీవుడితో నేను స్నేహం చేసి, వాలిని చంపింది? వాలిని ఒక్కణ్ణే చంపాను, ఈ సుగ్రీవుణ్ణి బంధువులతో సహా





చంపగలను. అందుచేత నీవు సుగ్రీవుడితో ఎలా చెప్పాలో అలా చెప్పు," అన్నాడు.

లక్ష్మణుడికి కూడా సుగ్రీవుడిపై పట్టరాని ఆగ్రహం వచ్చింది. అతను రాముడితో, "నీ మూలానే తనకు రాజ్యప్రాప్తీ, భార్యాప్రాప్తీ కలిగిందని కూడా తలచకుండా ఆ సుగ్రీవుడు, తాగి భార్యలతో తలకిందులై పోతున్నాడు. ఇలాటివాణ్ణి రాజుగా ఉండనివ్వరాదు. నాకు మండిపోతున్నది. ఇప్పుడే వెళ్ళి వాణ్ణి వాలి దగ్గిరికి పంపించేస్తాను, సీతను వెతకటానికి అంగదుడున్నాడు, వానర వీరులున్నారు," అన్నాడు, బాణాలు తీసుకుని బయలుదేరుతూ.

రాముడు లక్ష్మణుడితో శాంతంగా, "లక్ష్మణా, తొందరపడకు. మిత్రవధ చేసి నిష్కారణంగా పాపం అంటగట్టుకోకు. సుగ్రీవుడు అన్న సమయానికి రాకపోవటం తప్ప వేరే మహాపరాధం ఏం చేశాడు? నీవు వెళ్ళి అతనితో మృదువుగానే మాట్లాడు," అని అతన్ని పంపేశాడు.

లక్ష్మణుడు కిష్కింధ చేరి సుగ్రీవుడి ఇంటికి బయలుదేరాడు. అణగని కోపంతోనూ, అతి వేగంతోనూ పోతున్న లక్ష్మణుణ్ణి చూసి పెద్ద పెద్ద వానర వీరులు, అతనెవరో శత్రు వనుకుని, అతని పైన వెయ్యటానికి



చెట్లు పీకారు. అది చూసి లక్ష్మణుడు వారికేసి నిప్పులు కక్కుతూ చూశాడు. దానితో వారు భయపడి దూరంగా తొలగారు. కొందరు సుగ్రీవుడి ఇంటికి వెళ్ళి లక్ష్మణుడు వస్తున్నాడని చెప్పారు. కాని తారతో సరస సల్లాపాలలో మునిగి ఉన్న సుగ్రీవుడా మాట వినిపించుకోలేదు.

ఈలోపల సుగ్రీవుడి మంత్రులు, లక్ష్మణుడు నిజంగా వస్తున్నాడేమో చూసి రమ్మని కొందరు వానరులను పంపారు. వాళ్ళతో బాటు వచ్చిన అంగదుణ్ణి చూసి లక్ష్మణుడు, "నేను వచ్చానని సుగ్రీవుడితో చెప్పు. నాతో మాట్లాడతాడో లేదో, తెలుసుకుని వెంటనే









లక్ష్మణుడు ఉత్తగా కాక ధనుర్బాణాలతో సహా వచ్చాడనీ, చాలా కోపంలో ఉన్నాడనీ సుగ్రీవుడికి తెలిసింది.

సుగ్రీవుడు మంత్రులతో, "నేనేమీ తప్పు చేయలేదే, లక్ష్మణుడికి ఆగ్రహం ఎందుకు కలిగి ఉంటుందీ? నా శత్రువు లెవరో అతనితో నాపై చాడీలు చెప్పి ఉంటారు. మీ తెలివితేటలన్నీ ఉపయోగించి అతని కోప కారణం తెలుసుకోవాలి. రామలక్ష్మణు లంటే నాకు భయమని కాదు, కాని మిత్రుడికి కోపం వచ్చినప్పుడు ఆందోళన చెందటం సహజం. రాముడు చేసిన ఉప కారానికి ప్రత్యుపకారం చెయ్యటం నాకు సాధ్యంకాదు," అన్నాడు.

అప్పుడు హనుమంతుడు సుగ్రీవుడితో, "రాజా, రాముడికి నీ మీద అలక వచ్చి ఉంటుందేగాని నిజమైన ఆగ్రహం రాదు. నీవు ఏమరుపాటున శరదృతువు రావటం గమనించలేదు. అందుకే లక్ష్మణుడు వచ్చి ఉంటాడు. అతను కాస్త పరుషంగా మాట్లాడినా నీవు సహించాలి, ఎందుకంటే తప్పు నీదే. రాముడికి ఆగ్రహం తెప్పించటం ఎవరికీ మంచిది కాదు; అతని వల్ల లాభం పొందిన నీకు అది బొత్తిగా అనుచితం," అన్నాడు. ఈలోపుగా లక్ష్మణుడు సుగ్రీవుడి

రా!" అన్నాడు. అంగదుడు సుగ్రీవుడి వద్దకు వెళ్ళి, అతనికీ, తన తల్లికీ నమస్కారం చేసి, లక్ష్మణుడు చెప్పమన్నట్టే చెప్పాడు. కాని సుగ్రీవుడు తాగిన మత్తులో ఉండి ఏమీ వినిపించుకోలేదు. అయితే లక్ష్మణుడి రౌద్రాకారం చూసి వానరులు చేసిన కలకలానికి సుగ్రీవుడి మత్తు కొంత వదిలింది.

అంగదుడు అవతలికి వెళ్ళి ప్లక్షుడూ, ప్రభావుడూ అనే మంత్రులతో సుగ్రీవుడి వద్దకు తిరిగి వచ్చేసరికి అతను కొంత స్పృహలో ఉన్నాడు. వారు అతనితో లక్ష్మణుడు మాట్లాడటానికి వచ్చాడని చెప్పారు.







అంతఃపురం దాకా వచ్చి, లోపల ఆడవాళ్ళ అలికిడి విని అక్కడే ఆగిపోయాడు. లక్ష్మణుడు చేసిన ధనుష్టంకార ధ్వని విని సుగ్రీవుడు అతని ఎదట పడడానికి జంకి, లక్ష్మణుడితో మాట్లాడమని తారను పంపాడు.

తార లక్ష్మణుడున్న చోటికి వచ్చి, "మీకు కోపం వచ్చిందిట, దేనికీ? మీ మాటను ఎవరైనా అతిక్రమించారా?" అని అడిగింది.

"సుగ్రీవుడు అస్తమానమూ తాగి ఉండి రాచకార్యాలు చూడడు, మా సంగతి ఆలోచించడు, నీకు తెలియదా? యుద్ధ సన్నాహానికి నాలుగు మాసాలు వ్యవధి తీసుకున్నాడు. గడువు దాటిపోయింది. మా పని ప్రారంభం కాలేదు. మేమేం చెయ్యాలో నీవే చెప్పు," అన్నాడు లక్ష్మణుడు.

తార అతనితో, "సుగ్రీవుడు భోగలాలసుడై ఉన్నందుకు ఆగ్రహించ వద్దు. అతను మీ పని మరవలేదు. ఇదివరకే అతను మీ పనికి వానరులను హెచ్చరించాడు. ఎక్కడెక్కడి పర్వతాల నుండో వానరులు లక్షల, కోట్ల సంఖ్యలో వచ్చి చేరారు," అని చెప్పి అతన్ని తన వెంట అంతఃపురంలోకి తీసుకుపోయింది.

కాని తీరా లక్ష్మణుడు లోపలికి వెళ్ళే సరికి సుగ్రీవుడు, తాగిన మత్తులో ఎర్రబడిన కళ్ళతో, అనేకమంది స్త్రీల నడుమ కనిపించాడు. లక్ష్మణుడికి అతన్ని చూడగానే మండిపోయింది. అతను సుగ్రీవుణ్ణి చూసి, "తనకు ఉపకారం చేసిన మిత్రులకు అబద్ధపు ప్రతిజ్ఞ చేసేవాడు పరమపాపి. కృతఘ్నుడు. వాణ్ణి ఎవరైనా చంపవచ్చు. రాముడి చేత నీ పని పూర్తి చేయించుకుని సీతను వెతికే ప్రయత్నం ప్రారంభించని నీవు కృతఘ్నుడవు. వాలి వెళ్ళిన దారి జ్ఞాపకం ఉంచుకుని సీత కోసం వెతికించు," అన్నాడు.






తార లక్ష్మణుడికి అడ్డం వచ్చి, "లక్ష్మణా, తొందరపడి సుగ్రీవుణ్ణి నిందించ వద్దు. అతను రామ కార్యం ఏమర లేదు. వానరు లందరూ పదిహేను రోజులలో రావాలనీ, రాని వారికి మరణశిక్ష అనీ సుగ్రీవుడు అదివరకే ప్రకటించాడు. ఈవాళే గడువు ఆఖరు రోజు. చాలాకాలం కష్టాలు అనుభవించిన సుగ్రీవుడు ఇప్పుడు భోగ లాలసుడై ఉన్న మాట నిజమే. కాని నీవు దానిని క్షమించ వచ్చు. అందుచేత నీవు కోపం మాను," అన్నది.

తార మాటలతో లక్ష్మణుడు మెత్త బడ్డాడు. అది చూసి సుగ్రీవుడికి కాస్త ధైర్యం వచ్చింది. అతను లక్ష్మణుడితో, "లక్ష్మణా, రాముడు నాకు చేసిన మహోప కారంలో నే నాయనకు చెయ్యబోయేది ఏపాటి? రాముడి పట్ల నాకున్న చనువుకొద్దీ నేను కొంచెం జాప్యం చేసి ఉంటే నన్ను క్షమించాలి. లోకంలో తప్పు చెయ్యనివాడు ఉంగడుగద," అన్నాడు.

దానికి లక్ష్మణుడు, "సుగ్రీవా, నీ సహాయం మాకు దేతవలు చేసే సహాయమే. నీవు ఒకసారి వచ్చి ఎంతో దుఃఖంలో ఉన్న రాముణ్ణి ఊరడించు. ఆయన దుఃఖం చూడలేకనే నేను ఆగ్రహం చెందాను, నన్ను క్షమించు," అన్నాడు.

సుగ్రీవుడు హనుమంతుడి కేసి తిరిగి, "వానరుల నందరినీ పిలుచుకు రమ్మని నే నింతకు ముందే దూతలను పంపాను. వారి వెనక ఇప్పుడు మరికొందరు వానరు





లను పంపి, అనేక పర్వతాలలోనూ, సముద్ర తీరాలా, వనాలలోనూ ఉండే రక రకాల వానరులు శీఘ్రంగా వచ్చి చేరే ఏర్పాటు చెయ్యి. వారిని రప్పించటానికి సామదానాది ఉపాయాలు ప్రయోగించు. పది రోజులలోగా రాని వానరులకు మరణ శిక్ష! ఇది నా ఆజ్ఞ!" అన్నాడు.

అలాగే హనుమంతుడు అనేకమంది వానరులను అనేక దిక్కులకు పంపాడు. క్రమంగా వానర బలగాలు కిష్కింధకు రాసాగాయి. నల్ల కోతులు, పచ్చ కోతులు, తెల్ల కోతులు, భయంకరమైన ఎర్ర కోతులు—అన్ని రకాల కోతులూ వచ్చాయి. వానరులు తాముండే చోట దొరికే పళ్ళూ, సువాసనగల పూలూ కూడా తెచ్చారు; వాటిని సుగ్రీవుడికి కానుకగా ఇచ్చారు.

తమ నిమిత్తమై పెద్ద ఎత్తున పని ప్రారంభించిన సుగ్రీవుడి పైన భక్తి విశ్వాసా లేర్పడి లక్ష్మణుడు అతన్ని తాముండే చోటికి ఆహ్వానించాడు. సుగ్రీవుడు సమ్మతించి, తన పల్లకి తెప్పించి, అందులో లక్ష్మణుణ్ణి ఎక్కమని, అతనితోబాటు తాను కూడా ఎక్కి కూచుని, రాముడుండే చోటికి బయలుదేరాడు. వానరు లతనికి తెల్ల గొడుగు పట్టారు, వింజామరాలు వీచారు, శంఖ ధ్వానాలు చేశారు, భేరీ భాంకారాలు



మోగించారు, స్తోత్ర పాఠాలు దారి పొడుగునా చదివారు. కొన్ని వందలమంది వానర వీరులు పల్లకి వెంట నడిచారు.

ప్రస్రణ పర్వతం మీది గుహ వద్ద పల్లకి దిగింది. సుగ్రీవుడు లక్ష్మణుడితో సహా పల్లకి దిగి రాముణ్ణి సమీపించి, చేతులు పైకెత్తి నమస్కారం చేసి నిలబడ్డాడు. మిగిలిన వానరులంతా అలాగే చేతులు పైకెత్తి నమస్కారాలు చేస్తూ నిలబడ్డారు. వారి చేతులు రాముడికి చెరువులోని తామర మొగ్గల్లాగా కనిపించాయి.

రాముడు సుగ్రీవుణ్ణి సమీపించి; అతను సాష్టాంగ పడగా లేవనెత్తి ఆలింగనం చేసుకుని, లాంఛనగా సహాయం అడిగాడు. దానికి సుగ్రీవుడు, "రామా, నా దూతలు పిలవగా ప్రపంచంలోని అన్ని మూలల నుంచీ మహా పరాక్రమవంతులైన వానరులు వేల, లక్షల, కోట్ల సంఖ్యలో వచ్చి ఉన్నారు. వారు రావణాసురుణ్ణి చంపి, సీతను నీకు తెచ్చి ఇవ్వటానికి సమర్థులు," అన్నాడు.

రాముడీ మాటకు సంతోషించి, "సుగ్రీవుడా, నీ వంటి వాడి సహాయంతో నేను రావణుణ్ణి అవలీలగా చంపి సీతను తెచ్చుకోగలను," అన్నాడు.

ఇంకా కిష్కింధ పరిసరాలలో దుమ్ము లేస్తూనే ఉన్నది, భూమి కంపిస్తూనే





ఉన్నది. వానరు లింకా వస్తూనే ఉన్నారు. తార తండ్రి సుషేణుడు పది వేల కోట్ల వానరులతో వచ్చాడు. సుగ్రీవుడి మామా, రుమ తండ్రీ అయిన తారుడు వెయ్యి కోట్ల వానరులతో వచ్చాడు. హనుమంతుడి తండ్రి కేసరి ఇరవైయొక్క వేల ఎనిమిది వందల డెబ్భై మంది వానరులతో వచ్చాడు. గోలాంగూలాలకు రాజయిన గవాక్షుడు వెయ్యి కోట్ల వానరులతో వచ్చాడు. ధూమ్రుడనేవాడు రెండువేల కోట్ల భల్లూకాలను తెచ్చాడు. ఇదే విధంగా పనసుడూ, నీలుడూ, గవయుడూ, దరీముఖుడూ, అశ్వనీ దేవతల కొడుకులైన మైందద్వివిదులూ, గజుడూ, జాంబవంతుడూ, రుమణ్వంతుడూ, గంధమాదనుడూ, అంగదుడూ మొదలైనవారు అంతులేని బలాలను వెంట తెచ్చారు. ఈ వానరుల నందరినీ వనాలలోనూ సెలయేళ్ళ దగ్గిరా, కొండల వద్దా విడియింపజేశారు. సుగ్రీవుడు ఈ వానర బలా లన్నిటినీ రాముడి పరం చేసి, వారిని కావలిసిన విధంగా ఉపయోగించుకోమని చెప్పాడు.

"సుగ్రీవుడా, ముందుగా మనకు రెండు విషయాలు తెలియాలి. సీత బ్రతికి ఉన్నదా, లేదా అన్నది మొదటి విషయం. రెండో విషయం రావణుడి వాస స్థల మెక్కడ అన్నది. ఈ రెండు వార్తలూ తెలిసినాక కర్తవ్యం నిర్ణయింతాం. ఈ వార్తలు సేకరించటానికి నేనూ, లక్ష్మణుడూ సమర్థులం కాము. ఆ పని నీ వల్లనే జరగాలి," అని రాముడన్నాడు.

అప్పుడు సుగ్రీవుడు వినతుడనే వానర నాయకుణ్ణి పిలిచి, "నీవు లక్ష వానరులను తీసుకుని తూర్పు దిక్కుగా వెళ్ళు. రావణుడుండే చోటు తెలుసుకుని సీత యొక్క స్థితిగతులు కనుక్కొనిరా," అన్నాడు. ఇలా సీతను వెదకబోయేవారు నెల రోజుల లోపుగా తిరిగి రావాలనీ, రానివారికి మరణ



దండన విధించబడుతుందనీ సుగ్రీవుడు హెచ్చరించాడు.

తరవాత అతను నీలుణ్ణీ, హనుమంతుణ్ణీ, మహాబలుడు జాంబవంతుణ్ణీ, మహేంద్రుణ్ణీ, శరారినీ, శరగుల్మణ్ణీ, గజుణ్ణీ, గవాక్షుణ్ణీ, గవయుణ్ణీ, ఋషభుణ్ణీ, మైందుణ్ణీ, ద్వివిదుణ్ణీ, విజయుణ్ణీ, గంధమాదనుణ్ణీ, ఉల్కాముఖుణ్ణీ, అసంగుణ్ణీ, అంగదుణ్ణీ, మరికొందరు వానర వీరులనూ దక్షిణ దిశ అంతా వెదకమన్నాడు. అతను వారికి దక్షిణానగల దేశాలన్నీ వివరించి, "మీరు దక్షిణ తీరం చేరినాక సముద్రం మీదుగా పోయే ఉపాయం ఆలోచించుకోండి. ఎందుకంటే సముద్రంలో నూరు యోజనాల వైశాల్యం గల లంక ఉన్నది. అదే రావణుడి నివాస స్థానం. సీత కోసం అక్కడ చక్కగా వెతకండి. సముద్రంలో ఇంకా పర్వతా లున్నాయి. వాటన్నిటిమీదా మీరు సీతాదేవిని వెదకండి. దక్షిణ దిక్కుగా ఇంకా ఏయే రహస్య ప్రదేశాలున్నా వాటి నన్నిటినీ గాలించండి. నెల లోపలగా ఎవరైతే తిరిగి వచ్చి, 'చూశాను సీతను' అని చెబుతాడో వాడికి నాతో సమమైన భోగ భాగ్యాలు కలుగుతాయి. వాణ్ణి నా ప్రాణాల కన్న ఎక్కువగా చూసుకుంటాను," అని వానరులతో అన్నాడు.

ఇదే విధంగా సుగ్రీవుడు పడమటి దిక్కుగా తార తండ్రి అయిన సుషేణుడు మొదలైన వారిని రెండు లక్షల వానర బలగంతో పంపాడు. లక్షమంది వానర వీరులతో సహా శతవలి అనే వాణ్ణి ఉత్తరంగా పంపాడు.

ఇంతమంది వానరులను అన్ని దిశలకూ పంపుతున్నప్పటికీ సుగ్రీవుడి ఆశలన్నీ హనుమంతుడిపైనే ఉన్నాయి. అందుచేత అతను హనుమంతుడితో, "నీవు భూమిపైనా, నీటిలోనూ, గాలిలోనూ పోగలవాడివి - మూడు లోకాలూ తెలిసిన వాడివి. నీ తండ్రి





వాయుదేవుడికి ఉన్నంత ప్రతిభ నీకూ ఉన్నది. అందుచేత సీతాదేవి దొరకటానికి అవసరమైన ప్రయత్నమంతా నీవే చెయ్యాలి," అన్నాడు.

ఈ మాటలు వినగానే రాముడు హనుమంతుడి యందు సుగ్రీవుడికి ఎంత నమ్మక మున్నదీ గ్రహించాడు. హనుమంతుడే పని సాధించుకురాగలడేమోనన్న ఆశ రాముడిలో కూడా తల ఎత్తింది. అందుచేత తన పేరు గల ఉంగరాన్ని తీసి, సీతాదేవికి గుర్తుగా ఉండగలందులకై హనుమంతుడి కిచ్చాడు. అతను హనుమంతుడితో, "సీత ఈ ఉంగరం చూసి నట్టయితే నిన్ను విశ్వసిస్తుంది, భయపడకుండా ఉంటుంది," అని చెప్పాడు. హనుమంతుడా ఉంగరాన్ని నెత్తిన పెట్టుకుని రాముడికి నమస్కారం చేసి బయలుదేరాడు.

"హనుమంతుడా, నా ఆశలన్నీ నీపైనే పెట్టుకుని ఉన్నాను. నీ శక్తికొద్దీ ప్రయత్నించి సీత దక్కేటట్టు చెయ్యాలి," అని రాముడు హనుమంతుడితో చివరి మాటగా అన్నాడు.

హనుమంతుడు తన జట్టు వానరులతో బయలుదేరి వెళ్ళాడు. అలాగే అన్ని దిక్కులకూ వానర సమూహాలు బయలుదేరి



వెళ్ళాయి. వారు తిరిగి రావటానికి ఒక్క నెల గడు విధ్వబడింది. ఈ నెల రోజులూ సీత వార్తకై ఎదురు చూస్తూ రాముడు లక్ష్మణుడితో సహా ప్రస్రవణ పర్వతం పైనే గడిపాడు. సుగ్రీవుడు తన విధిని నెరవేర్చినవాడై పెద్ద బరువు దిగి పోయినట్టు సంతోషించాడు.

సుగ్రీవుడి చేత వేరువేరు దిక్కులకు పంపబడిన వానరులు సీత కోసం చాలా శ్రద్ధగా వెతికారు. వారు పగలంతా వేరువేరు స్థలాలకు వెళ్ళి వెతుకుతూ, రాత్రి పూట ఏ పళ్ళ తోటల్లోనో తిరిగి కలుసుకుని నిద్రపోతూ నెల రోజులూ వెతికారు. నెల





పూర్తి అయేసరికి తూర్పు నుంచీ, పడమటి నుంచీ, ఉత్తరం నుంచీ వానరులు తిరిగి వచ్చి, తమకు సీత జాడ తెలియరాలేదని సుగ్రీవుడితో చెప్పుకున్నారు.

ఇక దక్షిణంగా బయలుదేరిన వానర వీరులు సీతను వెదుకుతూ చాలా దూరం వెళ్ళి వింధ్య పర్వతాన్ని చేరుకున్నారు. వింధ్య పర్వతం సామాన్యమైన పర్వతం కాదు. దానిపై ఎన్నో శిఖరాలు, ఎన్నో గుహలు! దాని పరిసరాలలో ఎన్నో నదులు, ఎన్నో దుర్గమారణ్యాలు! వానరులు ఎంతో ఓపికగా ప్రతి ప్రదేశమూ వెతికారు.

ఒక చోట వారికి ఒక భయంకరుడైన రాక్షసుడు కనిపించాడు. వాడే రావణుడై ఉంటా డనుకుని అంగదుడు వాణ్ణి ఒక్క దెబ్బతో నెత్తురు కక్కి చచ్చేట్టు చేశాడు. ఆ సమీపంలో సీత ఉంటుందేమోనని వెతికారు. కాని వారి ఆశ ఫలించలేదు.

చిట్టచివరకు అందరూ అలిసిపోయి ఒక చెట్టు కింద కూచున్నారు. అప్పుడు అంగదుడు మిగిలిన వాళ్ళతో, "సీత కోసం మనం పడిన శ్రమ ఇంతవరకు ఫలించలేదు. రోజులా చాలా గడిచాయి. సుగ్రీవుడు తీవ్రంగా దండించే మనిషి. అందుచేత మనం మరింత ఒళ్ళు వంచి వెతకాలి, నిద్రకూడా మానాలి," అన్నాడు. గంధమాదనుడు కూడా అంగదుడి అభిప్రాయాన్ని బలపరిచాడు.

ఆకలి దప్పులతో ఆర్చుకు పోతున్న గొంతుతో అతను, "సుగ్రీవుడి ఆజ్ఞ ప్రకారం అందరూ సమస్త వనాలూ, పర్వతాలూ, గుహలూ, బిలాలూ సీత కోసం వెతకండి," అన్నాడు. వెంటనే వానరులంతా లేచి వింధ్యారణ్యాలన్నీ సీత కోసం గాలించ సాగారు. వారా పర్వతమంతా గాలించే లోపలనే నెల రోజుల గడువు పూర్తి అయిపోయింది.






వానరులు తిరిగి తిరిగి అలిసిపోయి, ఆకలి దప్పులతో అలమటిస్తూ, మయుడు నిర్మించిన ఋక్షబిలం వద్దకు చేరుకున్నారు. అందులోనుంచి పక్షులు ఎగిరి వస్తున్నాయి, సువాసనలు వెలువడుతున్నాయి. కాని బిలానికి అడ్డంగా లతల పొదలు ఉండటం చేత లోపలికి వెళ్ళటం కష్టంగా ఉన్నది.

"ఈ బిలం లోపలినుంచి పక్షులు రావటం చూస్తేనూ, బయట ఉన్న పొదలు నవనవలాడుతూ ఉండటం చూస్తేనూ దీని లోపల బావో, చెరువో ఉంటుందని తోస్తుంది," అన్నాడు హనుమంతుడు.

వెంటనే వానరులు ఆ బిలం లోపలికి ప్రవేశించారు. లోపల గాఢాంధకారం. ఆ కటిక చీకటిలో వారు ఒకరి చేతు లొకరు పట్టుకుని ముందుకు పోగా పోగా ఒక అద్భుతమైన ప్రదేశం వచ్చింది. ఆ ప్రదేశం, కాంతివంతంగా ఉన్నది. పెద్ద పెద్ద చెట్లున్నాయి. వెండి బంగారాలతో చేసి రత్నాలతో అలంకరించిన ఇళ్ళున్నాయి. బంగారు, వెండి, కంచు పాత్రలు రాసులుగా పోసి ఉన్నాయి. అలాగే అగరు చందనాలూ, ఫలాలూ, పానీయాలూ, బట్టలూ, రత్న కంబళ్ళూ, తోళ్ళూ, బంగారమూ పెద్ద పెద్ద రాసులలో కనిపించాయి.

దగ్గిరలోనే ఒక స్త్రీ కృష్ణాజినమూ, నార బట్టలూ ధరించి, కాంతితో వెలిగిపోతూ తపస్సు చేసుకుంటున్నది.







హనుమంతుడామెను సమీపించి నమస్కరించి, "నీవెవరు? ఇదేమి బిలం? మేము చాలా దూరం ప్రయాణించి, ఆకలి దప్పులతో అలమటిస్తూ నీరు దొరుకుతుందనే ఆశతో తొందరపడి ఈ బిలం ప్రవేశించాం. ఇక్కడి వింతలన్నీ చూస్తే ఇదంతా రాక్షసమాయేమో ననిపిస్తున్నది. ఈ ఇళ్ళూ, ఈ పళ్ళూ ఎవరివి? ఇక్కడి నీళ్ళలో బంగారు కమలాలూ, బంగారు చేపలూ, బంగారు తాబేళ్ళూ ఎవరి మహిమ చేత కలిగాయి?" అని అడిగాడు.

దానికి ఆ తపస్విని ఈ విధంగా సమాధానం చెప్పింది :

"దానవుల విశ్వకర్మ అయిన మయుడు ఇక్కడ నివసించేవాడు. ఆయన దీర్ఘ తపస్సు చేసి బ్రహ్మ నుంచి గొప్ప వరాలు పొందాడు. ఆయనే తన శక్తిచేత ఈ ప్రదేశం సృష్టించి, హేమ అనే అప్సరతో ఇక్కడ సుఖంగా జీవిస్తూ వచ్చాడు. అది చూసి సహించలేక దేవేంద్రుడు మయుడిపై వజ్రాయుధం ప్రయోగించాడు. తరవాత బ్రహ్మ ఈ ప్రదేశం హేమ కిచ్చేశాడు. హేమ నా ఇష్ట సఖి. నేను మేరుసావర్ణి కుమార్తెను. నా పేరు స్వయంప్రభ. ఈ ప్రదేశాన్ని రక్షిస్తూ ఇక్కడ ఉన్నాను. మీ రిక్కడికి ఏ పని మీద వచ్చారు? ఇక్కడి ఫలాలూ నీళ్ళూ పుచ్చుకుని మీ ఆకలి దప్పులు తీర్చుకుని మీ వృత్తాంతం చెప్పండి."

వానరులందరూ పళ్ళు తిని నీరు తాగి సంతృప్తులయినాక హనుమంతుడు స్వయంప్రభకు తమ పూర్వోత్తరాలు ఇలా చెప్పాడు :

"దశరథ మహారాజు కొడుకు రాముడు త్రిలోకాధిపతి అయిన ఇంద్రుడితో సమానుడు. అతను తన తమ్ముడైన లక్ష్మణుడితోనూ, భార్య అయిన సీతతోనూ దండకారణ్యానికి వచ్చాడు. వారు జనస్థానంలో ఉండగా సీతాదేవిని రావణుడు







బలాత్కారంగా తీసుకుపోయాడు. రాముడి మిత్రుడైన సుగ్రీవుడు సమస్త వానరులకు రాజు. ఆయన సీతాదేవిని వెతికే నిమిత్తమై మమ్మల్ని దక్షిణ దిశకు పంపాడు. మేము దక్షిణ దిశ అంతా కలయ వెతికి, ఆకలి చెంది, అలసిపోయి ఒక చెట్టు కింద కూచుని ఉండగా లతలు కప్పి ఉన్న గొప్ప అంధకార బిలం కనిపించింది. తడి విదిలించుకుంటూ ఈ బిలం నుంచి పక్షులు బయటికి రావటం చూసి నేనే ఈ వానరులందరినీ ప్రోత్సహింప జేసి బిలంలో ప్రవేశించమన్నాను. మేము ఇలా వచ్చి ఇక్కడ చేరుకున్నాం. అదృష్టవశాన నీవు మాకు తటస్థపడి మా ఆకలి తీర్చి, మేలు చేశావు."

హనుమంతుడు స్వయంప్రభకు ఈ విధంగా తమ వృత్తాంతమంతా చెప్పి, "నీవు మాకు ప్రాణదానం చేశావు. దీనికి ఏ ప్రత్యుపకారం కోరినా చేస్తాము. మేము ఈ బిలంలో ప్రవేశించామేగాని ఇందులో నుంచి ఎలా బయట పడాలో తెలియటం లేదు," అన్నాడు.

స్వయంప్రభ తన కేమీ ప్రత్యుపకారం అవసరం లేదనీ, వానరులంతా కళ్ళు మూసుకుంటే వారిని తన తపశ్శక్తిచే బిలం వెలుపల చేర్చుతాననీ అన్నది. వానరులందరూ కళ్ళు మూసి తెరిచేసరికి బిలం వెలపల ఉన్నారు. స్వయంప్రభ వారున్న చోటికి కొండ గుర్తులు చెప్పి బిలంలోకి వెళ్ళి పోయింది.

వింధ్య పర్వతపు పడమటి పార్శ్వపు టంచున కూచుని, పశ్చిమ సముద్రాన్ని చూస్తూ తమ గడువు ముగిసిందనీ, శిశిరం వెళ్ళి వసంతం కూడా రాబోతోందనీ గుణించుకుని వానరు లందరూ చింతలో మునిగిపోయారు.

అప్పుడు అంగదుడు మిగిలిన వానరులతో, "మనమంతా సుగ్రీవుడి ఆజ్ఞకు







లోబడి వచ్చాం. ఆయన చెప్పిన గడువు లోపల సీత జాడ తెలుసుకోలేక పోయాం. ఇప్పటికే ఆయన అజ్ఞ మీరిన వాళ్ళ మయాం. సుగ్రీవుడు చాలా క్రూరుడు, మీదుమిక్కిలి రాజు. మనని క్షమించడు. ఆయన వద్దకు తిరిగి పోవడం కన్న అన్న పానాలు మాని ప్రాయోపవేశం చేసి చావటం మేలు. కావటానికి నేను యువ రాజునే కాని నన్ను యువరాజు చేసినది సుగ్రీవుడు కాదు, రాముడు. సుగ్రీవుడికి నా మీద చాలా పగ ఉన్నది. నేను ఇప్పుడు అతడికి దొరికితే నన్ను ప్రాణాలతో వదలడు," అన్నాడు.



మిగిలిన వానరులు కూడా ఇలాగే భావించారు. కనీసం సీత వార్త అయినా తెలిస్తే రాముడు సంతోషించి, గడువు దాటి నందుకు శిక్ష పడకుండా చూస్తాడేమో! కాని సీత జాడ తెలియక, గడువు దాటి కిష్కింధకు వెళ్ళటం కన్న ఇక్కడే ఉండి పోవటం మేలని వారు భావించారు. ముఖ్యంగా తారుడు వారితో, "ఇంత ఆలోచన దేనికి? మీ కిష్టమైతే ఈ బిలం లోనే ఉండి పోదాం," అన్నాడు.

అంగదుడి మాట కారితనమూ, ధోరణీ గమనిస్తున్న హనుమంతుడు తనలో, "అబ్బో, వీడు సుగ్రీవుడి రాజ్యం కాజేసే లాగే ఉన్నాడే!" అనుకుని వానరులకూ అంగదుడికీ మధ్య భేదం కలిగించటానికి గాను, "అంగదుడా, వానరులకు ఈ క్షణం ఉన్న ఆలోచన మరుక్షణం ఉండదు. వీరందరూ భార్యలనూ బిడ్డలనూ వదిలేసి నీ ఆజ్ఞలు పాలిస్తూ నిజంగానే ఇక్కడ ఉండి పోతారని నమ్ముతున్నావా? ఉన్న మాట చెబుతాను విను. నేనుగాని, ఈ జాంబవంతుడుగాని, నీలుడుగాని, సుహోత్రుడుగాని సుగ్రీవుణ్ణి విడిచి నిన్ను అనుసరించటం కల్ల. అదీగాక బలవంతుడితో వైరం కూడదు. ఈ బిలం నిన్ను లక్ష్మణ









వదినెను భార్యను చేసుకున్న పాపి. రాక్షసుడితో పోరటానికి బిలంలోకి దూరిన తన అన్న బయటికి రాకుండా బిలానికి కొండ రాయి అడ్డం పెట్టిన ద్రోహి. తనకు రాజ్యదానం చేసిన రాముణ్ణే మరిచిన కృతఘ్నుడు. లక్ష్మణుడి భయం కొద్దీ సీతాన్వేషణకు గాను మనని పంపాడేగాని అతనికి అధర్మ భయం ఎక్కడిది? అటువంటివాడు, తన కొడుక్కు రాజ్యమిస్తాడుగాని నా కిస్తాడా? తన ఆజ్ఞ మీరిన వంక పెట్టి నన్ను తప్పక ఉరి తీయిస్తాడు. నేను తిరిగి రాను; ఇక్కడే ప్రాయోపవేశం చేస్తాను. నన్ను వదిలి మీరంతా వెళ్ళండి. రామ లక్ష్మణులకూ, మా పినతండ్రికీ, పినతల్లి రుమకూ నా నమస్కారాలు చెప్పండి. నే నంటే ప్రాణం కన్న ఎక్కువగా చూసే నా తల్లిని ఊరడించండి. ఆమె ఎలాగూ నాకోసం ప్రాణాలు విడుస్తుంది," అని మిగిలిన వానరులకు నమస్కారాలు చేసి, భూమి మీద దర్భలు పరుచుకుని వాటిపై ఏడుస్తూ పడుకున్నాడు.

అంగదుణ్ణి చూసి వానరులందరికీ ఆగకుండా దుఃఖం వచ్చింది. వాళ్ళు వాలిని మెచ్చుకుని సుగ్రీవుణ్ణి తిట్టుతూ, తాము కూడా ప్రాయోపవేశం చేయ నిశ్చయించారు. సముద్రంలో స్నానం చేసి తీరాన దర్భలు

బాణాల నుంచి కూడా రక్షించ లేదు. తెగబడి యుద్ధమే చెయ్యటానికైనా నీవు వాలి కన్న బలశాలివి కావుగదా! ఈ వానరులందరూ నీ మాట అనుసరిస్తారని భ్రమపడితే త్వరలోనే ఒంటరిగాడివై పోతావు. సుగ్రీవుడికి నీ పైన పగ అన్నది నిజం కాదు. నీ తల్లి పై ఆయనకు ప్రేమ గనక ఆమెను బట్టి నీ పైన కూడా ప్రేమే," అన్నాడు.

ఈ మాట లేవీ అంగదుడి చెవికెక్క లేదు. అతను కోపావేశంతో, "సుగ్రీవుడికి స్థిరబుద్ధీ, ఆత్మశుద్ధీ, చిత్తశుద్ధీ, దయా, పరాక్రమమూ, గాంభీర్యమూ ఏ కోశానా లేవు. అన్న బతికి ఉండగానే తల్లిలాటి





పరిచి వారంతా తూర్పు ముఖంగా పడుకున్నారు. అలా పడుకుని వారు రాముడు అరణ్యవాసానికి బయలుదేరినది మొదలు జరిగిన సంఘటనలన్నీ చెప్పుకుంటూ ఉండగా ఒక భయంకరమైన ఆకారం గల గద్ద వారికి కనిపించింది. దానిని చూస్తూనే భయంతో వారు పెట్టిన కేకలకు గుహలన్నీ మారుమోగాయి.

ఆ వచ్చినది జటాయువు అన్న అయిన సంపాతి. అతను వింధ్య పర్వతం మీది ఒక గుహలో ఉంటున్నాడు. అతను గుహలో నుంచి వెలికి వచ్చి, "దేవుడి దయ వల్ల ఇవాళ నాకు కావలిసినంత ఆహారం! ఈ వానరులందర్నీ వరసగా చంపి కడుపు నింపుకుంటాను," అన్నాడు.

ఆ మాటలు విని అంగదుడు హనుమంతుడితో, "మన కెలాటి గతి పట్టింది? యముడు ఈ గద్ద రూపంలో మనని కడతేర్చ వచ్చాడు. మనమూ రాముడి పని తీర్చినవాళ్ళమూ కాలేదు, సుగ్రీవాజ్ఞ నిర్వర్తించిన వాళ్ళమూ కాలేదు. మన కన్న ఆ జటాయువు మేలు; అతను రాముడి కోసం ప్రాణాలు వదిలాడు. మనం రామకార్యం మీద బయలుదేరామన్న మాటేగాని అది చెయ్యకుండానే ఈ గద్ద నోట పడబోతున్నాం. మన చావుకు ఎన్ని కలిసి



వచ్చాయో! జటాయువు ప్రాణాలు వదలక పోతే మనకు సీతను వెతక వలిసిన పనే ఉండేది కాదు; రావణుడి సంగతి అతనే చెప్పేవాడు. రావణుడు సీత నెత్తుకు పోక పోతే అమె కోసం వెతికే పనే ఉండేది కాదు. దశరథుడు చావకపోతే ఏనాడో రాముణ్ణి పిలిపించుకుని ఉండేవాడు. అసలు దశరథుడా కైకేయికి వరాలే ఇవ్వకపోతే ఏ బెడదా ఉండకనేపోను. ఇవన్నీ మన వానరు లందరి ప్రాణం తియ్యటానికే జరిగాయి," అన్నాడు.

సంపాతి గట్టిగా, "ఎవడది? నా తమ్ముడు చచ్చిపోయినట్టు మాట్లాడుతున్నాడు! ఇంత కాలానికి నా తమ్ముడి పేరు విన్నాను గదా అని సంతోషించాను. నాయనలారా, నా రెక్కలు సూర్య కిరణాలకు కాలిపోయాయి. నేను మీ దగ్గిరికి రాలేను. దయచేసి నన్ను మీరున్న చోటికి దించండి," అని అరిచాడు.

వానరులు ఇదంతా దొంగ ఎత్తను కున్నారు. అయినా తాము చావటానికి సిద్ధమయ్యే ఉన్నారు గనక ఆ చావు ఈ విధంగా త్వరగా రావటం కూడా మేలేనేమోనని వారికి తోచింది. అంగదుడు మాత్రం లేచి వెళ్ళి సంపాతిని కొండ మీది నుంచి దించి కిందికి తెచ్చాడు.

అతను సంపాతితో రాముడు అరణ్య వాసం రావటమూ, జనస్థానంలో ఉన్న సీతను రావణుడు అపహరించటమూ, అది చూసి జటాయువు రావణుడితో ఘోర యుద్ధం చేసి చని పోవటమూ, రామ లక్ష్మణులు సీతను వెతుక్కుంటూ ఋశ్య మూకానికి వచ్చి, సుగ్రీవుడి స్నేహం చేసి, వాలిని చంపి, వానర రాజ్యాన్ని సుగ్రీవుడి కివ్వటమూ, సుగ్రీవుడు సీతాన్వేషణకై తమను పంపటమూ, తాము విఫలులై, తిరిగి వెళ్ళలేక ప్రాయోపవేశం చెయ్యటమూ వివరించి చెప్పాడు.






సంపాతి తన తమ్ముడి మరణ వార్త విని కన్నీరు కార్చుతూ, "జటాయువును చంపిన ఆ దుర్మార్గుడు రావణుడి పైన పగ తీర్చుకుందామన్నా నేను ముసలివాణ్ణి, రెక్కలు లేనివాణ్ణి, ఏం చేసేది? వెనక వృత్రాసురుడి వధ జరిగిన రోజుల్లో నేనూ, జటాయువూ పోటీ పడి ఒకరి కన్న ఒకరం వేగంగా ఎగురుతూ ఆకాశంలోకి వెళ్ళాం. మిట్ట మధ్యాహ్నపు ఎండ తీక్ష్ణతకు తట్టుకోలేక జటాయువు వివశుడై సోలి పోయాడు. అప్పుడు నేను ప్రేమ కొద్దీ నా రెక్కలు చాచి వాడికి నీడ ఇచ్చాను. దానితో నా రెక్కలు మాడి పోయాయి; నేను ఈ వింధ్య పర్వతం పైన పడ్డాను. తరవాత నాకు నా తమ్ముడి సమాచారమే తెలియలేదు," అన్నాడు.

ఈ మాట విని అంగదుడు, "అయ్యా, నీవు జటాయువు అన్నవైతే ఆ రావణుడు ఎక్కడ ఉంటాడో, ఎంత దూరాన ఉంటాడో చెప్పు," అన్నాడు.

"నాయనా, న్యాయానికి నేను స్వయంగా రామకార్యం చెయ్యవలసిన వాణ్ణేగాని, ముసలివాణ్ణీ, అశక్తుణ్ణీ కావటంచేత వాక్సహాయమైనా చేస్తాను. రావణుడు సీతను తీసుకునిపోయిన మాట నిజమే. అతను లంకలో ఉంటాడు. అది ఇక్కడికి నూరామడల దూరాన సముద్ర మధ్యంలో ఉన్నది. లంకలోనే లంకా నగరం ఉన్నది. దాన్ని విశ్వకర్మ బంగారు ద్వారాలతో, బంగారు అరుగులతో, గొప్ప ప్రాకారాలతో నిర్మించాడు. ఆ లంకలోని రావణుడి అంతః





పురంలో సీత రాక్షస స్త్రీల మధ్య దుఃఖిస్తూ ఉన్నది. గద్ద జాతివాణ్ణి కావటంచేత ఇక్కడి నుండే రావణుణ్ణీ, సీతనూ చూడగలుగుతున్నాను. మీ రక్కడికి వెంటనే వెళ్ళినట్టయితే సీత తప్పక కనబడుతుంది," అన్నాడు సంపాతి.

అప్పుడు జాంబవంతుడు సంపాతితో, "అయ్యా, సీతను రావణుడు పట్టుకుపోగా చూసింది ఎవరు?" అని అడిగాడు. మిగిలిన వానరులు సంపాతి చెప్పే మాటలను ఆసక్తితో వినటానికి ఎదురు చూశారు.

"ఆ కథ చెబుతాను వినండి. నేను కదలలేని వాణ్ణి కావటంచేత నా కొడుకు సుపార్శ్వుడు రోజూ నియమం తప్పకుండా నాకు ఆహారం తెచ్చి ఇస్తూ ఉంటాడు. అలాటిది వాడు ఒకనాడు వేళమించి, సూర్యాస్తమయం అయినాక రావటమేగాక వట్టి చేతులతో వచ్చాడు. అసలే ఆకలి దహించుకుపోతూ ఉండటంచేత నేను వాణ్ణి బాగా తిట్టాను. నా కోపం పోగొట్టుతూ వాడు జరిగిన సంగతి చెప్పాడు. వాడు నా ఆహారం నిమిత్తం మహేంద్ర పర్వతం వద్ద జంతువులు నడిచే దారికి అడ్డంగా నిలిచి ఉన్నాడట. ఆ సమయంలో నల్లని శరీరం గల వాడొకడు సూర్యోదయంలాగా వెలిగిపోయే ఒక స్త్రీని తీసుకుపోతూ అటుగా



వచ్చాడట. ఆ మగవాణ్ణీ, ఆడదాన్నీ నాకు ఆహారంగా తీసుకు వద్దామని సుపార్శ్వుడు ఆలోచిస్తుండగా ఆ నల్లటివాడు చాలా మంచి తనంగా దారి విడవమని కోరాడట. మర్యాదగా అడిగాడుగదా అని నా కొడుకు దారి ఇచ్చాడట. ఈ సంగతి తెలిసి అక్కడి మునులు సుపార్శ్వుడితో, 'ఇవాళ నీవు బతికి బయట పడటం నీ అదృష్టం! నిన్ను దారి అడిగినవాడు మరెవరో కాదు, లంకా నగరాన్ని ఏలే రావణుడు. వాడు ఎత్తుకు పోతున్నది రాముడి భార్య అయిన సీత!' అని అన్నారట. ఇదంతా జరగటం మూలాన వాడు నాకు వేళకు ఆహారం తీసుకు రాలేకపోయానని చెప్పాడు," అన్నాడు సంపాతి.

తరవాత సంపాతి తన తమ్ముడికి ఇన్ని నీళ్ళు విడిచి, స్నానం చేసి ఒక చోట కూర్చున్నాడు. వానరులు అతని చుట్టూ చేరి కూచున్నారు. సంపాతి మళ్ళీ వారితో ఇలా అన్నాడు :

"నేను సూర్యుడి వేడికి రెక్కలు కాలి ఇక్కడ పడిపోయానని చెప్పాను కాదూ? ఆరు రోజులపాటు నాకు స్పృహలేదు. ఆ తరవాత, నేను పడినది వింధ్య పర్వతం మీద అని తెలుసుకున్నాను. అప్పుడిక్కడ నిశాకర మహర్షి ఆశ్రమం ఉండేది. ఆయన





గొప్ప తపస్వి. అదివరకు నేనూ, మా జటాయువూ ఆ మహర్షిని ఎరుగుదుము. నేను మెల్లిగా కాళ్ళీడ్చుకుంటూ ఆయన ఆశ్రమానికి వచ్చి ఆయన దర్శనం కోసం ఒక చెట్టు కింద నిలిచాను. కొంత సేపటికి ఆ మహర్షి స్నానం చేసి అటుగా వచ్చాడు. ఆయన తిన్నగా ఆశ్రమంలోకి వెళ్ళి మళ్ళీ వచ్చి నన్ను చూసి నేను వచ్చిన పని అడిగాడు. నా దుస్థితికి కారణం ఏమి టన్నాడు. నన్ను గుర్తించాడు కూడా. నే నాయనతో జరిగినదంతా చెప్పాను. నాకు ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తున్నదని కూడా ఆయనతో అన్నాను. నాకు దుఃఖం అగలేదు. ఆయన కొంతసేపు కళ్ళు మూసి ధ్యాన నిమగ్నుడై, 'నీకు మళ్ళీ రెక్కలు వస్తాయి, జవసత్వా లేర్పడతాయి. భవిష్యత్తులో దశరథుడనే రాజు పుట్టబోతాడు. అతని కొడుకు భార్యతో అరణ్యవాసం చేయవస్తాడు. వారు జనస్థానంలో ఉండే టప్పుడు రావణుడనే రాక్షసరాజు రాముడి భార్యను అపహరిస్తాడు. ఆమె కోసం వెతక మని రాముడు పంపగా వానరులు నీ వుండే చోటికి వస్తారు. వారికి నీవు సీత సంగతి చెప్పు. నీవు ఎక్కడికీ పోలేవు గనక ఇక్కడే ఉండటం మంచిది,' అన్నాడు. ఇదంతా ఎనిమిది వేల ఏళ్ళనాటి మాట. నాకీ సంగతి చెప్పిన నిశాకరమహర్షి నూరేళ్ళ అనంతరం దేహం చాలించాడు. నా మనసు అయోమయంలో పడిపోయింది. రావణుడు బలశాలి అయితేనేంగాక, ఆ దుర్మార్గుడు సీతను తీసుకుపోవటం నా కొడుకు కళ్ళారా చూశాడని తెలిసినప్పుడు, 'వాడితో పోరి సీతను విడిపించి ఉండవలసింది,' అని నా కొడుకును మందలించాను. నా తమ్ముడు ప్రాణాలు విడిచాడు, నా కొడుకు ఏమీ చేయనేలేదు. రావణుడు మహాపరాక్రమ వంతుడనటానికి సందేహం లేదు. కాని మీరు తక్కువవాళ్ళు కారు. సుగ్రీవుడు



సరి అయిన వాళ్ళనే ఎంచి పంపాడు. మీరు వెళ్ళినట్టయితే సీత తప్పక కనిపిస్తుంది. తరవాత రామ లక్ష్మణుల బాణాలతో ఆ రావణుడు తప్పక చస్తాడు. వాడు నా తమ్ముడైన జటాయువును చంపినందుకు నా పగకూడా తీరుతుంది.''

ఈ విధంగా సంపాతి వానరులతో చెబుతూండగానే అతనికి కొత్త రెక్కలూ, ఈకలూ మొలుచుకు వచ్చాయి. సంపాతి ఆనందంతో, ''చూశారా, నిశాకరమహర్షి చెప్పినది అక్షరాలా జరిగింది. మీరు వెళ్ళే పని జరుగుతుందని కూడా ఆయన అన్నాడు. అందుచేత మీకు కార్యసిద్ధి తప్పక అవుతుంది,'' అంటూ ఆకాశంలోకి ఎగిరాడు. ఇది చూసి వానరులు కూడా కొత్త ఉత్సాహంతో దక్షిణంగా బయలుదేరారు. సీత జాడ తెలిసిన సంతోషంతో వాళ్ళు గెంతారు, సింహనాదాలు చేశారు. ఈ విధంగా వెళ్ళి వారు దక్షిణ సముద్ర తీరాన్ని చేరుకున్నారు.

అంతులేని ఆ సముద్రాన్ని చూడగానే వానరులకు భయం పుట్టింది. ఆ సముద్రంలో నూరామడల దూరాన లంక ఉన్నది. దీన్ని ఎలా దాటటం? అంగదుడు మేటి వానరులను సమావేశ పరిచి, ''మనం ఎలాగైనా ఈ సముద్రాన్ని దాటనిదే సీతాదేవిని చూడలేము. సీతను చూడకుండా తిరిగిపోయే



కన్న ఇక్కడ ప్రాయోపవేశం చెయ్యటం మేలు. సముద్రాన్ని చూసి భయపడి ప్రయోజనం లేదు. మీలో ఎవరెవరు ఎంతెంత దూరం దూకగలరో చెప్పండి," అన్నాడు. సముద్రం దాటి లంకకు చేరగల ఘటికుడి పైన అందరి క్షేమమూ ఆధారపడి ఉన్నది. గజుడు పది ఆమడల దూరం దూకగల నన్నాడు. గవాక్షుడు ఇరవై ఆమడలూ, గవయుడు ముప్పై ఆమడలూ దూకగల మన్నారు. నలభై ఆమడలు దూక గల నన్నాడు శరభుడు. గంధమాదనుడూ, మైందుడూ, ద్వివిదుడూ వరసగా యాభై, అరవై, డెబ్భై ఆమడలు దూకగల మన్నారు. సుషేణుడు ఎనభై ఆమడలు దూకగల నన్నాడు. జాంబవంతుడు, "ఒకప్పుడు నేను ఎంత దూరమైనా దూకేవాణ్ణి. త్రివిక్రముడు వామనావతార మెత్తి మూడడుగులతో మూడు లోకాలూ ఆక్రమించి నప్పుడు నేను అతని చుట్టూ ప్రదక్షిణం తిరిగి వచ్చాను. ఇప్పుడు ముసలివాణ్ణి, తొంభై యోజనాలు మించి దూకలేను," అన్నాడు.

అందరన్న మాటలూ విని అంగదుడు, "నేను నూరు ఆమడల దూరం సులువు గానే దూక గలను. కాని తిరిగి రాగలనని నిశ్చయంగా చెప్పలేను," అన్నాడు.



ఆ మాట విని జాంబవంతుడు, "నాయనా, మాకు రాజువంటి వాడవు. నీవు మాలో ఒకణ్ణి లంకకు పంపవచ్చు గాని నిన్ను మేమెలా పంపుతాము? అది పొసగదు," అన్నాడు.

"నేనూ వెళ్ళక, మీలో వెళ్ళేవారూ లేక పోతే ఇక మనకు ప్రాయోపవేశమేగదా గతి?" అన్నాడు అంగదుడు.

"నాయనా, ఆ విషయం నీ వేమీ విచా రించకు. మన పని సానుకూలం చెయ్య గల మహామహుడు అడుగో దూరాన ఒంటరిగా కూచున్నాడు," అంటూ జాంబ వంతుడు హనుమంతుణ్ణి చూపాడు.





అతను హనుమంతుడి వద్దకు వెళ్ళి, "మేమంతా తలలు పగల గొట్టుకుంటూ ఉంటే మా కందరికీ మేటివైన నీవు ఉలుకూ, పలుకూ లేకుండా ఇక్కడ ఒంటిగా కూర్చున్నావేమిటి? పుట్టుతూనే సూర్యుణ్ణి చూసి పండనుకుని ఆకాశాని కెగిరిన వాడవుకదా, నీవు కాక ఈ మహా సముద్రాన్ని మరెవరు దాట గలరు? వేగంలో వాయువుకు సమానమైన వాడవు, గరుత్మంతుడికి తీసిపోనివాడవు. ఎగరటంలో నీకు సరి వచ్చేవాళ్ళు మాలో ఎవరున్నారు? నీ ప్రజ్ఞ చూడటానికి ఈ వానరులంతా ఆత్రంగా ఎదురు చూస్తున్నారు. మరి లే! లేచి నీ శక్తి చూపించు!" అని ఉత్సాహ పరిచాడు.

ఈ మాటలు వింటూంటే హనుమంతుడి శరీరం పొంగిపోయింది. హనుమంతుడి శరీరం పెరిగి పోతున్న కొద్దీ వానరులు ఉత్సాహాతిశయంతో సింహనాదాలు చేశారు. వారి ప్రశంసలు వింటున్న కొద్దీ హను మంతుడి బలం కూడా పెరగ సాగింది. ఆ ఉత్సాహంలో అతను, "ఔను, ఈ సముద్రాన్ని అవలీలగా దాటుతాను. కావలిస్తే నేను సూర్యుడితో బాటు తూర్పు నుంచి బయలుదేరి పడమరకు వెళ్ళి మధ్యాహ్నని కల్లా సూర్యుడికి ఎదురు రాగలను. శుభ శకునాలు కలుగుతున్నాయి. నేను సీతాదేవిని తప్పక చూసి వస్తాను. మీరేమీ దిగులు పడకండి," అన్నాడు.

తాను భూమిని తన్ని పైకి లేచేటప్పుడు భూమి కంపిస్తుందనే ఉద్దేశంతో హను మంతుడు సమీపంలో ఉన్న మహేంద్ర పర్వత శిఖరాన్ని ఎక్కాడు. అతను అక్కడ నడుస్తుంటే అతని పాద ఘట్టనకు రాళ్ళు పిండి అయాయి, మహేంద్రగిరిపై ఉండే జంతువులు భయపడి నలు దిక్కులకూ పారిపోయాయి.

[కిష్కింధాకాండ సమాప్తం]





# సుందరకాండ

జాంబవంతుడు ప్రోత్సాహం ఇవ్వగా హనుమంతుడు రామముద్రికతో సహా లంకకు దాటి, రావణుడు సీతను ఉంచిన స్థలం కనిపెట్ట నిశ్చయించుకున్నాడు. అతను శరీరాన్ని పెంచి, మహేంద్రగిరి పైన అటూ ఇటూ తిరుగుతూ, పెద్ద వృక్షాలను తన రొమ్ముతో కూలదోస్తూ, మృగాలను చంపుతూ కొంతసేపు సంచరించాడు. బయలుదేరే ముందు అతను సూర్యుడికీ, ఇంద్రుడికీ, వాయుదేవుడికీ, బ్రహ్మకూ నమస్కారాలు చేసి, మహేంద్రపర్వతం మీద చేతులూ, కాళ్ళూ ఆనించి ఒక్క ఊపు ఊపాడు. చలనం ఎరగని మహేంద్ర పర్వతం ఆ ఊపుకు కంపించిపోయింది. దాని మీది శిలలు బద్దలయాయి. గుహలలో ఉండే ప్రాణులు ఆర్తనాదాలు చేశాయి. పర్వతం మీద ఉండే విద్యాధరులు కంగారు పడి ఆకాశంలోకి ఎగిరారు. ఋషులూ, చారణులూ, సిద్ధులూ హనుమంతుడు సముద్రాన్ని లంఘించి లంకకు వెళ్ళే యత్నంలో ఉండటం గురించి మాట్లాడుకోసాగారు.

హనుమంతుడు తన శరీరం మీది రోమాలను విదిల్చి, ఒక్క పెడబొబ్బ పెట్టాడు; ఒకసారి దూరం కేసీ, ఒకసారి ఆకాశం కేసీ చూసి, తన సమీపంలో ఉన్న జాంబవంతుడు మొదలైన వారితో, "నేను రామబాణం లాగా వేగంతో లంకకు పోతాను,







అక్కడ సీత కనిపించకపోతే అదే వేగంతో స్వర్గానికి వెళతాను. అక్కడ కూడా సీత లేని పక్షంలో తిరిగి లంకకువెళ్ళి, ఆ రావణుణ్ణి బంధించి ఇక్కడికి తెస్తాను. అదృష్టం కలిసివస్తే సీతను తెస్తాను. లేదా, రావణుడితో సహా లంకనే పెల్లగించి యిక్కడికి తెస్తాను," అన్నాడు.

ఈ మాట చెప్పి హనుమంతుడు ఆకాశంలోకి ఎగిరాడు. హనుమంతుడు ఎగిరిన వేగానికి పెద్దపెద్ద మానులు అతని వెనకగా గాలిలో లేచి కొంతదూరం ఎగిరి, తరవాత సముద్రంలో పడిపోయాయి. దూరప్రయాణం మీద బయలుదేరే వాణ్ణి బంధువులు కొంతదూరం సాగనంపినట్టుగా ఆ చెట్లు హనుమంతుణ్ణి వెంబడించాయి. అవి పడిపోయిన తరవాత కూడా వాటి పూలు మరికొంత దూరం హనుమంతుడి వెంట వెళ్ళాయి.

దక్షిణ దిక్కుగా హనుమంతుడు అతి వేగంగా సముద్రం మీదుగా పోతూ ఉంటే, అతని చేతుల సందుగా వెళ్ళే గాలి గొప్ప రొద చేసింది. అతను లంకకు చేటు సూచించే తోకచుక్కలాగా లంక కేసి వెళ్ళాడు. అతని వేగానికి అతనికి దిగువగా ఉండే సముద్రంలో పెద్ద తరంగాలు కల్లోలంగా లేచాయి. అతని నీడ సముద్రం మీద పది ఆమడల వెడల్పునా, ముప్పై ఆమడల పొడుగునా పడింది.

ఇలా సముద్రం మీదుగా వెళ్ళే హనుమంతుణ్ణి చూసి దేవతలు మెచ్చారు. సముద్రుడికి కూడా హనుమంతుడికి తోడ్పడాలనే ఆలోచన కలిగింది. ఎందుకంటే సముద్రుణ్ణి వృద్ధిపొందించిన సగరుడు ఇక్ష్వాకువంశం వాడు. అదే వంశంలో పుట్టిన రాముడి పని మీద హనుమంతుడు వెళుతున్నాడు. ఇక్ష్వాకు వంశానికి తన కృతజ్ఞత చూపుకోవాలంటే సముద్రుడికి యిది మంచి అవకాశం.









అందుకని సముద్రుడు తనలో దాగి ఉన్న మైనాకపర్వతంతో, "ఓ మైనాకుడా, పాతాళంలోని రాక్షసులు పైకి రాకుండా అడ్డం ఉన్న నీ కిప్పుడు చిన్నపని చెబుతాను. వానర శ్రేష్ఠుడైన హనుమంతుడు రాముడి పని మీద అత్యంత సాహసంతో లంకకు ఎగురుతూ ఇటుగా వస్తున్నాడు. నీకు పైకీ, పక్కలకూ కూడా పెరిగే శక్తి ఉన్నది గనక, నీటి పైకి పెరిగి ఆ హనుమంతుడికి కాస్సేపు విశ్రాంతి ఇయ్యి. నీ పైన కాస్సేపు విశ్రమించిన మీదట హనుమంతుడు మిగిలిన దూరం మరింత తేలికగా వెళ్ళగలడు," అన్నాడు.

అప్పుడు బంగారు శిఖరాలు గల మైనాక పర్వతం సముద్రుడు కోరిన ప్రకారం ఆకాశంలోకి పెరిగింది. దాని బంగారు శిఖరాలు నూరు సూర్యుళ్ళలాగా వెలిగాయి.

ఆకస్మికంగా తన దారికి అడ్డంగా పెరిగిన ఆ మైనాకాన్ని చూసి హనుమంతుడు, "ఇది నా పనికి విఘ్నంచెయ్యాలనే దుర్బుద్ధితో నా దారికి అడ్డంగా లేచింది," అనుకుని ఆ పర్వతాన్ని తన రొమ్ముతో ఒక్క తోపు తోసేసరికి, అది పక్కకు పడిపోయింది.

తనను సునాయాసంగా పడదోసిన హనుమంతుడి వేగానికి మైనాకు డెంతో సంతోషించి, మానవరూపం ధరించి ఒక శిఖరంపై నిలబడి, "వానరవీరుడా, నీవు అసాధ్యమైన సముద్ర లంఘనం చేస్తూ కూడా, కొంచెమైనా అలియకపోగా, నన్ను పడదోశావు. నా శిఖరం మీద కాస్సేపు విశ్రమించు. ఒకప్పుడు రాముడి పూర్వీకుడైన సగరుడూ, అతని కొడుకులూ సముద్రుడికి మహోపకారం చేశారు. అందుచేత రాముడి పని మీద వెళ్ళే నీకు కొంత సహాయంచేసి ఇక్ష్వాకులకు ప్రత్యుపకారం చెయ్యాలని సముద్రుడి కోరిక. అందుచేత నీకు విశ్రాంతి కలిగించమని సముద్రుడు నన్ను కోరాడు. నా మీద నిలిచి, అలసట







తీర్చుకుని కందమూలఫలాలు ఆరగించి మరీ వెళ్ళు. ఏ అతిథి అయినా పూజనీయుడే అన్నప్పుడు, నీ వంటి అతిథి మాట వేరే చెప్పాలా? నీవు మహాపండితుడవు, అది అలాగుంచి, వాయుదేవుడి కుమారుడవు. నేను వాయుదేవుడికి ఋణపడి ఉన్నాను. ఎలాగంటే: కృతయుగంలో పర్వతాలన్నిటికీ రెక్కలుండేవి. అవి వేగంగా గాలిలో ఎగురుతూ ఉండేవి. అందుచేత వాటిని చూసి దేవతలూ, ఋషులూ కూడా భయపడ్డారు. అప్పుడు దేవేంద్రుడు వజ్రాయుధంతో పర్వతాల రెక్కలు అనేకవేల సంఖ్యలో తెగవేశాడు. నా రెక్కలు కూడా తెగవేయటానికి ఇంద్రుడు రాగా, నీ తండ్రి అయిన వాయుదేవుడు నన్ను అతివేగంగా తీసుకుపోయి ఇంద్రుడి బారినుండి కాపాడాడు. ఆయన దయ వల్ల నా రెక్కలు దక్కాయి. అందుచేత నీవు కాదనకుండా, నేనూ, సముద్రుడూ చేసే ఆతిథ్యాన్ని స్వీకరించాలి," అని చెప్పాడు.

దానికి హనుమంతుడు, "చాలా సంతోషం! నీ మాటలే నాకు ఆతిథ్యం. మీ ఆతిథ్యాన్ని నిరాకరించి నందుకు మీరు కోపగించ వద్దు. కార్యార్థినైన నేను విశ్రాంతి తీసుకోవటం అసాధ్యం. రామబాణంలాగా లంకకు పోతానని వానరులకు మాట ఇచ్చాను," అంటూ మైనాకుణ్ణి తన చేతితో తాకి, సంతోషం తాండవించే ముఖంతో ముందుకు సాగాడు. "నీకు కార్యసిద్ధి అగుగాక!" అని సముద్రుడూ, మైనాకుడూ అతన్ని దీవించారు.

హనుమంతుడు అక్కడి నుంచి ఆకాశంలోకి మరింత ఎత్తుగా ఎగిరి ముందుకు సాగాడు. మైనాకుడిచ్చిన ఆశ్రయాన్ని నిరాకరించి దీక్షతో లంకకు వెళ్ళే హనుమంతుడికి దేవతలు పరీక్షపెట్ట గోరి, పాములకు తల్లి అయిన సురస వద్దకు వెళ్ళి,







"వాయుపుత్రుడైన హనుమంతుడు సముద్రం మీదుగా ఎగురుతూ లంకకు పోతున్నాడు. నీవు భయంకరాకారం ధరించి అతని దారికి అడ్డం తగులు. అతను నిన్ను జయించి పోతాడో, నిన్ను చూసి భయపడతాడో చూడగోరుతున్నాం. అతని పరాక్రమం ఎంతటిదో తెలుసుకోవాలని మా అందరి కోరిక," అన్నారు.

సురస వారి కోరిక తీర్చటానికై కొండంత రాక్షసరూపం ధరించి, పెద్ద కోరలతోనూ, గోరోజనం రంగుగల కళ్ళతోనూ భయంకరంగా తయారై, హనుమంతుడి దారికడ్డంగా నిలబడి, "హనుమంతుడా, నిన్ను భక్షించటానికి దేవతలు నాకు అనుజ్ఞ ఇచ్చారు. కనక నీవు నా నోట్లోకి ప్రవేశించు," అన్నది.

హనుమంతుడు సురసకు నమస్కారం చేసి, నవ్వుతూ, "రాముడు వనవాసం చేస్తూండే సమయంలో, ఆయన లేనప్పుడు రావణుడు ఆయన భార్య అయిన సీతను ఎత్తుకు పోయాడు. నేను రాముడి దూతగా ఇప్పుడు సీత వద్దకు పోతున్నాను. రాముడి రాజ్యంలో ఉండే దానివే గనక నీవుకూడా రామకార్యానికి తోడ్పడాలి. కాదంటావా, రాముడి వద్దకు వెళ్ళి అనుమతి పొంది, నీ నోట ప్రవేశిస్తాను. ఇందుకు నా కేమీ అభ్యంతరం లేదు," అన్నాడు.

సురస ఆ మాటకు జవాబివ్వక, "నన్ను దాటి ఎవరూ వెళ్ళలేరు. ఆ విధంగా నాకు వరం ఉన్నది. నా నోటి ముందుకు వచ్చిన వాడు తప్పించుకు పోలేకుండా నాకు బ్రహ్మ వరమిచ్చాడు. కనక నా నోట ప్రవేశించు," అంటూ నోరు తెరిచి హనుమంతుడి ముందు నిలబడింది.

ఈ మాటకు హనుమంతుడు అలిగి, "అయితే నన్ను మింగేటంతగా నోరు తెరు!" అంటూ, తన శరీరాన్ని పది ఆమడల ప్రమాణానికి పెంచాడు. వెంటనే సురస తన నోటిని ఇరవై ఆమడల ప్రమాణానికి





పెంచింది. హనుమంతుడు కోపంతో తన దేహాన్ని ముప్పై ఆమడలకు పెంచాడు. సురస తన నోటిని నలభై ఆమడలు చేసింది. హనుమంతుడు తన శరీరాన్ని యాభై ఆమడలకు పెంచాడు.

ఈ విధంగా పోటీ పడటంలో హనుమంతుడి శరీరం తొంభై ఆమడలూ, సురస నోరు నూరామడలూ అయాయి.

అకస్మాత్తుగా హనుమంతుడు తన శరీరాన్ని వేలంతదిగా చేసి, తూనీగలాగా సురస నోట్లో ప్రవేశించి మళ్ళీ బయటికి వచ్చి, "ఓ సురసా, బ్రహ్మదేవుడు నీ కిచ్చిన వరం సార్థక మయింది. నీ నోటి ఘుందుకు వచ్చిన నేను నీ నోట ప్రవేశించాను. ఇంతటితో నన్ను వదిలిపెట్టు. సీత ఉండే చోటికి వెళ్ళాలి," అన్నాడు.

సురస రాక్షస రూపం విడిచిపెట్టి మామూలు రూపు ధరించి, "వెళ్ళి రా, నాయనా. నీకు విజయం కలుగుతుంది. రాముణ్ణీ సీతనూ తిరిగి కలుపు!" అని చెప్పి తన నివాసానికి వెళ్ళింది.

హనుమంతుడు తిరిగి ప్రయాణం సాగించాడు. ఆకాశంలో ఎగిరి పోయే హనుమంతుణ్ణి సింహిక అనే రాక్షస జంతువు సముద్రంలో ఉండి చూసింది. అది ఆకలితో ఉండటం చేత హనుమంతుణ్ణి తినగోరి, అతని నీడను పట్టుకుని ఈడ్చింది. తనను ఎవరో వెనక్కు లాగేస్తూండటం గమనించి హనుమంతు డాశ్చర్యపోయి, అటూ, ఇటూ, అన్ని పక్కలా చూసేసరికి సముద్రం మీద సింహిక కనిపించింది. అది తన నీడను పట్టుకుని ఉండటం చూడగానే హనుమంతుడికి సుగ్రీవుడు ఎప్పుడో అన్న మాట జ్ఞాపకం వచ్చింది. దక్షిణ సముద్రంలో ఒక వింత జంతు వున్నదనీ, అది నీడను పట్టుకోగలదనీ సుగ్రీవు డన్నాడు. అదే ఇది అయి ఉంటుందని హనుమంతు డనుకున్నాడు.







సింహిక శక్తి ముందు హనుమంతుడి పరాక్రమం ఎందుకూ పనికి రాలేదు. అది అతన్ని తన కేసి ఈడ్చుకున్నది. హనుమంతుడు తన శరీరాన్ని అపారంగా పెంచాడు. అందుకు తగ్గట్టుగానే సింహిక కూడా భయంకరంగా నోరు తెరిచింది. ఆ తెరిచిన నోటి కుండా హనుమంతుడు దాని శరీరంలోని మర్మస్థానాలు గమనించి, తన శరీరాన్ని చిన్నదిగా చేసి, లోపలికి ప్రవేశించి, సింహిక మర్మాలు చీల్చేసి, అది తిరిగి నోరు మూసే లోపుగా బయటికి వచ్చేసి, తన శరీరాన్ని పెద్దది చేసుకున్నాడు. సింహిక గుండెలు చీలిపోయి స్పృహ తప్పి చచ్చి, నీటిపై తేలింది. చచ్చిన సింహికనూ, చంపిన హనుమంతుణ్ణీ చూసి ఆకాశంలో సంచరించే భూతాలు ఎంతో సంతోషించి, హనుమంతుణ్ణి కీర్తించాయి.

హనుమంతుడు మళ్ళీ బయలుదేరాడు. కొంత సేపటికి అతనికి సముద్రపు అవతలి తీరం కనిపించింది. అక్కడ అడవులున్నాయి. పోయినకొద్దీ లంకా ద్వీపమూ, అక్కడి వనాలూ, చెట్లూ మరింత బాగా కనిపించాయి. లంకలోని నదులు సముద్రంలో వచ్చి పడటం కనిపించింది.

తన దేహం ఇంకా పెద్దదిగానే ఉండటం హనుమంతుడికి జ్ఞాపకం వచ్చింది. లంకలోని రాక్షసులు అంత శరీరంతో ఉన్న తనను చూశారంటే హాహాకారాలు చేసి, అందరికీ చెబుతారు; అప్పుడు తాను వచ్చిన పని కాస్తా పాడైపోతుంది. అందు చేత హనుమంతుడు తన దేహాన్ని చిన్నదిగా చేసుకున్నాడు.

ఆ శరీరంతో అతను ఆలంబపర్వతం మీద దిగాడు. దాని మీద విరిగిచెట్లూ, మొగలి పొదలూ, కొబ్బరిచెట్లూ ఉన్నాయి. ఎత్తుగా త్రికూటపర్వతం పైన లంకానగరం కనిపిస్తున్నది. అది దేవేంద్రుడి అమరావతీ నగరంలాగున్నది.






నూరామడల దూరం దూకినా కూడా హనుమంతుడికి ఆయాసం కలగలేదు. ఆఖరుకు ఊపిరి కూడా వేగంగా పీల్చలేదు. అందుచేత అతను, "నేను ఎన్ని నూరామడలైన దూక గలను. ఈ సముద్రం దాటటం ఏపాటి?" అనుకున్నాడు. అతను పచ్చిక భూముల మీదుగా, చిన్న పెద్ద కొండలు గల అరణ్యాలమధ్యగా లంకానగరం కేసి నడవ సాగాడు. లంకా పట్టణం చుట్టూ సరళ చెట్లూ, కొండగోగులూ, ఖర్జూరాలూ, జంబీరాలూ, కొండ మల్లెలూ, మొగలి పొదలూ, ఏడాకుల అరటులూ మొదలైన ఎన్నో రకాల చెట్లున్నాయి, అందమైన ఉద్యానాలున్నాయి. నగరం చుట్టూ బంగారు ప్రాకారాలున్నాయి, అగడ్తలున్నాయి. ఎవరూ లోపల ప్రవేశించకుండా భయంకరులైన రాక్షసులు ఆయుధాలతో కాపలా కాస్తున్నారు. లెక్కలేని కోట బురుజులతోనూ, ధ్వజ స్తంభాలతోనూ, ప్రకాశిస్తున్న ఇళ్ళతోనూ అతి మనోహరంగా ఉన్న లంకా నగరం ఎత్తున ఉండటం చేత నిజంగానే దేవ లోకానికి సంబంధించినట్టుగా ఉన్నది.

లంకా నగరమూ, దానికి గల రక్షణలూ, రాక్షసుల కాపలా చూస్తూ ఉంటే హనుమంతుడి కొక ఆలోచన కలిగింది: వానరులు సముద్రం దాటి ఈ లంకకు ఎలా వస్తారు? నూరు యోజనాల సముద్రాన్ని లంఘించ గల వానర వీరులలో హనుమంతుడు గాక, అంగదుడూ, నీలుడూ, సుగ్రీవుడూ మాత్రమే ఉన్నారు. మిగిలిన వాళ్ళ మాటేమిటి?








మహా వీరుడైనప్పటికీ రాము డిక్కడికి వచ్చి ఈ లంకను జయించగలడా అని హనుమంతుడికి అనుమానం కలిగింది. సీతను చూసినాక ఈ శంకలను గురించి ఆలోచించవచ్చు ననుకుని హనుమంతుడు లంకలో ప్రవేశించటానికి చిన్న రూపం ధరించాడు. మరీ చిన్న శరీరమైతే త్వరగా కదలలేడు, మరీ పెద్ద శరీరం అందరినీ ఆకర్షిస్తుంది; అందుచేత అన్నివిధాలా అనుకూలించే ప్రమాణంలో శరీరాన్ని ఉంచుకుని అతను ముందుకు సాగాడు. లంకలో జొరబడి సీతను వెదకటానికి రాత్రివేళే మేలని అతనికి తోచింది. అందుచేత అతను సూర్యాస్తమయ మయాక పిల్లి ప్రమాణం గల దేహంతో, నాలుగు కాళ్ళమీదా ఒకే సారి గెంతుతూ కోతిలాగే లంక ప్రవేశించాడు. లంకా నగరం హనుమంతుడికి అద్భుతంగా కనబడింది. ఏడేసి, ఎనిమిదేసి అంతస్థుల మేడలు, వాటికి వెండి బంగారాల స్తంభాలు, స్ఫటికమణుల అలంకారాలు! ఎక్కడ చూసినా మణులతోనూ, ముత్యాలతోనూ తీర్చిన అలంకరణలు! "అహా, ఈ నగరాన్ని వానరులు ఎలా జయిస్తారు!" అనుకున్నాడు హనుమంతుడు.

అకస్మాత్తుగా హనుమంతుడి ముందు ఒక భయంకర వికృతాకారం సాక్షాత్కరించి, పెద్ద గొంతుతో అరుస్తూ, "ఎవరు నీవు? ఇక్కడి కెందుకు వచ్చావు? నిజం చెప్పకపోతే నీ ప్రాణాలు తీస్తాను!" అన్నది.

"నా సంగతి చెబుతాను గాని నీ వెవతెవు? వికారమైన కళ్ళతో ఈ నగర ద్వారం దగ్గిర ఏం చేస్తున్నావు?" అని హనుమంతుడా ఆకారాన్ని అడిగాడు.

"నేను ఈ లంకా నగరాన్ని. రావణుడి కింకరిని. ఈ నగరాన్ని నేను రక్షిస్తున్నాను. నన్ను గెలిచి నీవు నగరంలోకి అడుగు పెట్టలేవు. నిశ్చయంగా నా చేతిలో చస్తావు," అన్నది లంక.







"మరేమీ లేదు. ఈ బురుజులూ, ప్రాకారాలూ గల అందమైన లంకా నగరాన్ని చూడ బుద్ధి పుట్టి వచ్చాను. నగరమంతా చూసి ఎలా వచ్చానో, అలాగే పోతాను. ఇంకేమీ చేయను," అన్నాడు హనుమంతుడు. ఆ మాట విని లంక హనుమంతుణ్ణి అరచేత్తో గట్టిగా చరిచింది. హనుమంతు డొక్క కేక పెట్టి, తన ఎడమ పిడికిలి బిగించి లంకను ఒక్కపోటు పొడిచాడు. దాన్ని చంపాలనే ఉద్దేశం లేకపోవటంచేత అతను అటే బలంగా కూడా పొడవలేదు. కాని ఆ దెబ్బకే లంక కాళ్ళూ, చేతులూ కొట్టుకుంటూ నేల కూలింది.

లంక హనుమంతుడికి ఒక్క నమస్కారం పెట్టి, "కోతిరాజా, నీవు మహా బలుడవు. నా మీద నీ శక్తి చూపక, నన్ను కాపాడు. నేను ఓడిపోయాను. నన్ను ఎవరో వానరుడు వచ్చి జయిస్తాడనీ, అంతటితో రాక్షసులకు చేటు మూడుతుందనీ ఒకప్పుడు బ్రహ్మ చెప్పాడు. ఆ సమయం ఇప్పుడు వచ్చింది. ఇక రాక్షసులకు కీడు తప్పదు. సీతను ఎత్తుకు వచ్చి రావణుడు రాక్షసు లందరికీ నాశనం తెచ్చాడు. నీవు నగరం ప్రవేశించి నీ యిష్టం వచ్చినట్టు చెయ్యి. సీతను కూడా చూడు," అన్నది.



ఈ విధంగా లంకను జయించిన హనుమంతుడు ప్రాకారం ఎక్కి లంకా నగరంలోకి దిగి, ఎడమకాలు ముందు పెట్టి నగరం ప్రవేశించాడు. అతను రాజ మార్గం వెంట పోతుంటే వాద్య ధ్వనులూ, నవ్వులూ వినిపించాయి. ఇళ్ళన్నీ ఎంతో అందంగా రంగు రంగుల పుష్ప మాలలతోనూ, చిత్ర విచిత్రమైన రంగులతోనూ అలంకరించి ఉన్నాయి. మద్యం తాగిన స్త్రీలు త్రిస్థాయిలలో మనోహరంగా పాడి గంధర్వ స్త్రీలను జ్ఞాపకం చేస్తున్నారు.

రాక్షసుల ఇళ్ళలో స్త్రీలు అటూ ఇటూ తిరిగేటప్పుడూ, మేడల మెట్లెక్కేటప్పుడూ









చేసే అందెలు మొదలయిన వాటి ధ్వనులు హనుమంతుడు విన్నాడు. కొన్ని ఇళ్ళలో మంత్రాలు చదువుతున్నారు. ఒక చోట రాక్షససేన విడిసి ఉండటం కనిపించింది.

హనుమంతుడు రావణుడు మొదలైన రాక్షస ప్రముఖులుండే కోటను చేరేసరికి పొద్దు పోయింది. దాని లోపల బంగారపు టిళ్ళూ, బంగారు పూత పూసి, ముత్యాలతో అలంకరించిన ప్రాకారాలూ ఉన్నాయి. దానికి భయంకరులైన రాక్షసులు కాపలా కాస్తున్నారు. ఎవరికీ తెలియకుండా హనుమంతుడు ఆ అంతర్నగరం ప్రవేశించాడు. ప్రతి ఒక్క ఇంటా రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, సింహాసనాలూ ఉన్నాయి. ఎక్కడ చూసినా బాగా తిని, తాగి ఒళ్ళు తెలియని స్థితిలో ఉన్న రాక్షస స్త్రీ పురుషులు అతనికి కనిపించారు.

అతను ధైర్యంగా ప్రతి ఇల్లూ, ఇంటి తోటా పరిశీలిస్తూ, ప్రహస్తుడు, మహాపార్శ్వుడు, కుంభకర్ణుడు, విభీషణుడు, మహోదారుడు, విరూపాక్షుడు, విద్యున్మాలి, వజ్రదంష్ట్రుడు, శుకుడు, సారణుడు, ఇంద్రజిత్తు, జంబుమాలి, రశ్మికేతువు, వజ్రకాయుడు, ధూమ్రాక్షుడు, విద్యుద్రూపుడు, విఘనుడు, శుకానాసుడు, యుద్ధోన్మత్తుడు, ధ్వజగ్రీవుడు, బ్రహ్మకర్ణుడు, ఇంద్రజిహ్వుడు, కరాళుడు మొదలైన రాక్షస ప్రముఖుల ఇళ్ళన్నీ గాలించి రావణుడి ఇంట జొరబడ్డాడు. ఆ ఇంటి ఆవరణలో రంగు రంగుల గుర్రాలూ, ఐరావతాలలాటి ఏనుగులూ, శ్రేష్ఠమైన బంగారు ఆభరణాలు ధరించిన కాపలి వాళ్ళూ కనిపించారు. ఆ ఇంట లతాగృహాలూ, చిత్రశాలలూ, క్రీడా గృహాలూ మొదలైనవి వేరువేరుగా ఉన్నాయి. అంతటా మణులు ప్రకాశిస్తున్నాయి. ఆ ఇంట మంచాలూ, పీటలూ, పాత్రలూ, సమస్తమూ బంగారంతో చేసినవే. ఎక్కడ





చూసినా పుష్పమాలలూ, సుగంధ దీపాలూ, ధూపాలూ కనిపించాయి. విశ్వకర్మ నిర్మించిన ఆ గృహం కన్న అందమైనది ప్రపంచంలో ఎక్కడా లేదు. అక్కడే పుష్పక విమానం కూడా హనుమంతుడికి కనిపించింది.

అత్యద్భుతమైన పుష్పక విమానాన్ని వివరంగా చూసి హనుమంతుడు రావణుడి శయ్యాగారానికి వెళ్ళాడు. అర్థరాత్రి దాటింది. అందరూ నిద్రపోతున్నారు. అక్కడ హనుమంతుడికి వెయ్యి మంది స్త్రీలు కనిపించారు. వారిలో చాలామంది అడ్డదిడ్డంగా పడుకుని ఉన్నారు. కొందరి చేతుల్లో ఇంకా వాద్యాలు మొదలైనవి ఉన్నాయి. వారిలో చాలామంది సౌందర్యవతులున్నారు. వారందరూ రావణుడి భార్యలు. వారిలో ఋషుల స్త్రీలూ, దేవ గంధర్వ స్త్రీలూ, రాక్షస స్త్రీలూ ఉన్నారు. కాని ఒక్కతె కూడా బలాత్కారంగా తెచ్చినదికాదు. అందరికీ అతడిపై ప్రేమ ఉన్నది.

రావణుడు ఒక పక్కగా శయ్యపై నిద్రపోతున్నాడు. అతను తన నల్లని శరీరానికి ఎర్రని చందనం పూసుకుని, బంగారు అలంకారాలు గల బట్టలు ధరించి మందర పర్వతంలాగా ఉన్నాడు. రావణుడికి



సమీపంగా వెళ్ళిన హనుమంతుడు భయపడ్డ వాడిలాగా వెనక్కు వెళ్ళి, పక్కనే ఉన్న మెట్ల మీది కెక్కి, అక్కడి నుంచి రావణుణ్ణి పరీక్షించాడు. నిద్రపోతున్న స్త్రీలలో సీత ఉన్నదేమోనని అతను చూడటంలో, అతని కళ్ళు రావణుడి పక్కనే పడుకుని ఉన్న మందోదరి పై పడ్డాయి. ఆమెను చూసి సీతే అనుకుని హనుమంతుడు ఒక్క క్షణంపాటు సంతోషించి, మరుక్షణం అనుమానంలో పడ్డాడు.

రాముణ్ణి ఎడబాసిన సీతకు నిద్రాహారాలూ, అలంకరణలూ, తాగుడూ ఉంటాయా? అందుచేత ఆమె సీత అయి




ఉండదని హనుమంతుడు నిశ్చయించుకున్నాడు. అతనికి అనేక రకాల స్త్రీలు కనిపించారు గాని సీత కనిపించలేదు. సీత ప్రాణాలతో ఉంటే ఇందరు స్త్రీల మధ్యగాక ఇంకెక్కడో ఉంటుందా? సీత ఆత్మహత్య చేసుకున్నదేమో నని హనుమంతుడికి అనుమానం కలిగింది. ఇంత యత్నమూ చేసి చివరకు సీతను చూడకుండానే తిరిగి పోవలసివస్తుందా అని అతను భయపడ్డాడు.

హనుమంతుడు మిగిలిన లంక యావత్తూ వెతకటానికి నిశ్చయించుకున్నాడు. పెడగా అనేక ఇళ్ళున్నాయి. కొన్ని మేడలు, కొన్ని ఇళ్ళలో నేలమాళిగలున్నాయి. హనుమంతుడు అన్ని ఇళ్ళలోకీ జొరబడి అంతటా సీత కోసం వెతికాడు. ఆఖరుకు వీధులూ, మంటపాలూ, తిన్నెలూ, బావులూకూడా వెతికాడు. సీత అసలు లంక దాక రానే లేదేమో, రావణుడు తెచ్చేటప్పుడు మార్గ మధ్యానో, సముద్రంలోనో పడిపోయిందేమో నని కూడా అతనికి తోచింది. తాను సీతను చూడక తిరిగి పోతే రాముడు చస్తాడు, రాముడి తమ్ముడు చస్తారు. సుగ్రీవుడూ, అంగదుడూ చస్తారు. అందుచేత సీత కనబడిన దాకా తాను లంకను విడవరాదు. ఇక్కడే ఏ వనంలోనో పళ్ళూ ఫలాలూ తింటూ ఉండి, సీతను చూడలేకపోయిన పక్షంలో ప్రాయోపవేశం చెయ్యటం మంచిదని హనుమంతుడు తీర్మానించుకున్నాడు.

రాత్రి అయిపో వచ్చింది. హనుమంతుడు ప్రాకారంమీదుగా దూకి చుట్టూ చూసేసరికి అతనికి అశోకవనం కనిపించింది. అక్కడ కూడా సీత కోసం వెతకవచ్చు నని అతనికి తోచింది. ప్రాకారం మీది నుంచి చూస్తే అశోక వనంలో అశోక వృక్షాలతో బాటు మామిడి చెట్లూ, సంపెంగ చెట్లూ, ఇతర వృక్షాలూ, దట్టంగా అల్లుకుని ఉన్న లతలూ, నానా రకాల పక్షులూ ఉన్నట్టు





తెలిసింది. హనుమంతుడు విడిచిన బాణం లాగా ఆ చెట్ల మీదుగా పరిగెత్తసాగాడు. అతని వేగానికి చెట్లు పూలను రాల్చాయి, పక్షులు గోల చేస్తూ ఎగిరాయి. హనుమంతుడు ఆ చెట్ల మీదుగా పోతూ ఆకులూ, పళ్ళూ రాల్చి చెట్లను మోడు చేశాడు, లతలను చిందరవందర చేశాడు.

అశోక వనంలో అనేక రకాల అందమైన కట్టడాలున్నాయి. కృత్రిమ వృక్షాలూ, దిగుడు బావులూ ఉన్నాయి. ఒక చోట ఒక క్రీడా పర్వతం ఉన్నది. దాని చుట్టూ చెట్లున్నాయి. దానిమీద రాతి ఇళ్ళున్నాయి. దాని పైనుంచి ఒక నది కిందికి ప్రవహిస్తున్నది. ఆ నదికి దూరంగా తామర తంపర కనిపించింది. అక్కడ చల్లని నీరు గల కృత్రిమమైన తటాకం ఒకటి ఉన్నది. దానికి రత్నాల మెట్లున్నాయి. ముత్యాలు ఇసుకలాగా పోసి ఉన్నాయి. దాని చుట్టూ అందమైన చెట్లూ, గొప్ప మేడలూ ఉన్నాయి.

హనుమంతుడికి దట్టమైన ఆకులూ, బంగారు అరుగులూ గల శింశుపా వృక్షం ఒకటి కనిపించింది. అతను కొన్ని బంగారు వృక్షాలనూ, వాటి మధ్య గల ఒక అశోక వృక్షాన్ని చూసి ఆశ్చర్యపడ్డాడు. ఆ అశోక చెట్టు గాలికి కదిలినప్పుడల్లా గజ్జెలమోత వినిపించింది.

అతను శింశుపా వృక్షం ఎక్కి, " ఈ అశోకవనం ఇంత అందంగా ఉన్నదే, సీత రోజూ ఇక్కడికి రాక మానదు. ఆమెకు వనవిహారం ఇష్టం. ఆమె విహరించటానికి ఈ వనం తగి ఉన్నది, స్నానమాడటానికి ఈ జలాశయం కూడా తగి ఉన్నది. రాముణ్ణి తలచుకుని దుఃఖించటానికైనా ఇది ఎంతో అనువైన చోటు. సీతకు ఈ వనమూ, ఈ వనానికి సీతా తగి ఉంటారు. ఆమె జీవించే ఉండాలి గాని, ఇక్కడికి రాకుండా ఉండదు ; నే నామెను తప్పక చూస్తాను కూడా !" అనుకున్నాడు.






శింశుపా వృక్షం ఎక్కిన హనుమంతుడు అక్కడి నుంచి చుట్టు పక్కలన్నీ కలయ జూశాడు. అశోక వనం దేవేంద్రుడి నందన వనం లాగుంది. దాని నిండా పూల చెట్లూ, పళ్ళ చెట్లూ ఉన్నాయి. పక్షులూ, మృగాలూ ఉన్నాయి. అక్కడక్కడా దివ్యమైన భవనాలూ, అరుగులూ, తామర పూలూ, కలువ పూలూ గల మడుగు లున్నాయి. అన్నిటి కన్న అశోక వృక్షాలు జాస్తిగా ఉన్నాయి.

కొద్ది దూరంలో ఒక ఎత్తయిన తెల్లని మంటపం ప్రకాశిస్తున్నది. అందులో వెయ్యి స్తంభా లున్నాయి. దానిలో పగడాలతో తయారు చేసిన మెట్లూ, బంగారు అరుగులూ ఉన్నాయి. అది ఒక చైత్యం ఆకారంలో ఉన్నది

తరవాత హనుమంతుడికి సీత కనిపించింది. ఆమె ధరించిన చీర మట్టి కొట్టుకుని ఉన్నది. ఆమె చుట్టూ రాక్షస స్త్రీ లున్నారు. ఆమె బాగా కృశించి, నిట్టూర్పులు పుచ్చుతూ, దైన్యంతో కూడుకుని ఉన్నది. దేహ సంస్కారం లేక ఆమె శరీరం కూడా మట్టి కొట్టుకుని ఉన్నది. నగలు చాలా కొద్దిగా ఉన్నాయి. ఆమె జుట్టు ఒకే జడ లాగా అట్ట కట్టుకుపోయి తుంటి దాకా వేళ్ళాడు తున్నది.

ఈమె సీత అయి ఉండాలని హనుమంతుడు ఈవిధంగా వితర్కించుకొన్నాడు: రావణాసురుడు ఎత్తుకు పోయేటప్పుడు ఆ స్త్రీలో తనకూ, సుగ్రీవాదులకూ కనిపించిన పోలికలు ఈమెలో కొన్ని ఉన్నాయి. నిండు







చంద్రుడి వంటి ముఖం. తీర్చినట్టుండే కనుబొమలు, నల్లని వెంట్రుకలు, అంద మైన నడుము—సీత ఎంత కృశించి, శోక సముద్రంలో మునిగి ఉన్నా ఈ లక్షణాలు దాగటం లేదు. ఇవి గాక రాముడు సీత గుర్తులు కొన్ని చెప్పాడు. అందుచేత హను మంతుడు ఆమె సీతే నని నిర్ణయించు కోవ టానికి చాలా శ్రద్ధగా చూశాడు.

రాముడు చెప్పిన ఆభరణాలలో కొన్నిటిని ధరించటం ఇష్టంలేక ఆమె చెట్టు కొమ్మలకు తగిలించింది. వాటిలో చెవులకు పెట్టుకునేవీ, చేతులకు పెట్టుకునేవీ ఉన్నాయి. అవి తీసి వేసినట్టుగా సీత చెవులకూ, చేతులకూ గుర్తులు కానవస్తున్నాయి. అదీ గాక సీత ఋశ్యమూక పర్వతం పైన మూట గట్టి పడ వేసిన ఆభరణాలలో ఇవి లేవు. అదీ గాక సీత నగలను మూట గట్టిన పచ్చ పట్టు వస్త్రమూ, ఆమె ఇప్పుడు కట్టుకొన్న చీరా ఒకటి గానే ఉన్నాయి—కాకపోతే చీరె చాలా మాసి ఉన్నది. ఇవన్నీ ఆలోచించి హనుమంతుడు ఆమె సీతే నని నిశ్చయించు కుని పరమానందం చెందాడు.

మరుక్షణమే సీత స్థితి తలుచుకుని హనుమంతుడి గుండె నీరై పోయింది. జన కుడి కుమార్తె, దశరథుడి పెద్ద కోడలు, ఎన్నో సుఖాలు అనుభవించ వలిసిన ఈ సీత కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ, శుష్కించి, ఈ భయంకర రాక్షస స్త్రీల మధ్య ఇలా కుమిలిపోవట మేమిటి? ఈ సీత కోసం రాముడు ఎందరు రాక్షసులను చంపాడు! ఈమె కోసమేగదా అతను వాలిని చంపి సుగ్రీవుడికి పట్టం గట్టాడు! ఈమె కోసమే గదా తాను సముద్రాన్ని లంఘించి లంకకు వచ్చాడు! ఈమె కోసం రాముడు మూడు లోకాలూ తల్లకిందులు చెయ్యా మన్నా చేస్తాడు. "పరాయి వాణ్ణయిన నాకే ఈ సీతను చూసి ఇంత బాధ కలుగు తూంటే రాముడి కింకా ఎంత దుఃఖం





కలుగుతూండవచ్చు?'' అనుకున్నాడు హనుమంతుడు శింశుపా వృక్షం కొమ్మల మీద కూర్చుని.

రాత్రి చాలా భాగం గడిచింది. రాక్షస బ్రాహ్మణులు వేదాధ్యయనం ప్రారంభించారు. మంగళ వాద్యాలు మోగాయి. రావణుడు వాటి ధ్వనికి మేలుకొని, సీతను జ్ఞాపకం తెచ్చుకున్నాడు. వెంటనే అతను సమస్తాభరణాలూ ధరించి, వెలిగి పోతూ అశోక వనానికి బయలుదేరాడు. అతని వెంట నూరు మంది స్త్రీలు వచ్చారు. వారిలో కొందరు బంగారు దీపస్తంభాలూ, కొందరు చామరాలూ, మరి కొందరు విసన కర్రలూ పట్టుకున్నారు. ఒకతె తన కుడి చేతిలో మణి మయమైన మద్య భాండం తీసుకున్నది, మరొకతె రావణుడి వెనుక నుంచి బంగారు కర్ర గల తెల్ల గొడుగు పట్టింది.

వారందరూ అశోక వన ద్వారం దగ్గిరికి వచ్చే సరికి, చెట్టు మీద ఆకుల చాటున ఉన్న హనుమంతుడు వారిని చూశాడు. రావణుణ్ణి ఇంకా బాగా చూడటానికి హనుమంతుడు కింది కొమ్మ మీదికి దిగాడు.

రావణుడు ఇంకా అంత దూరంలో ఉండగానే సీత భయంతో కంపించిపోయింది. ఆమె ముడుచుకుని కూర్చుని ఏడవసాగింది. కటిక



నేల మీద కూర్చుని, భయపడి ఏడుస్తూ, దుమ్ము కొట్టుకుని ఉన్న సీతతో రావణుడిలా అన్నాడు :

"నన్ను చూసి ఎందుకు భయపడతావు, సీతా? ఇక్కడ నీకు హాని చేసే వారెవరూ లేరు. నేనా నీ మీది మోహంతో తపించి పోతున్నాను. కాని నీకు నా మీద కొంచెం కూడా ప్రేమ లేదు. ఎందు కిలా శోకిస్తావు? నన్ను నమ్ము, స్నేహ బుద్ధితో చూడు. తల దువ్వకోక, మురికి బట్ట కట్టుకుని, అర్థం లేని ఉపవాసాలు చెయ్యటం నీ కెంత మాత్రమూ తగదు. కారిపోయిన నీటి లాగా పోయిన యౌవనం తిరిగి రాదు. భోగాలు







అనుభవించు. నీ వంటి అందగత్తె సృష్టిలో లేదు. నన్ను చేపట్టితే నిన్ను అగ్ర భార్యను చేస్తాను. ప్రపంచమంతా జయించి నీ తండ్రి జనకుడికి కానుకగా ఇస్తాను. అదృష్ట హీనుడై, రాజ్యం పోగొట్టుకుని, అడవులలో అలమటించే ఆ రాముడింకా బతికి ఉంటాడా అని నా సందేహం. ఒక వేళ బతికి ఉన్నా అతడు నిన్ను చూడను కూడా లేడు. పూర్వం తన భార్యను ఇంద్రుడెత్తుకు పోతే హిరణ్యకశిపుడు నారదుడి చేత అడిగించి తెచ్చుకున్నాడు. రాముడి గతీ అంతే. అయితే అతను ఎంత వినయంగా అడిగినా నేను నిన్నివ్వను. కృశించి, మట్టి కొట్టుకుని ఉంటేనే నీ అందం నా మనస్సు హరించేస్తున్నదే, చక్కగా అలంకరించుకుని, మంచి బట్టలు కట్టుకుని, సంతోషంగా ఉంటే ఎలా ఉంటావో! హాయిగా తిను, తాగు, సుఖించు. నీ కేమిటి లోపం?"

ఈ మాటలు విని సీత ఒక గడ్డి పోచను తనకూ రావణుడికీ మధ్యగా పట్టుకుని, దీనస్వరంతో ఇలా చెప్పింది :

"నా మీది ఆశ వదులుకో. పాపిష్ఠి వాడికి మోక్షం ఎంత దుర్లభమో, నీకు నేనూ అంతే. నే నింకొకడి భార్యను, పతివ్రతను. నీ భార్యలను ఇతరులు కోరితే నీ కెలా ఉంటుందో ఆలోచించుకో. నీకు బుద్ధి చెప్పే వారెవరూ లేరో, లేక చెప్పినా నీవు వినవో! కాని నీవు చేసిన పని నీకూ, నీ రాజ్యానికీ, రాక్షస కులానికీ చేటు కలిగించేది. నాకు కావలసింది నీ అంతఃపుర స్త్రీల పై పెత్తనమూ కాదు, డబ్బూ కాదు, ఇంకేదీ కాదు—నా భర్త వెంట ఉండటం. నాలుగు కాలాలపాటు సుఖంగా ఉండాలంటే నన్ను రాముడి దగ్గిర చేర్చు. రాముడితో స్నేహం చేసుకో. శరణన్న వారిని రాముడు క్షమించగలడు. లేదా, రామలక్ష్మణుల మూలంగా నీకు సర్వ నాశనం తప్పదు. నీవు పిరికిపందవు. రాముడు జన





స్థానంలో ఉన్న రాక్షసుల నందరినీ చంపెయ్యటం చూసి భయపడి, రామ లక్ష్మణు లిద్దరూ బయటికి వెళ్ళి ఉండగా నన్ను దొంగిలించి తెచ్చావు. వారి గాలి ఏమాత్రం సోకినా, పులుల వాసన తగిలిన కుక్కలాగా నీవు పారిపోయి ఉందువు. అటువంటి రామ లక్ష్మణులతో యుద్ధం పెట్టుకోకు."

సీత అడిన ఈ పరుష వచనాలకు రావణుడు మండిపడి, "నీ వన్న ఈ మాటలలో ప్రతి ఒక్క మాటకూ నిన్ను చంపవచ్చును. కాని నీ మీది మోహం చేత నేనా పని చెయ్యలేకుండా ఉన్నాను. నేను చెప్పిన గడువింకా రెండు మాసా లున్నది. ఈ లోపల నా భార్యవు కావటానికి సమ్మతించవో, నిన్ను ఉదయపు ఫలహారం కింద వండించుకు తింటాను," అన్నాడు.

అతను సీత వెంట ఉన్న రాక్షస స్త్రీలతో, "మీరు నయానో, భయానో ఈ సీత మనస్సు నా మీదికి మళ్ళేటట్టు చేయండి. ఆమె కిష్టం లేని పనులు చేయటానికి కూడా ఇప్పుడనుజ్ఞ ఇస్తున్నాను," అన్నాడు.

రావణుడి వెంట ఉన్న భార్యలలో దేవ గంధర్వ స్త్రీలు సీతను చూసి జాలిపడి, తమ సానుభూతిని ఆమెకు సంజ్ఞల ద్వారా



తెలియ జేశారు. రావణుడి కడగొట్టు భార్య అయిన ధాన్యమాలిని రావణుణ్ణి కౌగలించుకుని, "ఈమెకు నీపై ఇష్టం లేదు. ఆమె పైన ఎందుకు లేని పోని ఆశ పెట్టుకుంటావు? ఆమెకు సుఖపడే గీత లేదు. అందుకే నిన్ను వరించటం లేదు," అన్నది.

రావణు డీ మాట విని చిరు నవ్వు నవ్వి స్త్రీలతో సహా తన యింటికి తిరిగి వెళ్ళాడు. అతను వెళ్ళి పోగానే రాక్షస స్త్రీలు సీతను మాటలతో హింసించారు, ఆయుధాలతో బెదిరించారు. కొందరు రావణుణ్ణి పొగడారు. కొందరు రాముణ్ణి తిట్టారు. "మేము చెప్పినట్టు చెయ్యకపోతే నిన్నిప్పుడే తినేసి, సీత





చచ్చిపోయిందని రావణుడితో చెబుతాం," అన్నారు. "మళ్ళీ పోట్లాడుకోకుండా దీన్ని ముందుగానే ముక్కలు ముక్కలుగా కోసి సమంగా పంచండి," అన్నది మరొకతె. కల్లు కూడా ఉంటే ఇంకా బాగుంటుందని మరొకతె అన్నది.

సీతకు ఒక వంక భయమూ, మరొక వంక అసహ్యమూ కలిగాయి. ఆమె తాను కూర్చున్న చోటి నుంచి లేచి శింశుపా వృక్షం కేసి నడిచి ఒక అశోక వృక్షం కింద దాని కొమ్మ పట్టుకుని నిలబడి తన దుస్థితిని గురించి తలుచుకుని బాధ పడింది. రామ లక్ష్మణులు మరణించి ఉంటారా, రావణుడు వారిని ఈపాటికి చంపించి ఉంటాడా అని ఆమెకు కొంచెం సేపు అనుమానం కలిగింది. వాళ్ళు సన్యసించారేమోనని మరొకసారి సందేహించింది. రాక్షస స్త్రీలు ఆమెను చుట్టు ముట్టి ఇంకా భయపెడు తూనే ఉన్నారు.

ఇంతలో త్రిజట అనే ముసలి రాక్షసి అప్పుడే నిద్ర లేచి, పెద్దగా మూలుగుతూ, "సీతను తినెయ్యకండర్రా, కావలిస్తే నన్ను తినండి. నా కొక భయంకరమైన కల వచ్చింది," అన్నది. రాక్షస స్త్రీలు ఈ మాటకు భయపడి, దాని చుట్టూమూగి



ఏం కల వచ్చిందని త్రిజట నడిగారు. త్రిజట ఇలా చెప్పింది :

"రాముడు తెల్లటి పూల మాలలు వేసుకుని, తెల్ల బట్టలు కట్టుకుని, దంతంతో చేసిన పల్లకీలో ఎక్కి, లక్ష్మణుడితో సహా, వెయ్యి హంసలు మోస్తుండగా ఆకాశ మార్గాన లంకకు వచ్చాడట. ఈ సీత తెల్లని చీర కట్టుకుని, సముద్రం మధ్య ఉండే శ్వేతపర్వతం మీద ఉన్నట్టు నాకు కలలో కనిపించింది. రామలక్ష్మణులు నాలుగు దంతాలు గల పెద్ద ఏనుగు నెక్కి లంకలో సంచరించటం కనిపించింది. ఆ రామ లక్ష్మణులు సీతను సమీపించారు. రాము డెక్కిన





ఏనుగు శ్వేతపర్వత శిఖరం పైగా ఉంటే సీత దాని పైకి ఎక్కింది. తరవాత, రాముడి తొడ పైన కూర్చున్న సీత లేచి, చేతులతో సూర్య చంద్రులను పట్టుకుంటున్నట్టు కనిపించింది. ఆ తరవాత రాముడు ఎనిమిది తెల్ల యెద్దులు లాగే రథం మీద సీతతో ఇక్కడికి రావటం చూశాను. సీతా రామ లక్ష్మణులు పుష్పక విమాన మెక్కి ఉత్తరంగా వెళ్ళటం నాకు కనిపించింది. ఇక రావణుడు గన్నేరు పూల మాలలు ధరించి, ఒళ్ళంతా నూనె పూసుకుని, ఎర్ర బట్ట కట్టుకుని, తాగిన మత్తులో నేల పైన పడి ఉండటం కనిపించింది. ఇంకోసారి రావణుడు పుష్పక విమానం నుంచి కింద పడి, నున్నని, జుట్టు లేని తలతో, నల్లని బట్టలు కట్టుకున్న ఆడది ఈడుస్తున్నట్టు కనిపించాడు. మరొకసారి రావణుడు ఎర్ర పూల మాలలూ, రక్త చందనమూ ధరించి, నూనె తాగుతూ, నవ్వుతూ, నాట్యం చేస్తూ, మతి పోయి గాడిదలు పూన్చిన రథం పైన పోతూ కనిపించాడు. ఒకసారి రావణుడు గాడిద నెక్కి దక్షిణంగా పోతూ, దాని మీద నుంచి తల్లకిందులుగా నేల మీద పడటం చూశాను. అక్కడి నుంచి లేచి అతను నోటికి వచ్చినట్టు దుర్భాషలాడుతూ ఒక బురద గుంటలో పడి మునిగి పోయాడు. కుంభ కర్ణుడు కూడా ఇలాటి స్థితిలోనే కనిపించాడు. రావణుడి కొడుకులు శరీరంపై నూనె పోసుకోవటం కనిపించింది. రావణుడు పందినీ, ఇంద్రజిత్తు మొసలినీ, కుంభ కర్ణుడు ఒంటెనూ ఎక్కి దక్షిణంగా పోవటం చూశాను. గోపురాలూ, తోరణాలూ విరిగి పడిపోయిన లంక సముద్రంలో మునగటం కనిపించింది. రాముడి దూత అయిన ఒక కోతి లంకను తగలబెట్టాడట. అందుచేత మీ అఘాయిత్యం చాలించి సీతతో మంచిగా ఉండండి, లంకకు చేటు రానున్నది."








ఈలోపల సీత దుఃఖ వివశురాలై బెంబేలు పడిపోయింది. ఎటు చూసినా ఆమెకు ఆశ అన్నది లేదు. రావణుడో, రాక్షస స్త్రీలో తనను తప్పక చంపుతారనీ, తాను రాముడి కొరకు ఇంత కాలమూ ఎదురు చూడటం నిష్ప్రయోజన మయిందనీ ఆమె అనుకున్నది. నో రెండిపోతూ ఆమె శింశుపా వృక్షం కిందికి పోయి, ఆత్మహత్య చేసుకునే ఆలోచన చేస్తూ తన జెడను మెడకు చుట్టుకున్నది. అంతలోనే ఆమెకు శుభ శకునాలు కలిగాయి. ఆమె ఎడమ కన్ను గట్టిగా అదిరింది, ఎడమ భుజం అదిరింది, ఎడమ తొడ అదిరింది. ఆమెకు ఈ శుభ శకునాలు చూసి కొత్త ప్రాణం వచ్చినట్టయింది.

ఇంతసేపూ శింశుపా వృక్షంలో కూర్చుని ఉన్న హనుమంతుడు అంతా చూశాడు. అన్నీ విన్నాడు. కాని అతనికి ఏం చెయ్యాటానికీ ఒకంతట పాలుపోలేదు. తాను రాముడి వార్త సీతకు చెప్పి, ఆమె సందేశం రాముడికి అందించాలి. సీతతో మాట్లాడకుండానే తిరిగి పోతే సీతకు రాముడి విషయం తెలియదు; ఆమె ఇక్కడి బాధలు భరించలేక ఆత్మహత్య చేసుకోవచ్చు. అదీ గాక, "సీత ఏమన్నది?" అని రాముడు తప్పక అడుగుతాడు. "నే నామెతో మాట్లాడలేదు," అంటే రాముడు తన చూపులతోనే నన్ను దగ్ధం చేస్తాడు. పోనీ సీతతో మాట్లాడతామంటే రాక్షస స్త్రీ లంతా ఉన్నారు. సంస్కృతంలో మాట్లాడితే వాళ్ళకు అర్థం








కాని మాట నిజమే కాని, సీత తనను చూసి రావణుడే మాయా రూపంలో వచ్చా డను కుంటుందేమో! అప్పు డామె భయపడి కెవ్వున అరవగానే రాక్షస స్త్రీలు తన పైకి ఆయుధాలతో వస్తారు. తన చేత దెబ్బతిని వాళ్ళు రాక్షస యోధులను పిలుచుకు వస్తారు. వాళ్ళతో యుద్ధం చేసి అలసిపోతే తాను మళ్ళీ నూరు యోజనాల సముద్రం లంఘించలేక పోవచ్చు. ఒక వేళ తాను రాక్షసుల చేతిలో చావటమే జరిగితే సీత వార్త చెప్పేవాడుండడు.

"నేను చెప్పే మాటలు సీత ఆలకిం చాలి, కాని ఆమె నన్ను చూసి భయపడ గూడదు. అలా మాట్లాడే మార్గమేది?" అని హనుమంతుడు దీర్ఘంగా ఆలోచించి అందు కొక మంచి మార్గం కనిపెట్టాడు. అతను చెట్టు కొమ్మల మాటున సీతకు కనిపించ కుండా కూర్చుని, ఆమెను చూస్తూ ఇలా ప్రారంభించాడు:

"దశరథుడనే ఒక గొప్ప రాజు. ఆయన జ్యేష్ఠపుత్రుడు రాముడు మిక్కిలి అంద మైనవాడు, గొప్ప విలుకాడు. తండ్రి ఆజ్ఞ చేత ఆ రాముడు భార్యనూ, తమ్ముణ్ణీ వెంట బెట్టుకుని అరణ్యాలకు వెళ్ళాడు. అక్కడ అతను ఖరుడు మొదలైన అనేక రాక్షసులను చంపాడు. ఈ సంగతి తెలిసి రావణుడు మాయలేడి సహాయంతో రాముణ్ణి మోసపుచ్చి, అతని భార్య అయిన సీతను అపహరించాడు. రాముడు సీతను వెతుకుతూ వచ్చి, సుగ్రీవుడనే అతనితో స్నేహం చేసి, వాలి అనే వానర రాజును చంపి, ఆ రాజ్యాన్ని సుగ్రీవుడి కిచ్చాడు. ఆ సుగ్రీవుడు సీతాదేవిని వెతకటానికి అన్ని దిక్కులకూ వేలకువేల వానరులను పంపాడు. ఆ ప్రయత్నంలో నేను నూరు యోజనాల సముద్రాన్ని లంఘించి ఈ లంకకు వచ్చి, రాముడు వర్ణించిన సీతను చూడగలిగాను."







హనుమంతు డీ మాటలని మౌనం వహించగానే సీత ఆశ్చర్యంతోనూ, సహజమైన భయంతోనూ తల ఎత్తి శింశుపా వృక్షం కేసి చూసింది. ఆమెకు హనుమంతుడు కనిపించాడు. సీత తన కళ్లనూ, చెవులనూ తానే నమ్మలేక, తాను కలగంటున్నాననీ, కలలో కోతి కనిపించటం చాలా చెడ్డదనీ భయపడింది. తరవాత ఆమె తాను కల కనటం లేదని రూఢిచేసుకుని, భ్రమపడుతున్నాననుకున్నది.

ఈలోపల హనుమంతుడు చెట్టుదిగి వచ్చి, కొంతదూరంలో నిలబడి నమస్కారం చేసి, "అమ్మా, జీర్ణించిన పట్టుచీరె కట్టుకుని, చెట్టుకొమ్మ పట్టుకుని నిలబడి ఉన్నావు, నీ వెవరవు? ఏ జాతికి, ఏ గణానికి చెందిన దానివి? నిన్నుచూస్తే దేవతవని పిస్తున్నది. నీ తండ్రి ఎవరు? భర్త ఎవరు? పెద్ద దుఃఖంలో ఉన్నావు, నీ బంధువు ఎవరైనా పోయారా? జనస్థానం నుంచి రావణుడు అపహరించి తెచ్చిన సీతవే అయితే ఆ మాట వెంటనే చెప్పు," అన్నాడు.



సీత హనుమంతుణ్ణి చూసి, "నేను దశరథుడి కోడలిని, జనకుడి కూతురిని, రాముడి భార్యను. నా పేరు సీత అంటారు. నేను కాపరానికి వచ్చిన పదమూడో ఏట నా భర్తకు రాజ్యాషేభికం జరగనుండగా, దశరథుడి భార్య అయిన కైకేయి అనే ఆమె రామ పట్టాభిషేకం చేస్తే తాను ప్రాణత్యాగం చేస్తాననీ, రాముణ్ణి వనవాసం పంపెయ్యమనీ కోరింది. తండ్రి యాచించిన మీదట రాముడు తాను పుచ్చుకోనున్న రాజ్యాన్ని తిరిగి తండ్రికి ఇచ్చివేశాడు. అతను నారబట్టలు కట్టుకుని వనవాసం పోతూ నన్ను తన తల్లి అయిన కౌసల్య వద్ద ఉండమన్నాడు. నేను రాముణ్ణి విడిచి ఉండలేక వెంట బయలుదేరాను. నా కన్న ముందే నారబట్టలు కట్టి బయలుదేరాడు లక్ష్మణుడు. మేము దండకారణ్యంలో







ఉండగా దుర్మార్గుడైన రావణుడు నన్ను ఇక్కడికి తెచ్చాడు. ఆ రావణుడు నన్నింకా రెండు నెలలు బతకనిస్తాడు, ఆ తరవాత నా ప్రాణాలు తీస్తాడు," అన్నది.

సీత దుఃఖం చూసి హనుమంతుడికి కూడా దుఃఖం వచ్చింది. అతను ఆమెకు దుఃఖోపశమనం కలిగేటట్టుగా, "సీతాదేవీ, రాముడి దూతగా నేను నీ వద్దకు వచ్చాను. రాముడు తన క్షేమం నీకు చెప్పి, నీ క్షేమం తెలుసుకు రమ్మన్నాడు. లక్ష్మణుడు నీకు సాష్టాంగ నమస్కారం చేశాడు," అని చెప్పాడు. ఈ మాటలు వినగానే సీతకు శరీర మంతా పులకరించింది. "మనిషి బ్రతికి ఉండాలే గాని నూరేళ్ళకైనా ఆనందం కలగకపోదంటారు. అది నా విషయంలో నిజమయింది," అన్నదామె.

సీతకు తనపై నమ్మకం కుదిరిందనుకుని హనుమంతుడు ఆమెను సమీపించాడు. ఇది చూసి సీత, రావణుడే వానర రూపంలో వచ్చాడని అనుమానించి, అతనితో ఆత్మీయంగా మాట్లాడినందుకు భయపడుతూ, అశోకవృక్షం కొమ్మ విడిచి నేలపై చతికిల బడింది. తనకు నమస్కారం చేస్తున్న హనుమంతుడి ముఖం చూడటానికి కూడా ఆమెకు ధైర్యం చాలలేదు. ఆమె హనుమంతుడితో, "నీవు నిజంగా రావణుడవే. ఇప్పుడీ కోతి రూపంలో వచ్చావు. ఆ నాడు సన్యాసి రూపంలో వచ్చావు. నే నసలే దుఃఖంతోనూ, ఉపవాసాలతోనూ కృశించి ఉన్నాను. నన్నిలా మరింత బాధపెడుతున్నావెందుకు? ఇది నీకు మంచిదికాదు. ఒక వేళ నీవు నిజంగా రామదూతవే అయితే రాముడి గుణగణాలు వర్ణించు. రామలక్ష్మణుల గుర్తులు చెప్పు. రాముడితో నీ కెప్పుడు సంబంధం కలిసింది? నీవు రామలక్ష్మణుల నెలా ఎరుగుదువు? నర వానరులకు పొత్తు ఎలా కుదిరింది?" అని అడిగింది.







హనుమంతుడు రాముడి గుణగణాలు వివరించాడు. రాముణ్ణి ఆపాదమస్తకమూ వర్ణించాడు. సీతాపహరణానంతరం రామలక్ష్మణులు ఋశ్యమూక పర్వతప్రాంతానికి వచ్చినది మొదలు తాను లంకకు వచ్చిన దాకా జరిగినదంతా పూసగుచ్చినట్టు సీతకు చెప్పాడు. తాను హనుమంతుణ్ణనీ, సుగ్రీవుడి మంత్రిననీ తెలిపి రాముడిచ్చిన ముద్రికను సీత చేతిలో పెట్టాడు.

సీతకు హనుమంతుడి యందు నమ్మకం కుదిరింది. ఆమె ముఖం విప్పారింది. ఆమె ఆంజనేయుణ్ణి పొగడుతూ, అతను మామూలు కోతి కాడనీ, ఎంతో శక్తిసామర్థ్యాలుండబట్టే సముద్రం దాటి రాగలిగాడనీ, రావణుడు కూడా అతన్ని ఏమీ చేయలేడనీ అన్నది. అప్పటికప్పుడే ఆమె రాముడు వచ్చి తనను రక్షిస్తాడనీ, అయోధ్య నుంచి భరతుడు కూడా వానరసేనకు తోడుగా ఒక అక్షౌహిణి సేనను పంపుతాడనీ, రామలక్ష్మణులు సపరివారంగా రావణుణ్ణి యుద్ధంలో హతమార్చుతారనీ కలలు కన్నది. రాముడు తనను తీసుకుపోతాడో పోడో అన్న అనుమానం కూడా ఆమెకు కలిగింది; తీసుకుపోకపోతే ప్రాణత్యాగం చేయ నిశ్చయించుకున్నది.



రాముడు అస్తమానమూ సీతనే స్మరిస్తూంటాడనీ, ఆమె వెళ్ళిపోయిన తరవాత అతను మాంసాహారమూ, మద్యపానమూ కూడా మానేశాడనీ, సీత ఇక్కడ ఉన్నదని తెలియగానే వచ్చి వాలుతాడనీ హనుమంతుడు చెప్పాడు. తనకు రావణుడిచ్చిన ఏడాది గడువులో పది నెలలు నిండవచ్చాయనీ, మిగిలిన రెండు మాసాలలోగా రాముణ్ణి రమ్మని చెప్పమనీ సీత హనుమంతుడితో అన్నది. ఆమె హనుమంతుడితో ఇంకొక ముఖ్య విషయం కూడా చెప్పింది: లంకలో సీత పక్షం వహించిన వారున్నారు; వారిలో విభీషణుడూ, అతని







భార్యా, అతని పెద్ద కూతురు నలా, అవింధ్యుడనే ఒక రాక్షసుడూ ఉన్నారు.

హనుమంతుడు సీతతో, "అమ్మా, నీవింక ఒక్క క్షణంకూడా దుఃఖించ నవసరంలేదు. నా వీపు పైన ఎక్కు, ఒక్క క్షణంలో సముద్రాన్ని దాటేస్తాను," అన్నాడు.

హనుమంతుడు చిన్న ప్రమాణంలో ఉండటం చూసి సీత అతని మాటలు నమ్మలేక, "నీవేమిటి? నన్ను వీపున ఎక్కించుకుని సముద్రం దాటటమేమిటి? మొత్తానికి కోతి వనిపించావు," అన్నది.

ఈ మాట హనుమంతుడికి అవమానమయింది. అతను సీతకు కొంచెం ఎడంగా వెళ్ళి తన శరీరాన్ని భయంకరంగా పెంచాడు. అతని శరీరం మండుతున్నట్టు కాంతివంతంగా కనబడింది. "సీతాదేవీ, నిన్నే కాదు, ఈ లంక నంతా పాదుతో సహా పెరికి తీసుకుపోగలను. అందుచేత భయపడక నా వెంబడి వచ్చెయ్యి," అన్నాడతను.

కాని సీత అభ్యంతరాలు చెప్పింది. తనను వీపున ఎక్కించుకుని సముద్రం మీదుగా బయలుదేరగానే సాయుధులైన రాక్షసులు చుట్టు ముట్టుతారనీ, తాను భయపడి సముద్రంలో పడిపోవచ్చుననీ, అందువల్ల తనకూ, హనుమంతుడికీ కూడా అపాయం కలగవచ్చుననీ, ఒక వేళ హనుమంతుడే రాక్షసుల నందరినీ చంపినా అందువల్ల రాముడికి అపకీర్తి వస్తుందనీ, అందుచేత హనుమంతుడు వెంటనే తిరిగి వెళ్ళి శీఘ్రంగా రాముణ్ణి తీసుకురావటమే మేలనీ అన్నది. హనుమంతుడు పరపురుషుడు గనక అతని శరీరాన్ని తాకటానికి తన కభ్యంతరంవున్నట్టు సీత వ్యంగ్యంగా, "నేను పతివ్రతను. రాముడి శరీరాన్ని తప్ప తాకలేదు. 'రావణుడు నిన్ను తాకలేదా?' అంటావేమో, ఆ సమయంలో నేను ఏమి చెయ్యటానికీ అసమర్థురాలిని, పైన దుఃఖవివశనై ఉన్నాను, నా భర్త దగ్గిర





లేడు. అలాటిస్థితిలో రావణుడు నన్ను తాకాడు," అన్నది.

హనుమంతుడీ అభిప్రాయాన్ని గ్రహించి, "పరపురుషుడి నైన నా వీపుపై ఎక్కటానికి నీ కభ్యంతరం ఉండటం భావ్యమే. నిన్ను నేను చూసినట్టు గుర్తుగా రాముడికి ఏమైనా ఇయ్యి," అన్నాడు.

రాముడికి గుర్తుగా ఉండగలందులకు సీత హనుమంతుడితో ఒక పాత సంఘటన చెప్పింది. ఈ సంఘటన చిత్రకూట పర్వతం వద్ద గంగాతీరాన ఒక ఋష్యాశ్రమంలో సీతా రాములుండగా జరిగింది. ఒకనాడు సీత అక్కడి పుష్పవనంలో విహరించి అలసి పోయి రాముడి తొడపై కూర్చున్నది. అప్పు డొక కాకి వచ్చి సీత రొమ్ము మధ్య పొడి చింది. సీతకు కోపం వచ్చి, మంటిబెడ్డతో దాన్ని తరిమింది. కాని ఆ కాకి వెళ్ళిపోక మాటిమాటికీ సీత మీదికి రాసాగింది. కాకి చేత అవస్థపడుతూండే సీతను చూసి రాముడు హేళన చేసి, కోపం తెప్పించి తరవాత ఆమెను ఓదార్చాడు. తరవాత సీత రాముడి తొడపై తల పెట్టుకుని చాలా సేపు నిద్రపోయింది. ఆమె నిద్రలేవగానే రాముడు ఆమె తొడపై తల పెట్టుకుని తాను కూడా నిద్రపోయాడు. ఆ కాకి తిరిగి వచ్చి సీతను మళ్ళీ రొమ్ములో గీరి మాంసం తినసాగింది. ఆమెకు పెద్ద గాయమై రక్తం కారి రాముడు కూడా తడిశాడు.

కాకి బాధ భరించలేక సీత రాముణ్ణి నిద్ర లేపింది. రాముడు నిద్ర లేచి, సీత రొమ్మున గాయం చూసి మండిపడుతూ, "ఇంతగా నిన్ను గాయపరిచిన దుర్మార్గు డెవరు?" అని అడిగాడు. అతను అటూ ఇటూ చూసే సరికి గోళ్ళనిండా నెత్తురుతో కాకి కనిపించింది. రాముడు దర్భాసనం నుంచి ఒక దర్భను లాగి బ్రహ్మాస్త్రం పఠించాడు. ఆ దర్భ ప్రళయాగ్ని లాగా ప్రజ్వరిల్లుతూ కాకి పైకి వెళ్ళింది.








ఆ కాకి ఇంద్రుడి కొడుకు, పక్షులలో మేటి, పర్వతాలలో ఉండేది, వాయు వేగం గలది. బ్రహ్మాస్త్రం వెంట పడగా ఆ కాకి మూడు లోకాలూ తిరిగింది. ఇంద్రుడు గాని, దేవతలు గాని, మహర్షులు గాని దానిని కాపాడలేకపోయారు. అది తిరిగి రాముడి వద్దకే వచ్చి శరణన్నది. రాముడు శరణాగత వత్సలుడు గనక దాన్ని క్షమించాడు; కాని బ్రహ్మాస్త్రం వృథాపోవటానికి వీలులేనందున ఆ కాకి యొక్క కుడికన్ను నాశనం చేశాడు.

సీత హనుమంతుడికి ఈ సంగతంతా చెప్పి, "ఇంత సమర్థుడై ఉండి కూడా నా భర్త నన్ను రక్షించే ప్రయత్నం చెయ్యీ లేదంటే నేను చేసి ఉండిన మహాపాపమే కారణమై ఉండాలి," అన్నది. హనుమంతుడామెను ఓదార్చి, రామలక్ష్మణులకూ, సుగ్రీవుడికీ, వానర సమూహానికీ ఏం చెప్పమన్నావని అడిగాడు.

"రాముడి కుశలం అడిగానని చెప్పు. ఆయనకు నా సాష్టాంగ నమస్కారం చెప్పు. నన్ను తల్లిలాగా చూసుకున్న లక్ష్మణుడి క్షేమం అడిగానని చెప్పు. అతను సమయానికి దగ్గిర ఉన్నా నన్ను రావణు డపహరించి ఉండలేడు. రాముణ్ణి బయలుదేరదీయటానికి నీకన్న సమర్థులు లేరు," అంటూ సీత తన కొంగున కట్టి ఉన్న చూడామణి తీసి హనుమంతుడికిచ్చి, "దీన్ని మా అమ్మ నాకు వివాహసమయంలో ఇచ్చింది. అప్పుడు దశరథ మహారాజు కూడా అక్కడే ఉన్నాడు. దీన్ని చూడగానే







రాముడికి మా అమ్మా, తన తండ్రీ, నేనూ జ్ఞాపకం వస్తాం," అన్నది.

హనుమంతు డిప్పుడు తిరిగి మామూలు రూపం ధరించి ఉన్నాడు; అతనా చూడా మణిని తీసుకుని, చేతికి తొడగటం సాధ్యం కాక, వేలికి తగిలించుకున్నాడు.

ఆ హనుమంతుడు సీతకు చెప్పవలిసిన ధైర్యమంతా చెప్పి ఆమెను విడిచి ఇవతలికి వచ్చి, రావణుడి సంగతి కొంతవరకు అంతుతేల్చుకుని పోదామని నిశ్చయించుకున్నాడు. ఇంత శ్రమపడి లంకకు వచ్చి సీతను మాత్రం చూసి తిరిగి వెళ్ళిపోవటం అతనికి భావ్యంగా తోచలేదు. రాక్షసులేపాటి పరాక్రమవంతులో, యుద్ధం చెయ్యటంలో వారికీ, వానరులకూ గల తారతమ్యం ఏమిటో తెలుసుకుని వెళ్ళితే సుగ్రీవుడి ఆజ్ఞను సరిగా నెరవేర్చినట్టవుతుందని అతనికి అనిపించింది. పనిలోపనిగా రావణుడికి కూడా వానర పరాక్రమం ఏమిటో చూపినట్టూ అవుతుంది! రావణుణ్ణి రెచ్చగొట్టాలంటే నందన వనంలాగున్న అశోక వనాన్ని నాశనం చెయ్యటం కన్న మంచి మార్గం లేదనుకుని హనుమంతుడు తన శక్తి కొద్దీ అశోకవనంలోని చెట్లను కూలదోయసాగాడు. క్రీడా సరోవరాలను ధ్వంసం చేశాడు. క్రీడా పర్వతాలను కూలదోశాడు. అశోకవన మంతా భీభత్సమైపోయింది. చెట్ల మీది పక్షులన్నీ భయపడి అరిచాయి. లతలూ, తీగలూ తెగి వాడు ముఖాలు వేశాయి. ఇళ్ళన్నీ కూలిపోయాయి. ఎంత మంది రాక్షసులు వచ్చినా యుద్ధం చెయ్యటానికి సిద్ధపడి హనుమంతుడు వెలపలి ద్వారం వద్ద చేరాడు.

హనుమంతుడు చేసిన విధ్వంసానికి రాక్షస స్త్రీలందరూ పరిగెత్తుకొచ్చి హనుమంతుణ్ణి చూశారు. వాళ్ళు చూస్తున్నారని తెలిసి, అసలే పెంచి ఉన్న తన శరీరాన్ని హనుమంతుడు మరింత పెంచాడు. వాళ్ళు








సీతతో, "వీడెవడు? ఎక్కడి నుంచి వచ్చాడు? ఎవరు పంపారు? నీతో ఏమిటి మాట్లాడాడు?" అని అడిగారు.

"అతనెవడో నాకేం తెలుస్తుంది? రాక్షస మాయలు మీ రాక్షసులకే తెలియాలి! అతన్ని చూస్తే నాకూ భయంగానే ఉంది. ఎవరతను? మీరే చెప్పండి," అన్నది సీత.

సీత ఇలా అనగానే రాక్షస స్త్రీలు హడలి పోయారు. వారిలో కొందరు సీతను రక్షించ టానికి ఉండిపోతే, మిగిలిన వారు రావ ణుడితో చెప్పటానికి పరిగెత్తారు. వాళ్ళు రావణుడితో, "భయంకరమైన దేహమూ, అపారమైన బలమూ కల వానరుడెవడో వచ్చి సీతతో ఏదో మాట్లాడాడు. వాడిప్పు డశోకవనంలో ఉన్నాడు. వాడెవడని అడిగితే సీత చెప్పటంలేదు. ఎవరు పంపగా వచ్చాడో గాని ఆ వానరుడు అంతఃపుర వనమంతా నాశనం చేసేశాడు. ఒక్క ప్రదేశమైనా వదిలిపెట్టలేదు. సీత కూర్చునే చెట్టు మాత్రం విరవ లేదు. సీత ఒక శింశుపా వృక్షం కిందికి వెళ్ళింది. దాన్నికూడా వాడు విరవ లేదు. అశోకవనం ధ్వంసం చేశాడు గనకా, నీవు తెచ్చిన సీతతో మాట్లాడాడు గనకా, రెండు విధాలా వాడు చంపదగిన వాడే," అన్నారు.

రావణుడీ మాటలు విని ఆగ్రహావేశం చెంది, హనుమంతుణ్ణి పట్టుకోమని తనంత పరాక్రమంగల ఎనభైవేల మంది రాక్షసు లను, కింకరులనే పేరుగల వాళ్ళను ఆజ్ఞా పించాడు. వారు వివిధాయుధాలతో బయలు దేరి వెళ్ళి, అశోకవన ద్వారం వద్ద ఉన్న హనుమంతుడి పైకి విజృంభించారు. వారు తనను చుట్టుముట్టగానే హనుమంతుడు తన తోకను నేలకేసి కొట్టి గట్టిగా అరిచాడు. ఆ ధ్వనికీ, అతను భుజాలు చరచుకున్న చప్పుడుకూ లంక అంతా మారుమోగింది.

"జయం రామలక్ష్మణులది, వానర రాజైన సుగ్రీవుడిది! నేను రాముడికి







దాసుణ్ణి. నా పేరు హనుమంతుడు. శత్రు హంతకుణ్ణి. వెయ్యిమంది రావణులు నాకు యుద్ధంలో సాటిరారు. ఈ రాక్షసులంతా చూస్తూండగానే ఈ లంకానగరాన్ని నాశనం చేసి, సీతకు నమస్కరించి, రాముడి వద్దకు తిరిగి పోతాను," అని హనుమంతుడు గట్టిగా అరిచాడు.

ఎర్రగా పర్వతాకారుడై కనిపించే హనుమంతుణ్ణీ, అతని అరుపూ చూసి రాక్షసులు భయపడ్డారు గాని, రాజాజ్ఞ తప్పదు గనక రాక్షసు లతని పైన తమ ఆయుధాలను ప్రయోగించారు. హనుమంతుడు ద్వారం వద్దనే ఉన్న పెద్ద పరిఘను చేత బట్టుకుని, దానితో రాక్షసులను చావ మోదాడు. ఇలా కింకరులనే రాక్షసులను మట్టుబెట్టి, ఇంకా యుద్ధకాంక్ష తీరక, హనుమంతుడు ద్వారం వద్దనె వేచి ఉన్నాడు.

ఈలోపల పారిపోయిన రాక్షసులు కొందరు రావణుడి వద్దకు వెళ్ళి, కింకరులందరూ హనుమంతుడి చేత చచ్చారని చెప్పారు. రావణుడు మండిపడి గుడ్లు తిప్పుతూ, హనుమంతుడితో యుద్ధం చెయ్యమని ప్రహస్తుడి కొడుకైన జంబుమాలి అనే వాణ్ణి, యుద్ధంలో ఓటమి ఎరగని మహాశూరుణ్ణి ఆజ్ఞాపించాడు.

కింకరులను చంపి నిలబడి ఉన్న హనుమంతుడికి అశోక వనంలోని చైత్యంలాటి భవనం జ్ఞాపకం వచ్చింది. దాన్ని అతను ధ్వంసం చెయ్యలేదు. ఆ పని చేద్దామని అతను ఒక్క ఎగురున ఆ చైత్య ప్రాసాదం మీదికి దూకాడు. ఆ ప్రాసాదాన్ని రక్షించే వారు నూరుమంది రాక్షసులు ఆయుధాలు తీసుకుని హనుమంతుడి పైకి వచ్చారు. వారి ఆయుధాలు తగిలి హనుమంతుడాగ్రహించి తన శరీరాన్ని ఇంకా పెంచాడు. అతను ఆ ప్రాసాదంలోని ఒక స్తంభాన్ని ఒక్క ఊపున పెరికి దాన్ని గిరగిరా తిప్పేసరికి, ఆ వడికి నిప్పుపుట్టి చైత్య ప్రాసాదమంతా





తగలబడిపోయింది. హనుమంతుడా స్తంభంతోనే నూరుగురు రాక్షసులనూ చంపాడు.

తరవాత అతను గట్టిగా అరుస్తూ, "నా వంటి వానరులు అనేక వేల సంఖ్యలో సీతాదేవిని వెతకటానికి సుగ్రీవుడి చేత పంపబడ్డారు. లక్షల, కోట్ల వానరులతో సుగ్రీవుడిక్కడికి వస్తాడు. మీరు రాముడితో వైరం పెట్టుకున్నారు. ఇక లంక ఉండదు. నాశనమవుతుంది. మీరూ ఉండరు చస్తారు. రావణుడూ ఉండడు," అన్నాడు.

ఎర్రని పూలమాలలు ధరించి, తలలో పూలు పెట్టుకుని, కుండలాలు ధరించి, ఇంద్ర ధనుస్సులాటి విల్లూ, అందమైన బాణాలూ తీసుకుని జంబుమాలి గాడిదలు పూన్చిన రథంలో వచ్చేసరికి హనుమంతుడు ద్వారతోరణం పైన కూర్చుని ఉన్నాడు. జంబుమాలి విల్లెక్కుపెట్టి అనేక బాణాలు ప్రయోగించి హనుమంతుడి ముఖాన్నీ, దేహాన్నీ గాయపరిచాడు; హనుమంతుడు పెద్ద రాయి విసిరితే దాన్ని బాణాలతో పడగొట్టాడు; సాలవృక్షం పీకితే దాన్ని ముక్కలు ముక్కలు చేశాడు. చివరకు హనుమంతుడు మొదట తీసుకున్న పరిఘనే తీసి గిరగిరా తిప్పి విసిరే సరికి జంబుమాలితో బాటు రథమూ, గాడిదలూ నజ్జునజ్జయిపోయాయి.



కింకరులతో బాటు జంబుమాలి కూడా చచ్చాడని విని రావణుడు ఆగ్రహావేశం చెంది, అస్త్రవేత్తలయిన ఏడుగురు మంత్రి పుత్రులను హనుమంతుడి పైకి పంపాడు. వారు తమతమ సైన్యాలను వెంటబెట్టుకుని, ఎవరు ముందు వెళ్ళి శత్రువుతో తలపడతారా అని పోటీలు పడుతూ, అమితోత్సాహంతో బయలుదేరారు. వాళ్ళు తన మీద వదిలిన బాణవర్షాన్ని తప్పించుకుని హనుమంతుడు గాలిలోనే సంచరిస్తూ, రాక్షసమూకను చేతులతోనూ, కాళ్ళతోనూ కొట్టి చంపాడు. వారు పెట్టిన చావు కేకలకు లంక యావత్తూ పిక్కటిల్లింది.







మంత్రి పుత్రులు కూడా ఎప్పుడైతే చచ్చారో, రావణుడికి భయం ఆరంభ మయింది. కాని అతను దాన్ని లోపలనే అణచుకుని, విరూపాక్షుడూ, యూపాక్షుడూ, దుర్ధరుడూ, ప్రఘసుడూ, భాసకర్ణుడూ అనే అయిదుగురు అగ్రసేనానాయకులను పిలిచి, "సేనాధిపతులారా, మీరు చతురంగ బలాలతో వెళ్ళి ఆ వానరుణ్ణి శిక్షించండి. వాడు వానరుడుగా నాకు తోచలేదు. ఏ ఇంద్రుడో తపస్సు చేసి ఈ భూతాన్ని మన పైకి పంపాడేమో! నేను కూడా మహా బలవంతులైన వానరులను, వాలి సుగ్రీవ నీల ద్వివిదాదులను చూశాను గాని, వారి కన్న ఈ వానరుడు భిన్నంగా కనబడతాడు. ఇదేదో వానర రూపంలో ఉన్న భూతం. ప్రయాసపడి ఎలాగైనా ఈ వానరుణ్ణి మీరు పట్టాలి. యుద్ధం చేసేటప్పు డేమాత్రమూ అశ్రద్ధగా ఉండకండి," అని హెచ్చరించాడు.

ఆ అయిదుగురూ బయలుదేరి అశోకవన ద్వారం దగ్గిరికి వెళ్ళి హనుమంతుణ్ణి చూసి, అతన్ని అన్నివైపుల నుంచీ చుట్టుముట్టి యుద్ధం ఆరంభించారు. దుర్ధరుడు హనుమంతుడి తలను అయిదు బాణాలతో కొట్టాడు. హనుమంతు డొక్క పెడబొబ్బ పెట్టి ఆకాశంలోకి ఎగిరాడు. అక్కడినుంచి అతను అతి వేగంగా, సూటిగా దుర్ధరుడి రథం పైకి దూకే సరికి, ఆ పాటుకు రథమూ, దానికి కట్టిన ఎనిమిది గుర్రాలూ, అందులో వున్న దుర్ధరుడూ క్షణంలో నాశనమయారు.

దుర్ధరుడు చచ్చే సరికి విరూపాక్ష యూపాక్షులు ఆగ్రహం చెంది ఆకాశానికి ఎగిరి, ముద్గరాలతో హనుమంతుణ్ణి రొమ్ము మీద కొట్టారు. హనుమంతు డొక మద్దిచెట్టు పెరికి, దాంతో వారిద్దరినీ చావ మోదాడు. ముగ్గురు చావగా మిగిలిన ఇద్దరూ అడ్డకత్తి, శూలమూ తీసుకుని హనుమంతుడిపై కలియబడి, అతన్ని గాయపరిచారు. హనుమంతు డొక పర్వత శిఖరాన్ని, దానిపై గల





వృక్షాలతోనూ, జంతువులతోనూ సహా విరిచి, దాన్ని ఎత్తి ప్రఘసుడి పైనా, భాసకర్ణుడి పైనా కొట్టి, వారిని కూడా చంపాడు.

ఇలా అయిదుగురు యోధులనూ చంపి హనుమంతుడు వారి సేనలను అవలీలగా నిర్మూలించాడు.

ఈ వార్తకూడా తెలియరాగానే రావణుడి కన్ను యుద్ధోద్రిక్తుడై ఉన్న తన కొడుకు అక్షుడి పైన పడింది. తండ్రి తన కేసి చూడ టమే ఆలస్యంగా అక్షుడు చివాలున లేచి, బంగారం పొదిగిన తన విల్లు తీసుకుని, బంగారు అలంకరణలు గల తన గొప్ప రథ మెక్కి హనుమంతుడి పైకి వెళ్ళాడు. ఆ రథం నిండా ఆయుధాలున్నాయి. అది యుద్ధానికి ఆయత్తం చేయబడి ఉన్న రథం. అతని వెంట సైన్యం కూడా వెళ్ళింది.

హనుమంతు డింకా అశోకవన ద్వారం వద్దనే ఉన్నాడు. అతన్ని చూస్తూనే అక్షుడు తన శత్రువు పరాక్రమవంతుడని గ్రహించి గౌరవభావంతో చూశాడు. ఇద్దరికీ గొప్ప యుద్ధం జరిగింది. అక్షుడు కుర్రవాడైనా అతని పరాక్రమం చూసి హనుమంతుడు కూడా సంతోషించాడు. అతను అక్షుడి బాణాలకు అందకుండా తప్పుకుంటూ గాలిలో తిరుగుతూ, "ఈ కుర్రవాణ్ణి ఎలా చంపడం? అయినా వీ డిప్పుడే ఇంత ప్రతాపం చూపుతున్నాడే, ముందుముం దింకా ఎంత ప్రబలుడవుతాడో! ఇప్పుడే వీణ్ణి చంపటం మంచిది," అనుకున్నాడు.

అక్షకుమారుడి రథం ఆకాశంలో కూడా సంచరించగలది. అది ఆకాశంలో ఉండగానే హనుమంతుడు ఆ రథానికి గల గుర్రాలను చేత్తో కొట్టి చంపి, చక్రాలు విరిచాడు. రథం నేల కూలింది, కాని అక్షుడు విల్లుతో రివ్వున ఆకాశంలోకి లేచాడు. అలా లేచిన అక్షుడి కాళ్ళు రెండూ ఉపాయంగా పట్టుకుని, హనుమంతుడు అతన్ని గాలిలో గిరగిరా తిప్పి, బలంగా నేల కేసి కొట్టి చంపేశాడు.






అక్షకుమారుణ్ణి హనుమంతుడు చంపాడని వినగానే రావణుడికి ఎంతో దుఃఖం కలిగింది. అతను దాన్ని అణచుకుని క్రోధావేశంతో ఇంద్రజిత్తును చూసి, "నాయనా, ఇంద్రుణ్ణి జయించిన వీరాగ్రేసరుడివి, బ్రహ్మ నుంచి దివ్యాస్త్రాలు పొందినవాడివి. ఈ కోతి కింకరుల నందరినీ చంపాడు, జంబుమాలినీ, మంత్రి కొడుకులనూ, అయిదుగురు సేనాపతులనూ, నీ తమ్ముడైన అక్షకుమారుణ్ణీ చంపాడు. వాడి బలం ఎలాటిదో సరిగా గ్రహించి వాడితో యుద్ధం చెయ్యి. వెళ్ళి, శత్రువును జయించి తిరిగి రా!" అన్నాడు.

ఇంద్రజిత్తు తండ్రికి ప్రదక్షిణం చేసి, ధనుర్బాణాలు తీసుకుని, రథ మెక్కి, యుద్ధోత్సాహంతో హనుమంతుడి కేసి వెళ్ళాడు. హనుమంతు డతన్ని దూరాన చూస్తూనే గట్టిగా సింహనాదం చేసి, తన శరీరాన్ని పెంచాడు. తరువాత ఇద్దరూ యుద్ధానికి తలపడ్డారు. ఇంద్రజిత్తు పదకొండువేల మంది ధనుర్ధారులతో ఒక్కసారిగా యుద్ధం చేయగల వాడు. కాని అతను తనపై వేసే బాణాలు తనకు తగలకుండా తప్పించుకుంటూ హనుమంతుడాకాశాన విహరించసాగాడు.

ఎంతసేపు యుద్ధం చేసినా హనుమంతుడు ఇంద్రజిత్తుకు గాని, ఇంద్రజిత్తు హనుమంతుడికి గాని అంతు చిక్కలేదు. తన బాణాలన్నీ వృథా అయిపోవటం చూసి ఇంద్రజిత్తు, "వీణ్ణి చంపటం అసాధ్యం.







ఏదోవిధంగా పట్టుకోవటం మంచిది," అనుకుని అందుకై బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. దానితో హనుమంతుడు కట్టుపడి, చెయ్యీ కాలూ కదలించలేని స్థితిలో ఉండిపోయాడు. అప్పు డతనికి, పూర్వం బ్రహ్మ తన కిచ్చిన వరం జ్ఞాపకం వచ్చింది. అతనికి ఏ అస్త్రం వల్లా ప్రమాదం లేకుండా బ్రహ్మ వర మిచ్చాడు. బ్రహ్మాస్త్రం చేత కట్టుపడినప్పటికీ, తనను బ్రహ్మ, దేవేంద్రుడూ, వాయుదేవుడూ కాపాడుతూనే ఉంటారని హనుమంతు డనుకున్నాడు. అతనికి రావణుడితో సంభాషించాలని కూడా కోరిక కలిగింది.

కదల కుండా పడి ఉన్న హనుమంతుణ్ణి రాక్షసులు సమీపించి, తాళ్ళతో అతన్ని బంధించారు. వారు హనుమంతుణ్ణి తాళ్ళతో కట్టగానే బ్రహ్మాస్త్రబంధం దానంతట అదే విడిపోయింది. ఈ సంగతి తెలిసిన ఇంద్రజిత్తు చాలా భయపడ్డాడు; ఎందుకంటే హనుమంతు డీ తాళ్ళను సులువుగా తెంచగలడు, బ్రహ్మాస్త్రం ప్రయోగించిన వాడి పైన మరే అస్త్రమూ పారదు. కనుక హనుమంతు డిప్పుడు తలుచుకుంటే లంకకు ఎంత చేటైనా చేయగలడు.

అయితే ఈ సంగతి హనుమంతుడికి తెలియలేదు. తాను తాళ్ళతో కట్టుపడగానే బ్రహ్మాస్త్రబంధం తొలగిందని కూడా అతనికి తెలియదు. ఈ లోపల రాక్షసులు హనుమంతుణ్ణి కసిగా ఈడ్చుతూ, కర్రలతోనూ పిడికిళ్ళతోనూ కొట్టుతూ, రావణుడుండే చోటికి లాక్కుపోయారు. ఇంద్రజిత్తు సభలోని రావణుడికి హనుమంతుణ్ణి చూపి, "వీడే ఆ వానరుడు," అన్నాడు.

సభలోని రాక్షసప్రముఖులు తమలో తాము, "ఎవడీ వానరుడు? ఇక్కడి కెందుకు వచ్చాడు? ఎవరు పంపగా వచ్చాడు? ఎవరిని చూడ వచ్చాడు?" అని ప్రశ్నించుకున్నారు. మరికొందరు రాక్ష







సులు, "ఈ వానరుణ్ణి చంపి కాల్చండి, తినేద్దాం!" అన్నారు.

హనుమంతుడు ముందుకు వచ్చి, రావణుడి సింహాసనం దిగువన కూర్చుని ఉన్న వృద్ధమంత్రులనూ, మణులతో అలంకరించిన సభాభవనాన్నీ కలయజూశాడు. రాక్షసులు తాళ్ళు పట్టుకుని అటూ, ఇటూ గుంజుతున్న హనుమంతుణ్ణి రావణుడు చూశాడు. అతని కళ్ళు ఆగ్రహంతో చింత నిప్పుల్లాగా అయిపోయాయి. అతను తన మంత్రులను ఆజ్ఞాపిస్తూ, హనుమంతుణ్ణి చూపి, "వీడి విషయమేమిటో అడిగి కనుక్కోండి!" అన్నాడు.

హనుమంతుడు రావణుణ్ణీ, అతని మంత్రులైన దుర్ధరుణ్ణీ, ప్రహస్తుణ్ణీ, మహాపార్శ్వుణ్ణీ, నికుంభుణ్ణీ, రావణుడి అత్యంత వైభవాన్నీ, తేజస్సునూ చూసి ఆశ్చర్యం పొందాడు. ఈ రావణుణ్ణి చూసి మూడు లోకాలూ గజగజ లాడటంలో వింత ఏమీ లేదని అతనికి అనిపించింది.

ఇంతలో రావణుడి ప్రేరణతో ప్రహస్తుడు హనుమంతుడితో ఇలా అన్నాడు:

"వానరుడా, భయపడకు. నిన్నెవరు పంపారు? దిక్పాలకులా? విష్ణువా? ఎవరు పంపినప్పటికీ నిన్నేమీ చెయ్యము. నిజం చెప్పు, నిన్ను విడిచిపెడతాము. నీవు చూడటానికి కోతిలాగా ఉన్నావేగాని, నీ ప్రభావం చాలా హెచ్చుగా కనబడుతున్నది. అబద్ధం చెప్పావో, నీ ప్రాణాలు దక్కవు. ఒకవేళ నీ అంతట నీవే వచ్చి ఉంటే, ఎందుకు వచ్చావో చెప్పు."

ప్రహస్తుడీ మాటలనగానే హనుమంతుడు రావణుడి కేసి తిరిగి, "నన్ను పంపినది ఇంద్రుడూ, కుబేరుడూ, వరుణుడూ, యముడూ కాదు; విష్ణువు కూడా కాదు. నేను పుట్టుకతోనే వానరుణ్ణి, నాపె తెచ్చిపెట్టుకున్న వానరరూపం కాదు. నిన్ను చూడటం సులభం కాదు గనక, అందుకై









అశోకవనాన్ని నాశనం చేశాను. అప్పుడు బలవంతులైన రాక్షసులు నా పైకి వచ్చారు. ఆత్మరక్షణ కోసం వారిని చంపాను. బ్రహ్మ వరం వల్ల నన్ను ఏ అస్త్రమూ ఏమీ చెయ్యి లేదు. కాని నిన్ను చూడాలనే కోరికతో బ్రహ్మాస్త్రానికి కట్టుపడ్డాను. నీతో ఒక రాచ కార్యం ఉండి వచ్చాను. నేను రాముడి దూతను. నీకు శుభకరమైన మాటలనే చెబుతాను, విను. ఈ మాటలను సుగ్రీవుడు నీతో చెప్పమన్నాడు: దశరథుడి కొడుకైన రాముడు, తన భార్య అయిన సీతతోనూ, తమ్ముడైన లక్ష్మణుడితోనూ తండ్రి ఆజ్ఞ పాలించి దండకారణ్యానికి వచ్చాడు. అక్కడ రాముడి భార్య అయిన సీత కనపడకుండాపోయింది. రాముడు సీతను వెతుకుతూ ఋశ్యమూకానికి వచ్చి సుగ్రీవుణ్ణి చేరుకున్నాడు. తరువాత ఆయన వాలిని చంపి, సుగ్రీవుణ్ణి వానర భల్లూకాలకు రాజునుగా చేశాడు. అందుకు ప్రత్యుపకారంగా సుగ్రీవుడు సీతను వెతికిస్తానని మాట ఇచ్చాడు. ఆ మాట ప్రకారం ఆయన అన్ని దిక్కులకూ వానరులను పంపాడు. వారిలో ఒకడనైన నేను వాయుపుత్రుణ్ణి, హనుమంతు డనే వాణ్ణి. నేను నూరు యోజనాల సముద్రం దాటి సీతను చూడటానికి వచ్చాను. నీ అధీనంలో ఉన్న సీతను చూశాను. ఎంతో తపస్సు చేసి, ధర్మం తెలిసిన నీ వంటివాడు పరస్త్రీని చెరపట్టటం కూడని పని. రాముడికి అపచారం చేసి ఫల మనుభవించకపోవటం ఎవరికీ సాధ్యం కాదు. ఇక ముందు రాముడేం చేస్తాడో నాకు తెలియదు. సీతను రాముడి కిచ్చి వేయటం నీకు శ్రేయస్కరం. అనేక జాతుల వల్ల నీకు మరణం రాకుండా వరం పొంది ఉన్నావు నిజమే, కాని సుగ్రీవుడు ఆ జాతులలో దేనికీ చెందని వానరుడు. నరుడైన రాముడి చేతిలోనో, వానరుడైన సుగ్రీవుడి చేతిలోనో నీకు చావు తప్పదు.







రాముడు ఒప్పుడు గాని, నే నొక్కణ్ణే నీ లంకను నిర్మూలించ గలను. అసలు సీతను అపహరించి తెచ్చినప్పుడే మృత్యు దేవతను మెడకు చుట్టుకున్నావు. నేను రాయబారిని; అటు మానవుణ్ణీ కాను, ఇటు రాక్షసుణ్ణీ కాను. అందుచేత నీ మంచి కోరి చెబుతున్నాను. రాముడితో వైరం పెట్టు కుని నీవు జీవించలేవు," అన్నాడు.

ఈ మాటలు విని రావణుడు కోపోద్రే కంతో హనుమంతుణ్ణి చంపవలసిందిగా ఆజ్ఞ ఇచ్చాడు. అప్పుడు విభీషణుడు తన అన్నకు అడ్డు తగిలి ఇలా అన్నాడు: "ఈ దూతను చంపటం రాజ ధర్మం కాదు. ఆగ్రహావేశంలో ధర్మహాని చెయ్యటం తగదు. ఇతను కేవలమూ దూత మాత్రమే కాదు, అక్షుడు మొదలైన వారిని చంపాడు కనుక శత్రువే. అయినను దూతగా వచ్చిన వాడికి విధించే శిక్షలున్నాయి. ఇతనికి అంగ వైకల్యం కలిగించవచ్చు, కొరడాతో కొట్ట వచ్చు, శిరస్సు ముండనం చేయవచ్చు, కాల్చి ముద్ర వేయవచ్చు—కాని చంప రాదు. శాస్త్రం మాట అటుంచి, ఇతన్ని చంపటం చేత మన కేమీ లాభం లేదు. ఇతన్ని ఎవరు పంపారో వారిని చంపు."

ఈ మాట రావణుడికి నచ్చింది. "నిజమే, దూత అయిన వీణ్ణి చంపవద్దు, మరేదైనా శిక్ష విధింతాము. కోతులకు ఇష్ట మైనది తోక. ఇతడి తోకను కాల్చి పంపె య్యండి. తోక అంటించి వీణ్ణి వీధులన్నీ తిప్పండి," అన్నాడు.

రాక్షసులు హనుమంతుడి తోకకు గుడ్డ పీలికలు చుట్టి, చమురుపోసి అంటించి, నాలుగు వీధులూ తిప్పుతూ, "వేగులవాణ్ణి చూడండి," అని కేకలు పెట్టారు. హను మంతు డిది లక్ష్యపెట్టక, పట్టపగలు నగర రక్షణ సాధనలు ఎట్లా ఉన్నదీ చూడవచ్చు నని ఆశపడ్డాడు. అతన్ని చూడటానికి రాక్షస స్త్రీలూ, పిల్లలూ ఎగ బడ్డారు.









కొందరు రాక్షసస్త్రీలు సీత వద్దకు వెళ్ళి, "నీతో మాట్లాడి వెళ్ళాడే, ఆ వానరుడి తోకకు నిప్పు అంటించి, నగరమంతా తిప్పు తున్నారు," అని చెప్పారు.

సీత ఆ మాటలు విని చాలా బాధపడి, "నేనే పతివ్రతనైతే హనుమంతుడికి చల్లగా ఉండు," అని అగ్నిహోత్రుణ్ణి ప్రార్థించింది.

సీత ఈ మాట అనగానే హనుమంతుడి తోకలోని జ్వాలలు మరింత పెద్దవయాయి. కాని హనుమంతుడికి మంట తోచలేదు. అది చూసి హనుమంతుడికి ఆశ్చర్య మయింది. అతను చేయవలసిన దాన్ని గురించి ఆలోచించాడు. మొట్టమొదటగా మిక్కిలి చిన్నవాడై కట్ల నుంచి విడిపించు కున్నాడు. మరుక్షణమే తన దేహాన్ని పెంచి, నగరద్వారం వద్ద ఉన్న పరిఘను తీసు కుని, తన వెంట ఉన్న రాక్షసుల నందరినీ చావమోదాడు. అతను లంకా నగరం కేసి చూస్తూ, "ఇప్పుడేం చేస్తే బాగుంటుంది?" అనుకున్నాడు. అప్పటికే రాక్షసులకు చేయ వలసిన నష్టం చాలా చేశాడు, లంకా దుర్గాన్ని నాశనం చెయ్యటమే మిగిలి ఉన్నది. లంక లోని మహాభవనాలను అగ్నిహోత్రుడికి ఆహుతి ఇవ్వటమే కర్తవ్యం.

ఈ మాట అనుకుని హనుమంతుడు మండుతున్న తోకతో లంకలోని భవనాల మీదుగా సంచరించ నారంభించాడు. నిర్భ యంగా రాక్షసుల యిళ్ళన్నీ తిరిగాడు. ప్రహస్తుడి భవనానికి నిప్పు అంటించి, మహా పార్శ్వుడి ఇంటి పైకి దూకాడు. ఆ ఇంటిని దేదీప్యమానంగా అంటించి, తరవాత వరు సగా వజ్రదంష్ట్ర, శుక, సారణుల గృహా లకు నిప్పు పెట్టేశాడు. తరువాత ఇంద్ర జిత్తూ, జంబుమాలి, సుమాలిల ఇళ్ళన్నీ అంటించాడు. అతను ఒక్క విభీషణుడి ఇల్లు తప్ప మిగిలిన రాక్షసోత్తముల ఇళ్ళను, మణులతో సహా తగలబెట్టేశాడు.





లంక కంతా చిచ్చుపెట్టే హనుమంతుడికి సహాయంగా వాయుదేవుడు వీచాడు. వాయువు సహాయంతో లంక అంతా వేగంగా అంటుకున్నది. ఒక్కొక్క మేడే కూలి పడసాగింది.

మండిపోతున్న తమ ఇళ్ళను రక్షించుకోవటం రాక్షసులకు సాధ్యంకాలేదు. మగవాళ్ళూ, పిల్లలూ, స్త్రీలూ భీభత్సంలో మునిగిపోయారు. ఎంతోమంది మంటలలో నశించారు. తగలబడిపోతున్న లంక భయంకరంగా కనబడింది. రాక్షసుల ఆర్తనాదాలు ఈ దృశ్యాన్ని మరింత భయానకం చేశాయి.

హనుమంతుడు ఒక్కసారి లంక అంతా కలయజూచి, ఆ నగరంలోని అన్ని ప్రాంతాలూ తగలబడిపోతూ ఉండటం గమనించి, తన తోకలోని మంటలను సముద్రంలో ముంచి ఆర్పేశాడు.

ఆ సమయంలో అతనికి పెద్ద భయం పట్టుకున్నది: లంకతో బాటు సీత కూడా తగలబడిపోయి ఉంటుంది! ఈ ఆలోచన రాగానే హనుమంతుడు తనను తాను తిట్టుకున్నాడు; ఆగ్రహం చెందిన వాడికి కార్యాకార్య విచక్షణ లేకుండా పోతుందనుకున్నాడు: తాను వచ్చిన పని అంతా మంట కలిసి పోయిందనుకున్నాడు.

కాని అంతలోనే అతనికి మళ్ళీ ధైర్యం వచ్చింది. తాను వచ్చిన పని ఇన్ని విధాల సఫలమైన తరువాత సీత చావటం జరగదు. తన తోకనే కాల్చని అగ్నిహోత్రుడు సీతను దహిస్తాడా? అలా ఎన్నటికీ జరగదు. సీతే అగ్నిలాటిది! ఆమెను అగ్ని ఏం చెయ్యగలడు? అత నలా అనుకుంటూండగానే ఆకాశాన చారణులు అనుకునే మాటలు వినిపించాయి. లంక అంతా దగ్ధమైనా సీతకు ఏ అపాయమూ కలగకపోవడం గురించి వారు ఆశ్చర్యంగా చెప్పుకునే మాటలు విని హనుమంతుడు పరమానందం చెందాడు.






లంక అంతా పరశురామ ప్రీతి చేసిన హనుమంతుడు అశోకవనంలో ఉన్న సీత వద్దకు తిరిగి వచ్చి, ఆమెకు నమస్కారం చేసి, "నా అదృష్టం చేత నీ కేమీ అపాయం కలగలేదు. రాముడు త్వరలోనే వానరులనూ, భల్లూకాలనూ వెంట బెట్టుకుని వస్తాడు. నాకు సెలవిప్పించు," అన్నాడు.

అతను ఆమె వద్ద సెలవు పుచ్చుకుని అరిష్టమనే పర్వతం పైకి ఎక్కి సముద్రం పైకి చూసి తన శరీరాన్ని పెంచాడు. అతను ఒక్కసారి బలంగా తొక్కగానే ఆ పర్వతం లోని శిలలు పిండి అయాయి; అందులో ఉండే మృగాలన్నీ భయపడి చెల్లాచెదరుగా పరిగెత్తాయి. హనుమంతుడు అవతలి ఒడ్డుకు ప్రయాణమైన వాడై ఆకాశంలోకి లేచాడు. అతను మేఘాల మధ్య కనిపిస్తూ, మాయమవుతూ, సముద్రంలో వెళ్ళే ఓడలాగా గాలిలో తేలిపోతూ, సముద్రాన్ని లంఘించాడు. త్వరలోనే అతనికి అంతదూరాన మహేంద్ర పర్వతం కనబడింది. దాన్ని చూస్తూనే అతను ఉత్సాహంతో గట్టిగా సింహ నాదం చేశాడు.

హనుమంతు డెప్పుడు వస్తాడా అని ఆత్రంగా ఎదురు చూస్తున్న అంగదుడు మొదలుగాగల వానరులకు ఆ సింహ నాదం విని పరమానందమయింది. అందరికీ పెద్ద వాడయిన జాంబవంతుడు వానరులందరినీ చేరదీసి, "మన హనుమంతుడు పని చక్క బెట్టుకుని మరీ వస్తున్నాడు. అతని కంఠ ధ్వని వింటే అలాగే తోస్తున్నది," అన్నాడు.







వానరులు ఆనందంతో కుప్పి గంతులు వేశారు. కొందరు హనుమంతుణ్ణి చూడ టానికి చెట్లెక్కి, అతన్ని పిలుస్తున్నట్టుగా కొమ్మ లాడించారు. అంతలోనే హను మంతుడు వచ్చి మహేంద్రపర్వతం మీద దిగాడు. వానరులంతా అమితోత్సాహంతో అతన్ని చుట్టు ముట్టారు. అతనికి పళ్ళూ, దుంపలూ అందించారు.

హనుమంతుడు జాంబవంతుడిలాటి పెద్ద లకూ, యువరాజైన అంగదుడికీ నమస్కా రాలు చేసి, "చూశాను సీతను," అని స్పష్టంగా చెప్పేశాడు. అతను అంగదుణ్ణి ఆలింగనం చేసుకుని, అందరూ కూర్చోవ టానికి మహేంద్రగిరి పైన ఒక సుందర స్థలం చూశాడు.

హనుమంతుడు సీతను చూశానన్న శుభ వార్త చెప్పగానే వానరులు కొందరు సింహ నాదాలు చేశారు. కొందరు కేకలుపెడితే మరి కొందరు జవాబులిచ్చారు, ఇంకొందరు రాళ్ళమీదుగా దూకుతూ, అతణ్ణి తాకారు.

అప్పుడు అంగదుడు, "హనుమంతుడా, నూరు యోజనాల సముద్రాన్ని అటూఇటూ కూడా దాటి నీకు సాటి లేడనిపించావు. మా అందరి మానాన్నీ కాపాడావు. అంతేకాదు, సీతాదేవిని కూడా చూశావు," అన్నాడు. హనుమంతుడు చెప్పబోయే విశేషాలు విన టానికి వానరులందరూ ఆత్రంగా ఉన్నారు.

జాంబవంతుడు హనుమంతుడితో, "సీత నీ కెలా కనపడింది? ఆమె అక్కడ ఎలా ఉన్నది? ఆమె పట్ల రావణు డెలా ప్రవర్తి స్తున్నాడు? ఉన్న సమాచార మంతా దాచ కుండా చెప్పు. అందులో రాముడికి చెప్ప వలసినదేదో, చెప్పగూడనిదేదో మనం తరవాత తేల్చుకుందాం," అన్నాడు.

హనుమంతు డీ విధంగా చెప్పసాగాడు:

"నేను బయలుదేరటం మీరు చూశారు గదా. కొంతదూరం వెళ్ళేసరికి ఒక అంద మైన బంగారు పర్వత శిఖరం నా దారి





కడ్డు తగిలింది. అది నన్ను ప్రేమగా పలకరించి, తాను మైనాకుణ్ణనీ, నా తండ్రి అయిన వాయుదేవుడు తనను ఇంద్రుడి నుంచి కాపాడాడనీ చెప్పింది. మైనాకుడి వద్ద సెలవు పుచ్చుకుని చాలా దూరం వెళ్ళాక సర్పమాత అయిన సురసాదేవి ఎదురై నన్ను మింగుతానన్నది. అంగుళం దేహంతో ఆమె నోట ప్రవేశించి వెంటనే బయటికి వచ్చి దారి పుచ్చుకున్నాను."

ఈ విధంగా ప్రారంభించి హనుమంతుడు, తాను చీకటిపడ్డాక లంకానగరం ప్రవేశించటమూ, లంకను జయించటమూ, లంక అంతా గాలించిన మీదట అశోకవనంలో ఒక శింశుపా వృక్షం కింద సీత కనిపించటమూ మొదలైన విషయాలన్నీ వివరంగా చెప్పాడు. చివర కతను ఇలా అన్నాడు:

"సీత మహా పతివ్రత అనటానికి సందేహం లేదు. ఆమె రాముడి కొరకే జీవిస్తూ చాలా కష్టాలకు గురి అవుతున్నది. నేనొక్కణ్ణే లంకను బూడిద చేసి వచ్చినప్పుడు మన మందరమూ కలిసి రావణుడి బలాలన్నిటినీ హతమార్చ లేక పోతామా? మనలో ఎవరు తక్కువ? జాంబవంతుడూ, అంగదుడూ, పనసుడూ, నీలుడూ, అజేయులైన మైందద్వివిదులూ...ఇంద రున్నారు.



మనం రావణుణ్ణి చంపి సీతను రాముడి వద్దకు చేర్చటం బాగుంటుందేమో!"

అంగదుడు హనుమంతుడి మాటను బలపరుస్తూ, "మనం సీతను చూసి కూడా ఆమెను తీసుకు పోకపోవటం అనుచితం. రాముడి వద్దకు వెళ్ళి, 'సీతను చూశాం, కాని తీసుకు రాలేదు,' అనటం ఏమీ బాగుండదు. అసలు హనుమంతుడు అక్కడి రాక్షస వీరులందరినీ చంపనే చంపాడు. సీతను తీసుకు రావటం తప్ప మనకు పెద్ద పని కూడా లేదు," అన్నాడు.

ఈ మాట విని జాంబవంతుడు, "యువరాజా, నీది చాలా మంచి ఆలోచనే. దీన్ని







పెట్టారు, ఒకరి నొకరు తరుముకున్నారు, చెట్ల మీదుగా పరిగెత్తారు.

మధువనానికి రక్షకుడు దధిముఖుడు, సుగ్రీవుడి మేనమామ. వానరులు వనంలోని తేనె అంతా తాగెయ్యటమే గాక, చెట్లన్నీ ధ్వంసం చేసి, పూలన్నీ రాల్చెయ్యటం చూసి మండిపడి అతను వానరులను వనం విడిచి పొమ్మని కేక లేశాడు. వాళ్ళు విని పించుకోలేదు. అతను కొందరిని కొట్టాడు. కొందరితో మంచి మాటలాడాడు. కొందరిని బతిమాలుకున్నాడు. కాని అందరూ అతన్ని పట్టుకుని ఏడిపించుకు తిన్నారు, కొంద రతన్ని రక్కి, కొరికారు కూడా.

హనుమంతుడు వానరులకు ప్రోత్సాహ మిస్తూ, "మీ ఇష్టం వచ్చినట్టు తేనె తాగండి. ఎవరడ్డొస్తారో నేను చూస్తాను," అన్నాడు.

అంగదుడు హనుమంతుణ్ణి బలపరుస్తూ, "హనుమంతుడు కూడని పని చెయ్యమన్నా నేను చేసేస్తాను. అలాటప్పుడు మంచి పని చెయ్యమంటుంటే మానట మెందుకూ!" అన్నాడు. వానరులు అంగదుడి మాటలకు హర్షధ్వానాలు చేశారు. వారు తేనె తాగిన కైపులో చిత్తం వచ్చినట్టు చేశారు. మధు వనంలోని కాపలా వాళ్ళందరినీ కట్టేశారు, పళ్ళన్నీ తినేశారు. కొందరు సింహనాదాలు

గురించి రాముడే మంటాడో తెలుసుకుని ఆయన చెయ్యమన్నట్టు చేద్దాం," అన్నాడు లౌక్యంగా. దీనికి అంగదుడే గాక మిగిలిన వానర వీరులు కూడా సమ్మతించారు.

తలపెట్టిన పని సానుకూలం కావటమూ, రాముడికి చెప్పవలిసిన సమాచారం ఉండ టమూ, యుద్ధంచేసే అవకాశం ఉండటమూ మొదలైన అంశాలతో వానరులు ఉద్రేకోత్సా హాలు చెంది తిరుగుముఖం పట్టారు. వారు గాలిలో ఎగురుతూ మధువనం చేరుకుని, అంగదుడి అనుమతితో అక్కడి చెట్ల మీద ఉన్న తుట్టెల నుంచి తేనె తాగారు, సంతో షం పట్టలేక రకరకాల ఆటలాడారు, కేకలు





చేశారు, కొందరు సన్నగా కూశారు, మరి కొందరు పడుకుని నిద్రపోయారు.

మధువన మంతా నాశనమవుతూండటం చూసి దధిముఖుడు తన కాపలా వాళ్ళ నందరినీ కూడగట్టుకుని, చెట్లూ, రాళ్ళూ మొదలైన ఆయుధాలతో అంగదాది వానర వీరులపై తలపడ్డాడు. హనుమంతుడు మొదలుగా గల వారు అతని మీద కలియ బడ్డారు. మత్తులో ఉన్న అంగదుడు, దధిముఖుడు తన తాత అన్న స్ఫురణ కూడా లేకుండా, అతన్ని పడదోసి ఘోరంగా కుమ్మాడు. దధిముఖుడికి స్పృహ తప్పింది.

కొంత సేపటికి అతను తెలివి తెచ్చుకుని, తన చేతిలో ఉన్న చెట్టుతో తప్పతాగి ఉన్న వానరులను తరిమాడు. తరవాత అతను తన వారితో, "వీళ్ళందరినీ ఇక్కడే పడి ఉండనివ్వండి. నేను వెళ్ళి సుగ్రీవుడితో జరిగినదంతా చెబుతాను. తరవాత సుగ్రీవుడే వాళ్ళ తలలు తీసేస్తాడు," అని చెప్పి శీఘ్ర గమనాన సుగ్రీవుడి వద్దకు వెళ్ళాడు.

సుగ్రీవుడు తన మేనమామను చూసి ఆశ్చర్యపడి, "ఏమిటి విశేషం?" అని అడిగాడు.

"మీ నాన్నగారి కాలంలో గాని నీ కాలంలోగాని దేవతలకైనా ప్రవేశింపరాని మధు



వనాన్ని అంగదుడు మొదలైన వానరులు ధ్వంసం చేసి పెట్టారు. కావలివాళ్ళు పొమ్మంటే కొట్టారు, తల కిందులుగా వేళ్ళాడ గట్టారు. మధువనంలోని తేనె అంతా తాగేస్తున్నారు," అని దధిముఖుడు సుగ్రీవుడితో చెప్పాడు.

ఆ సమయంలో లక్ష్మణుడక్కడికి వచ్చి, దధిముఖుణ్ణి చూసి, "ఇతనేమిటో ఫిర్యాదు చేస్తున్నాడు?" అన్నాడు.

"సీతను వెతకటానికి దక్షిణంగా వెళ్ళిన నా వాళ్ళు మధువనానికి వస్తూనే వనమంతా అల్లకల్లోలం చేసి తేనెలు తాగేస్తున్నారట. పని సానుకూలం చేసుకురాకపోతే వారట్లా







దధిముఖుడు వారు ముగ్గురికీ ప్రణామం చేసి, శీఘ్ర గమనాన ఆకాశమార్గాన మధువనానికి తిరిగివచ్చే సరికి వానరులకు కైపు దిగిపోయింది. అతను అంగదుడితో, "యువరాజా, మేము నిన్నడ్డగించామని కోపించకు. తెలియక పొరపాటు జరిగిపోయింది. నేను వెళ్ళి మీరు వచ్చినట్టు మీ పినతండ్రికి చెప్పగా, ఆయన సంతోషించి మిమ్మల్నందరినీ త్వరగా రమ్మన్నాడు," అన్నాడు.

అంగదుడు తన వారితో, "మనం ఇక్కడ విశ్రాంతి తీసుకున్నాం గనక ఇక బయలుదేరుదాం. మనం వస్తున్న సంగతి రామలక్ష్మణులకు అప్పుడే తెలిసిపోయింది," అన్నాడు.

అంగదుడూ, అతని వెనుకగా మిగిలిన వారూ ఆకాశంలోకి లేచారు. వారు కిష్కింధను చేరవస్తూ చేసిన సింహనాదాలు సుగ్రీవుడికి వినిపించాయి. అతను ఆనందంతో తోక చాచి ఆడించాడు. ఇంతలో వానరులు, హనుమంతుణ్ణీ, అంగదుణ్ణీ ముందుంచుకుని, రాముడున్న చోటికి వచ్చి వాలారు.

"వానరులారా, సీత ఎక్కడ ఉన్నది? నన్ను గురించి ఏ భావంతో ఉన్నది? అన్ని విషయాలూ నాకు వివరంగా చెప్పండి,"

ప్రవర్తించరు. వారు తప్పకుండా సీతను చూసే వచ్చారు. అందుకు సమర్థుడైన హనుమంతుడు వాళ్ళవెంట ఉండనే ఉన్నాడు. పని ముగించుకు వచ్చిన పొగరులోనే వాళ్ళు కాపలా వాళ్ళను కూడా కొట్టారు," అన్నాడు సుగ్రీవుడు.

సుగ్రీవుడు చేసిన ఊహ రామలక్ష్మణులకు పరమానందం కలిగించింది. సుగ్రీవుడు దధిముఖుడితో, "వానరులు మధువనంలోని తేనె అంతా తాగినందుకు చాలా సంతోషించానని చెప్పు. వాళ్ళ కోసం నేనూ, రామలక్ష్మణులూ వేచి ఉన్నాం. వారిని త్వరగా రమ్మను," అన్నాడు.





అని రాముడు వానరుల నడిగాడు. వానరులు హనుమంతుణ్ణి ముందుకు తోశారు.

హనుమంతుడు రాముడికి జరిగినదంతా చెప్పి, సీత ఇచ్చిన చూడామణిని రాముడి చేతిలో పెట్టి, "రామా, చిత్రకూటం మీద మీరుండేటప్పుడు కాకి ఉదంతం ఒకటి నీకు గుర్తుగా ఉండగలందులకు సీత చెప్పింది. తన కింకొక్క మాసమే గడువున్నదని నీతో చెప్పమన్నది. ఆమె చాలా అధైర్యం చెంది ఉన్నది. సముద్రం దాటి లంకకు వెళ్ళే ఉపాయం ఆలోచించండి," అన్నాడు.

సీత పంపిన చూడామణిని చూడగానే రామలక్ష్మణులకు దుఃఖం ఆగలేదు. రాముడు శోకవివశుడై, "సీత కనిపించకుండా ఈ చూడామణి కనిపించటం కన్న వేరే దుఃఖ మేముంటుంది? సీత ఇంక ఒక్క నెలపాటే జీవించి ఉంటుందా? ఆమె ఉన్న చోటు తెలిసి అక్కడికి వెళ్ళకుండా, ఇక్కడ ఒక్క నిమిషమైనా ఎలా ఉండటం? ఆ భయంకర రాక్షస స్త్రీల మధ్య సీత ఇంత కాలం ఎలా ఉన్నది?" అని ఆక్రోశించాడు.

అతను సీత అన్న మాటలన్నీ హనుమంతుడి చేత చెప్పించుకుని విన్నాడు. హనుమంతుడు అంతా చెప్పి, "ఆమె నిన్ను సేనతో వచ్చి రావణుణ్ణి చంపి తనను కాపాడమన్నది. అందుకు తగిన ప్రోత్సాహం నన్నే ఇవ్వమన్నది. వానర సేనలు సముద్రం దాటి లంకకు రాలేవేమో నని ఆమె సంశయించింది. తనకు విమోచనం ఉండదేమోనని భయపడుతున్న సీతను నేను అనేక రకాల ఓదార్చాను. నన్ను మించిన వారు సుగ్రీవుడి వద్ద వేలాది వానరులున్నారని చెప్పాను. త్వరలోనే రావణుడు మొదలైన వారు నాశనమైపోతారనీ, ఆమె తన భర్తతో అయోధ్యకు తిరిగి వెళుతుందనీ ధైర్యం చెప్పాను," అన్నాడు.

[ సుందరకాండ సమాప్తం ]









హనుమంతుడు చెప్పినదంతా విని రాముడు పరమసంతోషం చెంది, "ఆహా, ఈ హనుమంతుడు చేసిన పని మరెవరు చెయ్యగలరు? ఇతరులు తలపనైనా తలవలేరు గదా! సముద్రాన్ని దాటటం గరుత్మంతుడికీ, వాయుదేవుడికీ, ఈ హనుమంతుడికీ తప్ప మరెవరికీ సాధ్యమయే పని కాదు. అంతతో పోక ఈ హనుమంతుడు దేవతలకు సైతం ప్రవేశించరాని లంకను ప్రవేశించాడు! ప్రవేశించటమే కాదు, ప్రాణాలతో తిరిగివచ్చాడు! అక్కడ అశోకవన భంగమూ, రాక్షస సంహారమూ, లంకా దహనమూ మొదలైన అద్భుత కార్యాలు చేశాడు! సీతనూ, నన్నూ ఈ హనుమంతుడు కాపాడినవాడైనాడు. ఇతనికి ఏమి ఇచ్చినా తీరదు. అన్నిటికీ బదులుగా ఆలింగనం చేసుకుంటాను," అంటూ హనుమంతుణ్ణి కౌగలించుకున్నాడు.

తరవాత రాముడు సుగ్రీవుడితో, "సీతను వెతకటంలో కృతకృత్యుల మయామేగాని ఆ సముద్రాన్ని తలుచుకుంటే నా మనసు కుంగిపోతున్నది. దాని దక్షిణ తీరానికి ఎలా చేరుకునేట్టు?" అంటూ విచారంలో మునిగి పోయాడు.

అప్పుడు సుగ్రీవుడు రాముణ్ణి చూసి, "ఎందుకు విచారం? అది కార్యహాని హేతువు. సముద్రానికి సేతువు కట్టి లంకలో అడుగుపెట్టే ఉపాయం ఆలోచించామంటే ఆ రావణుడు చచ్చినవాడి కిందనే లెక్క. సముద్రానికి సేతువు కట్టకుండా లంకను







హనుమంతు ఈ విధంగా చెప్పాడు :

"లంకలోని వారంతా సంతృప్తులు, అసంతృప్తు లక్కడ లేరు. నగరం విశాల మైనది. పుష్కలంగా చతురంగ బలాలు గలది. దానికి నాలుగు పెద్ద ద్వారా లున్నాయి. ద్వారాల వద్ద శత్రు సైన్యాలను నాశనం చెయ్యడానికి బ్రహ్మాండమైన రాళ్ళు విసిరే యంత్రాలున్నాయి, నూరేసి మందిని చంప గల శతఘ్నులున్నాయి. నగరం చుట్టూ దాటరాని ప్రాకారం ఉన్నది. దాని చుట్టూ లోతైన అగడ్త ఉన్నది. దానిని దాటటానికి ద్వారాల సమీపంలో కర్ర వంతెన లున్నాయి. వాటిని యంత్ర సహాయంతో ఎత్తవచ్చు, దించవచ్చు. శత్రువులు వచ్చి నప్పుడు వాటిని ఎత్తివేస్తే, అగడ్తను దాటటం అసాధ్యం. రావణుడు చాలా మెల కువ గల వాడు, శత్రు భయం లేనప్పుడు కూడా తన సైన్యాన్ని యుద్ధ సన్నద్ధంగా ఉంచుతాడు. లంకకు నాలుగు రక్షలున్నా యనవచ్చు. ఒకటి, చుట్టూ ఉండే సముద్రం. లంక ఎత్తుగా త్రికూటపర్వతం పైన ఉండటం చేత దానిని ఎక్కి లంకను చేరాలి. ఆ పర్వతం రెండో రక్ష. అక్కడ ఉండే అరణ్యం మరొక రక్ష. నాలుగో రక్ష అగడ్తా, పరిఘలూ, యంత్రాలూ, శత

జయించటం దేవతలకే సాధ్యం కాదు. అందుచేత విచారం విడిచిపుచ్చి కర్తవ్యం ఆలోచించు. నీకు జయం కలుగుతుందన టానికి ఏ సందేహమూ లేదు," అన్నాడు.

ఈ మాటలతో రాముడు తేరుకుని, "తపస్సు చేసో, సేతువు కట్టో, సముద్రాన్ని ఇంకించో, ఏదో విధంగా లంకకు చేరి తీరు తాను. ఆ విషయమై ఇంక విచారించను," అంటూ హనుమంతుడితో, "లంకకు ఎన్ని దుర్గాలున్నాయి? ఎంత సైన్యం ఉన్నది? ద్వారరక్షణ ఎలా ఉన్నది? ప్రాకారాలు మొదలైన వాటిని గురించి వివరంగా చెప్పు," అన్నాడు.







ఘ్నులూ మొదలైనవి. ద్వారాల వద్దా, నగర మధ్యంలోనూ యోధులైన రాక్షసులు కోట్ల సంఖ్యలో ఉన్నారు. అయితే నేను అగడ్తలను దాటే వంతెనలను ధ్వంసం చేసి, అగడ్తను పూడ్చాను. ప్రాకారాన్ని ధ్వంసం చేశాను. చాలా మంది పరాక్రమ వంతులైన రాక్షసులను చంపాను. కనుక ఇప్పుడు లంకను వశపరచుకొనటం అంత కష్టం కాదు. మిగతా సైన్యంతో కూడా పని లేదు; అంగదుడూ, ద్వివిదుడూ, మైందుడూ, జాంబవంతుడూ, పనసుడూ, నళుడూ, సేనానాయకుడైన నీలుడూ చాలు. వీళ్ళు తలుచుకుంటే లంకను పెళ్ళగించి, రాక్షసులతో సహా తేగలరు. అందుచేత అంగదుడు మొదలైన వారిని ఆజ్ఞాపించి, మంచి ముహూర్తం చూసి బయలుదేర దీయించు."

రాముడంతా విని హనుమంతుడితో, "సరే, ఆ లంకను అవశ్యం హత మార్చుదాం," అన్నాడు. అతను సుగ్రీవు డితో, "మనం ఇవాళే, ఇప్పుడే సేనలతో బయలుదేరి పోదాం. సరిగా మిట్టమధ్యాహ్న మయింది. ఇది అభిజిత్తు అనే ప్రశస్తమైన ముహూర్తం. కార్యసాధన అవుతుంది. అదీ గాక, ఇవాళ ఉత్తర ఫల్గునీ నక్షత్రం.



నా జన్మ నక్షత్రం పునర్వసు గనుక ఇది నాకు అనుకూలం. ఇంకా అనేక శుభ లక్షణాలు కనిపిస్తున్నాయి గనుక వెంటనే బయలుదేరుదాం," అన్నాడు.

వానరసేనలో ముందెవరుండాలో, దాని పార్శ్వాలను ఎవరు రక్షించాలో, ఏయే వానరయోధు డేయే పని నిర్వర్తించాలో, మార్గ మధ్యంలో శత్రువులు అవాంతరాలు కలిగించ కుండా ఎలా జాగ్రత్త పడాలో రాముడు వానర సేనానాయకుడైన నీలు డితో చెప్పాడు. ఉదాహరణకు, వానరసేన వెళ్ళే మార్గంలో ఉండే పళ్ళూ, ఫలాలూ మొదలైన ఆహారాన్ని రాక్షసులు నిర్మూ







లించవచ్చు. లోయలలోనూ, నదులు దాటే చోటా, అరణ్యాలలోనూ శత్రువులు మాటు వేసి ఉండి వానరసేనను నిర్మూలించ యత్నించవచ్చు. అలాటి ప్రమాదాలేవీ జరగకుండా ముందు నడిచే వారు జాగ్రత్త తీసుకోవాలి.

ప్రయాణం కావలిసిందని సుగ్రీవు డాజ్ఞాపించగానే యుద్ధోత్సాహులైన వానరులు గుహల నుంచీ, కొండల మీది నుంచీ, చెట్ల మీది నుంచీ దూకుతూ వచ్చారు. వానర సేన దక్షిణంగా కదిలింది. రాముణ్ణి హనుమంతుడూ, లక్ష్మణుణ్ణి అంగదుడూ తమ భుజాల పైన ఎక్కించుకున్నారు. అసంఖ్యాకులైన వానరులు వారిని చుట్టుముట్టి నడుస్తూ, ఎగిరారు, గంతులు వేశారు, సింహనాదాలు చేశారు, ఒకరి నొకరు పడదోసుకున్నారు, పరుగుపందాలు వేసుకున్నారు, "రావణుణ్ణి చంపాలి; రాక్షసులను చంపాలి," అని నినాదాలు చేశారు. మహా పరాక్రమవంతులైన వానరోత్తములు, ఋషభుడూ, నీలుడూ, కుముదుడూ పెద్ద బలగంతో సేనకు ముందుండి దారి తీశారు.

దారిలో లక్ష్మణుడు రాముడికి ఉత్సాహం కలిగిస్తూ, "ఇంక త్వరలోనే రావణుడు చస్తాడు. సీతకు విమోచనం కలుగుతుంది. మీ ఇద్దరూ అయోధ్యకు తిరిగిపోతారు. వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది, నక్షత్రాలు అనుకూలంగా ఉన్నాయి. రాక్షసుల నక్షత్రమైన మూలా నక్షత్రాన్ని తోకచుక్క తాకుతున్నది," అన్నాడు.

దారి పొడుగునా వానరులు చేయవలసిన కోతి చేష్టలన్నీ చేస్తూ, చెట్ల మీదుగానూ, చెట్ల కిందుగానూ నడుస్తూ, కుప్పి గంతులు వేస్తూ, ఎగురుతూ, కిచకిచలాడుతూ, చెట్ల కొమ్మలు విరుస్తూ, ఫలాలు తిని తేనెలు తాగుతూ, ఎక్కడా మజిలీ వెయ్యకుండా, సహ్యపర్వతాన్నీ, మలయపర్వతాన్నీ దాటి సముద్రతీరాన్ని చేరుకున్నారు.







రాముడు లక్ష్మణ సుగ్రీవులతో సహ మహేంద్రగిరి శిఖరానికి ఎక్కి, అక్కడి నుంచి సముద్రాన్ని చూశాడు. తరవాత పర్వతం దిగివచ్చి సముద్రాన్ని దగ్గిరగా చూశాడు. అతను సుగ్రీవుడితో, "ఇక మన ముందు సముద్రమే గాని భూమి లేదు. దీన్ని దాటటానికి ఏదో ఉపాయం ఆలోచించాలనుకున్నామే, ఆ ఉపాయం ఆలోచించే సమయం వచ్చింది. ప్రస్తుతానికి సేనలను ఇక్కడే విడియిద్దాం. ఎవరూ తన సేన నుంచి దూరంగా వెళ్ళరాదు. శత్రు భయం కలగకుండా శూరులైన వానరులు కాపలా తిరుగుతూ ఉండాలి," అన్నాడు.

సుగ్రీవుడు ఆజ్ఞాపించగా వానరసేన మూడు విభాగలై విడిసింది. ఆ సమయంలో వానరులు చేసిన ధ్వని మూలాన సముద్ర ఘోష కూడా విన రాలేదు. వానరులు సముద్రాన్ని చూసి మహాశ్చర్యం పొందారు. దీన్ని ఎలా దాటటమా అని దిగులు చెందారు.

వానరసేనాని అయిన నీలుడు సేనానివేశనం శాస్త్రోక్తంగా జరిపించాడు. వానరోత్తములైన మైందద్వివిదులు సేనకు రక్షకులుగా రెండు పక్కలా సంచరించారు.

సైన్యం విడిసే ఏర్పాట్లు పూర్తికాగానే రాముడు సీతా విరహంలో పడి చాలాసేపు తపన పడ్డాడు. అతను లక్ష్మణుడితో తన బాధ చెప్పుకుని విలపించాడు. ఇంతలో సూర్యాస్తమయమయింది. లక్ష్మణుడు ఓదార్చిన మీదట రాముడు వ్యాకుల మనస్సుతోటే సంధ్యోపాసన చేశాడు...

ఈ లోపల అక్కడ లంకలో, రావణుడు ఘోరమైన అవమానం పొంది తన రాక్షస ప్రముఖులతో, "శత్రువులకు అభేద్యమైన లంకలోకి ఒక వానరమాత్రుడు ప్రవేశించి, గొప్ప గొప్ప రాక్షస వీరులను చంపి, లంకను దహించి అల్లకల్లోలం చేసేశాడు; సీతతో మాట్లాడి మరీ వెళ్ళాడు. ఇప్పుడు రాముడు





వేలకొద్దీ వానరవీరులను వెంటబెట్టుకుని మన పైకి ఎత్తి వస్తున్నాడు. అతను తన తమ్ముడితోనూ, సుగ్రీవుడు మొదలైన వారితోనూ, వానరసేనతోనూ సముద్రాన్ని దాటి రాగలడనటానికి సందేహం అక్కర్లేదు. అతను స్వశక్తి చేత సముద్రాన్ని ఎండించవచ్చు, లేక మరొకటి చేయవచ్చు. అతను వానరబలగంతో వచ్చిపడే పక్షంలో మనం లంకనూ, మననూ రక్షించుకునే ఉపాయమేమిటి? అందరూ శాస్త్రీయంగా ఆలోచించి, ఏకాభిప్రాయానికి వచ్చి కర్తవ్యం నిర్ణయించండి," అన్నాడు.



ఈ మాటలు విని రాక్షసులు, "రాక్షసేశ్వరా, నీకి విషయమై చింత ఎలా కలిగింది? మనకు అంతులేని సేన ఉన్నది; అంతులేని పరిఘలూ, శక్తులూ, శూలాలూ, పట్టిసాలూ మొదలైన ఆయుధాలున్నాయి. నీవా ముల్లోకాలనూ జయించినవాడవు. కుబేరుణ్ణీ, యక్షులనూ జయించి పుష్పకం తెచ్చుకున్నావు. మయుడు నీకు వెరిచి తన కూతురును (మందోదరిని) నీకు భార్యగా ఇచ్చాడు. వాసుకీ, తక్షకుడూ మొదలైన నాగరాజులు నీకు లోబడ్డారు. అపారశక్తివంతులూ, మాయావులూ అయిన కాలకేయులు నీతో ఏడాది పాటు యుద్ధం చేసి చివరకు ఓడారు. వరుణుడూ, యముడూ నీ చేత జయించబడ్డారు. రాముడు వారితో పోల్చితే ఏపాటి? వారందరినీ జయించిన నీకు రాముడొక లెక్కా? నీ దాకా ఎందుకు? మహేశ్వర యజ్ఞం చేసి, వరప్రసాదుడై, దేవేంద్రుడితో యుద్ధం చేసి, అతన్ని కట్టి లంకకు తెచ్చిన ఇంద్రజిత్తు చాలడా? క్షణంలో ఆ రాముణ్ణీ, వానరసేననూ మట్టుబెట్ట గలడు! వానరుడైన హనుమంతుడు చేసిన అల్లరిని తలచి బాధ పడకు, ఆ సంగతి మరిచి పో!" అన్నారు. వారు అవివేకులు, మీదు మిక్కిలి శత్రుబలం ఏ మాత్రమూ ఎరగరు.





వెంటనే ప్రహస్తుడు లేచి రావణుడికి నమస్కారం చేసి, "దేవదానవ గంధర్వ పిశాచాదులకు భయపడని మనం కోతులకు భయపడతామా? మనని జయించే వారు లేరన్న అలక్ష్యంలో ఉన్న కారణం చేత హనుమంతుడు అల్లరి చేశాడుగాని, నేను జీవించి ఉండగా వాడు ప్రాణాలతో లంకను దాటునా? నన్ను ఆజ్ఞాపించు, భూమి మీద ఎక్కడా వానర మనేదీ మచ్చుకు కూడా లేకుండా చేసేస్తాను. లంకను కాపాడే పని నాకు వదిలెయ్యి!" అన్నాడు.

"హనుమంతుడు మనకూ, మన రాజుకూ చేసిన అవమానం నిజంగా క్షమించరానిదే. నే నొక్కణ్ణే వెళ్ళి ఆ వానరుల నందరినీ చంపి వస్తాను," అన్నాడు దుర్ముఖుడు. వజ్రదంష్ట్రుడు కోపం వెళ్ళగక్కుతూ, ఇనుప గుదియ ఒకటి చేతబట్టి, "అర్థ రాత్రివేళ దొంగలాగా వచ్చిన ఆ హనుమంతుడితో నేమిటి? నేను వెళ్ళి, నిజమైన శూరుడైన ఆ రాముణ్ణి లక్ష్మణ సుగ్రీవులతో సహా చంపేస్తాను. రాజా, మరొక మాట చెబుతాను. మనం శత్రువులను ఉపాయంతో జయించవచ్చు. కామరూపులైన మన రాక్షసులు వేల సంఖ్యలో మనుష్య రూపం ధరించి రాముడి వద్దకు వెళ్ళి, 'మమ్మల్ని భరతుడు పంపాడు, ఆయన పెద్ద సేనతో వస్తున్నాడు!' అని చెప్పాలి. రాముడు ఆ ఆశలో ఉండగా మనం ఇక్కడి నుంచి వెళ్ళి, వానరసేన అంతా నిర్మూలిస్తాం. రామలక్ష్మణులు అది చూసి గుండె పగిలి చస్తారు," అన్నాడు.

ఇదే విధంగా కుంభకర్ణుడి కొడుకు నికుంభుడు తా నొక్కడే వెళ్ళి వానర సేననూ, రామలక్ష్మణులనూ చంపి వస్తా నన్నాడు. వజ్రహను డనే వాడు వానరుల నందరినీ తిని వస్తా నన్నాడు. ఇంకా అనేక మంది రాక్షస వీరులు శత్రు నాశనానికి సన్నద్ధులై లేచి నిలబడ్డారు.








ఈవిధంగా రావణుడి సభలో అనేకమంది రాక్షస ప్రముఖులు, "ఇప్పుడే వెళ్ళి రామ లక్ష్మణులనూ, వానర సేననూ నాశనం చేస్తాం," అంటూ లేవటం చూసి, విభీష ణుడు వారిని వారించి, కూర్చోమని, చేతులు మోడ్చి రావణుడితో ఇలా అన్నాడు:

"సామ దాన భేదోపాయాల వల్ల సాధ్యం కాని దాన్నే దండోపాయం ద్వారా సాధించా లని బుద్ధిమంతు లంటారు. ప్రమత్తులూ, దురాశాపరులూ, దైవోపహతులూ అయిన వారి పట్ల శాస్త్రీయంగా ప్రయోగిస్తే దండో పాయం ఫలిస్తుంది, లేకపోతే ఫలించదు. రాముడు అప్రమత్తుడు, బలవంతుడు. హనుమంతుడు సముద్రం దాటి, లంకకు వచ్చి చేసిన అద్భుత కార్యాలు చూస్తే దైవం రాముడికి అనుకూలంగా ఉన్నట్టు కూడా కనబడుతుంది. శత్రుబలాన్ని తక్కువ చేసి చూడవద్దు. రాముడు రాక్షసు లకు చేసిన అపకారానికి ప్రతీకారంగా రావణేశ్వరుడు సీతను ఎత్తుకు వచ్చాడందా మనుకున్నా, రాముడు తానై ఖరుడు మొదలైన రాక్షసులను చంపలేదు. వాళ్ళే పనిపెట్టుకుని అతని పైకి వెళ్ళారు. రాముడు ఆత్మరక్షణ కొరకు వారిని చంపవలిసి వచ్చింది. సీతను తీసుకు రావటం మనకే చేటు. ఆమెను తిరిగి రాముడి కివ్వటం మంచిది. నీ మేలు కోరి ఈ మాట చెబు తున్నాను. రాముడి బాణాలు లంకను సర్వనాశనం చెయ్యక ముందే సీతను రాముడి కిచ్చెయ్యి."







విభీషణు డీ మాట లనగానే రావణుడు సభ చాలించి తన ఇంటికి వెళ్ళిపోయాడు. విభీషణు మర్నాడు ఉదయం రావణుడి భవనానికి వెళ్లి, మంత్రులు తప్ప మరెవరూ లేని సమయంలో తన అన్నతో, "సీత వచ్చినది మొదలు అనేక దుశ్శకునాలు కనిపిస్తున్నాయి. ఈ సంగతి లంకలోని ప్రతి పురుషుడికీ, స్త్రీ కీ కూడా తెలుసును. మంత్రులు మాత్రం నీతో ఈ సంగతి చెప్పరు. అన్ని విషయాలూ చక్కగా ఆలోచించి న్యాయప్రకారం చెయ్యి," అన్నాడు.

రావణు డీ మాట విని కోపంచెంది, "నా కెవరి భయమూ లేదు. రాముడు సీతను పొందలేడు, దేవేంద్రుడు సహాయం వచ్చినా యుద్ధంలో నా ఎదట నిలవలేడు," అని చెప్పి విభీషణుణ్ణి పంపేశాడు.

తరువాత రావణుడు యుద్ధం గురించి తన మంత్రులతో ఆలోచించగోరి, తన రథా న్నెక్కి, సపరివారంగా సభా భవనానికి వెళ్ళి, రాక్షసుల నందరినీ పిలుచుకు రమ్మని దూతలను పంపాడు. దూతలు రాక్షసు లందరి ఇళ్ళకూ వెళ్ళి వేరువేరు పనులలో నిమగ్నులై ఉన్న రాక్షసులను పిలిచారు. వారందరూ వచ్చిన మీదట, రావణుడు విభీషణుణ్ణీ, శుకుణ్ణీ, ప్రహస్తుణ్ణీ ప్రత్యేక స్థానాలలో కూర్చోమని చెప్పి, ప్రహస్తుడితో, "మన రాక్షస సైనికులు లంకానగరాన్ని ఎప్పటి కన్న జాగ్రత్తగా రక్షించాలని చెప్పు," అన్నాడు.

ప్రహస్తుడు బయటికి వెళ్ళి తిరిగి వచ్చి, "సమస్త సైన్యమూ సంసిద్ధంగా ఉన్నది," అని చెప్పాడు.

"మీ సలహాతో ప్రారంభించిన ప్రతి పనీ సఫలమయింది. ఇప్పుడు కూడా మీ సహాయంతో నాకు జయం లభించి తీరుతుంది. ఇప్పుడున్న సమస్య ఏమిటో మీకు ముందే చెప్పాను. ఆరు మాసాలుగా నిద్రపోతూ ఉండటం చేత ఒక్క కుంభకర్ణుడికే చెప్ప





లేదు. అత నిప్పు డిక్కడ ఉన్నాడు. జన కుడి కుమార్తె, రాముడి భార్యా అయిన సీతను రాక్షసులుండే దండకారణ్యం నుంచి తెచ్చాను. ఎంత ప్రార్థించినా ఆమె నన్ను ప్రేమించటం లేదు. అలాటి సుందరి మూడు లోకాలలోనూ లేదు. ఆమె మూలాన నేను మోహావేశంతో దహించుకు పోతు న్నాను. రాముడు వచ్చి తనను రక్షిస్తాడేమో నన్న నమ్మకంతో సీత నన్ను ఒక సంవత్సరం గడు వడిగింది. నేను సరే నన్నాను. రాముడు వానర సేనతో సముద్రం దాటి రావటం అసాధ్యం. కాని దాటి రాగలిగితే మన మేం చెయ్యాలి? ఎందుకంటే ఒక్క వానరుడు సముద్రం దాటి వచ్చి పెద్ద యుద్ధం చేసి పోయాడు. అందుచేత బాగా ఆలోచించండి. రాముడు వానర సేనతో సముద్రం అవతలి ఒడ్డున చేరి ఉన్నాడు. సీతను ఇచ్చేమాట అబద్ధం. రామలక్ష్మణు లను చంపే ఉపాయం చూడండి," అని రావణు డన్నాడు.

రావణు డన్న మాటలు విని కుంభ కర్ణుడు మండిపడుతూ, "మాతో ఈ ఆలో చన సీతను తీసుకు రాకపూర్వం చేసి ఉండ వలిసింది. ఏ పని చేసేటప్పుడైనా ముందు గానే చక్కగా ఆలోచిస్తే తరువాత పశ్చాత్తాప



పడ నవసరముండదు. కొంచెంకూడా ఆలో చించకుండా సీతను అపహరించి తెచ్చావు. రాముడు నిన్నిదివరకే చంపక పోవటం అదృష్టం. ఈ స్థితిలో నీ శత్రువుల నంద రినీ చంపి నీ కార్యం నెరవేర్చే శక్తి గల వాణ్ణి నే నొక్కణ్ణే ఉన్నాను. నేనా పని చేస్తాను. అందుచేత నీవు నిశ్చింతగా ఉండు," అన్నాడు.

కుంభకర్ణుడి మాటలు రావణుడికి కోపం కలిగించాయి. ఆ సంగతి గ్రహించి మహా పార్శ్వుడనే రాక్షసుడు, "తేనె కోసం భయం కర మృగాలున్న వనంలో ప్రవేశించి తేనె సంపాదించుకున్న వాడు దాన్ని తాగకపోతే







వాడు వట్టి మూఢుడు. రావణా, అందరికీ నీవే ఈశ్వరుడవు, నిన్నడ్డగల వారెవరు? సీతను యథేచ్ఛగా అనుభవించు, ఆమె ఒప్పుకపోతే బలాత్కారంగానైనా అనుభవించు. నీ కోరిక తీరినాక ఏం వచ్చినా రానీ, నీవు అన్నిటినీ ఎదుర్కో గలవు. దేవేంద్రుణ్ణి సయితం జయించగల వారు కుంభకర్ణుడూ, ఇంద్రజిత్తూ ఉండనే ఉన్నారు. సామదాన భేదాలన్నవి చేతగాని వారికి. నీవు దండోపాయంతోనే కార్యసిద్ధి పొందు," అన్నాడు.

ఈ మాట రావణుడికి నచ్చింది. అతను మహాపార్శ్వుడితో, "నన్ను గురించి ఒక రహస్యమున్నది. ఒకప్పుడు పుంజికస్థల అనేది బ్రహ్మదేవుడి ఇంటికి పోతూ ఉంటే చూసి దానిని బలాత్కారంగా చెరిచాను. ఆ సంగతి బ్రహ్మకు తెలిసిందట. ఆయన, అది మొదలు నేను ఏ పర స్త్రీని గాని బలాత్కారంగా అనుభవిస్తే నా తల నూరు ముక్కలవుతుందని శపించాడు. ఆ శాపానికి భయపడే నేను సీతను బలాత్కారంగా అనుభవించ లేదు. నాకు గల వేగమూ, గమనశక్తీ తెలియక రాముడు నా పైకి వస్తున్నాడు. గుహలో నిద్రపోయే సింహాన్ని లేపినట్టుగా మృత్యువులాటి నన్ను కవ్విస్తున్నాడు. నా బాణాల దెబ్బ ఎరగడు. ఇక తెలియజేస్తాను," అన్నాడు.

ఈ ధోరణిని విభీషణుడు సహించలేక తనకు తోచిన మాటలు నాలుగూ దులిపేశాడు. సీతను తీసుకురావటం అయిదు తలల విష సర్పాన్ని తెచ్చుకోవటమేనన్నాడు; రాముణ్ణి ఇంద్రజిత్తయేది, రావణుడయేది, ఎవరయేది జయించటం కల్ల అన్నాడు; రావణుడు తప్పు తోవను పోతుంటే మిగిలినవారు అతన్ని సరి అయిన మార్గానికి తిప్పటానికి బదులు ఇచ్చకాలాడుతున్నారన్నాడు: సీతను రాముడి వద్దకు పంపెయ్యటం అందరికీ క్షేమమని తేల్చాడు.





విభీషణుడు చెప్పిన ఈ మాటలకు ఇంద్రజిత్తు. "బాబాయీ, పులస్త్య వంశంలో పుట్టినవాడు అనరాని మాట లన్నావు. బల శౌర్య పరాక్రమాలు లేని పిరికి పందవు! ఎందుకు అందరినీ భయ పెట్టుతున్నావు? రామ లక్ష్మణులను చంప టానికి ఒక్క రాక్షసుడు చాలు. నేను ఇంద్రుణ్ణి ఓడించాను. నన్ను చూసి దేవ తలు గొర్రెల మందలాగా పారిపోయారు. ఐరావతాన్ని కూల్చి, దాని దంతాలు పెరి కాను. అల్పులైన ఈ రాజకుమారులను జయించలేనా?" అన్నాడు.

"నాయనా, కుర్రవాడివి. నీ బుద్ధి పరి పక్వం కాలేదు. నీ తండ్రి పక్షంగా మాట్లా డుతూ అతనికే శత్రుడివవుతున్నావు. ఈ సభలో నిన్ను మాట్లాడనివ్వటమే తప్పు. సీతను కానుకలతో సహా రాముడికి అర్పించి నట్టయితే మనమంతా సుఖంగా ఉండ వచ్చు," అని విభీషణు డన్నాడు.

ఈ మాట అన్నందుకు రావణుడు విభీషణుడి పై విరుచుకుపడ్డాడు. "జ్ఞాతివి, శత్రు పక్షపాతివి. జ్ఞాతి కన్న పగవాడు లేడు. తమ్ముడి వని క్షమించాను. మరొక డైతే చీల్చేసి ఉందును. ఛీ, వంశం చెడ బుట్టిన వాడా!" అన్నాడు.



రావణు డిలా చీదరించుకోగానే విభీష ణుడు మరి నలుగురు రాక్షస అనుచరులతో సహా ఆకాశంలోకి లేచి, "అన్న వని నీ మేలు కోరి చెప్పాను. నా మీద లేని తప్పు మోపి, నిందించావు. అది సహించరానిది. ఇష్టమైన మాటలు చెప్పేవారు కొల్లలు, కటువుగా ఉన్నప్పటికీ మేలు చేసే మాటలు చెప్పే వారు దొరకరు. నీవు రాముడి చేతిలో చావగా చూడలేను. నీ మంచి కోరి చెప్పిన మాటలను క్షమించు. నీవూ, లంకా, ఈ రాక్షసులూ క్షేమంగా ఉండేటట్టు చూచుకో. నేను పోతున్నాను. నీవు సుఖంగా ఉండు," అని చెప్పి, అక్కడి నుంచి బయలుదేరి







రామ లక్ష్మణులూ, వానరసేనా వున్న చోటికి క్షణంలో చేరుకున్నాడు.

ఆయుధాలు ధరించి ఆకాశమార్గాన అతి వేగంగా వస్తున్న విభీషణుణ్ణీ, అతని వెంట ఉన్న నలుగురు రాక్షసులనూ వానరులంతా చూశారు. సుగ్రీవుడు ఆ రాక్షసులను చూసి, క్షణం ఆలోచించి, హనుమంతుడు మొదలైన వారితో, "ఈ రాక్షసులు తప్పకుండా మనని చంపటానికే యిటు వస్తున్నారు, చూడండి!" అన్నాడు.

వెంటనే వానర ప్రముఖులు చెట్లనూ, శిలలనూ తీసుకుని, "ఈ దుర్మార్గులను చావగొట్టి కింద పడేస్తాం. వీళ్ళెంత?" అన్నారు. ఈలోపల విభీషణుడు తన అనుచరులతో సహా సముద్రపు ఉత్తర తీరాన్ని చేరి, ఆకాశంలోనే నిలబడి, సుగ్రీవుణ్ణీ, వానరులనూ చూసి ఇలా అన్నాడు:

"దుర్మార్గుడైన రాక్షస రాజు రావణుడనే వాడికి నేను తమ్ముణ్ణి. నన్ను విభీషణుడంటారు. అతను జటాయువును చంపి, దుఃఖితురాలూ, వివశురాలూ అయి ఉన్న సీతను జనస్థానం నుంచి ఎత్తుకు వచ్చి రాక్షస స్త్రీల రక్షణలో ఉంచాడు. సీతను రాముడికి తిరిగి ఇచ్చివెయ్యమని నయాన ఎన్నోసార్లు చెప్పాను. కాలం మూడిన రావణుడికి నా మాట రుచించింది కాదు. అందుచేత అతను నన్ను భృత్యుడిలాగా చూసి పరుష వాక్యాలన్నాడు. నేను భార్యా పుత్రులను సైతం విడిచిపెట్టి రాముడి శరణు వచ్చాను. నేనిలా వచ్చానని రాముడికి వెంటనే నివేదించండి."

ఈ మాటలు వింటూనే సుగ్రీవుడు లక్ష్మణుడి వెంట రాముడున్న చోటికి వెళ్ళి, "రావణుడి తమ్ముడు విభీషణుడట, నలుగురు రాక్షసులను వెంట బెట్టుకుని నిన్ను శరణు వేడ వచ్చాడు. కొంచెం జాగ్రత్తగా ఉండాలి. ఈ రాక్షసులను నమ్మరాదు; వారు కామరూపులు, శూరులు, అదృశ్యంగా





ఉండగలవారు, మాయావులు. ఇతను రావణుడి వేగులవాడుగా వచ్చి, మన విశ్వాసం సంపాదించి, మన మధ్య భేదాలు కలిగించవచ్చు; సందేహం లేదు. లేదా ఎప్పుడో ఒకప్పుడు ఇతనే మన మీద దెబ్బ తియవచ్చు. మన శత్రువుకు తమ్ముడైన ఇతని నెలా నమ్మటం? రావణుడే ఇతన్ని పంపి ఉండవచ్చు. ఇతన్నీ, ఇతని అను చరులనూ వెంటనే చంపటం మంచిది," అని హెచ్చరించాడు.

రాముడు సుగ్రీవుడి సలహా విన్నమీదట హనుమంతుడు మొదలైన వానరప్రముఖుల కేసి చూసి, "సుగ్రీవుడు ఆలోచించి చెప్పిన మాట విన్నారుగదా. అలాగే మీరందరూ కూడా మీకు మీకు తోచిన సలహా లివ్వ వచ్చు," అన్నాడు.

విభీషణుడు ఎలాటి వాడయినదీ స్పష్టంగా తేల్చుకున్న మీదట అతనిని నమ్మటమో, మానటమో తేల్చుకుందామని అంగదు డన్నాడు. అతన్ని పరీక్షించటానికి సూక్ష్మ బుద్ధి గల చారుణ్ణి పంపుదామని శరభు డన్నాడు. విభీషణుడు ఇక్కడికి రావటమే అనుమానాస్పదంగా ఉన్నదని జాంబవంతు డన్నాడు.

హనుమంతుడు అందరి సలహాలనూ కొట్టి పారేశాడు. "విభీషణుడి మంచి చెడ్డలు విచారించటం ఎలా? సమీపంలో ఉన్న వాడి వద్దకు చారుణ్ణి ఎలా పంపటం? విభీషణుడు ఈ సమయంలో ఇక్కడికి రావటానికి తగిన కారణం ఉన్నది. రావణుడు దుర్మార్గుడని అతనికి తెలుసును. అలాగే రాముడు వాలిని చంపి సుగ్రీవుడికి రాజ్యాభిషేకం చేసిన సంగతికూడా అతనికి తెలుసును. అతను రాజ్యం కోరి బుద్ధి పూర్వకంగానే తన అన్నను వదిలి యిక్కడికి వచ్చాడు. ఇలా నాకు తోస్తున్నది. తరువాత నీ యిష్టం," అన్నాడు హనుమంతుడు రాముడితో.






విభీషణుడు రాజ్యకాంక్షతో వచ్చాడని హనుమంతుడన్న మీదట రాముడు తన అభిప్రాయాన్ని కూడా బయటపెట్టుతూ, "ఈ విభీషణు డెంత దుర్మార్గుడు కానీ యుండి, శరణని వచ్చిన తరవాత నేను అతన్ని విడవలేను. అది సజ్జనుల పద్ధతి కాదు," అన్నాడు.

దానికి సుగ్రీవుడు ఒప్పుకోక, "ఇతను మంచి వాడే అయితే మాత్రం ఇతని వల్ల మన కేమిటి లాభం? ఇతన్ని మన మెంత మాత్రమూ చేర నివ్వగూడదు. అన్నను వదిలి వచ్చిన కృతఘ్నుడు మనను నమ్ముకుని ఉంటాడని ఏమిటి?" అన్నాడు.

"రాజులలో ఒక ధర్మం ఉన్నది. జ్ఞాతులు కూడా ఇరుగుపొరుగు రాజుల వంటి వారే; కష్టకాలంలో దెబ్బ తీస్తారు. అందుచేత యోగ్యులైన రాజులు కూడా బలవంతులైన జ్ఞాతులను నమ్మరు. ఇతన్ని రావణుడు నమ్మలేక పోయాడు. అందుచేత విభీషణుడు మన వద్దకు వచ్చాడు. మనం రాక్షసులం కాము; మనకు రాక్షస రాజ్యం పైన కాంక్ష లేదు. అందుచేత మన ద్వారా ఇతను రాజ్యం పొంద గోరుతున్నాడు. ఇతను మనని విడవడు," అన్నాడు రాముడు.

అయినా సుగ్రీవుడు తన మనసు మార్చుకోలేక, "రావణుడే ఇతన్ని ఇక్కడికి రహస్యంగా పంపాడు, సందేహం లేదు. నిన్నో, నన్నో, లక్ష్మణుణ్ణో కడ తేర్చటానికే ఇతను వచ్చాడు. అందరమూ కూడా చావ







వచ్చు. దుర్మార్గుడైన రావణుడి తమ్ముణ్ణి ఎలా నమ్మటం?" అన్నాడు.

"సుగ్రీవుడా, ఇతను దుర్మార్గుడైతే మాత్రం నన్నేం చేయగలడు. ఇతను మారు వేషంలో వచ్చిన రావణుడే అయినా శరణన్న తరవాత విడిచి పుచ్చను. శరణార్థిని రక్షించటానికి ప్రాణాలైనా ఇవ్వాలి. అందు చేత నీవు వెంటనే అతన్ని తీసుకు రా!" అని రాముడు సుగ్రీవుడితో అన్నాడు.

ఈ మాటలతో సుగ్రీవుడి మనసు మారింది. అతను వెళ్ళి విభీషణుణ్ణి రాముడి వద్దకు తీసుకు వచ్చాడు. విభీషణుడు తన నలుగురు అనుచరులతో బాటు రాముడి కాళ్ళపై పడి, "నేను రావణుడి తమ్ముణ్ణి. అతని వల్ల అవమానం పొంది నిన్ను శరణు జొచ్చాను. నా స్నేహితులనూ, నా సర్వస్వాన్నీ లంకలో వదలి యిక్కడికి వచ్చాను. ఇక నా జీవితమూ, నా సౌఖ్యమూ, నా రాజ్యమూ నీ చేతిలో ఉన్నాయి," అన్నాడు.

రాముడు విభీషణుణ్ణి ఆశ్వాసించి, "రాక్షసుల బలాబలాలను యథార్థంగా వివరించి చెప్పు," అన్నాడు.

దానికి విభీషణు డిలా చెప్పాడు :

"గంధర్వ ఉరగ రాక్షసుల చేతనూ, ఏ భూతం చేతనూ చావు లేకుండా రావణుడు బ్రహ్మ నుంచి వరం పొందాడు. రావణుడికి తమ్ముడూ, నాకు అన్నా అయిన కుంభకర్ణుడు మహా బలశాలి, యుద్ధంలో ఇంద్రుడికి సమానుడు. రావణుడి సేనాపతి అయిన ప్రహస్తుడు కుబేర సేనాపతి అయిన మాణిభద్రుణ్ణి జయించిన వాడు. హనుమంతు డతన్ని గురించి చెప్పే ఉంటాడు. రావణుడి కొడుకు ఇంద్రజిత్తు వర ప్రసాదుడు; అతను అభేద్యమైన కవచం ధరించి, యుద్ధం చేస్తూనే అదృశ్యుడైపోయి శత్రువులను చంప గల వాడు. మహోదరుడూ, మహాపార్శ్వుడూ, అకంప





నుడూ అనే రావణ సేనాపతులు దిక్పాల కులతో సమంగా యుద్ధం చెయ్య గల వారు. రక్తమాంసాహారులూ, కామరూపులూ అయిన రాక్షసులు లంకలో పదివేల కోట్ల మంది ఉన్నారు. వారి సహాయంతోనే రావణుడు దిక్పాలకులను జయించాడు."

విభీషణుడు చెప్పిన ఈ మాటలు విని రాముడు, "విభీషణా, ఈ పనులన్నీ చేసిన రావణుణ్ణీ, ప్రహస్తుణ్ణీ, రావణుడి బలగాన్నీ చంపి, లంకా రాజ్యం నీకు చేకూర్చుతాను, నా మాట నమ్ము. అతను రసాతలానికి పోనీ, పాతాళానికి పోనీ, బ్రహ్మలోకానికే పోనీ, నేను ప్రాణాలతో వదలను. అతణ్ణి సపరివారంగా వధించకుండా అయోధ్యకు తిరిగిపోను, నా ముగ్గురు తమ్ముల మీద ఒట్టు!" అన్నాడు.

"ఆ యుద్ధంలో నేను కూడా పాల్గొని శక్తికొద్దీ రాక్షసులను చంపుతాను, మీకు సహాయం చేస్తాను," అన్నాడు విభీషణుడు.

రాముడు సంతృప్తుడై లక్ష్మణుడితో సముద్రజలం తెచ్చి, విభీషణుణ్ణి లంకకు రాజుగా అభిషేకించమన్నాడు. లక్ష్మణుడు వానరుల మధ్య విభీషణుణ్ణి లంకా రాజ్యాభిషిక్తుణ్ణి చేశాడు. వానరులు సింహనాదాలు చేసి రాముడికి జయధ్వానాలు పలికారు.



తరవాత సుగ్రీవ హనుమంతులు విభీషణుడితో ఏకాంతంగా చేరి, "ఇంత మందిమీ ఈ మహాసముద్రాన్ని దాటి లంక చేరటమెలాగో మాకు తెలియలేదు. ఆ ఉపాయం నీవే చెప్పాలి," అన్నారు.

"రాముడు సముద్రుడి శరణు పొందాలి. సముద్రుడు రాముడి పూర్వీకుడైన సగరుడికి ఋణపడి ఉన్నాడు; అందుచేత రామకార్యం తీరుస్తాడు," అన్నాడు విభీషణుడు.

సుగ్రీవుడు రామలక్ష్మణులున్న చోటికి వెళ్ళి, విభీషణుడన్న మాట చెప్పి, సముద్రుణ్ణి ఆరాధించాలని రాముడితో







అన్నాడు. రాము డందుకు ఒప్పుకుని, సముద్రతీరాన దర్భలు పరిచి, వాటి పైన పడుకున్నాడు.

ఈలోపుగా శార్దూలు డనే రాక్షసుడు, రావణుడి వేగులవాడు, వానరసేన ఉన్న చోటికి వచ్చి, అక్కడి పరిస్థితులన్నీ చూసి, రావణుడి వద్దకు తిరిగివెళ్ళి, "వానర భల్లూకసేన అపరసముద్రంలాగా లంక పైకి వస్తున్నది. ఉత్తమాయుధాలు ధరించి సీత కోసం వస్తున్న రామలక్ష్మణులు సేనతో సహా సముద్రతీరాన విడిసి ఉన్నారు. ఆ సేన యొక్క విస్తీర్ణం ఎటు చూసినా పది యోజనాలున్నది. నేనీ విషయాలు స్థూలంగా చూసి వచ్చాను. వివరంగా చూసి రావటానికి మరెవరినైనా పంపటం మంచిది," అన్నాడు.

అప్పుడు రావణుడు శుకు డనే రాక్షసుడితో, "నీవు సుగ్రీవుడి వద్దకు వెళ్ళి, మంచిగా ఈ మాటలు చెప్పు," అని, ఏమి చెప్పాలో చెప్పి పంపాడు.

శుకుడు పక్షి రూపం ధరించి లంక నుంచి బయలుదేరి సముద్రం దాటి, వానర సేన దగ్గిరకు ఎగురుతూ వెళ్ళి, సుగ్రీవుడు మొదలైన వారి మీదుగా గాలిలోనే ఉండి ఇలా చెప్పాడు:

"వానర రాజైన సుగ్రీవుడా! రావణుడిలా అన్నాడు: ఉన్నత వంశంలో పుట్టిన వాడవు. మహాబలుడవు. జన్మతః నాకు బంధువులాటి వాడివి. అకారణంగా నాతో విరోధ మెందుకు? ఇందువల్ల నీకు ఒరిగేదీ, తరిగేదీ లేదు. వాలి నా స్నేహితుడు. నీవు నా తమ్ముడిలాటి వాడివి. నేను రాముడి భార్యను తెస్తే నీ కేమిటి? బుద్ధిమంతుడవు, బాగా ఆలోచించుకుని కిష్కింధకు తిరిగి వెళ్ళు. ఈ విషయంలో నీ ప్రమేయ మేమీ లేదు. లంకను దేవతలే ప్రవేశించ లేరు గదా, నరుల మాటా, వానరుల మాటా చెప్పే దేమిటి?"





ఈ మాటలు వింటూనే వానరులు ఆకాశాని కెగిరి శుకుణ్ణి పట్టుకుని ఆకాశం మీది నుంచి నేల మీదికి పడదోశారు. శుకుడు ఎలుగెత్తి, "ఓ రామా, నన్ని వానరులు చంపేస్తున్నారు. దూతను చంపరాదు. నా ప్రభువు అనమన్న మాటలే అన్నాను గాని నేను సొంతాన ఏమీ అనలేదు," అని అరిచాడు.

రాముడు జాలిపడి, "వాణ్ణి చంపకండి," అన్నాడు వానరులతో.

శుకుడు దెబ్బతిన్న రెక్కలతో ఆకాశం లోకి లేచి, "సుగ్రీవుడా, రావణుడితో ఏం చెప్పమంటావు?" అని అడిగాడు.

"రావణుడితో ఇలా అన్నానని చెప్పు: రాక్షసరాజా, నీవు నాకు స్నేహితుడవు కావు, మేలుచేసిన వాడవు కావు, నా మిత్రుడైన రాముడికి శత్రువువు, నా శత్రువైన వాలికి మిత్రుడవు. అందుచేత తప్పక చంపదగిన వాడవు. నేను నిన్ను సకుటుంబంగా చంపి లంకను భస్మీపటలం చేస్తాను. నిన్ను రాముడి బారి నుంచి దేవతలు కూడా రక్షించ లేరు. ముసలి జటాయువును చంపి నట్టు కాదు; రామలక్ష్మణులు లేనప్పుడు దొంగతనంగా సీతను ఎత్తుకు వచ్చినట్టూ కాదు; రాముడి ప్రతాపం నీకు తెలియదు," అని సుగ్రీవుడు శుకుడితో అన్నాడు.





అంతలో అంగదుడు సుగ్రీవుడితో, "వీడు దూతలాగా లేడు, వేగుల వాడని తోస్తున్నది. మనతో మాట్లాడుతూనే శిబిర మంతా చూశాడు, వీణ్ణి పట్టుకోండి. లంకకు పోనివ్వకండి," అన్నాడు.

సుగ్రీవుడి ఆజ్ఞానుసారం వానరులు శుకుణ్ణి మళ్ళీ పట్టుకున్నారు. శుకుడు మళ్ళీ ఆక్రోశిస్తూ, "ఓ రామా, దూతనైన నన్ను ఈ వానరులు రెక్కలు విరుస్తున్నారు, కళ్ళు పీకేస్తున్నారు," అని పెద్దగా మొరపెట్టుకున్నాడు.

రాముడు కోతులతో చెప్పి శుకుణ్ణి కాపాడాడు. తరవాత అతను సముద్రుడికి నమస్కరించి చెయ్యి తల కింద పెట్టుకుని, సముద్రుడికి ఎదురుగా పడుకున్నాడు.

రాము డలా మూడు రాత్రులు గడిపాడు, అంతకాలమూ సముద్రుణ్ణి ధ్యానించాడు. కాని సముద్రుడు సాక్షాత్కరించ లేదు. అతనికి కోపం వచ్చింది. లోకంలో మంచి వాళ్ళు అసమర్థులుగా గణించబడతారు. సముద్రుడు తనను అలాగే భావించి ఉంటాడు. అందుచేత రాముడు సముద్రుడికి తన ప్రతాపం చూప నిశ్చయించి, లక్ష్మణుడితో, "లక్ష్మణా, నా ధనుర్బాణా లిలా ఇయ్యి. సముద్రాన్ని ఎండించి, వానరులు కాలి నడకన లంకకు చేరేలాగు చేస్తాను. సముద్రంలోని జలమంతా భూమి పైకి పారేటట్టు చేస్తాను," అన్నాడు.

అతను బాణాలు ఎక్కుపెట్టి వదిలాడు. అవి ధగధగా వెలిగిపోతూ వెళ్ళి సముద్రం ప్రవేశించి, సముద్రాన్ని అల్లకల్లోలం చేశాయి. సముద్రంలో బ్రహ్మాండమైన తరంగాలు పుట్టాయి, నీటి అడుగున ఉండే శంఖాలూ, ముత్యపు చిప్పలూ, భయంకరమైన సముద్ర ప్రాణులూ పైకి తేలాయి.

లక్ష్మణుడు రాముడి చెయ్యి పట్టుకుని, "ఇంక చాలు! ఊరుకో!" అన్నాడు. రాముడు వినిపించుకోలేదు.







"సముద్రుడా! నిన్ను పాతాళం దాకా ఇగిర్చేస్తాను! నీలో ఉన్న ప్రాణులన్నిటినీ దహించేసి, నిన్ను ఇసుకపర్రగా చేసి వదిలేస్తాను! నా బలపరాక్రమాలు నీకు తెలియవు! నేను నిన్నేం చెయ్యగలనో తెలుసుకో లేకుండా ఉన్నావు!" అన్నాడు రాముడు, తనకు ప్రత్యక్షం కాని సముద్రుడితో.

అత నొక భయంకరమైన బాణాన్ని తీసి బ్రహ్మాస్త్రం పఠించి, చెవి దాకా లాగాడు. అతను దాన్ని వదిలిపెట్టక మునుపే భూమ్యాకాశాలు బద్దలయినంత పని అయింది; కొండలు అదిరాయి; లోకాలన్నిటినీ చీకటి ఆవరించింది; నదులూ, సరస్సులూ కలకపారాయి. సూర్యచంద్రుల, నక్షత్రాల గతులు తప్పాయి. చీకటి కమ్మింది. పిడుగులు పడ్డాయి. ఆకాశాన ప్రచండమారుతాలు వీచాయి. వాటి వేగానికి మహావృక్షాలు విరుచుకు పడిపోయాయి. ఈ ఉత్పాతాల మధ్య సముద్రపు నీరు ఒక ఆమడ వెనక్కు పోయింది. సముద్రుడు వెనక్కు తగ్గటం చూసి రాముడు బాణం వదలలేదు.

అంతలోనే సముద్ర మధ్యంలోని బ్రహ్మాండమైన అలల మధ్య నుంచి సముద్రుడు, సమస్త నదులూ వెంట రాగా, వెలువడి వచ్చాడు. ఆయన దేహం వైడూర్య వర్ణంగా ఉన్నది; ఎర్రని మాలలూ, బట్టలూ ధరించాడు, రంగురంగుల పుష్పమాలికలు తలలో ధరించాడు; అనేకమైన బంగారు నగలు ధరించాడు; అతని మెడలోని ముత్యాల హారాల మధ్య కౌస్తుభమణి యొక్క తోబుట్టువు ప్రకాశిస్తున్నది.



సముద్రుడు రాముణ్ణి సమీపించి, ముందుగా తానే రాముడి పేరు చెప్పి నమస్కరించి, "రామా, లోతు అన్నది నాకు స్వభావసిద్ధమైనది. ఆ గుణాన్ని నేను విసర్జించలేను. కాకపోతే, వానరులు వారధి





కట్టేటప్పుడు వారికి సముద్ర ప్రాణుల భయం లేకుండా చెయ్యగలను, వారికి సహాయపడగలను," అన్నాడు.

"అలా అయితే, ఎక్కుపెట్టిన ఈ అమోఘాస్త్రాన్ని ఏమి చెయ్యను?" అని రాముడడిగాడు.

"ఇలా ఉత్తరంగా ద్రుమకుల్య మనే అందమైన ప్రదేశం ఉన్నది. అక్కడ భయంకరులైన దొంగలు కొందరుండి, నా జలాన్ని తాగి, సమస్త పాపకార్యాలూ చేస్తున్నారు. ఎంతో కాలంగా వారి స్పర్శ సహించ లేకుండా ఉన్నాను. నీ బాణాన్ని వారిపై ప్రయోగించు," అని సముద్రుడు, రాముణ్ణి కోరాడు.

ఆ ప్రకారమే రాముడు తన బాణాన్ని ద్రుమకుల్యం పైన ప్రయోగించాడు. ఆ బాణం పిడుగులాగా వెలుగుతూ వెళ్ళి పడినచోటుకు మరుకాంతార మని పేరు వచ్చింది. బాణం పెద్ద మోతతో భూమిని చీల్చుకుని వెళ్ళిన చోట పాతాళం నుంచి జల పుట్టుకొచ్చింది. వ్రణకూపమని పేరు పొందిన ఆ జల ఎన్నడూ ఆగక ప్రవహిస్తూనే ఉంటుంది. ద్రుమకుల్యంలో ఉండిన దొంగలందరూ నశించారు.

అప్పుడు సముద్రుడు రాముడితో, "నీ సేనలో గల నళు డనే వానరోత్తముడు విశ్వకర్మ కొడుకు. శిల్ప విద్యలలో తండ్రికి తీసిపోడు. ఇతని చేత సేతువు నిర్మింపజెయ్యి. అది మునగ కుండా నేను చూస్తాను," అన్నాడు.

ఈ మాట చెప్పి సముద్రుడు అంతర్ధానం కాగానే నళుడు, "సముద్రు డన్న మాట నిజమే. నేను సేతువు నిర్మించగలను. నా శక్తి మరొకరు చెబితే బాగుంటుందని నాకై నేనే చెప్ప దలచలేదు. కావలిస్తే వానరులందరూ కలిసి ఇప్పుడే సేతు నిర్మాణం ప్రారంభించవచ్చు," అన్నాడు రాముడితో.








సేతువు నిర్మించమని రాముడు ఆనతి ఇవ్వగానే లక్షల సంఖ్యలో వానరులు అరణ్యాలకు పోయి, సాలవృక్షాలనూ, అశోక వృక్షాలనూ, బిల్వ వృక్షాలనూ, మామిడి చెట్లనూ, ఇంకా అనేక రకాల చెట్లనూ పీకి తెచ్చి సముద్రం పైన వేశారు. తాటి, కొబ్బరి, తుమ్మ, పొగడ మొదలైన చెట్లను కూడా తెచ్చి సముద్రం మీద విసిరి వేశారు. ఏనుగు లంతేసి కొండరాళ్ళను యంత్రసహాయంతో చేర్చారు. అంతేసి రాళ్ళు వచ్చి పడుతుంటే సముద్రపు నీరు ఆకాశ మెత్తు లేచి పడింది. సేతువు సమంగా ఉండేటట్టు చూడటానికి కొందరు తాళ్ళు పట్టుకున్నారు, కొందరు కర్ర బద్దలు పట్టుకున్నారు, కొందరు హెచ్చు తగ్గులు పరీక్షించారు. ఈ విధంగా వానరులు పది ఆమడలు వెడల్పు, నూరు ఆమడలు నిడివీ గల సేతువును నిర్మించారు.

సేతువును నిర్మించటంలో నళుడికి తోడ్పడిన వానరులు పెద్ద పెద్ద కొండల్లాటి రాళ్ళను ఎత్తుకుని పరిగెత్తుకు వస్తుంటే చూడటానికి అశ్చర్యకర మనిపించింది. వారు మొదటి రోజు పథ్నాలుగామడలూ, రెండవ రోజు ఇరవై ఆమడలూ, మూడో రోజు ఇరవై ఒక్క ఆమడలూ, నాలుగో రోజు ఇరవై రెండామడలూ, అయిదో రోజు ఇరవై మూడామడలూ సేతువు నిర్మించి, అయిదు రోజులలోగా సువేలపర్వతాన్ని చేరుకున్నారు.

వానరులు సంతోషంతో గెంతుతూ, అరుస్తూ, కోట్ల సంఖ్యలో సముద్రాన్ని







సేతువు మీదుగా దాటి సముద్రపు దక్షిణ తీరాన్ని చేరుకున్నారు.

విభీషణు డొక గద తీసుకుని, శత్రువు లెవరైనా వస్తే హత మార్చటానికి సిద్ధంగా తన మంత్రులతో సహా ఆ దక్షిణతీరాన నిలబడి ఉన్నాడు.

రామలక్ష్మణులను హనుమంతుడూ, అంగదుడూ భుజాల మీద ఎత్తుకుని వారధి దాటించారు. అక్కడ అందరూ రాముడికి వేరువేరుగా మంగళాభిషేకం చేశారు. వారతన్ని శత్రువులందరినీ సంహరించి, చిరకాలం భూమండల మంతా ఏలవలసిం దని మంగళవాక్యాలతో ఆశీర్వదించారు.

రాముడు లక్ష్మణుడితో, "మనం ఆలస్యం చెయ్యరాదు. వెంటనే లంకకు బయలుదేరి పోదాం," అన్నాడు. రాముడు ధనుర్ధారి అయి ముందు నడుస్తూంటే వానరసేన వెనకగా కదిలింది. విభీషణ, సుగ్రీవాది ప్రముఖులు సింహనాదాలు చేస్తూ కదిలారు.

ఇక్కడ వానరసేన విడియగానే లంకలో నుంచి భేరీ మృదంగ ధ్వనులు భయం కరంగా వినవచ్చాయి. వాటిని విని వానరులు అంతకన్న గట్టిగా సింహనాదాలు చేశారు. ఆ ధ్వనిని లంకలోని రాక్షసులు విన్నారు.

రకరకాల ధ్వజాలతోనూ, పతాకలతోనూ కూడి ఉన్న లంకానగరాన్ని చూసి రాముడు, "ఇక్కడనేగదా సీత జింక పిల్లలాగా రావణుడి నిర్బంధంలో ఉన్నది!" అని దిగులుగా అనుకుని, లక్ష్మణుడితో, "ఆ త్రికూట పర్వతం మీద విశ్వకర్మ నిర్మించిన లంకా నగరాన్ని చూడు. అనేక పెద్ద భవనాలతో ఇది తెల్లని మబ్బులుగల ఆకాశంలా గున్నది. మంచి మంచి సుందర వనాలతో అందంగానూ, రకరకాల పక్షుల కూతలతో ఎంతో ఆహ్లాదకరంగానూ ఉన్నది," అన్నాడు.

తరవాత రాముడు వానరసేనను గరుడ వ్యూహంలో అమర్చి, దానికి ముందు తానూ





లక్ష్మణుడూ ఉండేటట్టూ, అంగదుడు నీలుడితో బాటు తన సేనతో సహా హృదయ స్థానంలో ఉండేటట్టూ, ఋషభుడు తన సేనతో కుడిపక్కా, గంధమాదనుడు ఎడమ పక్కా ఉండేటట్టూ, జాంబవంతుడూ, సుషేణుడూ, వేగదర్శీ కడుపుస్థానంలో ఉండేటట్టూ, సుగ్రీవుడు వెనుక భాగాన్ని రక్షించేటట్టూ ఏర్పాటు చేశాడు.

వ్యూహం ఏర్పాటు కాగానే రాముడి ఆజ్ఞపై సుగ్రీవుడు శుకుణ్ణి బంధవిముక్తుణ్ణి చేశాడు. వాడు అక్కడ క్షణమైనా ఉండక రావణుడి దగ్గిరికి వెళ్ళాడు. రావణుడు వాణ్ణి చూసి నవ్వుతూ, "ఎవరో నీ రెక్కలు విరిచినట్టున్నారు. నీవు కోతులకు చిక్క లేదు కద?" అన్నాడు.

"నేను సముద్రం దాటి వెళ్ళి, సుగ్రీవుణ్ణి చూసి, తమరు చెప్పమన్నట్టుగానే చెప్పాను. ఆ వానరులు నన్ను చూసి మండిపడి, ఆకాశంలోకి ఎగిరి నన్ను పట్టుకుని, నానా హింసలూ పెట్టి, చంపటానికి సిద్ధపడ్డారు. వాళ్ళు అమిత కోప స్వభావులూ, క్రూరులూనూ. వాళ్ళతో మాట్లాడటమే కష్టం, ఇంక జవాబు చెప్పించటం ఎట్లా? రాముడు లంకా ద్వీపానికి చేరాడు. సముద్రానికి సేతువు నిర్మించి లంకాద్వారం



దాకా వచ్చాడు. వానరసేనలు ఇసుక వేస్తే రాలకుండా ఉన్నాయి. వెంటనే సీతను రాముడి కిచ్చెయ్యటమో, యుద్ధానికి సిద్ధం కావటమో, ఏదో ఒకటి చెయ్యాలి," అన్నాడు శుకుడు.

రావణుడు శుకుడితో తాను యుద్ధానికే నిశ్చయించుకున్నట్టు చెప్పి, వానరసేన యొక్క వివరాలన్నీ రహస్యంగా తెలుసుకు రమ్మని శుకసారణులను పంపాడు. వారు వానర రూపాలు ధరించి వానరసేన ప్రవేశించారు.

వాళ్ళకు వానరసేన అంతు చిక్కలేదు. పర్వత శిఖరాల మీదా, పర్వతాల మధ్యా,







అరణ్యాలలో, సముద్రతీరానా, వనాలలో, ఉద్యానాలలో ఎక్కడ చూసినా వారికి వానరసేన కనిపించింది. ఆ సేనలో ఒక భాగం ఇంకా సేతువు దాటుతూనే ఉన్నది!

ఇంతలో శుకసారణుల మాయా రూపాలను విభీషణుడు పోల్చుకుని, వారిని పట్టుకుని రాముడితో, "వీళ్ళు శుకసారణులనేవారు. రావణుడి మంత్రులు. మన రహస్యాలు తెలుసుకు పోవటానికి లంక నుంచి వచ్చారు," అని చెప్పాడు.

రావణుడు పంపగా వానరసేనను గురించి తెలుసుకోవటానికి వచ్చినట్టు శుకసారణులు ఒప్పుకున్నారు.



రాముడు నవ్వుతూ, "ఇకనేం? సైన్యమంతా చూసుకోండి. మమ్మల్ని చూడండి. చూడవలసిన దంతా చూశాక స్వేచ్ఛగా లంకకు వెళ్ళిపొండి," అని వారితో అన్నాడు. వాళ్ళు నిరాయుధులు కనక వారిని చంపనని కూడా అతనన్నాడు. అతను రావణుడితో తన మాటలుగా ఇలా చెప్పమన్నాడు: "నీవు ఏ ధైర్యంతో నా భార్యను సీతను అపహరించావో ఆ ధైర్యాన్ని ఇప్పుడు ప్రదర్శించు. రేపు తెల్లవారుతూనే లంకా ప్రాకారాన్నీ, ద్వారాలనూ, నీ రాక్షస సైన్యాన్నీ నా బాణాలతో నుగ్గు చెయ్యబోతున్నాను. జాగ్రత్త!"

శుకసారణులు రాముణ్ణి పొగడి లంకకు తిరిగి వెళ్ళి రావణుడితో, "రాజా, మేము వానరసేనలో ప్రవేశించి విభీషణుడికి పట్టుబడ్డాం. అయితే ధర్మాత్ముడైన రాముడు మమ్మల్ని విడిచిపెట్టాడు. వానరసేనకు రాముడూ, లక్ష్మణుడూ, విభీషణుడూ, సుగ్రీవుడూ చాలు—వారు పరాక్రమంలో దేవేంద్రుడికి తీసిపోరు. లంకకు చేటు తీసుకురావటానికి ఆ నలుగురే చాలు, మిగిలిన వానరసేన అనవసరమనిపిస్తుంది. రాముడి రూపమూ, ఆయుధాలూ చూస్తే అతనొక్కడే చాలు, లక్ష్మణ విభీషణ సుగ్రీవు







లెందుకనిపిస్తుంది. ఇక వానర వీరులు యుద్ధోత్సాహులై, ఎప్పుడా అన్నట్టున్నారు. అందుచేత వాళ్ళతో విరోధం పెట్టుకోవటం కన్న సీతను రాముడి కిచ్చెయ్యటం మంచిది," అన్నారు.

ఈ మాటలు విని రావణుడు సారణుడితో, "అన్ని లోకాలూ ఒక్క పెట్టున నా పైకి ఎత్తివచ్చి భయపెట్టినా నేను సీతను పోనివ్వను. నీవు మెత్తని వాడవు కావటం చేత వానరుల దెబ్బలకు బెదిరిపోయి సీత నిచ్చెయ్యమంటున్నావు," అని, శుకసారణులను వెంటబెట్టుకుని మంచు కొండలాటి తెల్లని తన భవనం పైకి ఎక్కి, అక్కడి నుంచి కనిపించే పర్వతాలూ, వనాలూ, సమస్తమూ వానరసేనతో నిండి ఉండటం గమనించాడు.




అతను సారణుడి కేసి తిరిగి, "వానరులలో శూరులూ, బలవంతులూ అయిన వారెవరు? అగ్రనాయకు లెవరు? ముఖ్యులెవరు?" అని అడిగాడు.

"లంక కేసి తిరిగి సింహనాదం చేస్తున్న ఆ వానరుడు నీలుడు; వానర సేనా నాయకుడు, చేతులు పైకెత్తి నిలబడి, తోకను నేల కేసి కొట్టుతున్న వాడు అంగదుడు; సుగ్రీవుడి చేత యువరాజుగా అభిషేకం చేయించుకున్నవాడు; వాలి కొడుకు. హనుమంతుడు లంకకు వచ్చి సీతను చూసిన వాడే. అంగదుడికి వెనకగా ఉన్న వాడు నళుడు; అతనే సముద్రానికి సేతువు కట్టినది! తానొక్కడే లంకను జయించాలని ఇతని అభిలాష. సైనికులను సర్దుతూ, ఉత్సాహపరుస్తూ తిరిగే ఆ తెల్లని వానరుడే శ్వేతుడు. అడుగో, అతను కుముదుడు, చాలా తీవ్రస్వభావం గలవాడు, భయంకరుడు. ఆ వానరుడు రంభుడు. ఆ అవలించే వాడు శరభుడు; అతనికి చావంటే లక్ష్యం లేదు: యుద్ధంలో వెనకడుగు వెయ్యడు," అని చెబుతూ సారణుడు







రావణుడికి ఒక్కొక్క వానర ప్రముఖుణ్ణీ పరిచయం చేశాడు.

సారణుడు చెప్పేది పూర్తి అయాక శుకుడు మరి కొందరు శత్రు ప్రముఖులను గురించీ, వారి ఘనతను గురించీ రావణుడికి వివరించి చెప్పాడు.

తన మంత్రులు శత్రువీరులను ఆవిధంగా తెగ పొగడటం విని రావణుడికి ఆగ్రహం కలిగింది. అతను వారితో, "నా ఉప్పు తిని బతికే వాళ్ళు నాకు అప్రియంగా ఇలా మాట్లాడవచ్చా? ఒక వంక యుద్ధం జరగ బోతుండగా శత్రువుల నిలా పొగడవచ్చా? పెద్దల దగ్గిర మీరేం నేర్చుకున్నట్టు? మీరు చదివిన నీతి శాస్త్రమంతా ఏమైనట్టు? మిమ్మల్ని చంపెయ్యవలిసిందే, కాని మీరు లోగడ చేసిన మేలు తలచి మిమ్మల్ని విడిచిపెట్టేస్తున్నాను. అదే మీకు మృత్యువుతో సమానం," అన్నాడు.

ఈ మాటలకు సిగ్గుపడి, శుకసారణులు రావణుడికి జయం పలికి వెళ్ళిపోయారు.

రావణుడు మహోదరు డనేవాణ్ణి పంపి వేగులవాళ్ళను పిలిపించి, వారితో, "మీరు రాముడి వద్దకు వెళ్ళి, అతని ప్రయత్నాలేవో, అతని అంతరంగికులెవరో తెలుసుకోండి. రాముడు ఎప్పుడు పడుకుంటాడో, ఎప్పుడు మేలుకుంటాడో, ఏంచేస్తాడో, సమస్తమూ తెలుసుకురండి. మీరు తెలుసుకు వచ్చే విషయాలు యుద్ధంలో మనం సులువుగా గెలవటానికి సహాయంకావాలి," అన్నాడు.

ఆ చారులు శార్దూలుడనే వాణ్ణి వెంట బెట్టుకుని, మారు రూపాలతో, సువేల పర్వత సమీపంలో రామ లక్ష్మణ విభీషణ సుగ్రీవు లున్న చోటికి చేరుకున్నారు. రామలక్ష్మణు లనూ, వానరసేననూ చూడగానే వారికి భయం వేసింది.

విభీషణుడు వాళ్ళను పోల్చనే పోల్చాడు. వారిలో శార్దూలుడు మరీ దుష్టుడు. విభీషణుడు చారులను పట్టుకుని, శార్దూలుణ్ణి





వానరులకు అప్పగించాడు. వానరులు వాణ్ణి చంపబోతుంటే రాముడు అడ్డుపడి, శార్దూలుణ్ణీ, మిగిలిన చారులనూ కూడా విడిపించాడు. వారు లంకకు తిరిగి వెళ్ళి, రాముడు సేనతో సహా సువేల పర్వతప్రాంతంలో ఉన్నాడని రావణుడికి చెప్పారు.

రావణుడు శార్దూలుణ్ణి చూసి, "నీ ముఖం అలా వాడి ఉన్నదేమిటి? శత్రువులు నిన్నేమీ చెయ్యలేదు గద?" అని అడిగాడు.

శార్దూలుడు రావణుడితో, "ఆ వానరుల మీద వేగు చెయ్యటం చాలా కష్టం. నేను వానరసేనలో ప్రవేశించానో లేదో, నన్ను పట్టుకున్నారు. విభీషణుడి మంత్రులు నన్ను హూనం చేసేశారు. ఆ తరవాత వానరులు నన్ను పొడిచి, కరిచి, కొట్టి చాలా విధాల బాధించి సేనచుట్టూ తిప్పారు. నేను రక్తంకారి, స్పృహ తప్పి, చావటానికి సిద్ధంగా ఉండగా రాముడు నన్ను కాపాడాడు. అతను త్వరలోనే లంకను ముట్టడించనున్నాడు. ఇస్తావా సీతను ఇచ్చెయ్యి, లేదా యుద్ధానికి సిద్ధంకా!" అన్నాడు.

రావణుడు శార్దూలుడి చేత కూడ వానర ప్రముఖులను గురించి చెప్పించుకుని, తన మంత్రులను పిలిపించి వారితో కార్యాలోచన చేశాడు. అతను కర్తవ్యం నిర్ణయించుకుని, మంత్రులను పంపేసి, మాయలలో ఆరితేరిన విద్యుజ్జిహ్వుణ్ణి వెంటబెట్టుకుని, సీత వద్దకు బయలుదేరాడు.

అతను విద్యుజ్జిహ్వుడితో, "మనం మాయ చేత సీతను మోసపుచ్చాలి. నీవు మాయ చేత రాముడి తలను కల్పించి, ధనుర్బాణాలతో సహా దాన్ని తీసుకుని నా వెంట రా," అన్నాడు.

విద్యుజ్జిహ్వుడందుకు సమ్మతించి, రావణుడు బహుమానంగా ఇచ్చిన ఆభరణాన్ని తీసుకుని వెళ్ళిపోయాడు. రావణుడు అశోకవనంలో రాక్షస స్త్రీల మధ్య ఉన్న సీత వద్దకు బయలుదేరి వెళ్ళాడు.





# యుద్ధకాండ

రావణుడు అశోకవనాన్ని చేరేసరికి, సీత దుఃఖంతో రాముణ్ణి గురించి ఆలోచిస్తూ, నేలపైన కూర్చుని తల వంచుకుని ఉన్నది. ఆమె చుట్టూ భయంకరాకారం గల రాక్షస స్త్రీలున్నారు. రావణుడు సీతను సమీపించి, "నీవు ఏ రాముణ్ణి చూసుకుని గర్విస్తున్నావో ఆ రాముడు యుద్ధరంగంలో చచ్చాడు. ఇక నీవు నా భార్యవు కాక గత్యంతరం లేదు. పాపం, ఆ రాముడు నన్ను చంపుదామని పెద్ద వానరసేనతో వచ్చి సముద్రపు ఉత్తర తీరాన విడిశాడు. అందరూ బడలి ఒళ్ళు తెలియకుండా నిద్రపోతున్న సమయంలో మా చారులు వెళ్ళి అన్ని సంగతులూ చూసి వచ్చారు. అప్పుడు మా ప్రహస్తుడు గొప్ప రాక్షస సేనతో వెళ్ళి, వానరసేన పై ఆయుధాల వర్షం కురిపించి, నిద్రపోతున్న రాముడి తల నరికేశాడు. లక్ష్మణుడూ, కొందరు వానరులూ తప్పించుకుని పారిపోయారు. సుగ్రీవుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ, అంగదుడూ మొదలైన వానర వీరులంతా చచ్చారు," అన్నాడు.

అతను ఒక రాక్షస స్త్రీతో, "రాముడి శిరస్సును యుద్ధరంగం నుంచి తెచ్చిన విద్యుజ్జిహ్వుణ్ణి రమ్మను," అన్నాడు. విద్యుజ్జిహ్వుడు రాముడి శిరస్సునూ, బాణాన్నీ తెచ్చి, రావణుడి ఆజ్ఞపై వాటిని సీత ముందుంచి చప్పున వెనక్కు వచ్చేశాడు.

తన ముందున్న తలలో కళ్ళూ, జుట్టూ, చూడామణీ గుర్తించి సీత నిజంగా రాముడు



5

63





చనిపోయాడనే అనుకుని దుఃఖ సముద్రంలో పడి కొట్టుకున్నది. ఆమె కైకేయిని తిట్టుకున్నది, తనను పెళ్ళాడటం చేతనే రాముడి కీ దురవస్థ వచ్చిందని తనను తాను నిందించుకున్నది. తన తలను రాముడి తలతోనూ, తన శరీరాన్ని రాముడి శరీరం తోనూ చేర్చమని రావణుణ్ణి వేడుకున్నది.

అంతలోనే ద్వారపాలకుడు వచ్చి రావణుడితో, ప్రహస్తుడు మొదలైన మంత్రులందరూ రావణుడి దర్శనం కోసం వేచి ఉన్నట్టు చెప్పాడు. రావణుడు బయలుదేరి సభకు వెళ్ళిపోయాడు. అతను వెళ్ళగానే రాముడి తలా, ధనుస్సూ అంతర్థానమయిపోయాయి.

విభీషణుడి భార్య అయిన సరమ సీత వద్దకు వచ్చి ఊరడిస్తూ, "రాముడు వానర సేనతో సముద్రం దాటి దక్షిణ తీరానికి వచ్చాడు. ఆ సంగతి తెలిసే మంత్రులతో మాట్లాడటానికి రావణుడు పరిగెత్తి వెళ్ళాడు. రావణుడి మాయలు నమ్మకు," అన్నది.

రావణు డక్కడ కొలువులో సభ చేసి తన సైన్యాధ్యక్షులతో, "భేరి వేసి రాక్షస సైన్యాలను అయత్త పరచండి. కారణం చెప్పవద్దు," అన్నాడు. ఆ భేరి మోత సీతకూ, సరమకూ వినిపించింది. "చూశావా, రాక్షస సేనలు యుద్ధాని కిప్పుడే కదులుతున్నాయి," అన్నది సరమ సీతతో. సీతకు ప్రాణం లేచి వచ్చింది.

సరమ సీతతో, "కావాలంటే నే నిప్పుడే రాముడి వద్దకు వెళ్ళి, నీవు క్షేమంగా ఉన్నావని చెప్పి రాగలను. ఏమంటావు?" అని అడిగింది.

"నా కోరిక తీర్చాలని ఉన్నట్టయితే రావణు డేంచేస్తున్నాడో తెలుసుకుని రా," అన్నది సీత.

సరమ వెళ్ళి వచ్చి, "రావణుడికి అతని తల్లీ, అవిద్ధుడనే ముసలి మంత్రీ ఎంతగానో





చెప్పారు, నిన్ను విడిచిపుచ్చమని అన్నారు. కాని రావణుడు వారి మాటలు వినక, తాను జీవించి ఉండగా నిన్ను విడవనని మంత్రులతో ఆలోచన చేస్తున్నాడు. ఇక అతనికి చావు తప్పదు," అన్నది.

ఈ సమయంలో వానరసేనలు చేసే సింహనాదాలు దగ్గిరలో, భయంకరంగా వినవచ్చాయి. ఆ ధ్వనులు విని రాక్షసులు తెల్లబోయారు. రావణుడి సభలోని వారు కూడా వాటిని విన్నారు.

"రాముడు సముద్రం దాటి రావటమూ, అతని బల పరాక్రమాలూ విని మీరంతా దిగాలుపడి పోవటం నేను గ్రహించాను," అని రావణుడు సభికులతో అన్నాడు.

అప్పుడు రావణుడి తల్లి తాలూకు బంధువైన మాల్యవంతుడనే వృద్ధ రాక్షసుడు, "రాజా, మన కన్న బలహీనుడితో యుద్ధమూ, బలవంతుడితో సంధీ చెయ్యాలన్నది రాజ నీతి. మన పక్షాన అధర్మం ఉన్నందున మనం బలహీనులంగా ఉన్నాం. అందుచేత మనం రాముడితో సంధి చేసుకుని, సీత నతని కిచ్చివెయ్యటం యుక్తం. మన మధ్య కలహ కారణం సీతే గద. యుద్ధం నీకు కూడా క్షేమం కాదు. అనేక మందిచేత చావు లేకుండా వరం పొందావు



గాని, ఇప్పుడు మన పైకి ఎత్తి వచ్చిన మనుష్యులూ, వానరులూ, కొండముచ్చులూ, ఎలుగుగొడ్డులూ మొదలైన వారిచేత చావు లేకుండా వరం పొంది ఉండలేదు. శకునాలేవీ బాగాలేవు," అన్నాడు.

ఈ సలహా విని మండిపడి రావణుడు మాల్యవంతుడితో, "కోతులను వెంటబెట్టుకుని వచ్చిన రాముడు రాక్షస బలాలు గల నాకంటె ఎక్కువ బలం గల వాడని ఏ ఆధారంతో చెప్పావు? బెత్తెడు సముద్రానికి వారధి కట్టగానే రాముడు మహా బలుడయిపోయాడా? పని పెట్టుకుని సీతను తెచ్చుకున్న నేను రాముడికి భయపడిపోయి



65





ఆమెను తిరిగి ఇచ్చెయ్యనా? ఒక వేళ రాముడు నా కన్న బలవంతుడైతే నా తల నరకనీ, అంతే గాని నే నతనికి లొంగిపోను. అది నా స్వభావానికి వ్యతిరేకం. తిరిగి ప్రాణాలతో వెనక్కెలా పోతామా అని రాముణ్ణి భయపడనీ," అన్నాడు.

ఈ మాటలు విని మాల్యవంతుడు సిగ్గుపడి తల వంచుకున్నాడు. రావణుడు తన మంత్రులతో ఆలోచించి నగర రక్షణ ఏర్పాట్లు చేశాడు. దక్షిణ ద్వారాన మహోదర మహాపార్శ్వు లుంచబడ్డారు. పడమటి ద్వారానికి ఇంద్రజిత్తు నియోగించబడ్డాడు. ఉత్తర ద్వారానికి శుకసారణులతో సహా రావణుడే స్వయంగా వెళ్ళాడు. తూర్పున ప్రహస్తు డుంచబడ్డాడు. విరూపాక్షుడు పట్టణ మధ్య ప్రాంతంలో అనేకమంది రాక్షస వీరులతో ఉండిపోయాడు.

లంకానగర రక్షణ గురించి రావణుడు చేసిన ఈ ఏర్పాట్లను విభీషణుడి నలుగురు మంత్రులూ పక్షి రూపాలలో వచ్చి తెలుసుకుని, తిరిగి వెళ్ళి విభీషణుడికి చెప్పారు. విభీషణుడా వివరాలను రాముడికి చెప్పాడు. రాముడు లక్ష్మణ సుగ్రీవులతోనూ, హనుమంత జాంబవంతాది వీరులతోనూ సమాలోచన చేసి, లంకానగరం పైకి ఎలా దాడి చేయవలసినది నిర్ణయించాడు.

నీలుడు కొంత వానరసేనతో తూర్పు ద్వారానికి వెళ్ళి ప్రహస్తుడితో యుద్ధం చెయ్యాలి. అంగదుడు దక్షిణద్వారం వద్ద మహాపార్శ్వ, మహోదరులతో యుద్ధం చెయ్యాలి. హనుమంతుడు పడమటి ద్వారం పైకి పోతాడు. రావణుడు స్వయంగా రక్షించే ఉత్తర ద్వారం మీదికి రామ లక్ష్మణులు వెళ్ళాలని నిశ్చయమయింది. నగర మధ్యం లోని బలాలతో పోరాడవలసిన వారు సుగ్రీవుడూ, జాంబవంతుడూ, విభీషణుడూనూ.

రాముడు పెట్టిన మరొక నియమమేమంటే యుద్ధం చేసేటప్పుడు రామ, లక్ష్మణ,







నీల, అంగద, హనుమంత, సుగ్రీవులూ, విభీషణుడూ తప్ప మరెవరూ నరరూపాలు ధరించరాదు. గుర్తు తెలియగలందులకు వారు వానర రూపాలతోనే ఉండాలి.

ఈవిధంగా నిర్ణయం జరగగానే రాముడు సువేల పర్వతం పైకి దారి తీశాడు. అతని వెంట లక్ష్మణుడూ, సుగ్రీవుడూ, ఇతర వానర ప్రముఖులూ కొండ ఎక్కసాగారు. వారు సువేల పర్వతం పైకి చేరేసరికి లంకా నగరం ఎదురుగా కనిపించింది. ప్రాకారాల మీదా, ద్వారాల వద్దా నల్లని రాక్షసులు సాయుధులై, యుద్ధసన్నద్ధులై నిలబడి ఉన్నారు. వారిని చూసి వానరులు సింహ నాదాలు చేశారు. ఆ సమయంలో సూర్యు డస్తమించి, పూర్ణచంద్రు డుదయించాడు.

రాముడు మొదలైన వారంతా సువేల పర్వతం పైన ఆ రాత్రి విశ్రాంతి తీసుకున్నారు.

మర్నాడు ఉదయం వానరులు సువేల పర్వతం పైన ఉండే వనాలలో విహరించ బోయారు. రాముడు లక్ష్మణుడితోనూ వానర ప్రముఖులతోనూ సువేల పర్వతం మీది నుంచి త్రికూట పర్వతం మీద నిర్మించి ఉన్న లంకానగరపు శోభను గమనించి ఆశ్చర్యపోయాడు. ఆ నగరంలోని గొప్ప



భవనాలూ, ప్రాకారాలూ, గోపురాలూ, రక్షణలూ అతనికి విస్మయం కలిగించాయి.

అతనికి అప్పుడే రావణుడు కూడా కనిపించాడు. అతనికి వింజామరలు వీస్తు న్నారు, శ్వేతచ్ఛత్రం పట్టారు. మనిషి నల్లగా ఉన్నాడు. రక్త చందనం శరీరానికి పూసు కుని వెలలేని రత్నాభరణాలు ధరించి ఉన్నాడు. చాలా బరువైన ఎర్ర జరీ బట్టలు కట్టుకున్నాడు.

అందరితో బాటు రావణుణ్ణి చూస్తున్న సుగ్రీవుడికి ఉన్నట్టుండి పట్టరాని కోపం వచ్చింది. అతను ఒక్క ఊపున సువేల పర్వత శిఖరం నుంచి రావణుడున్న గోపురం





67





మీదికి దూకి, రావణుడికేసి తీక్ష్ణంగా చూసి, గాలిలోకి ఎగిరి రావణుడి కిరీటాన్ని తన్ని మళ్ళీ నేలపై వాలాడు. రావణుడు కోపంతో లేచి సుగ్రీవుణ్ణి తన చేతులతో పడదోశాడు. సుగ్రీవుడు బంతిలాగా పైకి లేచి రావణుణ్ణి పడదోశాడు. ఇద్దరూ కలియబడి చాలాసేపు భయంకరంగా కొట్టుకున్నారు. చివరకు రావణుడు అలిసి మాయా యుద్ధానికి దిగుదా మనుకుంటూండగా, ఆ సంగతి గ్రహించి సుగ్రీవుడు చప్పున ఆకాశంలోకి ఎగిరాడు. అతను మళ్ళీ వస్తాడని రావణుడనుకున్నాడు గాని, సుగ్రీవుడు తిరిగి రాముడి పక్కన వాలాడు.

రాముడు సుగ్రీవుణ్ణి కౌగలించుకుని, "సుగ్రీవుడా, నీవు రాజువై ఉండి, ఇలాటి అపాయకరమైన పని తొందరపాటున చెయ్యగూడదు. మేమందరమూ చాలా కలత పడ్డాం. నీకు అపాయం జరిగి ఉంటే మా అందరి పనీ ఏమై ఉండేది?" అన్నాడు.

"నీ భార్య నెత్తుకు పోయిన ఆ దుర్మార్గుడు ఎదురుగా కనిపిస్తూంటే సహించ లేక పోయాను," అన్నాడు సుగ్రీవుడు.

అప్పటి కప్పుడే అందరూ సువేల పర్వతం దిగి, వానరబలాలతో సహా త్రికూట పర్వతం ఎక్కారు. చూస్తుండగానే వానరులు లంకా నగరాన్ని ముట్టడించారు. రాముడు నిర్దేశించిన ప్రకారం ఏ ద్వారం వద్ద యుద్ధం చెయ్యవలసిన వానరయోధు లా ద్వారం వద్ద నిలబడ్డారు.

అప్పుడు రాముడు అంగదుణ్ణి పిలిచి, "అంగదుడా, నీవు నిర్భయంగా లంకా ప్రాకారం దాటి, రావణుడుండే చోటికి వెళ్ళి, నా మాటలుగా ఇలా చెప్పు: రావణుడా, నా భార్యను అపహరించిన నిన్ను శిక్షించటానికి యముడులాగా నేను వచ్చాను. ఏ బలం చూసుకుని నన్ను మోసపుచ్చి సీతను ఎత్తుకు పోయావో ఆ బలాన్ని ఇప్పుడు చూపించు. నీవు సీతను తెచ్చి





నాకు సమర్పించి నా శరణు వేడని పక్షంలో నిన్నూ, నీ రాక్షస కులాన్నీ నాశనం చేసి, లంకకు విభీషణుణ్ణి రాజుగా చేస్తాను. మూర్ఖులను ఆశ్రయించి ఉన్న నీకు రాజ్యార్హత పోయింది. నన్ను శరణువేడని పక్షంలో నాతో యుద్ధానికి వచ్చి, నా చేత చచ్చి పవిత్రుడివికా!" అన్నాడు.

అంగదు డీ సందేశం పుచ్చుకుని ఆకాశం లోకి ఎగిరి లంకలో వాలి, రావణుడు తన ఇంట మంత్రులతో కూర్చుని మాట్లాడుతున్న చోటికి వెళ్ళి, రావణుడి పక్కన నిలబడ్డాడు. అతను రావణుడికి తానెవరో చెప్పుకుని, రాముడు చెప్పమన్న మాటలు, ఒక్క ముక్క పొర్లు పోకుండా, రావణుడికి వినిపించాడు.

ఆ మాటలు వినేసరికి రావణుడు కోపం పట్టలేక, "ఈ అంగదుణ్ణి చంపెయ్యండి," అని మళ్ళీ మళ్ళీ కేకలు పెట్టాడు. నలుగురు రాక్షసులు అతన్ని పట్టుకుందామని వచ్చారు. అంగదుడు వారిని దగ్గరదాకా రానిచ్చి, వారిని తన చంకల్లో ఇరికించుకుని, ఒక్క ఎగురున రావణుడి ఇంటి ప్రాకారం మీదికి వెళ్ళి వాలాడు. కొండంత ఎత్తున్న ఆ ప్రాకారం మీద అతను వాలేటప్పుడు రాక్షసులు కింద పడిపోయారు.

ఆ ప్రాకారం మీద ఉన్న గోపురం అంగదుడి కంట పడింది. అంగదుడా గోపురాన్ని కాలితో ఒక్క తన్ను తన్నేసరికి అది విరిగి పడిపోయింది. అంగదుడు తన పేరు అందరికీ వినబడేటట్టు గట్టిగా చెప్పుకుని, ఎగిరి వెళ్ళి రాముడి చెంత వాలాడు.

ఇంతలో కొందరు రాక్షసులు వచ్చి, లంకను వానరసేనలు ముట్టడించిన సంగతి రావణుడికి చెప్పారు. రావణుడు ఆగ్రహావేశుడై తన నగరాన్ని ముట్టడించిన వానరులను చూడటానికై ప్రాసాదం మీదికి వచ్చాడు. వానరులు భూమినంతా ఆక్రమించి ఉండటం చూసి అతను ఆశ్చర్యపోయాడు.






రాముడు లంకా ప్రాసాదం సమీపానికి వచ్చి, లోపల ఉన్న సీతను తలుచుకుని, లంక పై దాడి ప్రారంభించమని వానరులకు అజ్ఞ ఇచ్చాడు. యుద్ధానికి సిద్ధంగా, చెట్లూ రాళ్ళూ పట్టుకుని ఉన్న వానరులు, రావణుడు చూస్తుండగానే, గుంపులు గుంపులుగా ప్రాకారం ఎక్కారు. వారు ప్రాకారాలనూ, పురద్వారాలనూ నాశనం చేశారు, అగడ్తలను పూడ్చారు.

రావణుడు కూడా రాక్షసులను యుద్ధానికి ఉపక్రమించమని ఆదేశించాడు. సింహనాదాలతోనూ, భేరీ భాంకారాలతోనూ, శంఖధ్వానాలతోనూ వానర రాక్షసుల మధ్య యుద్ధం ప్రారంభ మయింది.

ఇంద్రజిత్తు అంగదుడితోనూ, జంబుమాలి హనుమంతుడితోనూ, తపను డనే రాక్షసుడు గజుడితోనూ, నికుంభుడు నీలుడితోనూ ద్వంద్వ యుద్ధాలు చేశారు. ఇదే విధంగా అనేకమంది రాక్షస వీరులకూ, వానర వీరులకూ మధ్య ద్వంద్వ యుద్ధాలు జరిగాయి. ఈ యుద్ధాలలో సంపాతి అనే విభీషణ మంత్రి ప్రజంఘు డనే రాక్షసుణ్ణి చంపాడు. అలాగే ప్రఘసుడు సుగ్రీవుడి చేతిలో చచ్చాడు. విద్యున్మాలిని సుషేణు డనే వానరవీరుడు చంపాడు.

ఇంతలో సూర్యు డస్తమించాడు. రాత్రి వచ్చింది. కాని ఉభయపక్షాలూ విజయకాంక్షతో యుద్ధం కొనసాగించాయి.













అంగదుడికీ ఇంద్రజిత్తుకూ జరిగిన ద్వంద్వ యుద్ధంలో అంగదుడు ఇంద్రజిత్తు సారథినీ, గుర్రాలనూ చంపాడు. ఇంద్రజిత్తు అంతర్ధాన మయాడు. అతను మాయా యుద్ధానికి పూనుకుని, వానరసేన పై పిడుగుల వంటి బాణాలు వేశాడు, రామలక్ష్మణు లిద్దరి పైనా నాగాస్త్రాలు వేసి వారిని బంధించాడు, వారి శరీరాలనిండా సందు లేకుండా బాణాలు కొట్టాడు.

అతను వారితో, "రామ లక్ష్మణులారా, నేను అదృశ్యంగా ఉండి యుద్ధం చేస్తుంటే ఇంద్రుడు కూడా నన్ను తెలుసుకో లేడు, సమీపించలేడు. మీ రెంత? మిమ్మల్ని ఇప్పుడే యముడి వద్దకు పంపేస్తాను," అంటూ సింహనాదాలు చేశాడు. రామ లక్ష్మణులు నేలపై పడిపోయి ఏమీ చెయ్య లేని స్థితిలో ఉండి పోయారు. రాముణ్ణి చూసి లక్ష్మణుడికి ప్రాణభయం కలిగింది. హనుమంతుడు మొదలైన వానరులు కూడా అధైర్య పడిపోయారు. వా రాకాశ మంతా కలయ జూసినా ఇంద్రజిత్తు కనిపించలేదు.

ఇంద్రజిత్తు రామ లక్ష్మణుల నిద్దరినీ తాను చంపినట్టే భావించుకుని, వారు చచ్చారు చూడమని రాక్షసులకు చెప్పి, లంకలోకి తిరిగి వెళ్ళి పోయాడు.

ఆ రాత్రి వానరులకూ రాక్షసులకూ ఘోరమైన యుద్ధం జరిగింది. రక్తం నదులుకట్టి పారింది. ఉత్తర ద్వారాన్ని రక్షించే యమశత్రుడూ, మహాపార్శ్వుడూ, మహోదరుడూ, మహాకాయుడూ, వజ్ర దంష్ట్రుడూ, శుకసారణులూ రాముడి పైకి యుద్ధానికి వెళ్ళి, తీవ్రమైన రాముడి బాణాలచే కొట్టబడి, పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నారు.

ఇంకెందరో రాక్షసులు రాముడి చేతిలో చచ్చారు. అసలే భయంకరంగా ఉన్న ఆ రాత్రి సింహనాదాలతోనూ, ప్రతిధ్వనుల తోనూ మరింత భయంకరమయింది.









రామ లక్ష్మణులను చూస్తున్న కొద్దీ సుగ్రీవుడికి భయమూ, దుఃఖమూ పుట్టు కొచ్చాయి. విభీషణు డతనితో, "దుఃఖించకు. యుద్ధమంటే ఇలాగే ఉంటుంది. మొదటి నుంచి చివరదాకా జయమే కలగాలంటే కలుగుతుందా? అదృష్టం బాగుంటే రామలక్ష్మణులకు తిరిగి స్పృహ రావచ్చు," అంటూ నీటితో సుగ్రీవుడి అశ్రువులు కడిగాడు.

విభీషణుడు సుగ్రీవుడికి ధైర్యం చెప్పి, భయపడి పారిపోయే ప్రయత్నంలో ఉన్న వానరులకు ఉత్సాహం కలిగిస్తూ, సైన్యం నలు దిక్కులా తిరిగాడు. విభీషణుడి ప్రోత్సాహ వచనాలు వానరుల పై బాగా పని చేశాయి.

ఇంద్రజిత్తు తిన్నగా రావణుడి సభకు వెళ్ళి, తండ్రికి నమస్కారం చేసి, "రామ లక్ష్మణులను చంపేశాను," అని చెప్పాడు. రావణుడు పరమ సంతోషంతో ఆసనం మీది నుంచి లేచి, కొడుకును కౌగిలించు కున్నాడు. ఇంద్రజిత్తు యుద్ధ క్రమమంతా చెప్పాడు. అతన్ని తండ్రి ప్రశంసించాడు.

అతను సీతకు కాపలా ఉన్న త్రిజట మొదలైన రాక్షస స్త్రీలను పిలిపించి, "మన ఇంద్రజిత్తు చేతిలో రామ లక్ష్మణులు



చచ్చారు. సీత మద మణిగింది. ఆమె ఇక సర్వాభరణాలూ ధరించి, నా దగ్గిరికి వచ్చేస్తుంది. ఆ సీతను పుష్పక విమానంలో ఎక్కించి, యుద్ధరంగానికి తీసుకుపోయి, పడి ఉన్న రామ లక్ష్మణులను చూపించండి," అని ఆజ్ఞాపించాడు.

వాళ్ళు పుష్పకం ఉన్న చోటికి వెళ్ళి, దాన్ని తీసుకుని అశోకవనానికి పోయి, అందులో సీత నెక్కించుకుని యుద్ధరంగానికి తీసుకు పోయారు. అక్కడ సీతకు పడి ఉన్న రామ లక్ష్మణులూ, వారి చుట్టూ కూర్చుని, ఏ మాత్రం అలికిడి వినిపించినా రాక్షసులు వచ్చి పడుతున్నారేమో నని







భయపడుతున్న వానర ప్రముఖులూ కనిపించారు. ఆమె దుఃఖ సముద్రంలో మునిగిపోయింది.

సాముద్రిక వేత్తలూ, జ్యోతిశ్శాస్త్రం తెలిసినవారూ కూడా తనకు వైధవ్యం ఉండదన్నారు; తాను పుత్రవతి అవుతుందన్నారు, మహారాణి అవుతుందన్నారు. తనకు మహావీరుడు భర్త అవుతా డన్నారు. గోష్పాదమంత ఇంద్రజిత్తు ఆ మాటలన్నీ అబద్ధం చేసేశాడు. రామ లక్ష్మణులకు తెలిసిన దివ్యాస్త్రా లన్నీ ఏమయాయో? వాళ్ళు తన కోసం నాలుగు దిక్కులా వెతికించి, పెద్ద సేనతో సముద్రాన్ని కూడా దాటి లంకను చేరింది ఇంద్రజిత్తు మాయకు బలికావటానికా? పద్నాలు గేళ్ళూ పూర్తి కాగానే తన కొడుకు సీతా లక్ష్మణులతో తిరిగి వస్తాడని ఎదురు చూసే కౌసల్య ఏంకాను?

ఈ విధంగా దుఃఖంతో కుమిలుతున్న సీతను చూసి, "అమ్మా, ఏడవకు. రామ లక్ష్మణులు చావలేదు. వారు చచ్చిన లక్షణాలేవీ కనిపించవు," అన్నది త్రిజట. సీత ఆ మాట విని చేతులు జోడించి, "తథాస్తు!" అని పలికింది.

తరవాత పుష్పకం తిరిగి వెళ్ళిపోయింది. సీత మళ్ళీ అశోకవనం ప్రవేశించి, రామ లక్ష్మణులను పదే పదే తలుచుకుంటూ కన్నీరు కార్చింది.

యుద్ధరంగాన కొంత సేపటికి రాముడికి స్పృహ వచ్చింది. అతను తన పక్కన పడి ఉన్న లక్ష్మణుణ్ణి చూసి అతను చనిపోయాడనుకుని నిరాశచెందాడు. లక్ష్మణుడితో బాటు తాను కూడా చావాలని నిశ్చయించుకున్నాడు. సీతవంటి భార్య వెతికితే దొరక్కపోదు, లక్ష్మణుడి వంటి తమ్ము డెక్కడ దొరుకుతాడు? లక్ష్మణుడు లేకుండా యుద్ధ మెందుకు, అందులో విజయ మెందుకు? తాను ఒంటరిగా అయోధ్యకు తిరిగి పోయి సుమిత్ర ఎదట పడగలడా? అసంభవం.





తాను విభీషణుణ్ణి లంకకు రాజుగా చెయ్యలేక పోయినందుకు రాముడు చాలా చింతించాడు. తన కోసం సుగ్రీవుడు మొదలైన వానర యోధులు పడిన శ్రమకు కృతజ్ఞత చెప్పుకుని, వారు ప్రదర్శించిన శౌర్య పరాక్రమాలను మెచ్చుకుని, అందరినీ తిరిగి వెళ్ళి పొమ్మన్నాడు.

ఇంతలో విభీషణుడు తన గదతో సహా సుగ్రీవు డున్న చోటికి వచ్చాడు. అతన్ని దూరానే చూసి, ఇంద్రజిత్తు వస్తున్నా డనుకుని వానరులు భయపడి పారిపోసాగారు. జాంబవంతుడు వెళ్ళి వాళ్ళ భయాన్ని పోగొట్టాడు. వచ్చిన వాడు విభీషణు డని చెప్పిన మీదట, పారిపోతున్న వానరులు తిరిగి వచ్చారు.

సుగ్రీవుడు తన సమీపంలో ఉన్న తన మామ సుషేణుడితో; "రామ లక్ష్మణులకు స్పృహ రాగానే వాళ్ళను తీసుకుని, కొందరు వానర వీరులతో సహా కిష్కింధకు వెళ్ళు. నేను ఈ రావణుణ్ణి చంపి సీతను తీసుకు వస్తాను," అన్నాడు.

"పూర్వం దేవాసురులకు యుద్ధం జరిగినప్పుడు అనేకమంది దేవతలు మూర్ఛపోయారు, కొందరు చచ్చిపోయారు కూడా. అప్పుడు బృహస్పతి మృతసంజీవని లాంటి విద్యల సహాయంతోనూ, మూలికల సహా





యంతోనూ వాళ్ళకు చికిత్స చేశాడు. క్షీర సముద్ర మథనం జరిగిన చోట చంద్ర, ద్రోణ పర్వతా లున్నాయి. వాటి పైన దేవ తలు సంజీవకరణీ, విశల్యకరణీ అనే ఓష ధులను పెంచారు. హనుమంతుణ్ణి అక్కడికి పంపించి, వాటిని తెప్పించు," అన్నాడు సుషేణుడు.

ఇంతలో పెనుగాలి వీచింది. ఆ గాలి తాకిడికి మేఘాలు దూదిపింజెల్లాగా కొట్టుకు పోయాయి, సముద్రంలో పెద్ద కెరటాలు పుట్టాయి. మరి కొంత సేపటికి గరుత్మంతు డక్కడికి వచ్చాడు. అతణ్ణి చూస్తూనే రామ లక్ష్మణులను బాణాల రూపంలో బంధించిన



పాములు పారిపోయాయి. తరవాత అతను తన చేతులతో వారిద్దరి ముఖాలూ తడివాడు. వెంటనే వారి గాయాలన్నీ నయమై, శరీరా లకు ఎప్పటి శక్తీ, తేజస్సూ సమకూరాయి. అతడు వారిని లేవనెత్తి ప్రేమతో ఆలింగనం చేసుకున్నాడు.

రాముడు అతనితో, "అయ్యా, నిన్ను చూస్తే నాకు మా తండ్రినో, తాతనో చూసి నంత ఆనందం కలుగుతున్నది. దివ్య లేప నాలూ, దివ్యాంబరాభరణాలూ ధరించి ఉన్నావు. నీ వెవరు?" అని అడిగాడు.

"నేను నీకు స్నేహితుణ్ణి. నా పేరు గరుత్మంతుడు. మిమ్మల్ని బంధించిన పాములు కద్రువ సంతానం. ఇంద్రజిత్తు తన మాయ చేత వాటికి బాణ రూపం ఇచ్చి మీపై ప్రయోగించాడు. ఈ వార్త తెలిసి నే నిక్కడికి వచ్చాను. నేను నీకు ఎలా స్నేహితుణ్ణో యుద్ధంలో నీకు జయం కలిగాక చెబుతాను. రాక్షసులు మహామాయావులు. జాగ్రత్తగా వారితో యుద్ధం చెయ్యి. నీకు జయం కలుగుతుంది," అని గరుత్మంతుడు రాముడి వద్ద శలవు తీసుకున్నాడు.

వానరులకు ఉత్సాహం తిరిగి వచ్చింది. వారు భేరులు మోగించి, శంఖాలు పూరించి, సింహనాదాలు చేశారు. లంకలో రావణుడికి








అ ధ్వని వినిపించింది. రామలక్ష్మణులు చచ్చి పడుస్తూ ఉండవలిసిన వానరులు ఉత్సాహంతో శంఖాలూ, భేరీలూ ఎందుకు మోగిస్తున్నారో కనుక్కు రమ్మని అతను కావలివాళ్ళను పంపాడు. వాళ్ళు ప్రాకారాలపై కెక్కి, వానరసేన అంతా కలయజూసి, రావణుడి దగ్గిరికి వచ్చి, రామలక్ష్మణులు బంధవిముక్తులై సుఖంగా ఉన్నారని చెప్పారు.

ఇది విని రావణుడు తెల్లబోయి, "ఇంద్రజిత్తు ప్రయోగించిన నాగబంధాలను విప్పటం దేవతలకైనా సాధ్యంకాదు. రామలక్ష్మణులు వాటి నుండి బయటపడటం రాక్షస సేనకు అపాయాన్ని సూచిస్తున్నది," అన్నాడు. అతను ధూమ్రాక్షుడనే వాణ్ణి పిలిచి, "సేనతో సహా వెళ్ళి రాముణ్ణి వధించిరా!" అని ఆజ్ఞాపించాడు.

ధూమ్రాక్షుడు ఒక పెద్ద సేన తీసుకుని, తోడేలు ముఖాలూ, సింహం ముఖాలూ గల గాడిదలను పూన్చిన రథ మెక్కి యుద్ధానికి బయలుదేరాడు. రాక్షసులకూ, వానరులకూ గొప్ప యుద్ధం జరిగింది. ఉభయపక్షాలా అపారమైన ప్రాణ నాశం జరిగింది. చిట్ట చివరకు వానరుల దెబ్బకు తట్టుకోలేక రాక్షసులు పారిపోసాగారు. ఇది చూసి



ధూమ్రాక్షుడు వానరసేనపై విజృంభించాడు. హనుమంతుడికి కోపం వచ్చి, పెద్ద శిలను తీసుకు వచ్చి, ధూమ్రాక్షుడి రథంపై వేశాడు. రథం నుగ్గయింది గాని ధూమ్రాక్షుడు గదతో సహా కిందికి దూకేశాడు. హనుమంతుడికీ, అతనికీ యుద్ధమయింది. ధూమ్రాక్షుడు తన గదను హనుమంతుడి తలపైకి విసిరాడు. దాని దెబ్బకు హనుమంతుడు చలించక, ధూమ్రాక్షుడి నెత్తిన పర్వత శిఖరాన్ని వేసి చంపేశాడు. వానరులు హనుమంతుణ్ణి మెచ్చుకున్నారు.

ధూమ్రాక్షుడు చచ్చాడని విని రావణుడు వజ్రదంష్ట్రుణ్ణి సేనతో సహా పంపాడు.





ఆ సేన లంక యొక్క దక్షిణ ద్వారం కుండా వెళ్ళింది. ఆ ద్వారం వద్ద అంగదు డున్నాడు. ఉభయపక్షాల మధ్యా దొమ్మి యుద్ధం, ద్వంద్వ యుద్ధాలు జరిగాయి.

యుద్ధంలో వానరులు నష్టమవుతూ ఉండటం చూసి మండిపడి, అంగదుడు విజృంభించి రాక్షసుల తలలు పగలగొట్ట నారంభించాడు. రాక్షసులా తాకిడికి తట్టుకో లేక చలించిపోయారు. తన పక్షం దెబ్బ తింటూండటం చూసి వజ్రదంష్ట్రుడు అంగ దుడితో తలపడ్డాడు. ఇద్దరికీ చాలాసేపు యుద్ధం జరిగిన మీదట అంగదుడు కత్తితో వజ్రదంష్ట్రుడి తల తెగవేశాడు. రాక్షసు లంతా లంకా నగరంలోకి పారిపోయారు.

ఈసారి రావణుడు అకంపను డనే రాక్షస సేనానిని పంపాడు. రాక్షస వానర పక్షాలు రెండూ విజయ కాంక్షతో పట్టుదలగా యుద్ధం చేశాయి. కుముదుడూ, నలుడూ, మైందుడూ, ద్వివిదుడూ అనే వానరవీరులు ఒక్కసారిగా రాక్షస సేనపైన పడి రాక్షసు లను గుంపులు గుంపులుగా వధించసాగారు.

ఇది గమనించి అకంపనుడు తన రథాన్ని ఆ వానర వీరులున్న చోటికి తోలించాడు. అతని బాణాల తాకిడికి వానర వీరులు తట్టుకో లేకపోయారు. అకంపనుడి చేతిలో చావటానికి సిద్ధంగా ఉన్న వానరులకు అండగా హనుమంతుడు వచ్చాడు.

అతను అకంపనుడి బాణాలను లక్ష్య పెట్టకుండా, ఆయుధంగా ఒక కొండను పెరికి, ఒంటి చేత పట్టి గిరగిరా తిప్పి, అకంపనుడి పైకి వెళ్ళాడు. అకంపనుడు తన బాణాలతో ఆ కొండ శిఖరాన్ని ముక్కలు ముక్కలు చేసేశాడు. హనుమంతుడు మండి పడి, ఒక పెద్ద చెట్టు పెరికి, దానితో అకంప నుడి తల చితకగొట్టి చంపేశాడు. వానరులు పరమోత్సాహంతో సింహనాదాలు చేస్తూంటే, రాక్షసులు తమ ఆయుధాలు కూడా పారేసి పారిపోయారు.






అకంపనుడు చచ్చిన వార్త విని రావణుడికి కోపం వచ్చింది. అతను సభ నుంచి బయలుదేరి, తన వ్యూహాలను చూసుకుంటూ ఒక సారి లంక అంతా తిరిగి వచ్చాడు. అతను లంక చుట్టూ ఉన్న వానరుల ముట్టడి కూడా చూశాడు; సభకు తిరిగి వచ్చి, ప్రహస్తుణ్ణి చూసి, "వానరుల ముట్టడిని విచ్ఛిన్నం చెయ్యటం ఇతరుల వల్లకాదు; దానికి నేనూ, నీవూ, కుంభకర్ణుడూ, ఇంద్రజిత్తూ, నికుంభుడూ మాత్రమే సమర్థులం. నీవు సేనతో వెళ్ళి, వానరులను జయించిరా," అన్నాడు.

సీతను రాముడి కిచ్చేసి సంధి చేసుకోవటమే మంచి దనుకున్న వారిలో ప్రహస్తుడు కూడా ఉన్నాడు. సంధి జరగలేదు. అందుచేత తప్పనిసరిగా యుద్ధం సంప్రాప్తమయింది. యుద్ధం వస్తే రావణుడి కోసం ప్రాణాలు విడవటానికైనా ప్రహస్తుడు సిద్ధమే. అతను రథమెక్కి, యుద్ధానికి బయలుదేరాడు.

ఆర్భాటంగా వస్తున్న ప్రహస్తుణ్ణి చూసి రాముడు, "ఆ వచ్చే దెవరు? చాలా పరాక్రమ వంతుడిలాగా కనిపిస్తాడు!" అన్నాడు విభీషణుడితో.

"అతను ప్రహస్తుడు. అస్త్రా లెరిగిన శూరుడు. రావణుడి సేనలో మూడోవంతు అతని అధీనంలో ఉంటుంది," అని విభీషణుడు చెప్పాడు.

ఈ లోపల వానరవీరులు ప్రహస్తుణ్ణి చూసి సింహనాదాలు చేశారు. వాళ్ళు







చెట్లూ, రాళ్ళూ పట్టుకుని యుద్ధానికి సిద్ధంగా నిలబడ్డారు. యుద్ధంలో ఉభయ పక్షాలా ప్రాణ నష్టం జరిగింది. నరాంతకుడూ, కుంభహనుడూ, మహానాదుడూ, సమున్నతుడూ అనే రాక్షస యోధులు అంతులేని వానరులను చంపి, ద్వివిదుడూ, దుర్ముఖుడూ, జాంబవంతుడూ, తారుడూ అనే వానర వీరుల చేతుల్లో చచ్చారు. నీలుడు ప్రహస్తుణ్ణి ఎదుర్కొని, భయంకరంగా పోరాడి, తీవ్రంగా గాయపడి, చివరకు ప్రహస్తుడి తల చితకగొట్టి చంపేశాడు. ప్రహస్తుడు పోవటంతో, చావగా మిగిలిన రాక్షసులు భయకంపితులై లంకలోకి పారిపోయారు. నీలుణ్ణి రామలక్ష్మణులూ, సుగ్రీవుడూ, ఇతరులూ ఎంతో మెచ్చుకున్నారు.

ప్రహస్తుడి మరణ వార్త విని రావణుడికి కసీ, దుఃఖమూ కూడా కలిగాయి. అతను తనను పరివేష్ఠించి ఉన్న రాక్షసవీరులతో, "దేవతలను జయించగల ప్రహస్తుణ్ణే చంపారంటే వానరులు సామాన్యులు కారు. ఇంక నేను ఉపేక్షించటానికి లేదు. నేనే స్వయంగా యుద్ధానికి పోతాను; నా బాణాలతో ఆ రామలక్ష్మణులనూ, వానరసేననూ దగ్ధం చేస్తాను," అన్నాడు.

రావణుడు తన రథమెక్కి, సేనను వెంట బెట్టుకుని వానరుల పై యుద్ధం చెయ్యటానికి బయలుదేరి వెళ్ళాడు. ఆ సేనలో రావణుడి కొడుకులైన అకంపనుడనే వాడూ, ఇంద్రజిత్తూ ఉన్నారు.

విభీషణుడు రాముడికి వారందరినీ గురించి వేరు వేరుగా చెప్పాడు. రాముడు రావణుడి తేజస్సునూ, అతని యోధులు పట్టిన ఆయుధాలనూ చూసి ఆశ్చర్యచకితుడయాడు.

రావణుడు తన వెంట వచ్చిన రాక్షస వీరులతో, "మీరు తిరిగి వెళ్ళి లంకా నగరాన్ని కాపాడండి, లేకపోతే నిర్జనమైన





లంకను శత్రువులు తేలికగా ఆక్రమించుకో గలరు," అని చెప్పాడు.

రావణుడు యుద్ధానికి వస్తుండగానే సుగ్రీవు డతన్ని ప్రతిఘటించాడు. రావణుడు వేసిన బాణాలకు సుగ్రీవుడు త్వరలోనే తెలివి తప్పి పడి పోయాడు.

వానరసేనను కాపాడే భారం రాముడి పైన పడింది. అతను విల్లు పట్టి రావణుడితో తలపడటానికి ఉద్యుక్తుడౌతుండగా, లక్ష్మణుడు రాముడితో, "వీణ్ణి చంపటానికి నీవు కావాలా? నన్ను పోనీ!" అన్నాడు.

"వెళ్ళు. యుద్ధం జాగ్రత్తగా చెయ్యి," అన్నాడు రాముడు. ఎందుకంటే రావణుడు మహా యోధుడు.

లక్ష్మణుడు రావణుడి పైకి వచ్చేలోపల హనుమంతుడు రావణుడి రథం పక్కన చేరి, కుడి చెయ్యి ఎత్తి, "నిన్నిప్పు డొక్క గుద్దుతో చంపబోతున్నాను," అన్నాడు.

"నన్ను తప్పకుండా కొట్టు. ఒక కోతి రావణుణ్ణి కొట్టింది అన్న ఖ్యాతి కలకాలం ఉండిపోతుంది. నీవు నన్ను కొట్టిన మరుక్షణం నీ ప్రాణాలు తీస్తాను," అన్నాడు రావణుడు.

"నా చేతి దెబ్బకు నీ కొడుకు అక్షుడు చచ్చిన సంగతి మరిచిపోకు," అన్నాడు



హనుమంతుడు. ఈ మాట విని రావణుడు హనుమంతుడి రొమ్ముమీద అరచేత్తో ఒక్క దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బకు హనుమంతుడు క్షణంపాటు దిమ్మరపోయి, రావణుడి రొమ్ము మీద తన అరచేత్తో ఒక్క చరుపు చరిచాడు. ఆ దెబ్బకు రావణు డదిరి పోయాడు. రావణుడు కాస్త పుంజుకుని, "భేష్! పగవాడి వైతేనేం? నీ బలం చాలా గొప్పది!" అన్నాడు.

"నా బలం తగలబెట్టనా? నా చేత దెబ్బ తిని కూడా నీ వింకా బతికే ఉంటివి! మళ్ళీ ఒకసారి దెబ్బ కొట్టు, ఆ తరవాత నా పిడికిలి పోటుతో నిన్ను యముడి దగ్గిరికి







పంపేస్తాను," అన్నాడు హనుమంతుడు. రావణుడు మండిపడి, తన పిడికిలితో హనుమంతుడి రొమ్ములో భయంకరంగా పొడిచి, హనుమంతుడు తెప్పిరిల్లే లోపుగా నీలుడితో యుద్ధానికి వెళ్ళాడు. నీలుడితో యుద్ధం చేస్తున్న రావణుడితో హనుమంతుడు, "మరొకరితో పోట్లాడే వాడి పైకి పోవటం యుక్తం కాదు గనక నిన్నీసారికి పోనిచ్చాను," అన్నాడు.

నీలుడు రావణుడితో అతి విచిత్రమైన యుద్ధం చేశాడు. అతను అతి చిన్న దేహం ధరించి రావణుడి కిరీటం పైన వాలాడు. అతనికి బాణం గురిచేసి కొట్టటం రావణుడికి అసాధ్యమయింది. నీలుణ్ణి చూసి రామలక్ష్మణ హనుమంతు లాశ్చర్యపడ్డారు. చివరకు రావణుడు నీలుణ్ణి ఆగ్నేయాస్త్రంతో పడగొట్టాడు. అయితే, అగ్నిదేవుడు నీలుడికి తండ్రే గనక ఆగ్నేయాస్త్రం అతన్ని నేలపై పడగొట్టిందే గాని, అతని ప్రాణాలు తియ్యలేదు.

అప్పుడు లక్ష్మణుడు రావణుణ్ణి ఎదిరించాడు. ఇద్దరికీ జరిగిన యుద్ధంలో ఒకరినొకరు మూర్ఛ పోగొట్టుకున్నారు. చివరకు రావణుడు లక్ష్మణుడి పైన ఒక శక్తిని ప్రయోగించాడు; అది అతనికి బ్రహ్మ ఇచ్చినది. అది రొమ్ములో తగిలే సరికి లక్ష్మణుడు మూర్ఛపోయాడు. అప్పుడు రావణుడు లక్ష్మణుడి వద్దకు వచ్చి, అతన్ని తన చేతులలో ఎత్తటానికి ప్రయత్నించాడు, కాని సాధ్యం కాలేదు.

ఇంతలో హనుమంతుడు వచ్చి రావణుణ్ణి తన పిడికిలితో రొమ్ములో పొడిచాడు. ఆ దెబ్బకు రావణుడు మోకాళ్ళ పైన ముందుకు పడిపోయి, రక్తం కక్కుకుని, తన రథం మీద స్పృహ తప్పి పడిపోయాడు. హనుమంతుడు లక్ష్మణుణ్ణి తన చేతులలో ఎత్తుకుని రాముడి వద్దకు తెచ్చాడు. కొద్ది సేపటిలో లక్ష్మణుడికి





మూర్ఛ తెలిసింది. రావణుడికి కూడా స్పృహ వచ్చింది.

హనుమంతుడు రాముడితో, "నా వీపు మీద ఎక్కి రావణుడితో యుద్ధం చెయ్యి," అన్నాడు. రాముడా ప్రకారమే హనుమంతుడి భుజాల పైన ఎక్కి కూర్చున్నాడు. హనుమంతుడు రాముణ్ణి రావణుడి ఎదటికి తీసుకు పోయాడు.

రావణుడు హనుమంతుణ్ణి తీవ్రమైన బాణాలు వేసి కొట్టాడు. అది చూసి రాముడు క్రోధంతో రావణుడి రథ చక్రాలనూ, గుర్రాలనూ, ధ్వజాన్నీ, సారథినీ నాశనం చేసి, రావణుడి రొమ్ములో పిడుగులాటి బాణాన్ని నాటాడు. ఆ దెబ్బకు రావణుడు పడిపోగా మరొక బాణంతో అతని కిరీటాన్ని భగ్నం చేసేసి, "రాక్షసరాజా, చాలా గొప్ప యుద్ధం చేసి అలిసిపోయి ఉన్నావు. అందుచేత నిన్నిప్పుడే యమపురానికి పంపను. లంకకు తిరిగి వెళ్ళటానికి అనుమతిస్తున్నాను. వెళ్ళి, విశ్రాంతి తీసుకుని, రథమెక్కి, బాణం పట్టుకుని మళ్ళీరా. అప్పుడు నా శక్తి చూపుతాను," అన్నాడు.

రావణుడు గర్వభంగం పొంది, సిగ్గుపడుతూ లంకకు తిరిగి వెళ్ళాడు. అతనికిప్పుడు రాముడంటే నిజంగా భయం పట్టు



కున్నది. అతను రాక్షసులను సమావేశపరిచి ఇలా అన్నాడు:

"ఇంద్రుడికి తీసిపోని నేను ఒక మనుష్య మాత్రుడికి ఓడిపోయాను! నా తపస్సంతా ఏమయిందో తెలియటం లేదు. నాకు మనుష్యుల వల్ల ప్రమాదం ఉంటుందని ఒకప్పుడు బ్రహ్మ చెప్పాడు. వెనక నేను అనరణ్యుడనే ఇక్ష్వాకు రాజును చంపేటప్పుడు, నన్ను సర్వనాశనం చేయగలవాడు తన కులంలోనే జన్మిస్తాడని ఆయన అన్నాడు. వెనక వేదవతిని బలాత్కరించి ఆవిడ చేత శాపం తిన్నాను. ఆ వేదవతే ఈ సీత. పార్వతీ,







నందీశ్వరుడూ, రంభా, పుంజికస్థలా ఏమేమి అన్నారో, అదంతా ఈనాడు నిజం అవుతున్నది. ప్రమాదం మనసులో ఉంచుకుని శత్రుసంహారం విషయంలో మీరు మరింత శ్రద్ధవహించండి. ద్వారాలనూ, గోపురాలనూ శ్రద్ధగా కాపలాకాయండి. కుంభకర్ణుడు నిద్రపోతున్నాడు. అతన్ని లేపండి. నే నిక్కడ నానా అవస్థా పడుతూంటే అతను హాయిగా నిద్రపోతున్నాడు. యుద్ధాలోచన చేసేటప్పుడు కూడా మేలుకునే ఉన్నాడు. అటువంటి వాడు, తొమ్మిది రోజులకు యుద్ధం ఆరంభ మవుతుందనగా నిద్రపోయాడు. అతన్ని లేపండి. నాలాగా అతను శాపాలకు గురి అయినవాడు కాడు. అవలీలగా వానరసేననూ, రామ లక్ష్మణులనూ నిర్మూలించగల వాడు. రాముడి చేత దెబ్బ తిన్న నాకు కుంభకర్ణుడు లేస్తే ధైర్యంగా ఉంటుంది. కుంభకర్ణుడు ఇటువంటి తరుణంలో పక్కన లేకపోతే అతను ఉండీ ప్రయోజనమేమిటి?"

రావణుడీ మాట అనగానే రాక్షసులు కుంభకర్ణుడి ఇంటికి బయలుదేరారు. వాళ్ళు తమ వెంట గంధమూ, పూల మాలలూ, ఆహారమూ పట్టుకు పోయారు. ఒక బ్రహ్మాండమైన గుహలాటి ఇంట కుంభకర్ణుడు పడుకుని నిద్రపోతున్నాడు. అతను విడిచే ఊపిరి, రాక్షసులు లోపలికి ప్రవేశించటానికి యత్నిస్తే, బయటికి తోసేసింది. అతి కష్టం మీద వాళ్ళు చివరికి గుహలోపలికి వెళ్ళారు.

కుంభకర్ణుడు భయంకరమైన ఆకారంతో పడుకుని గాఢ నిద్రలో ఉన్నాడు. అతని ముందు రకరకాల మాంసాలు పెట్టి ఉన్నాయి. అన్నం రాసులుగా పోసి ఉన్నది. మద్యమూ, నెత్తురూ కడవలలో ఉన్నాయి. అతన్ని లేపటానికి రాక్షసులు విశ్వప్రయత్నాలు చేశారు—అందరూ కలిసి గట్టిగా అరిచారు, భయంకరమైన ధ్వనులు చేశారు,







గదలతోనూ, రోకళ్ళతోనూ అతని శరీర మంతా బాదారు. కుంభకర్ణుడు నిద్రలేవక పోగా, కదలనైనాలేదు.

రాక్షసులకు మండి పోయింది. వాళ్ళు ఏనుగుల చేత కుంభకర్ణుణ్ణి తొక్కించారు. ఏవో పురుగులు పాకు తున్నట్టనిపించి కుంభ కర్ణుడు మేలుకున్నాడు. అతను లేచి కూర్చుని పెద్ద పెట్టున ఆవలించాడు.

కుంభకర్ణుడు నిద్రలేస్తూనే మాంసం తిని, మద్యం తాగి చుట్టూ కలయ జూసి, రాక్షసులతో, "మీరంతా వచ్చి నన్నెందుకు నిద్ర లేపారు? రావణుడికి క్షేమమేగదా? ఏదో విపత్తు వచ్చిపడి ఉంటుంది. అందుకే మీరింత తొందరపడి నన్ను నిద్ర లేపారు. సంగతేమిటో చెప్పండి," అన్నాడు.

కుంభకర్ణుడు పడుకుంటే మూడు నెలలూ, ఆరు నెలలూ, ఒక్కొక్కప్పుడు తొమ్మిది నెలలు కూడా నిద్ర పోయేవాడు.

రావణుడి మంత్రి యూపాక్షు డనేవాడు కుంభకర్ణుడితో, "కుంభకర్ణా! పూర్వం దేవతల వల్ల కూడా కలిగి ఉండనంతటి భయం ఇప్పుడు మానవుల వల్ల కలిగింది. కొండ లంతేసి వానరులు లంకను ముట్టడించి ఉన్నారు. సీతను ఎత్తుకు వచ్చినందు కాగ్రహించి రాముడీ పని చేశాడు. కొంత



కాలం క్రితం ఒక వానరుడు వచ్చి లంకను తగలబెట్టి, అక్షకుమారుణ్ణి చంపేశాడు. దేవతల నందరినీ జయించిన రావణుణ్ణి రాముడు కొస ప్రాణంతో విడిచిపెట్టాడు. ఏ దేవతలూ చెయ్యలేని పని ఇప్పుడా రాముడు చేశాడు," అన్నాడు.

తన అన్న అపజయ వార్త విని కుంభ కర్ణుడు కోపోద్రేకంతో గుడ్లు గుండ్రగా తిప్పుతూ, "నేనా వానరసేననూ, రామ లక్ష్మణులనూ చంపేసి తరవాత రావణుణ్ణి చూస్తాను. రామలక్ష్మణుల రక్తం నేను తాగి, వానరుల రక్తం రాక్షసుల చేత తాగిస్తాను," అన్నాడు.







మహోదరుడనే రాక్షస ప్రముఖుడు కుంభకర్ణుడికి చేతులు జోడించి, "కుంభకర్ణా, నీవు రావణుడి వద్దకు వచ్చి, ఆయన చెప్పేది విని, మంచి చెడ్డలు సరిగా ఆలోచించుకుని, ఆపైన శత్రువుల పైకి యుద్ధానికి పోతే విజయం పొందటానికి వీలుగా ఉంటుంది," అన్నాడు.

కుంభకర్ణు డందుకు సమ్మతించి రాక్షసుల నందరినీ వెంట బెట్టుకుని రావణుడి ఇంటికి వెళ్ళటానికి సిద్ధమయాడు. రాక్షసులు ముందు వెళ్ళి రావణుడి దర్శనం చేసుకుని, "మీ తమ్ముడు కుంభకర్ణుణ్ణి నిద్ర లేపాం? ఏమి శలవు? అతను తిన్నగా యుద్ధానికి వెళ్ళవచ్చునా? లేక ఇక్కడికి రావాలా?" అని అడిగారు.

కుంభకర్ణుడు మేలుకున్నాడని విని రావణుడు సంతోషించి, "అతన్ని సగౌరవంగా ఇక్కడికే తీసుకురండి," అని రాక్షసులతో అన్నాడు. వాళ్ళు కుంభకర్ణుడి వద్దకు తిరిగి వెళ్ళి రావణుడు రమ్మంటున్నాడని చెప్పారు.

కుంభకర్ణుడు రావణుడి ఇంటికి బయలుదేరాడు. అతను అంగ వేస్తుంటే భూమి దద్దరిల్లింది. దారి పొడుగునా ఎదురైన రాక్షసులతనికి నమస్కారాలు చేశారు. లంక బయటి నుంచి అతన్ని చూసి వానరులు దడుచుకున్నారు. కొందరు వానరులు పారి పోసాగారు.

రాముడు కుంభకర్ణుణ్ణి చూసి విభీషణుడితో, "లంకలో పర్వతాకారుడైన వీరుడొకడు కిరీటం ధరించి కనబడుతున్నాడే ఎవరతను? అతన్ని చూసి మన వానరులు పారిపోతున్నారు!" అన్నాడు.

"అతను కుంభకర్ణుడు. యుద్ధంలో ఇంద్రుణ్ణీ, యముణ్ణీ గెలిచినవాడు. రాక్షసులలో అంత పెద్ద శరీరం కలవాడు లేడు. అతని బలం సహజమైనది, వరాల వల్ల వచ్చినది కాదు," అన్నాడు విభీషణుడు.







# యుద్ధకాండ

కుంభకర్ణుణ్ణి గురించి విభీషణుడు రాముడితో ఇంకా ఈ విధంగా చెప్పాడు :

కుంభకర్ణుడు పుట్టుతూనే ఆకలివేసి మనుష్యులను వేల సంఖ్యలో తినసాగాడు. ప్రజలు బెదిరిపోయి ఇంద్రుణ్ణి శరణు జొచ్చారు. ఇంద్రుడు అలిగి కుంభకర్ణుడిపై వజ్రాయుధం ప్రయోగించాడు. కుంభకర్ణుడు ఐరావతం యొక్క దంతాన్ని పెరికి ఇంద్రుణ్ణి రొమ్ములో కొట్టాడు.

ఇంద్రుడు ప్రజలను వెంటబెట్టుకుని బ్రహ్మ దగ్గిరికి వెళ్ళి, కుంభకర్ణుడు ప్రజలను తింటున్నాడనీ, దేవతలను అవమానిస్తున్నాడనీ, ఆశ్రమాలను ధ్వంసం చేస్తున్నాడనీ, పరస్త్రీలను హరిస్తున్నాడనీ బ్రహ్మతో చెప్పాడు.

బ్రహ్మ, రాక్షసుల నందరినీ పిలిపించి, వారిలో కుంభకర్ణుణ్ణి చూశాడు. ఆయన కుంభకర్ణుడితో, "విశ్రవసుడు నిన్ను కన్నది ప్రజాక్షయం చెయ్యటానికిలాగా ఉందే మిరా! ఇది మొదలు నీవు ఒళ్ళు తెలియకుండా పడి నిద్రపోతూ ఉండు," అన్నాడు.

కుంభకర్ణుడు బ్రహ్మ ఎదటనే నిద్ర ముంచుకొచ్చి పడిపోయాడు. అది చూసి రావణుడు, "తాతా, నీ మునిమనమణ్ణి ఇలా శపించటం అన్యాయం. వీడి నిద్రకూ, మెలకువకూ కాల నియమం ఏర్పాటు చెయ్యి," అన్నాడు.

"వీడు ఆరు మాసాల పాటు నిద్రపోయి ఒకరోజు మేలుకుని ఉంటాడు," అన్నాడు బ్రహ్మ.







విభీషణుడు రాముడికి ఈ విషయాలు చెప్పి, "రామా, నీ దెబ్బకు రావణుడు బెదిరిపోయి నిద్రపోతున్న కుంభకర్ణుణ్ణి లేపాడు. అతన్ని చూసే బెదిరి పారిపోయే వానరులు అతనికి యుద్ధంలో ఎదురునిల్చి ఏం పోట్లాడగలరు? అందుచేత వానరులతో మనం ఇదొక నడిచే యంత్రమని చెప్పాలి," అని చెప్పాడు.

రాముడు నీలుడితో వానరసేనను యుద్ధానికి సిద్ధం చెయ్యమని చెప్పాడు. గవాక్షుడూ, శరభుడూ, హనుమంతుడూ, అంగదుడూ తలా ఒక పర్వత శిఖరమూ పట్టుకుని లంకా ద్వారాల వద్ద నిలబడ్డారు.

ఈలోపల కుంభకర్ణుడు రావణుడి ఇంటికి వెళ్ళి, పుష్పకంలో విచారంగా కూర్చుని ఉన్న తన అన్నను చూశాడు. కుంభకర్ణుణ్ణి చూడగానే రావణుడు సంతోషంతో లేచి వెళ్ళి కౌగలించుకున్నాడు.

కుంభకర్ణుడు అన్నగారి పాదాలకు నమస్కారం చేసి, "నన్ను నిద్రలేపిన కారణమేమిటి? ఏం భయం వచ్చిపడింది? ఎవరికి చావు మూడింది?" అని అడిగాడు.

"నీవు చాలా కాలంగా సుఖ నిద్రలో మునిగి ఉన్నందున, రాముడు నాకు తెచ్చిపెట్టిన భయం గురించి నీకు తెలీదు. రాముడు సుగ్రీవుడి సేనతో సహా సముద్రాన్ని దాటి వచ్చి మన అంతు కనుక్కుంటున్నాడు. లంకలో ఉండే వనాలూ, ఉపవనాలూ చూడు; అన్నీ వానర మయం. మన రాక్షస ముఖ్యుల నందరినీ వానరులు చంపేస్తున్నారు, వానర ముఖ్యులు మన చేతిలో చావటం కనబడదు. నువు మహాబలుడివి, ఈ ఆపద నుంచి కాపాడుతావని నిద్రలేపాం," అని రావణుడు కుంభకర్ణుడితో అన్నాడు.

కుంభకర్ణుడు నవ్వాడు.

"వెనక ఈ విషయం చర్చించుకున్నప్పుడు నీ హితం కోరినవారు ఏ ప్రమాదం







వస్తుందని చెప్పారో అదే వచ్చిం దన్న మాట! ముందు వెనకలు ఆలోచించుకో కుండా బల గర్వంతో సీతను అపహరించి తెచ్చావు. మన తమ్ముడు విభీషణుడు చెప్పినట్టు చెయ్యి," అన్నాడు.

రావణు డీ మాటలు విని అలిగి, "నీవు చిన్నవాడివి; నేను పెద్దవాణ్ణి, గౌరవించ దగిన వాణ్ణి. నాకు నీవు బుద్ధులు చెప్పటం వట్టి కంఠ శోష. జరిగిపోయినదాన్ని గురించి ఇప్పుడు చర్చ దేనికి? ప్రస్తుత కర్తవ్యం ఆలోచించు. నేను చేసిన తప్పును నీ శౌర్యంతో సరిదిద్దు," అన్నాడు.

రావణుడికి కోపం వచ్చిందని గ్రహించి కుంభకర్ణుడు మృదువుగానూ, ఊరడింపు గానూ ఇలా అన్నాడు: "బాధపడకు! కోప్పడకు! నీకు తమ్ముణ్ణీ, హితుణ్ణీ కనక నీకు చెప్పవలిసిన మాట చెప్పాను. యుద్ధంలో రామలక్ష్మణులను చంపేసి నీ కోరిక తీరుస్తాను. రాముడి తల తెచ్చి నీ ముందు పెట్టి నిన్ను సంతోష పెడతాను. నేను బతికి ఉండగా నీకు రాముడి భయం ఎందుకుంటుంది? నన్ను యుద్ధానికి పంపించు. నా కసలు ఆయుధాలతో పని లేదు, ఉత్త చేతులతోనే ఎంతటి యోధుల నైనా చంపెయ్యగలను."



కుంభకర్ణుడి ఈ మాటలు విని మహోదరుడు మండిపడ్డాడు.

"నీవు మొరటు మనిషివి, అల్ప బుద్ధివి, అహంకారివి! రావణుడు చెయ్య గూడని పని ఎందుకు చేస్తాడు? చెడ్డపని చేసినందు వల్ల దుష్ఫలితం కలిగినట్టు చెప్పావే, అలా అనటానికి ప్రమాణ మేమిటి? మంచి పనుల వల్ల దుఃఖమూ, చెడ్డ పనుల వల్ల సుఖమూ కలగటం లేదా? సీతను అపహరించాలని రావణుడికి కోరిక పుట్టింది. ఆ కోరికను మేముకూడా బలపరిచాం. అది అలా ఉంచు. నీ వొక్కడవే యుద్ధానికి పోతానంటున్నావే! జనస్థానంలో అంత







మంది రాక్షస వీరులను చంపిన రాముణ్ణి నీ వొక్కడవే చంపగలవా?" అన్నాడు మహోదరుడు.

తానూ, ద్విజిహ్వుడూ, సంహ్రాదీ, కుంభకర్ణుడూ, వితర్దనుడూ అనే అయిదుగురూ వెళ్ళి రాముణ్ణి చంపాలని మహోదరుడు సూచించాడు. రాముడు చచ్చాడా సరే సరి, ఒక వేళ అతను చావకపోయినా ఈ అయిదుగురూ యుద్ధంలో తిన్న గాయాలతో, రక్త ప్రవాహలతో తిరిగి వచ్చి, రావణుడితో, "మేము రామలక్ష్మణులను తినేశాం!" అని చెబుతారు. అప్పుడు రావణుడు సీతను ఓదార్చి, ధనకనక వస్తువాహనాలిచ్చి అమె మనసును వశ్యం చేసుకుంటాడు. రావణుడు యుద్ధానికి వెళ్ళి రాముణ్ణి ఎదుర్కొ వలసిన పని లేకుండానే సీత అతని వశమవుతుంది! ఇదీ మహోదరుడు చెప్పిన ఉపాయం.

అంతా విని కుంభకర్ణుడు, "ఇలాటి మాట లెన్నడూ చెప్పకు. ఒళ్ళు జాగ్రత్తగా పెట్టుకో!" అని మహోదరుణ్ణి హెచ్చరించాడు. అతడివంటి వాళ్ళ సలహాలు వినే రావణుడి కీ గతి పట్టిందన్నాడు. యుద్ధం పేరు చెబితేనే భయపడే మహోదరుడి లాటి వాళ్ళు రావణుడు చెప్పినదాని కల్లా తల ఊపుతూ మార్గదర్శకులుగా ఉండటానికి బదులు తోడునీడలుగా తయారైనారన్నాడు.

కుంభకర్ణుడి మాటలకు రావణుడు గట్టిగా నవ్వి, "మహోదరుడికి రాముడంటే భయంలే! అందుచేత యుద్ధానికి పోవద్దంటున్నాడు. నీవు వెళ్ళి యుద్ధం చేసి జయించి రా. వెళ్ళి, రామలక్ష్మణులనూ, వానరులనూ భక్షించు," అన్నాడు.

కుంభకర్ణుడు ఒక అపూర్వమైన శూలాన్ని తీసుకున్నాడు. అది బోలెడంత ఇనుము ఉపయోగించి చేసినది, బంగారు అలంకారాలు గలది, ఎర్రని పూలమాలికలు చుట్టినది, ఇంద్రుడి వజ్రాయుధానికి







తీసిపోనిది. ఆ శూలం మాత్రం తీసుకుని, తాను ఒక్కడే యుద్ధానికి పోతాననీ, తనకు సహాయంగా సేన అవసరంలేదనీ కుంభకర్ణుడు చెప్పాడు.

రావణుడు అతనితో సైన్యాన్ని ఆయుధాలనూ తీసుకుపొమ్మనీ, యుద్ధంలో ఏమరుపాటుగా ఉన్నవాడికీ, ఒంటరిగాడికీ ప్రమాదం హెచ్చనీ అన్నాడు. అతను తన తమ్ముడి మెడలో రత్నఖచితమైన బంగారు హారం వేశాడు, అతనికి బాహుపురులూ, ఉంగరాలూ మొదలైన ఆభరణాలు పెట్టాడు, మంచి సువాసన గల పుష్పమాలలు వేశాడు, చెవులకు కుండలాలు పెట్టాడు, ఎంతో బరువైన బంగారు కవచం తొడిగాడు.

కుంభకర్ణుడు అన్నను కౌగలించుకుని, అతని చుట్టూ ప్రదక్షిణం చేసి, సాష్టాంగ నమస్కారం చేసి యుద్ధానికి బయలుదేరాడు. అతని వెనకగా మహాబలశాలులైన రాక్షసవీరులూ, పెద్దసేనా ఆయుధాలు ధరించి బయలుదేరారు. యుద్ధానికి బయలుదేరేటప్పుడు కుంభకర్ణుడు తన దేహాన్ని అపారంగా పెంచి ఉండటం వల్ల అతను ప్రాకారాల మీదుగా అంగవేసి దాటి వానరసేనలను చేరబోయాడు. అతన్ని చూసి వానరులు, మహామారుతానికి కొట్టుకుపోయే మబ్బు తునకల్లాగా, అన్ని దిక్కులకూ చెల్లాచెదరుగా పారిపోయారు.

కుంభకర్ణుణ్ణి చూసి పారిపోతున్న వానర వీరులలో నలుడూ, నీలుడూ, గవాక్షుడూ, కుముదుడూ లాటి వానర ముఖ్యులున్నారు. అంగదుడు వారిని చూసి, "మీరు మీ ఆత్మ గౌరవాన్నీ, పరాక్రమాన్నీ కూడా మరిచి, చచ్చుకోతుల్లాగా బెదిరిపోయి ఎక్కడికలా పారిపోతున్నారు? ఆ వచ్చేది యుద్ధం చేసే రాక్షసుడు కాదు, విభీషిక—భయం పుట్టించే బొమ్మ. వెనక్కు రండి, ఈ వెరబొమ్మను ధ్వంసం చేద్దాం," అన్నాడు.







అ మాటలతో ధైర్యం తెచ్చుకుని వానరులు వెనక్కు తిరిగివచ్చి కుంభకర్ణుడిపై తలపడ్డారు. వాళ్ళు తనపై వేసిన కొండ రాళ్ళకూ, చెట్లకూ కుంభకర్ణుడేమాత్రమూ చలించలేదు, పైపెచ్చు కోపం తెచ్చుకుని వానరులను నిర్మూలించ సాగాడు.

ఆ దెబ్బతో వానరులు పరుగులంకించుకున్నారు. వాళ్ళు ఒకరి మీదుగా ఒకరు ఎగురుతూ పారిపోయారు. కొందరు ఆకాశంలోకి ఎగిరారు, కొందరు వెళ్ళి సముద్రంలో పడ్డారు, మరికొందరు సేతువు మీదుగా పారిపోయారు. భల్లూకాలు కొందరు చెట్లలోనూ, మరికొందరు కొండలలోనూ దాక్కున్నారు, కొందరు చతికిలపడ్డారు, కొందరు మూర్ఛపోయారు, కొందరు చచ్చినట్టు కదలకుండా పడుకున్నారు.

"ఆగండి! ఆగండి! వెనక్కు రండి!" అని అంగదుడు కేకపెట్టి వానరులను పిలిచాడు. యోధులైనవాళ్ళు శత్రువును చంపి కీర్తి గడించటమో, శత్రువు చేతిలో చచ్చి బ్రహ్మలోకానికి పోవటమో చెయ్యాలిగాని, ప్రాణాలు కాపాడుకోవటానికి పిరికిపందల్లాగా పారిపోరాదనీ, కుంభకర్ణుడికి రాముడి చేతిలో నిశ్చయంగా చావు మూడిందనీ అతను వానరులతో అన్నాడు. కాని వాళ్ళు, "కుంభకర్ణుడు మమ్మల్ని దారుణంగా చంపేస్తున్నాడు. మేము పోతాం. మాకు ప్రాణాలు దక్కితే చాలు," అని, కుంభకర్ణుడు వస్తూండటం చూసి పారిపోయారు.

అయితే అలా పారిపోయే వానరులను అంగదుడూ, హనుమంతుడూ కలిసి మంచి మాటలతో నచ్చచెప్పి ఎలాగో వెనక్కు మరలించగలిగారు.

తరవాత హనుమంతుడు పన్నెండు మంది వానరయోధులను వెంటబెట్టుకుని యుద్ధానికి బయలుదేరాడు. వారెవరంటే, ఋషభుడూ, శరభుడూ, మైందుడూ, ధూమ్రుడూ, నీలుడూ, కుముదుడూ, సుషే





ఋడూ, గవాక్షుడూ, రంభుడూ, తారుడూ, ద్వివిదుడూ, పనసుడూనూ.

వీరంతా ఏకంగా చేసిన యుద్ధంలో అనేక మంది రాక్షసులు చచ్చారు, రథాలు నుగ్గయాయి, ఏనుగులూ, గుర్రాలూ, ఒంటెలూ చచ్చాయి. హనుమంతుడు గాలి లోకి ఎగిరి కుంభకర్ణుడి పైన కొండరాళ్ళ వర్షం కురిపించాడు, వృక్షాలు వేశాడు. కుంభకర్ణుడు వాటి నన్నిటినీ తన శూలంతో పక్కకు నెట్టేశాడు. కుంభకర్ణుడు వానరు లను తరుముతూ పోతూంటే హనుమంతు డొక పర్వతశిఖరం పట్టుకుని అతనికి అడ్డంగా నిలబడ్డాడు. దాన్నిపెట్టి హను మంతుడు కొట్టే సరికి కుంభకర్ణుడికి తల పగిలి, శరీరం రక్తంతో తడిసింది. వెంటనే కుంభకర్ణుడు తన శూలంతో రొమ్ములో పొడిచే సరికి, హనుమంతుడు నోట నెత్తురు కక్కుతూ మూర్ఛపోయాడు.

హనుమంతుడు పడగానే మళ్ళీ పారి పోసాగిన వానరులను నీలుడు నిలవవేసి, కుంభకర్ణుడిపై ఒక పెద్ద కొండరాయి వేశాడు. కుంభకర్ణుడు దాన్ని పిడికిలితో పొడిచి చూర్ణం చేశాడు. అయిదుగురు వానరవీరులు కుంభకర్ణుడిపై కలియబడి రాళ్ళతోనూ, చెట్లతోనూ కొట్టి, కాళ్ళతో,



చేతులతో తన్నారు. ఈ తాపులకు కుంభ కర్ణుడు చలించలేదు. అతను ఆ అయిదు గురినీ చంపేశాడు.

అది చూసి అనేక వేలమంది వానరులు కుంభకర్ణుడి పైన వచ్చి పడ్డారు. కుంభ కర్ణుడు వాళ్ళను పట్టుకుని తినసాగాడు. వానరులలో హహాకారాలు చెలరేగాయి. వాళ్ళు వెళ్ళి రాముణ్ణి శరణు జొచ్చారు.

అంగదుడు కుంభకర్ణుడి తలపైన పెద్ద కొండరాయి వేసి కొట్టాడు. కుంభకర్ణుడు మండిపడి శూలం విసిరితే అంగదుడు ఉపాయంగా తప్పించుకుని, చప్పున కుంభకర్ణుణ్ణి సమీపించి, రొమ్ముల్లో అదిరే





టట్టుగా కొట్టాడు. ఆ దెబ్బకు కుంభకర్ణుడికి మూర్ఛ వచ్చింది. వెంటనే స్పృహ తెచ్చుకుని కుంభకర్ణుడు అంగదుణ్ణి ఎడమ చేతి పిడికిలితో పొడిచి మూర్ఛ పోగొట్టి, శూలాన్ని ఎత్తుకుని సుగ్రీవుడి పైకి వెళ్ళాడు.

కుంభకర్ణుడు తన శూలాన్ని గిరగిరా తిప్పి సుగ్రీవుడి పైన విసిరాడు. అంతలో హనుమంతుడు వచ్చి మధ్య దారిలో దాన్ని పట్టుకుని, రెండు చేతులా పట్టి విరిచి పారేశాడు. వెయ్యి బారువల ఇనుముతో చేసిన ఆ శూలం, హనుమంతుడు తన మోకాలికి పెట్టి విరవగానే పుల్లలాగా విరిగిపోయింది.

శూలం పోయేసరికి కుంభకర్ణుడు కోపించి ఒక రాయి విసిరి సుగ్రీవుణ్ణి మూర్ఛపోగొట్టాడు. మూర్ఛలో ఉన్న సుగ్రీవుణ్ణి కుంభకర్ణుడు పట్టుకుని ఎత్తుకుపోయాడు. సుగ్రీవుణ్ణి కాజేస్తే వానర సేనా, రామలక్ష్మణులూ నిర్వీర్యులయిపోతారని అతని ఉద్దేశం. అతను సుగ్రీవుణ్ణి తీసుకుని లంకకు వెళ్ళిపోయాడు. కుంభకర్ణుణ్ణి ఎదిరించి సుగ్రీవుణ్ణి విడిపించుదామా అని హనుమంతు డొక క్షణంపాటు ఆలోచించి, చివరకు అలా చేయటం అనవసరమని తేల్చుకున్నాడు. ఎందుచేతనంటే, స్పృహ తెలిసిన మరుక్షణం అతను తనను తానే విడిపించుకోగలడు. ఇలా ఆలోచించి హనుమంతుడు, బెదిరిన వానరులకు ధైర్యం చెబుతూ అక్కడే ఉండిపోయాడు.

లంకా పౌరులు కుంభకర్ణుడిపై చల్లిన సుగంధ జలాలతో సుగ్రీవుడికి స్పృహ వచ్చింది. తానిప్పుడు ఏవిధమైన ప్రతిక్రియ చేస్తే బాగుంటుందా అని అతను ఆలోచించాడు. చివర కతను తన గోళ్ళతో కుంభకర్ణుడి చెవులు గిల్లి, ముక్కూ, చెంపలూ కొరికేశాడు. కుంభకర్ణుడు అలిగి సుగ్రీవుణ్ణి నేలకేసి కొట్టి, తొక్కాడు. అయినా సుగ్రీవుడు లక్ష్యపెట్టక వాయువేగంతో గాలిలోకి లేచి రాముడున్న చోట వాలాడు.









సుగ్రీవుడు కుంభకర్ణుడి చెవులూ, చెక్కిళ్ళూ కొరికి ఒక్క గంతుతో రాముడి వద్దకు వెళ్ళి పోయాక కుంభకర్ణుడు దేహమంతా రక్త ధారలు కారుతూ, ఒక్క క్షణం పాటు కొండ లాగా నిలబడి పోయి, తిరిగి యుద్ధ భూమికే బయలుదేరాడు. తన చేతిలో ఆయుధం లేదని జ్ఞాపకం వచ్చి అత నొక భయంకరమైన ముద్గరాన్ని దారిలోనే ఎత్తుకుని యుద్ధరంగానికి వెళ్ళాడు. అక్కడ అతను కోపావేశంతో కనిపించిన ప్రాణు లన్నిటినీ పట్టుకుని తినసాగాడు. వారిలో వానరులతోబాటు రాక్షసులు కూడా తన నోట పడుతున్న సంగతి కూడా కుంభకర్ణుడు గమనించలేదు. వానరులు అతనికి అందకుండా పారి పోతుంటే కుంభకర్ణుడు వారిని వెన్నంటి తరిమి పట్టుకుని వేల సంఖ్యలో తినేశాడు.

ఇది చూసి లక్ష్మణుడు కుంభకర్ణుణ్ణి ఎదిరించి, అతని పై బాణాలు వేశాడు. కాని ఆ బాణాలను కుంభకర్ణు డే మాత్రమూ లక్ష్య పెట్టలేదు. అతను అందిన వానరులను పట్టుకుని తింటూ రాముడి కేసి పోసాగాడు. రాము డొక భయంకరమైన అస్త్రాన్ని వేసి కుంభకర్ణుడి రొమ్ములో కొట్టాడు. ఆ దెబ్బకు కుంభకర్ణుడి నోట జ్వాలలు వెలువడ్డాయి. అతను పడిపోయాడు.

కుంభకర్ణుడు మళ్ళీ లేవ కుండా అతనిపై ఎక్కి నుంచోమని లక్ష్మణుడు వానరులతో చెప్పాడు. అయితే కుంభకర్ణుడు తన పైకి ఎక్కిన వానరులను చీమలను







దులిపినట్టు దులిపేశాడు. అది చూసి రాముడు కుంభకర్ణుణ్ణి సమీపించి తన వింటి నారిని మోగించాడు. కుంభకర్ణుడు లేచి నిలబడి పెద్ద పర్వతంలాగా రాముడి కెదురు వచ్చాడు.

రాము డతన్ని చూసి, "కుంభకర్ణా, భయపడకు! రా! ఇంద్రుణ్ణి జయించావు కాబోలు. నేను ఇంద్రుణ్ణి కాదు, రాముణ్ణి! నిన్నిప్పుడే ఒక్క క్షణంలో చంపబోతున్నాను," అన్నాడు.

"నేను కూడా విరాధుణ్ణి కాను; కబంధుణ్ణీ, ఖరుణ్ణీ, వాలినీ, మారీచుణ్ణీ కూడా కాను; కుంభకర్ణుణ్ణి! వచ్చాను! నీ ప్రతాపమేమిటో నాకు చూపించు, ఆ తరవాత నిన్ను తినేస్తాను," అన్నాడు కుంభకర్ణుడు.

రాముడు వేసిన మామూలు బాణాలు కుంభకర్ణుణ్ణి ఏమీ చెయ్యలేక పోయాయి; సాలవృక్షాలను ఛేదించి, వాలిని చంపిన బాణాలు కూడా కుంభకర్ణుడి పైన వ్యర్థమై పోయాయి. చేతిలో ఉన్న ముద్గరాన్ని గుండ్రగా తిప్పుతూ రాముడి బాణాలలో కొన్ని తనకు తగలకుండా చేసుకున్నాడు కుంభకర్ణుడు.

అప్పుడు రాముడు కుంభకర్ణుడి పైన వాయువ్యాస్త్రం ప్రయోగించాడు. అది ముద్గరం పట్టి ఉన్న కుంభకర్ణుడి చేతిని ఖండించేసింది. కుంభకర్ణుడు పెద్దగా అరిచాడు. అతడి చెయ్యి తెగినప్పుడు దాని కింద పడి కొందరు వానరులు నలిగి చచ్చారు.

కుంభకర్ణుడు ఒక చెయ్యి పోగొట్టుకుని, రెండో చేత్తో ఒక మహా వృక్షాన్ని పెరికి రాముడి పైకి వచ్చాడు. రాముడు ఐంద్రాస్త్రంతో కుంభకర్ణుడి రెండో చేతిని కూడా, చెట్టుతో సహా, నరికేశాడు. తరవాత అతను రెండు అర్ధచంద్ర బాణాలతో కుంభకర్ణుడి పాదాలు నరికేశాడు. కుంభకర్ణుడు పర్వతంలాగా విరుచుకు పడిపోయి, గుహలాటి నోరు తెరిచి గర్జిస్తుంటే, రాము డా నోటి నిండా





బాణాలు కొట్టాడు. కుంభకర్ణుడు మూర్ఛ పోయి ఉన్న స్థితిలో రాము డొక దివ్యాస్త్రంతో కుంభకర్ణుడి తల నరికేశాడు.

మహా బలశాలి అయిన కుంభకర్ణుడు చావటంతో రాక్షసులు హాహాకారాలు చేశారు. వానరుల ముఖాలు వికసించాయి. కుంభకర్ణుడు రాముడి చేత చచ్చా డన్న వార్త వింటూనే రావణుడు కొంచెం సేపు మూర్ఛ పోయి తరవాత తమ్ముడి కోసం దుఃఖించాడు. అతనితో బాటు మిగిలిన రాక్షస వీరులు కూడా దుఃఖించారు.

తమ్ముడి కోసం దుఃఖిస్తున్న రావణుణ్ణి ఓదార్చి, త్రిశిరుడూ, అతికాయుడూ, దేవాంతకుడూ, నరాంతకుడూ, మహోదరుడూ, మహాపార్శ్వుడూ అనే అరుగురు రాక్షస యోధులు యుద్ధానికి బయలుదేరారు.

తిరిగి రాక్షస వానర సేనల మధ్య దొమ్మి యుద్ధం ఆరంభ మయింది. నరాంతకుడు వానర సేన మధ్యకు జొరబడి, తన ఈటెతో వానరులను వందల సంఖ్యలో చంప సాగాడు. అప్పుడు సుగ్రీవుడు అంగదుణ్ణి అతని పైకి పంపాడు.

అంగదుడు నరాంతకుడికి ఎదురు వెళ్ళి, "ఆ ఈటెను సాధారణ వానరుల పైన ఎందుకు ప్రయోగిస్తావు? దానితో నన్ను



కొట్టు," అన్నాడు. నరాంతకుడు తన ఈటెను బలంగా అంగదుడి రొమ్ము మీద కొట్టాడు. అది కాస్తా విరిగి పడిపోయింది. అంగదుడు నరాంతకు డెక్కి ఉన్న గుర్రాన్ని నెత్తి మీద అరచేత్తో చరిచే సరికి అది తల పగిలి చచ్చిపోయింది. నరాంతకుడు తన పిడికిలి బిగించి గట్టిగా మొత్తే సరికి అంగదుడి తల పగిలి రక్తం కార సాగింది. "వీడి కింత బలం ఉందా?" అని ఆశ్చర్యపడి అంగదుడు తన పిడికిలి బిగించి నరాంతకుడి రొమ్ములో గట్టిగా పొడిచే సరికి నరాంతకుడు నెత్తురు కక్కుకుని చచ్చాడు.







అది చూసి మహెూదరుడూ, దేవాంతకుడూ, త్రిశిరుడూ అంగదుడి పైకి వచ్చారు. ఆ ముగ్గురితోనూ ఒంటరిగా పోరాడుతున్న అంగదుడికి హనుమంతుడూ, నీలుడూ తోడు వచ్చారు. వారి మధ్య జరిగిన యుద్ధంలో హనుమంతుడు దేవాంతకుణ్ణి తల పగల గొట్టి చంపేశాడు. అలాగే నీలుడి చేతిలో మహెూదరుడు చచ్చాడు. మళ్ళీ హనుమంతుడే త్రిశిరుడితో చాలా సేపు యుద్ధం చేసి అతని కత్తితోనే అతని కంఠం నరికేశాడు.

ఈ లోపల రాక్షస వీరులలో ఒకడైన మహాపార్శ్వుడు భయంకరమైన గద ఒకటి తీసుకుని వానరుల పైకి పోయేసరికి, ఋషభు డనే వానరవీరుడు అతనితో తలపడి, అతని గద చేత కొట్టబడి కూడా, ఆ గదతోనే మహాపార్శ్వుడి తల పగల గొట్టేశాడు. మహాపార్శ్వుడు కూడా చావగానే రాక్షసులు ఆయుధాలు పారేసి పారిపోయారు.

అలా పారిపోయే రాక్షసులను చూచి, అతికాయుడు చాలా కోపం చెంది, రెండో కుంభకర్ణుడి లాగా వానర సేన పై పడ్డాడు.

రాముడు అతికాయుణ్ణి దూరానే చూసి ఆశ్చర్యపడి, "పర్వతాకారుడుగా వచ్చే ఈ వీరు డెవరు? ఇతని ధనుస్సులు కూడా అసాధారణంగానే ఉన్నాయి," అని విభీషణుణ్ణి అడిగాడు.

"ఇతను రావణుడికి ధాన్యమాలిని యందు పుట్టిన కొడుకు, అతికాయుడు. లంకకు ఇతను కూడా పెట్టనికోట లాటివాడే. బ్రహ్మ నారాధించి దివ్యాస్త్రాలు పొందిన వాడు. ఇతని సంగతి వెంటనే తేల్చకపోతే వానరసేనను బాణాలతో నాశనం చేయగలడు," అని విభీషణుడు చెప్పాడు.

ఈ లోపల అతికాయుడు సింహనాదం చేస్తూ వానరసేనలో ప్రవేశించాడు. కుముదుడూ, ద్వివిదుడూ, మైందుడూ, నీలుడూ, శరభుడూ ఏకమై అతన్నెదిరించారు.





అతను వారందరినీ ఉక్కు బాణాలతో కొట్టి బాధించాడు. తరవాత అతను రాముడున్న చోటికి వచ్చి, "నేను అల్పులతో యుద్ధం చెయ్యను. సమర్థు డెవడన్నా ఉంటే నాతో యుద్ధానికి రావచ్చు," అన్నాడు.

ఆ మాట విని లక్ష్మణుడు రోషంతో అతని ముందుకు వచ్చి తన వింటినారిని మోగించి సవాలు చేశాడు.

"లక్ష్మణా, నీవు అర్భకుడివి, నాతో యుద్ధం చేసి, నిష్కారణంగా ప్రాణాలు పోగొట్టుకోకు," అన్నాడు అతికాయుడు.

"నీ ప్రతాపం ఉత్తమాటలలో గాక, చేతలలో చూపించు," అన్నాడు లక్ష్మణుడు.

ఇద్దరూ బాణాలతో యుద్ధం ప్రారంభించారు. ఒకరినొకరు బాణాలతో నొప్పించారు. ఒకరి బాణాల నొకరు పడగొట్టారు. ఒకరు వేసే అస్త్రాలను మరొకరు ప్రతి అస్త్రాలతో ప్రతిఘటించారు. అతికాయుడు అభేద్యమైన కవచం ధరించి ఉండటంచేత లక్ష్మణుడి బాణాలు అతన్ని ఏమీ చెయ్యలేకపోయాయి. ఈ సంగతి గ్రహించి, లక్ష్మణుడు బ్రహ్మాస్త్రం ప్రయోగించి అతికాయుడి తల నరికేశాడు.

ఆరుగురు మహాయోధులైన రాక్షస వీరులూ చచ్చారని వినగానే రావణుడు అంతులేని దుఃఖసముద్రంలో మునిగి





పోయాడు. అప్పుడు ఇంద్రజిత్తు తన తండ్రిని చూసి, "ఇంద్రజిత్తు బతికి ఉండగానే ఈ విచారం దేనికి? నే నిప్పుడే వెళ్ళి ఆ రామలక్ష్మణులను యుద్ధంలో చంపి తిరిగి వస్తాను," అన్నాడు. రావణుడు సరేనన్నాడు.

ఇంద్రజిత్తు ఉత్తమమైన గాడిదలు కట్టిన రథం పైన ఎక్కి, యుద్ధభూమికి బయలు దేరాడు. ధనుర్ధరులైన రాక్షసవీరు లనేకులు ఏనుగుల పైనా, గుర్రాల పైనా ఎక్కి, ప్రాసాలూ, ముద్గరాలూ, ఖడ్గాలూ, గదలూ తీసుకుని ఇంద్రజిత్తు వెంట యుద్ధానికి బయలుదేరారు.

యుద్ధభూమిలో, తన రథం చుట్టూ రాక్షసులను కాపలా ఉంచి, ఇంద్రజిత్తు హవిస్సులను హోమం చేసి, నల్లమేకను బలి ఇచ్చాడు. అగ్ని పొగలేకుండా మండి అతనికి విజయాన్ని సూచించింది. తరవాత ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రం జపించి, దానితో తన ధనుస్సునూ, రథాన్నీ అభిమంత్రించాడు. ఇదంతా పూర్తి అయాక ఇంద్రజిత్తు తన రథంతోనూ, సారథితోనూ సహా ఆకాశం లోకి వెళ్ళి అంతర్ధానమైపోయాడు. రాక్షస సేన అమితోత్సాహంతో యుద్ధానికి కదిలింది.

వానరసేనపై దారుణమైన హత్యాకాండ సాగింది. ప్రముఖ వానరవీరులైన గంధమాదనుడూ, నలుడూ, మైందుడూ, గజుడూ, జాంబవంతుడూ, సుగ్రీవుడూ, ఋషభుడూ, అంగదుడూ, ద్వివిదుడూ ఇంద్రజిత్తు ప్రయోగించిన తీవ్రమైన బాణాలతో గాయపడ్డారు; కొందరు మూర్ఛపోయారు. ఇంక చచ్చిన వానరులకు లెక్కే లేదు. ఇంద్రజిత్తు ఆకాశంలో ఎక్కడ ఉన్నదీ వానరులకు కనిపించనైనా లేదు.

ఇంద్రజిత్తు కురిపించే బాణవర్షం రామలక్ష్మణుల పైన కూడా పడింది. రాముడు లక్ష్మణుడితో, "కంటికైనా కనిపించని ఈ ఇంద్రజిత్తుతో యుద్ధం చెయ్యటం







మనకు సాధ్యమయే పని కాదు. అతని అస్త్రాల ఫలితంగా వానరసేన అంతా మూర్ఛపడి ఉన్నది. మనం కూడా మూర్ఛ వచ్చినట్టు పడిపోతే ఇంద్రజిత్తు తృప్తిపడి వెళ్ళిపోతాడు," అన్నాడు.

రామలక్ష్మణులు కూడా మూర్ఛితులై పడినట్టు కనిపించగానే ఇంద్రజిత్తు పరమ సంతోషంతో లంకకు తిరిగి వెళ్ళాడు. రామలక్ష్మణులు మూర్ఛలో ఉండటం చూసి వానరసేన కలవరం చెందింది. సుగ్రీవుడూ, నీలుడూ, అంగదుడూ, జాంబవంతుడూ నిజంగానే ఒళ్ళు తెలియని మూర్ఛలో ఉన్నారు.

రామలక్ష్మణులను చూసి కంగారు పడే వానరులతో విభీషణుడు, "మీరు కంగారు పడకండి. రామలక్ష్మణులు మూర్ఛ నటిస్తున్నారు, అంతే!" అన్నాడు.

రాత్రి, చీకటి. మూర్ఛపడి ఉన్న వానరులలో ప్రాణాలతో ఉన్నవారెవరో, చచ్చిన వారెవరో తెలియటం లేదు. అందుచేత హనుమంతుడూ, విభీషణుడూ చెరొక కొరవి తీసుకుని వెదక నారంభించారు. ఇంద్రజిత్తు ఆ సాయంకాలం అయిదు గడియల కాలంలో అరవైఏడు కోట్ల వానరులను పడగొట్టాడు. పడిపోయిన



వారిలో సుగ్రీవుడూ, అంగదుడూ, నీలుడూ శరభుడూ మొదలైన వా రెందరో వారికి కనిపించారు. వారు జాంబవంతుడి కోసం వెతికారు. మహా వృద్ధుడైన జాంబవంతుడు స్పృహతోనే కనిపించాడు.

విభీషణుడు జాంబవంతుణ్ణి సమీపించి, "తాతా, ప్రాణాలతో ఉన్నావు గద!" అన్నాడు.

జాంబవంతుడు హీనస్వరంతో, "ఆ మాట్లాడేది విభీషణుడా, నాయనా? నాకు కళ్ళు కనిపించటం లేదు. హనుమంతుడు బాగా ఉన్నాడా?" అని అడిగాడు.







"తాతా, సుగ్రీవుణ్ణీ, అంగదుణ్ణీ, రామ లక్ష్మణులనూ గురించి అడగకుండా హనుమంతుడి మాట అడుగుతున్నావేం?" అని విభీషణు డన్నాడు.

"హనుమంతుడి మాట ఎందు కడిగానంటావా? చెబుతా విను. హనుమంతుడొక్కడే ఉండి ఈ వానరసేన అంతా చచ్చినా అది బతికి ఉన్నట్టే. అలా కాక హనుమంతుడు పోయి వానరసేన అంతా బతికి ఉన్నప్పటికీ అది చచ్చిన దానితో సమానమే. నాయనా, ఆ హనుమంతుడు బ్రతికి ఉన్నంతకాలమే మాకు జీవితం పైన ఆశ!" అన్నాడు జాంబవంతుడు.

ఈ మాటలు వింటున్న హనుమంతుడు ఎంతో గౌరవభావంతో జాంబవంతుణ్ణి సమీపించి, అతని కాళ్ళు పట్టుకుని నమస్కారం చేశాడు.

హనుమంతుడి కంఠం వినిపించగానే జాంబవంతుడికి ప్రాణం లేచి వచ్చింది.

"నాయనా, హనుమంతుడా! ఇలారా! ఈ వానరులను కాపాడే భారం ఇప్పుడు నీదే. ఈ పని నీ వల్ల తప్ప మరొకరి వల్ల కాదు. నీవు సముద్రం దాటి హిమవత్పర్వతానికి వెళ్ళాలి. అక్కడ అన్నిటి కన్న ఎత్తుగా కనిపించే శిఖరాలు ఋషభమూ, కైలాసమూనూ. ఆ రెంటికీ నడుమగా ఓషధీ పర్వతం ఉన్నది. దాని శిఖరం మీద కాంతివంతమైన దివ్యౌషధులు నాలుగున్నాయి. వాటి పేరు విశల్యకరణీ, మృతసంజీవనీ, సౌవర్ణకరణీ, సంధానకరణీ. ఆ నాలుగు ఓషధులనూ తీసుకుని శీఘ్రంగా తిరిగిరా!" అని జాంబవంతుడు హనుమంతుణ్ణి హెచ్చరించాడు. వాటితో వానరులను బ్రతికించవచ్చునని ఆయన అన్నాడు.

వెంటనే హనుమంతుడా రాత్రివేళ ఒక్క దూకున పర్వత శిఖరం మీదికి ఎక్కి శరీరం పెంచి, రాక్షసులు అడలుకునేటట్టుగా పెడబొబ్బ పెట్టి ఆకాశంలోకి లేచాడు.





# యుద్ధకాండ

**జాం**బవంతుడు ప్రేరేపించగా హనుమంతుడు వాయు వేగంతో ఆకాశ మార్గాన హిమాలయ పర్వతాలకు పోయి, అక్కడ ఉన్న మంచు శిఖరాలూ, గుహలూ, గొప్ప క్షేత్రాలైన బ్రహ్మకోశమూ, కైలాసమూ, హయగ్రీవమూ, బ్రహ్మకపాలమూ, కుబేర స్థానమూ, పాతాళరంధ్రమూ, కాంచన శృంగమూ, రాత్రులు కూడా ప్రకాశించే సర్వౌషధి పర్వతమూ చూస్తూ, సర్వౌషధి పర్వతం పైన దిగి, ఓషధుల కోసం వెదకసాగాడు. ఆ సంగతి తెలిసి దివ్యౌషధులు అంతర్ధానమయాయి.

హనుమంతుడికి పట్టరాని కోపం వచ్చింది. అతను పెద్దపెట్టున అరిచి పర్వతంతో, "రాముడి పైన జాలి తలవరాదని నిశ్చయించుకున్నావా ఏమిటి? నిన్ను నా చేతులతో పెరికి, పిండి చేసేస్తాను," అన్నాడు. అంటూనే హనుమంతుడు ఆ పర్వత శిఖరాన్ని పెకలించి తిరిగి ఆకాశ మార్గం పట్టాడు.

పర్వత శిఖరంతో సహా తిరిగి వస్తున్న హనుమంతుణ్ణి చూసి వానరులు గట్టిగా అరిచారు. పని చేసుకుని వస్తున్న ఆనందంలో హనుమంతుడు కూడా అరిచాడు. ఈ అరుపులూ, ఆ అరుపులూ విన్న రాక్షసులు భయంతో అరిచారు.

హనుమంతుడు ఓషధి పర్వతంతో సహా త్రికూట పర్వతం మీద వానర సేన మధ్య వాలి, ప్రముఖ వానరులకు నమస్కారాలు చేసి, విభీషణుణ్ణి కౌగిలించుకున్నాడు.







రామ లక్ష్మణులూ, ఇతర వానర వీరులూ దివ్యౌషధుల వాసనకు బాణాల బాధ పోగొట్టుకున్నారు. యుద్ధంలో చచ్చిపోయిన వానరులు సైతం దివ్యౌషధుల గాలి సోకగానే నిద్ర లేచిన వారి లాగా లేచికూర్చున్నారు. వానరులు యుద్ధంలో చనిపోయిన రాక్షసుల నందరినీ సముద్రంలో పడవేశారు. హనుమంతుడు ఓషధి పర్వత శిఖరాన్ని తీసుకుపోయి యథాస్థానంలో ఉంచి తిరిగి వచ్చాడు.

అప్పుడు సుగ్రీవుడు హనుమంతుడితో, "తమ్ముడైన కుంభకర్ణుడూ, కొడుకులూ చచ్చారు గనుక ఇప్పుడు రావణుడు యుద్ధానికి రాడు. మనలో బల వేగాలు గల వానరులు ఈ రాత్రి దివిటీలు తీసుకుని వెళ్ళి లంకపై పడాలి," అన్నాడు.

సూర్యాస్తమయమై భయంకరమైన రాత్రి రాగానే వానర వీరులు దివిటీలు పట్టుకుని లంక కేసి వెళ్ళారు. వారి ధాటికి బెదిరి నగర ద్వార రక్షకులైన రాక్షసులు పారిపోయారు. తమను అడ్డే వారెవరూ లేక, వానరులు నగరం ప్రవేశించి, ద్వారాల లోనూ, బురుజుల లోనూ, రాజ వీధుల లోనూ, ఇతర వీధు లన్నిటా నిప్పు పెట్టారు. లంక అంతా అంటుకుని తగలబడ సాగింది. ఆకాశ మంత ఎత్తున్న మేడలు కాలి, కూలిపోయాయి. ఇళ్ళతో బాటు విలువ గల వస్తువులూ, వస్త్రాలూ, శాలువలూ, రత్న కంబళాలూ, నగలూ, ఆయుధాలూ, కవచాలూ, సమస్తమూ తగలబడిపోయాయి. అనేక మంది రాక్షసులు కాలిపోయారు. రాక్షస స్త్రీలు హాహాకారాలు చేశారు. గుర్రాలూ, ఏనుగులూ కట్లు తెంచుకుని భీభత్సంగా పరిగెత్తాయి. తగలబడి పోతున్న లంకా నగరం సముద్రంలో ప్రతిబింబించి సముద్రం కూడా ఎర్రగా కనబడింది.

ఒక వంక వానరులు సంతోషం తోనూ, రాక్షసులు దుఃఖం తోనూ కేకలు పెడు







తూంటే, రెండు ధ్వనులనూ మించి రాముడి బాణం చేసే ధ్వని వినపడింది. అది విని రాక్షసులు యుద్ధానికి సిద్ధపడ్డారు.

రావణుడి అంతఃపుర ద్వారం వద్దకు వెళ్ళి యుద్ధం చేయవలసిందిగా సుగ్రీవుడు వానరోత్తముల నాజ్ఞాపించాడు. వానరులు దివిటీలతో సహా ద్వారంలో నిలబడటం రావణుడు చూసి మండిపడి, ఆ వానరులను చంపి రమ్మని నికుంభుడూ, కుంభుడూ అనే వాళ్ళను, కుంభకర్ణుడి కొడుకులను, పంపాడు. వాళ్ళు అనేకమంది రాక్షస వీరులను వెంట బెట్టుకుని బయలుదేరి వచ్చారు. వానరులకూ రాక్షసులకూ తీవ్రమైన యుద్ధం జరిగింది. అనేక మంది రాక్షస వీరులు చచ్చారు. అంగదుడు మూర్ఛపోయాడు. చివరకు కుంభుడు సుగ్రీవుడి చేతిలో చచ్చాడు. అతని తమ్ముడైన నికుంభుణ్ణి హనుమంతుడు దారుణంగా చంపేశాడు. కుంభ నికుంభులు చావగానే వానరులు సింహనాదాలు చేశారు. రాక్షసులు భయపడ్డారు.

తరవాత రావణుడు వానరులతో యుద్ధం చెయ్యటానికి ఖరుడి కొడుకైన మకరాక్షుణ్ణి వెళ్ళమన్నాడు. మకరాక్షుడు రాక్షస సేనతో సహా రామ లక్ష్మణులతో యుద్ధం



చెయ్యటానికి బయలుదేరి వెళ్ళాడు. రాక్షసుల బాణ వర్షం ముందు తాళలేక వానరులు పారిపోయి వస్తుంటే వెంట తరుముకుంటూ వచ్చే రాక్షసులను రాముడు తన బాణాలతో నిలవేశాడు. తన తండ్రి అయిన ఖరుణ్ణి చంపినందుకు రాముణ్ణి చంపి పగ తీర్చుకుంటా నని మకరాక్షుడు ప్రగల్భాలాడాడు.

"మాటలతో విజయం కలగదు! యుద్ధం చెయ్యి," అన్నాడు రాముడు. ఇద్దరూ తలపడి భయంకరమైన యుద్ధం చేశారు. మకరాక్షుడు తన సారథినీ, గుర్రాలనూ, రథాన్నీ పోగొట్టుకుని చివరకు రాముడు ప్రయోగించిన ఆగ్నేయాస్త్రంతో







చచ్చి పడిపోయాడు. అతని వెంట ఉన్న రాక్షసు లందరూ నగరంలోకి పారిపోయారు.

మకరాక్షుడి మరణ వార్త విని రావణుడు కోపోద్రేకంతో పళ్ళు పటపట కొరికి, తన కొడుకైన ఇంద్రజిత్తును పిలిచి, "నాయనా దృశ్యంగానో, అదృశ్యంగానో రామ లక్ష్మణులతో యుద్ధం చేసి, వాళ్ళను చంపిరా! ఇంద్రుణ్ణి గెలిచిన నీకీ మానవమాత్రులొక లెక్కా?" అన్నాడు.

ఇంద్రజిత్తు తండ్రి ఆజ్ఞ పొంది యజ్ఞశాలకు వెళ్ళి, హోమం చేసి, ఒక నల్ల మేకను బలి ఇచ్చాడు. అగ్ని హోత్రం చక్కగా ప్రజ్వలించి విజయం సూచించింది.

ఇంద్రజిత్తు అదృశ్య శక్తి గల తన రథమెక్కి, యుద్ధరంగానికి వెళ్ళి, వానర సేనలో ఉన్న రామ లక్ష్మణులను గుర్తించి, వారిపై బాణాలు వర్షం లాగా కురిపించసాగాడు. ఇంద్రజిత్తు ఆకాశంలో ఎటుగా ఉన్నదీ కాన రాక, రామ లక్ష్మణులు ఆకాశ మంతా బాణాలతోనూ, దివ్యాస్త్రాల తోనూ నింపేశారు.

ఇంద్రజిత్తు వేసే బాణాలు ఎటునుంచి వస్తున్నదీ కనిపెట్టి, రామ లక్ష్మణులు అటుగా తమ బాణాలను ప్రయోగించారు. అయితే ఇంద్రజిత్తు ఆకాశ మంతటా సంచరిస్తూడటం చేత వారి బాణా లతనికి తగలలేదు. ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణాలతో రామ లక్ష్మణుల శరీరాల రక్తప్రవాహాలు కారాయి, వానరులు గుంపులు గుంపులుగా చచ్చారు. లక్ష్మణుడికి కోపం వచ్చి, "బ్రహ్మాస్త్రం ప్రయోగించి రాక్షసుల నందరినీ చంపేస్తాను," అన్నాడు.

"ఒక్కడి కోసం మనతో యుద్ధం చెయ్యని వారందరినీ చంపటం ఉచితం కాదు. చేతనైతే ఇంద్రజిత్తు నొక్కణ్ణే చంపుదాం," అన్నాడు రాముడు.

అంతలో ఇంద్రజిత్తు ఒక మాయ ఆలోచించాడు. అత నొక మాయ సీతను









ఉండటం చూసి హనుమంతుడు చాలా బాధపడి, ఏ ఉద్దేశంతో ఇంద్రజిత్తు అమెను తెస్తూ ఉండి ఉంటాడా అని ఆలోచించి, పక్క వారిని అడుగుతుండగా ఇంద్రజిత్తు మాయా సీతను జుట్టు పట్టుకుని, కత్తితో కొట్టాడు. అమె "రామా! రామా!" అంటూ ఏడ్చింది.

హనుమంతుడు ఇంద్రజిత్తు ముందుకు వెళ్ళి, అతన్ని నానా తిట్లూ తిట్టి, "ఈ సీత నీ కే విధమైన అపకారం చేసింది? అమె నెందుకు చంప జూస్తున్నావు?" అని అడిగాడు.

"ఈ సీత మూలానే గదా సుగ్రీవుడూ, రాముడూ ఈ లంకకు వచ్చారు? ఈమెను ఇప్పుడు నీ ఎదటే చంపి, ఆ తరవాత రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ, నిన్నూ, సుగ్రీవుణ్ణీ, ఆచారం పోగొట్టుకున్న ఆ విభీషణుణ్ణీ చంపేస్తాను," అన్నాడు ఇంద్రజిత్తు. వెంటనే అతను తన చేతి కత్తితో మాయా సీతను నరికేశాడు.

"నీ కళ్ళ ఎదటనే సీతను చంపేశాను. ఇక మీ ప్రయత్న మంతా వృథా!" అంటూ ఇంద్రజిత్తు పెద్ద పెట్టున సింహ నాదం చేశాడు. వానరులు భయపడి పారిపోసాగారు.

చేసి, అమెను రథం మీద పెట్టుకుని, వానరులు చూస్తుండగా అమెను చంపి, రామ లక్ష్మణులకు మనస్తాపం కలిగించే ఉద్దేశ్యంతో వానర సేన కెదురుగా వచ్చాడు. ఇంద్రజిత్తు కళ్ళకు కనపడగానే వానరులు యుద్ధోత్సాహం చెందారు. హనుమంతుడు ఒక పెద్ద పర్వత శిఖరం పట్టుకుని వానరులకు ముందు నిలబడ్డాడు.

అంతలో హనుమంతుడికి ఇంద్రజిత్తు రథంలో సీత కనిపించింది. అమె మాసిన బట్ట కట్టుకుని, దుమ్ము కొట్టుకుని, దీన వదనంతో, తాను కొద్ది కాలం క్రితం చూసి నట్టుగానే ఉన్నది. సీత ఇంద్రజిత్తు రథంలో









అప్పుడు హనుమంతుడు వారితో, "ఎక్కడికి పారిపోతారు ? మీ పరాక్రమమంతా ఏమయింది ? నేను ముందు నడుస్తాను, నా వెంట రండి," అని అందరినీ యుద్ధోన్ముఖులను చేశాడు. అందరూ కలిసి రాక్షస సేనపై పడి చంప నారంభించారు.

హనుమంతుడు ఒక వైపు దుఃఖంతోనూ, మరొక వైపు కోపంతోనూ తపించిపోతూ ఇంద్రజిత్తు పైన ఒక పెద్ద శిల విసిరాడు. కాని అది అతనికి తగలలేదు. అయినా వానరులు హనుమంతుడి చర్యతో ఉత్సాహం వచ్చి రాక్షస సైన్యాన్ని మట్టుబెట్టసాగారు.

హనుమంతు డప్పుడు తోటి వానరులతో, "మనం ఏ సీత కోసం వచ్చామో, ఎవరి కోసం ప్రాణా లొడ్డి యుద్ధం చేస్తున్నామో, ఆ సీత కాస్తా చంపబడింది. ఇంద్రజిత్తు సీతను చంపాడన్న వార్త రాముడికీ, సుగ్రీవుడికీ చెప్పి, వారేం చెయ్యమంటే అది చేద్దాం," అన్నాడు. వానరులు వెనక్కు తిరిగి వెళ్ళిపోయారు. వా రలా వెళ్ళిపోవటం చూసి ఇంద్రజిత్తు హోమం చెయ్యటం కోసం నికుంభిళ చైత్యానికి వెళ్ళాడు.

ఈ లోపల రాముడికి పశ్చిమ ద్వారం వైపు నుంచి యుద్ధ కోలాహలం వినిపించింది. అతను జాంబవంతుడితో, "మన



హనుమంతుడు రాక్షసులతో పెద్ద ఎత్తున యుద్ధం చేస్తున్నట్టున్నది. అతనికి సహాయం వెళ్ళు," అన్నాడు. జాంబవంతుడు పశ్చిమ ద్వారం దిక్కుగా వెళుతూంటే దారిలో హనుమంతుడూ, ఇతర వానర వీరులూ ఎదురుగా రావటం చూశాడు.

హనుమంతుడు యుద్ధ రంగానికి బయలుదేరిన భల్లూక సేనను వెనక్కు మళ్ళమని చెప్పి, త్వరగా రాముడున్న చోటికి వెళ్ళి, తన ఎదుటనే ఇంద్రజిత్తు సీతను చంపేసినట్టు చెప్పాడు.

ఈ మాట వింటూనే రాముడు మొదలు నరికిన చెట్టు లాగా పడిపోయాడు. దూర







దూరంగా ఉన్న వానరులందరూ పరిగెత్తు కొచ్చారు. రాముడి ముఖాన నీరు చల్లారు. లక్ష్మణుడు రాముణ్ణి ఓదార్చాడు. రాముడు లక్ష్మణుడి తొడపై తల పెట్టుకుని ఎంతో దుఃఖించాడు.

అంతలో అక్కడికి విభీషణుడు తన నలుగురు మంత్రులతోనూ వచ్చి, "అందరూ విచారంగా ఉన్నట్టున్నారే? ఏమిటి కారణం?" అని అడిగాడు

"ఇంద్రజిత్తు సీతను చంపేసినట్టు హనుమంతుడు వచ్చి చెప్పేసరికి రాముడు దుఃఖపడుతున్నాడు," అని లక్ష్మణుడు విభీషణుడితో అన్నాడు.

"అదంతా వట్టి మాట. రావణుడు సీతకు అంత కీడు ఎన్నటికీ జరగనివ్వడు. సీతను రాముడి కిచ్చెయ్యమని నే నెంత చెప్పినా సీతను విడిచి ఉండటానికి అంగీకరించని వాడు సీతను చంపనిస్తాడా? ఇంద్రజిత్తు సీతను చూడనైనా లేడు, వా డామెను తెచ్చి చంపగలడా? ఇప్పుడు రావణుడికి ఆ ఇంద్రజిత్తు తప్ప మరెవడూ లేడు. ఇంద్రజిత్తు విజయం కోసం హోమం చెయ్యటానికి నికుంభిళానికి వెళతాడు. ఈ లోపల వానరులు వచ్చి తనకు యజ్ఞ భంగం కలగ చెయ్యకుండా చెయ్యటాని కేదో మాయ పన్నాడు. ఆ మాయ పారింది. మీ రంతా పుట్టెడు దుఃఖంలో ఉన్నారు. అక్కడ వాడు నిర్విఘ్నంగా హోమం పూర్తి చేస్తాడు. ఆ తరవాత దేవతలూ, దానవులూ ఏకమై ఎత్తి వచ్చినా వాడి ముందు నిలవలేరు. కనక నేను చెప్పే దేమంటే, వాడా హోమం పూర్తి చేసే లోగా మనం నికుంభిళానికి పోదాం. రామా! నిర్విచారంగా నీ విక్కడే ఉండి, మా వెంట లక్ష్మణుణ్ణి పంపించు. అతను ఇంద్రజిత్తును చంపగలుగుతాడు. ఏ మాత్రమూ ఆలస్యం లేకుండా బయలుదేరాలి," అన్నాడు విభీషణుడు.





# యుద్ధకాండ

దుఃఖంతో మతి చెడి ఉన్న రాముడితో విభీషణుడు మరొక విషయం కూడా బయట పెట్టాడు. "నికుంభిలా హోమం చేస్తూండగా మధ్యలో ఎవడు నీతో యుద్ధం చేస్తాడో వాడి చేతిలో నీకు చావున్నది," అని బ్రహ్మ ఇంద్రజిత్తుకు చెప్పాడు. ఇప్పుడా హోమాన్ని భంగ పరచటానికి అవకాశం దొరికింది.

తరవాత రాముడి ఆజ్ఞ పొంది లక్ష్మణుడు సుగ్రీవ హనుమంత విభీషణులనూ, వానర సేననూ వెంట బెట్టుకుని, ఇంద్రజిత్తు హోమ కార్యం భంగం చేసి అతణ్ణి చంప టానికి బయలుదేరాడు. వారి దారికి అడ్డంగా రాక్షస సేన నిలబడి ఉన్నది. ఇంద్రజిత్తు హోమం పూర్తి చేసే లోపలనే ఆ రాక్షస సేనను నిర్మూలించవలసి ఉంటుందని లక్ష్మణుడితో విభీషణు డన్నాడు. ఆ సేన నిర్మూలమయితే హోమం ముగియకపోయినా ఇంద్రజిత్తు బయలుదేరి వస్తాడు, అప్పుడతన్ని తేలికగా కడతేర్చవచ్చు.

ఈ మాట విని వానరసేన రాక్షససేనపై విరుచుకుపడింది. ఉభయపక్షాలూ దారుణంగా పోరాడాయి. వానరులూ, రాక్షసులూ కూడా పెద్ద సంఖ్యలోనే చచ్చారుగాని, రాక్షసులు వానరుల ముందు నిలవలేక బెదిరిపోయారు.

ఆ వార్త విని ఇంద్రజిత్తు హోమకార్యం పూర్తికాకుండానే లేచి వచ్చి రథమెక్కాడు. రాక్షససేన అతని రథం చుట్టూ మూగింది.







కాని హనుమంతుడు పర్వతాకారం ధరించి, పెద్ద పెద్ద చెట్లతో రాక్షసులను చావ మోద సాగాడు. రాక్షసులు వేల సంఖ్యలో హనుమంతుణ్ణి చుట్టు ముట్టారు. తన మీద రకరకాల ఆయుధాలను ప్రయోగించే ఆ రాక్షసులందరితోనూ హనుమంతుడు ఒకేసారి భయంకరంగా యుద్ధం చేశాడు.

రాక్షసులను అదేపనిగా హనుమంతుడు మట్టుపెట్టుతూ ఉండటం చూసి ఇంద్రజిత్తు తన రథాన్ని అతనికేసి నడిపించాడు. ఇంద్రజిత్తు వేసే బాణాలతో తీవ్రంగా గాయపడి హనుమంతుడు, "దుర్మార్గుడా, నీవు నిజంగా వీరుడవైతే ఆయుధాలు లేకుండా వట్టి చేతులతో నాతో యుద్ధం చెయ్యి," అని అతడి కేసి వెళ్ళాడు.

"ఇంద్రజిత్తు హనుమంతుణ్ణి బాణాలతో చంపెయ్యగలడు. నీవు వెళ్ళి ఇంద్రజిత్తు నెదుర్కొని యుద్ధం చేసి చంపెయ్యి," అని లక్ష్మణుడితో విభీషణు డన్నాడు.

వెంటనే ఇద్దరూ కలిసి నికుంభిల కేసి వెళ్ళారు. అది నల్లని రాక్షసిలాగా కనిపించే జమ్మి చెట్టు కింద ఉన్నది. ఇక్కడే ఇంద్రజిత్తు భూతాలకు బలులిచ్చి, యుద్ధానికి బయలుదేరుతాడు.

"లక్ష్మణా, ఇంద్రజిత్తు జమ్మి చెట్టును ప్రవేశించక ముందే అతన్ని రథాశ్వసారథి సహితంగా నిర్మూలించు," అన్నాడు విభీషణుడు. లక్ష్మణుడు చప్పున జమ్మి చెట్టు మొదలు వద్దకు వెళ్ళి నిలబడి, ఇంద్రజిత్తును తనతో యుద్ధానికి రావలసిందిగా అహ్వానించాడు.

ఇంద్రజిత్తు లక్ష్మణుడితో ఏమీ అనక, విభీషణుడి కేసి తిరిగి, "విభీషణా, నీకు కులాభిమానం లేదు. ఈ గడ్డ మీద పుట్టి పెరిగిన వాడివి నా కెలా ద్రోహం తల పెట్టావు? నీకు బంధుత్వం గాని, మమకారం గాని, ధర్మం గాని లేదు. అయిన వారిని వదిలి శత్రువులకు భృత్యుడ





వయావు! అయిన వారి మధ్య గౌరవంగా ఉండటం కన్న శత్రువుల వద్ద నీచుడుగా ఉండటం నీకు సమ్మతమయింది. నీ బుద్ధి నశించింది. అందుకే నా హోమానికి విఘ్నం కలిగించటానికి లక్ష్మణుణ్ణి ప్రోత్సహించి జమ్మిచెట్టు దగ్గిరికి తీసుకువచ్చావు. ఇలాటి పని ఇంకెవడూ చెయ్యడు," అన్నాడు.

ఆ మాటలకు విభీషణుడు, "నా సంగతి తెలియనట్టుగా ఎందు కిలా మాట్లాడతావు? నేను రాక్షసుడనై పుట్టానే గాని, నాది రాక్షస స్వభావం కాదు. నేను అధర్మం సహించలేకనే నా సొంత అన్నను వదిలిపెట్టేశాను. మంచి వాడైనా పాపులను అంటిపెట్టుకుని పాపాత్ముడౌతాడు. దుష్ట సర్పాలను దూరంగా ఉంచాలి. పర ధనాన్నీ, పర స్త్రీలను కోరటమూ, స్నేహితులను నమ్మక పోవటమూ నాశహేతువులు. వాటిమూలంగా నీ తండ్రీ, నీవూ కూడా చావనున్నారు. మాయా సీతను వధించి రామ లక్ష్మణులకు అవమానం కలిగించిన నీవు బతికి ఉండటానికి తగవు. లక్ష్మణుడి చేతిలో చచ్చి నరకానికి వెళ్ళు," అన్నాడు.

ఇంద్రజిత్తు మహాకోపంతో అస్త్రాలు ధరించి రథ మెక్కి, హనుమంతుడి వీపు



మీద ఉన్న లక్ష్మణుడితో, "రాత్రి యుద్ధంలో నిన్నూ, నీ అన్ననూ, నా బాణాలతో మూర్ఛపోగొట్టాను. అది నీవు మరిచి అయినా ఉండాలి, లేక నీకు చావు దగ్గిర పడి అయినా ఉండాలి," అన్నాడు.

దానికి లక్ష్మణుడు, "ఓరీ రాక్షసుడా? నీవు మమ్మల్ని మాటలతోనే చంపుతున్నావు గాని నిజంగా చంపటం నీ తరం కాదు. కార్యశూరుడు ప్రగల్భాలు పలకడు. నీవు దొంగ లాగా మాకు కనిపించకుండా యుద్ధం చేశావు. అది వీరుడు చేసే పనికాదు. ఇలా ఎదురుగా కనిపిస్తూ నీ ప్రతాపం ఏ పాటిదో చూపు," అన్నాడు.







మరుక్షణమే ఇంద్రజిత్తు అమిత వేగంగా లక్ష్మణుణ్ణి తన తీక్ష్ణమైన బాణాల పరం పరతో కొట్టి సింహనాదం చేశాడు. లక్ష్మ ణుడు కూడా ఇంద్రజిత్తును క్రూరమైన బాణాలతో కొట్టాడు. ఇద్దరూ సమంగా యుద్ధం సాగించారు.

మధ్యలో విభీషణుడు లక్ష్మణుడితో, "ఇంద్రజిత్తు ధైర్యం సన్నగిల్లుతున్నది. వాడి ముఖంలో వెలవెలపాటు కనిపిస్తు న్నది. వీలయినంత త్వరలో వీణ్ణి చంపెయ్యి," అని హెచ్చరించాడు. నిజంగానే లక్ష్మణుడి బాణాలకు ఇంద్రజిత్తు క్షణం పాటు స్పృహ తప్పి, అంతలోనే మళ్ళీ తెప్పరిల్లాడు. మళ్ళీ ఇద్దరూ యుద్ధం సాగించారు. ఇద్దరూ అమితమైన పట్టుదలతో పోరాడుతూ ఒకరి నొకరు బాగా గాయ పరచుకున్నారు.

వారి యుద్ధం చూస్తూంటే విభీషణుడికి కూడా యుద్ధం చెయ్యాలనిపించింది. అతను తన నలుగురు మంత్రులతో సహా రాక్షసులను సంహరించుతూ, వానరులతో, "వానర వీరులారా, ఇంక రావణుడికి మిగిలి ఉన్న వీరుడు ఈ ఇంద్రజిత్తు ఒక్కడే. మిగిలిన వాళ్ళ నందర్నీ మీరే చంపేశారు. వీడు నా అన్న కొడుకు, అందుచేత నా చేత్తో నేను వీణ్ణి చంపలేను. ఆ పని లక్ష్మణుడు చేస్తాడు. ఇంద్రజిత్తుకు అండగా ఉన్న రాక్షసులను మీరు చంపేసి, ఇంద్రజిత్తు చావుకు తోడ్పడండి," అన్నాడు.

వానరవీరులు ఎంతో ఉత్సాహంతో తోక లాడిస్తూ, సింహనాదాలు చేస్తూ రాక్షసుల పైన తలపడ్డారు.

ఈ లోపల లక్ష్మణుడు ఇంద్రజిత్తు సారథిని చంపేశాడు. ఇంద్రజిత్తు తన రథాన్ని తానే నడుపుకుంటూ యుద్ధం సాగిం చాడు. ఆ సమయంలో నలుగురు వానర వీరులు ఇంద్రజిత్తు యొక్క రథాశ్వాల పైన పడి వాటిని చంపేశారు, అతని రథాన్ని





విరిచి పారేశారు. ఇంద్రజిత్తు నేల పైకి దిగి లక్ష్మణుడితో యుద్ధం సాగించాడు.

అతను తన రాక్షసులతో, "నేను రహస్యంగా నగరంలోకి పోయి ఇంకో రథంతో తిరిగి వస్తాను. నాకు అడ్డంగా నిలబడి మీరు వానరులతో యుద్ధం చేస్తూ ఉండండి. వానరులు నా దారికి అడ్డం రాకుండా చూడండి," అన్నాడు. అతను రాక్షసుల వెనక నుంచి, వానరుల కంట పడకుండా లంకా నగరంలోకి వెళ్ళి పోయాడు. అతను మరొక రథం పైన యుద్ధ భూమికి తిరిగి వచ్చి, లక్ష్మణ విభీషణుల నెదుర్కొన్నాడు. ఎప్పుడు వెళ్ళాడో తెలియకుండా మరొక రథంలో ప్రత్యక్షమైన ఇంద్రజిత్తు ఉపజ్ఞను వాళ్ళిద్దరూ మెచ్చుకున్నారు.

మళ్ళీ ఇంద్రజిత్తూ, లక్ష్మణుడూ యుద్ధం సాగించారు, మరొకసారి లక్ష్మణుడు ఇంద్రజిత్తు సారధిని చంపాడు. కాని రథాశ్వాలు సారధి అవసరం లేకుండానే రథాన్ని నడపవలిసిన విధంగా నడిపాయి. ఇంద్రజిత్తు లక్ష్మణుడితో బాటు విభీషణుడి మీద కూడా బాణాలు వేశాడు. విభీషణుడు మండిపడి తన గదతో ఇంద్రజిత్తు రథాశ్వాలను చంపేశాడు.



ఇంద్రజిత్తు నేల పైకి దూకి, శక్తి తీసుకుని విభీషణుడి పైన విసిరాడు. లక్ష్మణుడు దాన్ని తన బాణాలతోనే పది ముక్కలుగా నరికేశాడు. తరవాత ఇంద్రజిత్తూ, లక్ష్మణుడూ ఒకరి పైన ఒకరు దివ్యాస్త్రాలను ప్రయోగించుకున్నారు. అవి ఒకదాన్నొకటి తాకేసరికి నిప్పు రవ్వలూ, మంటలూ, పొగా బయలుదేరాయి. ఇలా కొంతసేపు ఒకరి అస్త్రాల నొకరు ధ్వంసం చేసుకున్నాక లక్ష్మణుడు ఒక దివ్య బాణంతో ఇంద్రజిత్తు తల నరికేశాడు.

విభీషణుడూ, వానరులూ సింహనాదాలు చేశారు. రాక్షసులు పారిపోయారు.







దేవేంద్రుణ్ణి సైతం జయించిన ఇంద్రజిత్తు లక్ష్మణుడి చేతిలో చచ్చిపోయాడని వినగానే రావణుడు మూర్ఛపోయాడు. అతను స్పృహ తెలిసి ఇంద్రజిత్తు కోసం చాలాసేపు దుఃఖించి, దుర్భరమైన రోషంతో, "అస్తమానమూ రాముణ్ణే ధ్యానించే సీత బతికి ఉండటం దేనికి? ఇప్పుడే చంపేస్తాను!" అంటూ కత్తి దూసి సీత ఉన్న చోటికి వేగంగా బయలుదేరాడు. అతన్ని మంత్రులూ, భార్యలూ వెంబడించి రాసాగారు. మంత్రులు వారించటానికి యత్నిస్తే రావణుడు వినిపించుకోలేదు.

సీత అతడి రౌద్రాకారాన్ని అంత దూరం లోనే చూసి తనకు చావు మూడిందని భయపడింది.

ఆనాడే హనుమంతుడి వీపు మీద ఎక్కి రాముడి వద్దకు వెళ్ళిపోనందుకు పశ్చాత్తాపపడింది.

చిట్టచివరకు రావణుడికి సుపార్శ్వుడనే మంత్రి అడ్డంపడి, "నీ వంటి బుద్ధిమంతుడు ఆడదాన్ని చంపట మేమిటి? చాతనయితే సీతను వశపరుచుకో. ఈ కోపమంతా రాముడి పైన చూపించు. ఇవాళ కృష్ణ చతుర్దశి. యుద్ధ ప్రయత్నం ప్రారం

ఇంద్రజిత్తును చంపేసి వానరులకు మితిలేని ఆనందాన్ని కలిగించి, లక్ష్మణుడు హనుమంతుణ్ణీ, విభీషణుణ్ణీ వెంటబెట్టుకుని సుగ్రీవుడూ, రాముడూ ఉన్న చోటికి వెళ్ళాడు. "ఇంద్రజిత్తు చచ్చాడు," అని లక్ష్మణుడు చెప్పగానే, రాముడు అతన్ని కౌగలించుకుని, "ఇక రావణుడూ చచ్చినవాడే. లక్ష్మణా, నీవు చేసినది చాలా గొప్ప పని!" అన్నాడు.

వైద్యంలో నిపుణుడైన సుషేణుడు వచ్చి, లక్ష్మణ విభీషణులకు గుచ్చుకున్న బాణాలు తీసేసి, చికిత్స చేశాడు. వానరసైనికులు ఉత్సాహంతో గంతులు వేయసాగారు.









ఖించి, రేపు అమావాశ్య నాడు రామలక్ష్మ ణులతో యుద్ధం చెయ్యి," అన్నాడు. సుపార్శ్వు డన్న మాటలు నచ్చి, రావణుడు ఇంటికి తిరిగి వెళ్ళాడు.

అతను తన సేనాపతులతో, "ఇవాళ మీరంతా వెళ్ళి రాముడితో యుద్ధం చెయ్యండి. అతన్ని మీరు చంపలేకపోయినా, మీతో పోరాడి నీరసించి ఉండే రాముణ్ణి నేను రేపు అవలీలగా చంపుతాను," అని చెప్పాడు.

రాక్షసులు యుద్ధానికి బయలుదేరి వెళ్ళి వానరులపై దారుణ యుద్ధకాండ సాగించే సరికి రాముడు పూనుకుని, వారిని తన బాణాలతో లక్షల సంఖ్యలో అంతమొందించాడు. లంకా నగరంలో చచ్చిన రాక్షసుల భార్యల ఆర్తనాదాలు మిన్ను ముట్టాయి.

ఇంక రావణుడు తానే స్వయంగా రామలక్ష్మణులను చంపటానికి బయలుదేరాడు. అతని వెంట రథాలపై మహాపార్శ్వుడూ, మహోదరుడూ, విరూపాక్షుడూ మొదలైనవారు బయలుదేరారు. అందరూ కలిసి, రామలక్ష్మణు లుండే ఉత్తర ద్వారం కేసి వెళ్ళారు.

రాక్షస సేన యుద్ధసన్నద్ధమై వస్తూండటం తెలిసి వానరులు కూడా యుద్ధానికి సిద్ధంగా నిలబడ్డారు. రావణుడు తన బాణాలతో వానరులను అపారమైన సంఖ్యలో చంపేస్తూ రాముడున్న చోటికి పోసాగాడు. అది చూసి సుగ్రీవుడు రాక్షస సేనల పైన కొండ రాళ్ళ వర్షం కురిపించి, రాక్షసులను కూడా అపారమైన సంఖ్యలో చంపసాగాడు. అప్పుడు విరూపాక్షుడు రథం మీది నుంచి ఒక ఏనుగు మీదికి మారి సుగ్రీవుడితో పోరాడ వచ్చాడు. సుగ్రీవు డతనితో భయంకరంగా యుద్ధం చేసి మొదట ఏనుగునూ తరవాత విరూపాక్షుణ్ణీ కూడా చంపేశాడు.

తన సైన్యాలు క్షీణించిపోతూ ఉండటం చూసి రావణుడు వానర సేనను నిర్మూ






లించమని మహోదరుణ్ణి ఆజ్ఞాపించాడు. సుగ్రీవుడు మహోదరుడితో కూడా చాలా సేపు యుద్ధం చేసి చివరకతన్ని చంపాడు. వానరులు సింహనాదాలు చేశారు.

ఈ లోపల మహాపార్శ్వుడు అంగదుడి సేన పైకి వెళ్ళి, అంగదుడితో ద్వంద్వ యుద్ధం చేసి, కొంత సేపటికి అతని చేతిలో ప్రాణాలు విడిచాడు.

తన వెంట వచ్చిన ముగ్గురు మంత్రులూ చావటం చూసి రావణుడు మహాకోపంతో రాముడి పైకి వెళ్ళి, యుద్ధం ప్రారంభించాడు. ఇద్దరూ ఒకరిపైన ఒకరు మహాస్త్రాలు ప్రయోగించుకున్నారు; ఒకరి అస్త్రాలను ఒకరు నిర్మూలించారు. చివరకు ఒకరి నొకరు బాణాలతో మర్మ స్థానాలలో కొట్టారు.

రాముడు రావణుణ్ణి తీవ్రంగా గాయపరిచి విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో లక్ష్మణుడు విల్లు ఎక్కుపెట్టి రావణుడి ధ్వజాన్నీ, వింటినీ విరగగొట్టాడు. విభీషణుడు గద తీసుకుని రావణుడి రథాశ్వాలను చంపాడు. రావణుడు రథం నుంచి కిందికి దిగి, తన తమ్ముడైన విభీషణుడి పైన ఒక శక్తిని ప్రయోగించాడు. లక్ష్మణుడా శక్తిని దారిలోనే తన బాణాలతో ఖండించాడు.

అది చూసి రావణుడు మరింత పెద్ద శక్తిని తీసి గిరగిరా తిప్పి, విభీషణుడి పై విసరబోయాడు. లక్ష్మణుడు రావణాసురుణ్ణి తన బాణాలతో పీడిస్తూ అతని ప్రయత్నానికి అంతరాయం కలిగించాడు. రావణుడు మహాకోపంతో ఆ శక్తిని లక్ష్మణుడి పైకే విసిరాడు. అది లక్ష్మణుడి రొమ్ములో లోతుగా దిగబడింది. లక్ష్మణుడు పడిపోయాడు.

రాముడది చూసి భరించరాని ఆగ్రహంతో రావణుడి పైన అతి దారుణమైన బాణాలు వేసి తీవ్రంగా బాధించాడు. రావణుడు రాముడి ధాటికి తట్టుకోలేక పారిపోయాడు.





# యుద్ధకాండ

రాముడి దెబ్బకు తట్టుకోలేక రావణుడు పారిపోయాడు. తరవాత రాముడు లక్ష్మణుడు పడిఉన్న చోటికి వచ్చి, ఊపిరి బరువుగా తీస్తూ కొన ప్రాణంతో ఉన్న లక్ష్మణుణ్ణి చూసి అధైర్యపడిపోయాడు. లక్ష్మణుడికి ప్రాణభయం ఉండదని సుషేణుడు రాముడికి ధైర్యం చెప్పి, హనుమంతుడితో, "జాంబవంతుడు చెప్పిన ఓషధీ పర్వతానికి వెళ్ళి, దాని దక్షిణ శిఖరం పైన ఉండే నాలుగు రకాల ఓషధులూ తీసుకురా," అన్నాడు.

హనుమంతుడు ఓషధీ పర్వతం దగ్గిరికి వెళ్ళాడు. కాని ఆ ఓషధు లేవో అతనికి తెలియలేదు. అందుచేత అతను మొత్తంగా శిఖరాన్నే తీసుకు పోదామనీ, లక్ష్మణుడికి కావలిసిన ఓషధి ఆ శిఖరం మీద ఎక్కడో ఉండకపోదనీ అనుకున్నాడు. అతనా పర్వత శిఖరాన్ని మూడు సార్లు అటూ ఇటూ కుదిలించి, పెకలించి తీసుకుపోయి యుద్ధభూమిలో వాలి, "నువు చెప్పిన మూలికలు గుర్తు తెలియక శిఖరాన్ని మొత్తంగా పెరికి తెచ్చాను," అని సుషేణుడితో చెప్పాడు.

సుషేణుడు తనకు కావలిసిన ఓషధిని పెల్లగించి, నలిపి, దాని రసాన్ని లక్ష్మణుడి ముక్కులో పిండాడు. దాని వాసన తగలగానే లక్ష్మణుడు లేచి కూర్చున్నాడు. రాముడు తన తమ్ముణ్ణి ఆలింగనం చేసుకుని ఆనందబాష్పాలు రాలుస్తూ, "లక్ష్మణా, నా అదృష్టం కొద్దీ నీవు చచ్చి మళ్ళీ







బతికావు. నువ్వే పోయిఉంటే నాకు సీత దేనికి? యుద్ధంలో విజయం దేనికి?" అన్నాడు.

అది విని లక్ష్మణుడు, "బలహీనుడి లాగా ఎందుకిలా మాట్లాడతావు? రావణుణ్ణి చంపి విభీషణుడికి పట్టం కడతానని ఇచ్చిన మాట నిలబెట్టుకోవద్దా? నా కోసం దిగులు పడి నిరాశ చెందక, రావణుణ్ణి యుద్ధంలో చంపెయ్యి," అన్నాడు.

లక్ష్మణు డిలా అనగానే రాముడు స్థిర చిత్తుడై విల్లు చేతబట్టాడు. ఈ లోపల రావణుడు కూడా మరొక రథ మెక్కి యుద్ధ సన్నద్ధుడై వచ్చాడు. రాముడు నేల పైనా, రావణుడు రథం లోనూ ఉండి యుద్ధం ప్రారంభించారు.

అంతలో ఇంద్రుడి సారథి అయిన మాతలి దేవలోకం నుంచి ఒక దివ్యమైన రథాన్నీ, కవచాన్నీ, విల్లునూ, బాణాలనూ, శక్తినీ తీసుకుని రాముడున్న చోటికి వచ్చి, "రామా, దేవేంద్రుడు నీకోసం వీటినన్నిటినీ పంపాడు. ఈ రథంలో ఎక్కి నీవు రావణుణ్ణి వధించు," అని చెప్పాడు. రాముడా రథానికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి అందులో ఎక్కాడు.

ఇద్దరూ ఒకరి పై ఒకరు మహాస్త్రాలు ప్రయోగించుకున్నారు. ఒకరి అస్త్రాలను మరొకరి అస్త్రాలు నిర్వీర్యపరచాయి. కొంత సేపు రావణుడు అతి భయంకరంగా యుద్ధం చేసి, రాముడికి చెయ్యీ కాలూ ఆడకుండా చేశాడు. అతను వజ్రాయుధంతో సమానమైన ఒక శూలాన్ని రాముడి పై ప్రయోగించే సరికి, రాముడు దాన్ని తన బాణాలతో నిరోధించ లేక, ఇంద్రుడు పంపిన శక్తిని ప్రయోగించి ఆ శూలాన్ని ధ్వంసం చేశాడు.

ఆ తరవాత రాముడు విజృంభించి యుద్ధం చేస్తూంటే రావణుడు ఉక్కిరి బిక్కిరి అయి ఆత్మరక్షణ కూడా చేసుకో





లేని స్థితిలో పడ్డాడు. అది చూసి రావణుడి సారథి తమ రథాన్ని యుద్ధరంగం నుంచి అవతలికి తోలుకు పోసాగాడు.

రావణుడికి తన సారథి పైన ఆగ్రహం వచ్చింది. "ఓరీ దుర్బుద్ధీ, నేను పిరికి వాణ్ణా, అసమర్థుణ్ణా, అస్త్రాలు లేనివాణ్ణా, యుక్తిలేనివాణ్ణా? ఏమనుకుని నీ యిష్టం వచ్చినట్టు రథాన్ని యుద్ధరంగం నుంచి తోలుకు పోతున్నావు? నా కీర్తి కాస్తా ధ్వంసం చేశావే! నీకు శత్రువులేమన్నా లంచంపెట్టారా ఏమిటి? వెంటనే రథాన్ని వెనక్కు తోలు," అన్నాడతను తన సారథితో.

"మహారాజా, నీ మేలు కోరి, నా విధిని పాటించి రథాన్ని పక్కకు తెచ్చాను. రాముడు చేసే యుద్ధానికి నీవు ప్రతి యుద్ధం చెయ్యటం లేదు. బ్రహ్మాండమైన యుద్ధం చేసి అలసిపోయి ఉన్నావు. గుర్రాలు కూడా డస్సి ఉన్నాయి. నీకూ వాటికీ కాస్త విశ్రాంతి లభించగలందుల కాపని చేశాను. రథం ఎప్పు డెలా నడపాలో తెలీకపోతే నేను సారథినే కాను. ఇప్పుడేం చెయ్య మంటావో చెప్పు, అలాగే చేస్తాను," అన్నాడు రావణుడి సారథి.

రావణుడు మెత్తబడి, తన సారథిని కాస్త పొగడి, "రాముడి కెదురుగా రథాన్ని





రావణుడితో యుద్ధం సాగించటానికి ముందుకు వచ్చాడు.

అతను మాతలితో, "ఈసారి రావణుణ్ణి నిశ్చయంగా చంపబోతున్నాను. నీవు రథాన్ని చాకచక్యంగా నడుపు. దేవేంద్రుడి రథ సారథివైన నీకు విశేషం చెప్ప నవసరం లేదు. ఏమాత్రం కూడా ఏమరు పాటు చెంద వద్దని జ్ఞాపకం చేస్తున్నా నంతే!" అన్నాడు.

తన రథం మూలాన రేగిన దుమ్ము రావణుణ్ణి చుట్టుముట్టే లాగా మాతలి రథాన్ని రావణుడి కేసి తోలాడు. రావణుడు మండిపడి రాముడి పైన బాణాలు వేశాడు. రాముడు ఇంద్రుడు పంపిన విల్లూ, బాణాలూ తీసుకుని రావణుడితో యుద్ధం ఆరంభించాడు.

తీసుకుపో!" అని చెప్పాడు. కొద్దిసేపటిలో రావణుడి రథం తిరిగి రాముడి ఎదటికి వచ్చి నిలబడింది.

ఆ సమయంలో రాముడు కూడా అమితంగా అలిసిపోయి, రావణుడితో యుద్ధం చేసే శక్తి లేని స్థితిలో ఉన్నాడు. అది కనిపెట్టి, యుద్ధం చూడవచ్చిన అగస్త్యుడు రాముణ్ణి సమీపించి, "రామా, నీకు ఆదిత్య హృదయం చెబుతాను. అది జపించి, శక్తి వంతుడవై రావణుడితో యుద్ధం చెయ్యి," అని రాముడికి ఆదిత్యహృదయం చెప్పాడు.

రాముడు దాన్ని మూడుసార్లు పఠించి, రెట్టింపైన బలం పొంది బాణం తీసుకుని

రామరావణ యుద్ధం ఎంత తీవ్రంగా సాగిందంటే ఉభయ పక్షాల వీరులూ యుద్ధం మానేసి ఆ ద్వంద్వ యుద్ధాన్ని చూడసాగారు. ఇద్దరూ తమ పరాక్రమాన్ని పూర్తిగా ప్రదర్శిస్తూ, అదే తమ తుది పోరాట మన్నట్టుగా యుద్ధం చేశారు.

ఇలా రామ రావణులు మహా భయంకర మైన యుద్ధం చేస్తుండగా, రాముడు ప్రయోగించిన అతి తీక్షణమైన బాణానికి రావ





ణుడి శిరస్సు తెగి నేలపైన పడిపోయింది. కాని, ఆ క్షణంలోనే రావణుడికి మరొక శిరస్సు పుట్టుకొచ్చింది. రాముడు దాన్ని కూడా ఖండించాడు. అది కిందపడే లోపుగా రావణుడికి మరొక శిరస్సు కనబడింది. ఈ విధంగా రాముడు రావణుడి తలను నూటఒక్కసారి ఖండించి కూడా అతన్ని ఏమీ చెయ్యలేకపోయాడు. తన వద్ద ఉన్న అమోఘమైన బాణాలన్నీ రావణుడి పై ఎందుకు వ్యర్థమయాయో రాముడికి అర్థంకాలేదు.

ఆ రామ రావణులు ఆ విధంగా, క్షణం విశ్రాంతి లేకుండా, ఏడు రాత్రులూ, ఏడు పగళ్ళూ పోరాటం సాగించారు. చూసి చూసి మాతలి రాముడితో, "వీణ్ణి చంపెయ్యక ఎందు కిలా తాత్సారం చేస్తున్నావు? వీడి మీద బ్రహ్మస్త్రం ప్రయోగించు," అన్నాడు.

మాతలి ఆ మాట అనగానే రాముడొక మహాసర్పం లాటి బాణాన్ని పైకి తీశాడు. దేదీప్యమానంగా వెలిగే ఆ బాణాన్ని బ్రహ్మ ఒకప్పుడు ఇంద్రుడి కోసం తయారుచేశాడు. అది చాలా బరువైనది, ఈకలు గలది, వజ్రం లాగా అతి కఠినమై ఇతర ఆయుధాలను ఛేదించ గలది. రాముడా బాణాన్ని ఎక్కు



పెట్టి మంత్రించి రావణుడి పైన వేశాడు. అది రావణుడి రొమ్మును ఛేదించి, అతని వీపులో నుంచి దూసుకుని బయటికి వచ్చేసింది. రావణుడు తన చేతిలో ఉండే ధనుర్బాణాలను వదిలేసి, ప్రాణాలుపోయి, రథం పై నుంచి నేల పైకి పడిపోయాడు.

అది చూసి హతశేషులైన రాక్షసులు పారిపోసాగారు. వానరులు చేతుల్లో చెట్లు పట్టుకుని, సింహనాదాలు చేస్తూ ఆ రాక్షసులను తరిమారు. రావణుడు చావగానే దేవదుందుభులు మోగాయి, పుష్పవర్షం కురిసింది. రాముణ్ణి భూమి పైన వానరులతో బాటు, ఆకాశం లోని దేవతలు కూడా







పొగడారు. రాముడూ, సుగ్రీవుడూ, అంగదుడూ కృతకృత్యులై చాలా సంతృప్తి చెందారు. ఇతర వానర ప్రముఖులూ, విభీషణుడూ రామ లక్ష్మణుల చుట్టూ మూగి వారిని ప్రశంసించారు.

తన అన్న పోయినందుకు విభీషణుడు బాధపడ్డాడు. ఒక్క సీతాపహరణ కారణంగా రావణుడు నాశనమయాడే గాని, అతను అనేక విధాల మహాపురుషు డనదగినవాడు; గొప్ప పండితుడు; నిష్ఠాపరుడు; అసమాన శౌర్య పరాక్రమాలు గలవాడు.

అన్న పోయాడని బాధపడుతున్న విభీషణుణ్ణి ఓదార్చుతూ రాముడు, "రావణుడు పిరికిచావు చావలేదు, వీరుడు లాగా పోరాడుతూ పోయాడు. యుద్ధంలో జయాపజయాలు దైవాధీనాలు. ఎంతటి మహావీరుడైనప్పటికీ శత్రువు చేతిలో మరణం పొందవచ్చు. వీరమరణం పొంది వీరస్వర్గం అందుకున్న వాడి కోసం శోకించ రాదు," అన్నాడు.

రాముడి అనుమతిపై విభీషణుడు తన అన్నకు శాస్త్రోక్తంగా దహనక్రియలు చేయబూనుకున్నాడు.

రావణుడు చచ్చాడని తెలియగానే అతని భార్యలు పెద్దపెట్టున ఏడుస్తూ, ఉత్తర ద్వారం కుండా వెలువడి, రావణుడి శవాన్ని వెతుక్కుంటూ వచ్చారు. చివరకు వా రతని శవాన్ని చూసి, దాని పైన పడి, గుండెలు అవిసే లాగా ఏడ్చారు; విభీషణుడు చెప్పినట్టు సీతను రాముడి కిచ్చినట్టయితే ఇంత దురన్యాయం జరిగేది కాదని ఆక్రోశించారు. "త్రిలోకాలనూ జయించి, దేవత లందరినీ అడలగొట్టి చివరి కొక మానవమాత్రుడి చేతిలో ప్రాణాలు వదిలావా?" అని మండోదరి విలపించింది.

"ఈ ఆడవాళ్ళ నందరినీ ఇళ్ళకు పంపి నీ అన్నకు ఉత్తరక్రియలు చెయ్యి," అని రాముడు విభీషణుడితో అన్నాడు. దుర్మా





ర్గుడూ, అవినీతిపరుడూ అయిన తన అన్నకు తాను సంస్కారం చెయ్యటం యుక్తంగా ఉంటుందో ఉండదో నని విభీషణుడు ధర్మసందేహం లేవదీశాడు. యుక్తంగానే ఉంటుందని రాముడు చెప్పిన మీదట అతను అందుకు పూనుకున్నాడు.

బ్రాహ్మణులు చందనపు చెక్కలతో చితి పేర్చి దాని పైన ఒక గొంగళి పరిచారు. రావణుడి శవాన్ని అలంకరించి చితి పైన పడుకోబెట్టారు. విభీషణుడు చితికి చిచ్చు పెట్టాడు. తరవాత అతను తడిబట్టలతో నీళ్ళు వదిలి, స్త్రీ జనాన్ని లంకకు పంపించి, రాముడి వద్దకు వచ్చాడు.

యుద్ధం చూడవచ్చిన దేవదానవ గంధర్వాదులు రామ పరాక్రమం గురించీ, వానరులు చేసిన యుద్ధం గురించీ మాట్లాడు కుంటూ తమతమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. రాముడు మాతలిని గౌరవించి, అతన్ని రథంతో సహా స్వర్గానికి పంపేశాడు. తరవాత రాముడు కృతజ్ఞతాపూర్వకంగా సుగ్రీవుణ్ణి కౌగలించుకుని, లక్ష్మణుడితో సహా శిబిరానికి వెళ్ళాడు.

అతను లక్ష్మణుడితో, "ఇప్పుడు వెంటనే జరగవలిసిన ముఖ్యమైన పని విభీషణుణ్ణి లంకా రాజ్యాభిషిక్తుణ్ణి చెయ్యటం. ఆ పని వెంటనే జరిపించు," అని చెప్పాడు.

లక్ష్మణుడు వానరులకు సువర్ణకలశా లిచ్చి సముద్ర జలం తెప్పించాడు. అతను విభీషణుణ్ణి సింహాసనం పైన కూర్చోబెట్టి ఆ జలంతో అభిషేకించాడు. విభీషణుడి మంత్రులూ, అతని పట్ల భక్తిగల రాక్షసులూ సంతోషించారు. విభీషణుడు తన ప్రజలకు నచ్చే మాటలు చెప్పాడు. రాక్షస పౌరులు అతనికి రకరకాల వస్తువులు కానుకలుగా అర్పించారు. విభీషణుడు కూడా రామ లక్ష్మణులకు దివ్యమైన వస్తువులను కాను కలుగా ఇచ్చాడు.





# యుద్ధకాండ

రాముడు హనుమంతుణ్ణి పిలిచి, "హనుమంతుడా, నీవు రాక్షస రాజైన విభీషణుడి అనుమతితో లంకకు వెళ్ళి, రావణుడి ఇంట్లో ఉన్న సీత వద్దకు వెళ్ళి, నేను సుగ్రీవ లక్ష్మణులతో సుఖంగా ఉన్నాననీ, నా చేత రావణుడు చచ్చాడనీ చెప్పి, ఆమె ఏం చెబుతుందో తెలుసుకురా!" అన్నాడు.

హనుమంతుడు లంకా నగరం ప్రవేశించి, రావణుడి ఇంటికి వెళ్ళి, అక్కడ ఒక చెట్టు కింద రాక్షస స్త్రీల మధ్య దుఃఖదేవత లాగా కూర్చుని ఉన్న సీతను సమీపించి, తన పేరు చెప్పుకుని, వినమ్రుడై నిలబడ్డాడు. సీత వెంటనే అతన్ని గుర్తు పట్టలేదు. ఆమె తనను గుర్తించి సౌమ్యురాలు కాగానే హనుమంతుడు ఇలా అన్నాడు:

"వైదేహీ, సుగ్రీవ లక్ష్మణ సమేతుడైన రాముడు కుశలంగా ఉన్నాడు. విభీషణుడి సహాయంతోనూ, వానర బలాల తోనూ ఆయన శత్రువును చంపేశాడు. ఆయన కార్యం సిద్ధించింది. రావణుడు మరణించాడు. లంక వశమయింది. 'ఇప్పుడు నీవు రావణుడి ఇంట ఉన్నప్పటికీ విభీషణుడి అధీనంలో ఉన్నావు కనక నీ కేమీ భయం లేదు, నీవు సుఖంగా ఉండవచ్చు. విభీషణుడు నిన్ను చూడవస్తాడు' అని రాముడు నీతో చెప్పమన్నాడు."

ఈ మాటలు విని సీత పరమానందం చెంది ఏమీ బదులు చెప్పలేక పోయింది. "ఏ మాలోచిస్తున్నావు? నాకేం చెబుతావు?" అని హనుమంతుడు హెచ్చరించిన మీదట







ఆమె తడబడుడూ, "ఈ సంతోష వార్త విని నా నోట మాట రావటంలేదు. నిన్నెలా ప్రశంసించాలో నాకు తెలియటంలేదు. నీ కివ్వదగిన కానుక కూడా ముల్లోకాల లోనూ కనబడదు," అన్నది.

"అమ్మా, నిన్ను అశోకవనంలో నానా దుర్భాషలూ ఆడిన ఈ రాక్షస స్త్రీలను చిత్రహింస చేసి, చీల్చి చెండాడాలని ఉన్నది. అనుమతి ఇయ్యి," అన్నాడు హనుమంతుడు.

"నాయనా, వీళ్ళు రావణుడి దాసీలు. యజమాని చెప్పినట్టు చెయ్యకపోతే శిక్ష పొందుతారు. వీరి పైన ఆగ్రహించటం



భావ్యం కాదు. ఏ జన్మలోనో చేసుకున్న పాపానికి ఫలితంగా ఈ కష్టాలన్నీ పడ్డాను. ఈ రాక్షస స్త్రీలు ఏ తప్పూ చేయలేదు. ఒక వేళ చేసినా ఉదారులు క్షమించవచ్చు. తప్పులు చెయ్యని వా రెవరుంటారు?" అన్నది సీత.

"అమ్మా, నీవు అన్ని విధాలా రాముడికి తగిన భార్యవు. రాముడి వద్దకు వెళ్ళి ఏం చెప్పమంటావు?" అన్నాడు హనుమంతుడు.

"నాకు నా భర్తను చూడాలని ఉన్నది," అన్నది సీత.

"రాముణ్ణి తప్పక చూస్తావులే," అని చెప్పి హనుమంతుడు రాముడి వద్దకు తిరిగి వెళ్ళాడు. అతను రాముడితో, "ఎంతో దుఃఖితురాలై ఉన్న సీతను వెళ్ళి చూడు. నీకు విజయం లభించిందని విని ఎంతో సంతోషించి, ఆమె నిన్ను చూడగోరు తున్నది," అన్నాడు.

రాముడి కంట నీరు వచ్చింది. అతనికి ఏం చెయ్యాలో తెలియలేదు; సీత చాలా కాలంగా రావణు డింట ఉన్నది. ఆమెను స్వీకరిస్తే అపకీర్తి, నిర్దోషిని నిరాకరించటం తప్పవుతుంది.

అతను విభీషణుడి కేసి తిరిగి, "నీవు సీతను చక్కగా స్నానం చేయించి, శరీరా











నికి గంధపు పూతలు పూయించి, నగలతో అలంకరించి త్వరగా ఇక్కడికి తీసుకురా," అన్నాడు.

విభీషణుడు వెళ్ళి తన స్త్రీల ద్వారా సీత కీ మాట చెప్పించాడు. సీత స్నానం చెయ్యకుండానే తన భర్తను చూస్తానన్నది, కాని విభీషణుడు, రాముడు చెయ్యమన్నట్టే చేస్తే బాగుంటుందని చెప్పాడు.

ఆడవాళ్ళు సీతకు తలంటి స్నానం చేయించి, శరీరానికి పూయ వలసిన పూత లన్నీ పూసి, మంచి నగలు పెట్టి, మంచి బట్టలు కట్టి, మంచి బట్ట పైన కప్పారు. చక్కని పల్లకీలో ఆమె నెక్కించి, అనేక మంది రాక్షసులను పరివారంగా పెట్టి విభీషణు డామెను రాముడున్న చోటికి తీసుకుపోయాడు.

సీతను ఎలా పరిగ్రహించటం, ఎలా త్యజించటం అని కొట్టుకుంటున్న రాముడికి, విభీషణుడు వచ్చి సీతను తెచ్చా నని చెప్ప గానే సీత మళ్ళీ తన కంట పడుతుం దన్న సంతోషం కూడా కలిగింది. అతను విభీష ణుడితో, "సీతను నా ముందుకు తీసుకురా!" అన్నాడు. విభీషణుడి ఆజ్ఞ పైన అతని భటులు అక్కడ మూగి ఉన్న వానరులను దూరంగా తోలేశారు. రాముడు విభీషణు డితో, "ఎందుకు వీరందర్నీ తరిమేస్తున్నావు? వీళ్ళు పరాయివాళ్ళు కారు, నా వాళ్ళే. ఆపత్సమయం లోనూ, స్వయంవరం లోనూ, పెళ్ళిళ్ళూ, యజ్ఞాలూ మొదలైనవి జరిగేటప్పుడూ స్త్రీలు ప్రజల మధ్యకు రావచ్చు. ఇది యుద్ధ భూమి, సీత నా వియోగంతో బాధపడుతున్నది. అందు చేత వీరంతా ఈ సమయంలో ఆమెను చూడవచ్చు," అన్నాడు.

విభీషణుడు వెళ్ళి సీతను రాముడి ఎదటికి తీసుకువచ్చాడు. రాము డన్న మాటలలో లక్ష్మణ సుగ్రీవాదులకు సీత పైన ప్రేమ ఉన్న లక్షణాలు కనబడక విచారం







కలిగింది. సీత సిగ్గు చేత ముడుచుకుపోతూ రాముడి ఎదటికి వచ్చింది. ఆమె వెనకగా విభీషణుడు వచ్చాడు. అంత మంది ఎదట తన ముఖం చూపలేక సీత చీరతో ముఖం కప్పుకుని, రాముడి కేసి చూస్తూ అతని కెదురుగా నిలబడింది.

రాముడు సీతను చూసి చాలా పరుషంగా ఇలా అన్నాడు:

"సీతా, పౌరుషవంతు డయినవాడు చేయగల పని చేశాను; శత్రువును చంపి, నిన్ను తిరిగి సంపాదించాను. శత్రువు నాకు చేసిన అవమానాన్ని కడిగేసుకున్నాను. నా శ్రమ ఫలించింది. నా ప్రతిజ్ఞ నెర



వేరింది. సుగ్రీవుడి ప్రయత్నమూ, విభీషణుడి ప్రయత్నమూ సఫల మయాయి. అయితే నే నిదంతా నీ కోసం చెయ్యలేదు, నా వంశానికి కలిగిన కళంకం పోగొట్టుకోవటానికి చేశాను. నాకు నీతో పని లేదు. నీ యిష్టం వచ్చిన చోటికి వెళ్ళిపోవచ్చు. నే నీ మాట బాగా ఆలోచించే చెబుతున్నాను. చాలా కాలంగా పరాయి వాడి దగ్గిర ఉన్న దాన్ని అభిమానవంతు డెవడూ తిరిగి గ్రహించడు. నిన్ను ఎవరు పోషిస్తే వారి వద్ద ఉండు; లక్ష్మణుడు గాని, భరతుడు గాని, వానర రాజైన సుగ్రీవుడు గాని, రాక్షస రాజైన విభీషణుడు గాని నిన్ను పోషించవచ్చు. నీ కెక్కడ సుఖంగా ఉంటుందని తోస్తే అక్కడనే ఉండవచ్చు."

ఇంత కాలంగా పతి వియోగంతో కుమిలిపోయి, చివరకు అతని నోట అమృత వాక్కులు వినవలిసిన సీత ఇలాటి మాటలు విని నిలువునా కంపించిపోతూ కన్నీరు కార్చసాగింది. అతని నోట అలాటి మాట లెన్నడూ విన్నది కాదు, అందుచేత అవమానంతో ఆమె తల మరింత వాలిపోయింది. ఆమె గద్గద కంఠంతో ఇలా అన్నది:

"వీరుడా, అజ్ఞాని తెలియని మాట లన్న విధంగా ఈ కర్ణ కఠోరమైన మాట లెందు









శంటున్నావు? నీ వనుకున్నట్టుగా నేను ఏ దోషమూ చెయ్యలేదు. దుష్ట స్త్రీలను బట్టి స్త్రీ జాతి నంతటినీ శంకిస్తున్నావు. నీకు నా స్వభావం తెలుసు. అందుచేత అలాటి శంక విడిచిపెట్టు. నేను అధీనురాలినై ఉండగా రావణుడు నా శరీరాన్ని తాకితే ఆ తప్పు నాది కాదు. నా అధీనంలో ఉన్న మనస్సు మాత్రం నీ పైనే ఉన్నది. ఇంత కాలం కలిసి ఉన్న తరవాత కూడా నా స్వభావం నీకు తెలియకపోతే ఇక తెలిసే మార్గమే లేదు. హనుమంతుడు నన్ను వెతుకుతూ వచ్చినప్పుడే నన్ను విడిచిపెట్టినట్టు కబురు చేసి ఉంటే అప్పుడే ఆత్మహత్య చేసుకుని ఉందును; నీకూ నీ మిత్రులకూ, ఇంత శ్రమ లేకపోయి ఉండును. నన్ను అగ్ని సాక్షిగా పెళ్ళాడటం గాని, చాలా కాలంగా నన్నెరిగి ఉండటం గాని నీ కిప్పుడు ప్రమాణం కాలేదు."

సీత రాముడితో ఈ మాట అని లక్ష్మణుడితో, "లక్ష్మణా, ఇంత మాటపడి నాకు జీవించాలని లేదు. చితి పేర్పించు, నే నందులో ప్రవేశించి ప్రాణ త్యాగం చేస్తాను. పది మంది మధ్య భర్త చేత విడవబడిన భార్యకు మరో గతి లేదు," అన్నది. లక్ష్మణుడు అతి దీనంగా రాముడి ముఖం కేసి చూసి, సీత అగ్ని ప్రవేశం చేసి ఆత్మహత్య చేసుకోవటాని కతను సుముఖుడే నని గ్రహించి, చితి పేర్చాడు.

తల వంచుకుని ఉన్న రాముడికి సీత మెల్లిగా ప్రదక్షిణం చేసి, మండుతున్న చితి వద్దకు వచ్చి, దేవ బ్రాహ్మణులకు నమస్కారం చేసుకుని, చేతులు మోడ్చి, "నేను రాముణ్ణి తప్ప తలవకపోయి నట్టయితే, నన్ను గురించి రాముడికి కలిగిన శంక అబద్ధమైతే, నేను మనోవాక్కాయ కర్మల రాముణ్ణి అతిచరించక పోయి నట్టయితే సర్వ సాక్షి అయిన అగ్నిహోత్రుడు నన్ను సర్వ విధాలా కాపాడు








తాడు గాక!" అని చెప్పి, అగ్నికి ప్రదక్షిణం చేసి అందులో ప్రవేశించింది.

అది చూసి వానరులూ, రాక్షసులూ కూడా హాహాకారాలు చేశారు. ఆ హాహా కారాలు వింటూ రాముడు బాధతో అశ్రు వులు రాల్చాడు.

అప్పుడు కుబేరుడూ, యముడూ, దేవేం ద్రుడూ, వరుణుడూ, శివుడూ, బ్రహ్మ కాంతివంతమైన విమానాలలో లంకకు చేరి రాముడి వద్దకు వచ్చారు. వాళ్ళు చేతు లెత్తి రాముడితో, "లోక కర్తవు, జ్ఞానావ తారుడివి, సీత అగ్నిప్రవేశం చేస్తుంటే ఎలా చూస్తూ ఊరుకున్నావు?" అన్నారు.



"నేను దశరథుడి కొడుకు ననే అను కుంటున్నాను. నేను పరమార్థంలో ఎవణ్ణో ఎందుకు పుట్టానో బ్రహ్మ చెప్పాలి," అన్నాడు రాముడు.

"నీవు సాక్షాత్తూ నారాయణుడివి. సీత లక్ష్మీదేవి. రావణ సంహారం కోసం ఈ భూలోకంలో మానవ జన్మ ఎత్తావు! రావణవధ చేశావు! ఇక వైకుంఠానికి రా!" అన్నాడు బ్రహ్మ.

బ్రహ్మ ఇలా అనగానే అగ్నిహోత్రుడు సీత నెత్తుకుని చితి నుంచి లేచి వచ్చాడు. అగ్నిహోత్రుడు మానవాకారం ధరించి పైకి లేవగానే చితి చెల్లాచెదరై పోయింది.

అగ్ని సీతను తెచ్చి రాముడి కిస్తూ, "ఇదుగో నీ సీత. ఈవిడ ఏ పాపమూ ఎర గదు. ఈమె మనస్సు ఒక్క క్షణమైనా నీ పై నుంచి మరొకరి పైకి మరల లేదు. ఆమె మనస్సు తన కేసి తిప్పాలని రావ ణుడు విశ్వప్రయత్నాలు చేశాడు. కాని అవేవీ ఫలించ లేదు. కనక ఈమెను పరిగ్ర హించు. ఇది నా ఆజ్ఞ," అన్నాడు.

"సీత ఏ పాపమూ ఎరగదని నాకు తెలుసును. కాని సదాచారాన్ని గౌరవించి, ఆమె అగ్ని ప్రవేశం చేస్తుంటే చూస్తూ ఊరుకోవలిసి వచ్చింది. లేకపోతే లోకులు





నన్ను మోహాంధుడి కింద కట్టేస్తారు. అగ్ని కంటె కూడా పవిత్రమైన సీతను రావణు డేం చెయ్యగలడు? ఇప్పుడు సీత పాపరహిత అని మూడు లోకాలకూ వెల్ల డయింది. నే నామెను తప్పక పరిగ్రహిస్తాను," అని రాము డన్నాడు.

అప్పుడు శివుడు రాముడితో, "రామా, స్వర్గం నుంచి నీ తండ్రి దశరథుడు విమానంలో వచ్చాడు చూడు. ఆయన మాట నిజం చేసినందు వల్ల ఆయనకు ఇంద్ర లోకం లభించింది," అన్నాడు.

రామలక్ష్మణులు విమానంలో వచ్చిన దశరథుణ్ణి చూసి ఆయనకు నమస్కారం చేశారు. దశరథుడు రాముణ్ణి దగ్గిరికి తీసుకుని కౌగిలించుకుని, "నాయనా, నిన్ను ఎడబాసిన నాకు స్వర్గ సుఖాలు కూడా తృప్తికరంగా లేవురా. నిన్ను అరణ్యానికి పంపా నన్న మాటా, కైకేయి అన్న మాటలూ న న్నింకా బాధిస్తూనే ఉన్నాయి. అయితే, నీ పట్టాభిషేకానికి విఘ్నం కలిగించింది దేవతలే ననీ, రావణ సంహారం కోరి వా రా పని చేశారనీ నాకు తెలియ వచ్చింది. నీ వనవాసం పధ్నాలుగేళ్ళూ తీరిపోయింది. ఇక నీవు అయోధ్యకు వెళ్ళి రాజ్యాభిషేకం చేసుకో. నిన్ను చూసి కౌసల్య చాలా సంతోషిస్తుంది," అన్నాడు.



ఆయన లక్ష్మణుడికీ, సీతకూ కూడా కొన్ని హితవాక్యాలు చెప్పాడు.

దశరథుడు స్వర్గానికి తిరిగి వెళ్ళిపోయాక ఇంద్రుడు రాముణ్ణి శ్లాఘించి, ఏదైనా వరం కోరుకో మన్నాడు. తన కోసం యుద్ధంలో చనిపోయిన వానర భల్లూకా లందరినీ తిరిగి బతికించమని రాముడు కోరాడు. ఇంద్రు డలాగే చేశాడు. చావగా మిగిలిన వానరులు చచ్చిన వానరులు తిరిగి బతకటం చూసి అత్యాశ్చర్యం చెందారు. తరవాత దేవత లంతా వెళ్ళిపోయారు.

రాము డా రాత్రి సుఖంగా నిద్రపోయాడు. మర్నాడు విభీషణుడు వచ్చి రాముణ్ణి స్నానం చేయిస్తాననీ, నగలూ, బట్టలూ ధరింపజేస్తా ననీ చెప్పి ఆహ్వానించాడు.

"అలాటి వన్నీ సుగ్రీవుడు మొదలైన వారికి చేయించు. పద్నాలుగేళ్ళు పూర్తి అయిన మర్నాడు నేను తిరిగి రాకపోతే ప్రాణం వదులుతానని నా తమ్ముడు శపథం చేశాడు. వా డన్నంత పనీ చేస్తాడు. అలాటప్పుడు నాకు స్నానాలూ, వస్త్రాభర ణాలూ దేనికి? నేను వెంటనే అయోధ్యకు వెళ్ళాలి," అని రాము డన్నాడు.

"ఒక్క రోజులో నేను నిన్ను పుష్పక విమానం మీద అయోధ్యకు చేర్చగలను. ఇంతకు ముందు కుబేరుడు వచ్చినా కూడా, అతని విమానం అతని కిచ్చెయ్యకుండా, నీ కోసం ఉంచాను. నేను నీకూ, నీ తమ్ము డికీ, నీ భార్యకూ ఇచ్చే అతిథ్యం తీసుకుని మరీ వెళ్ళాలని నా ప్రార్థన," అన్నాడు విభీషణుడు.

"నీ భక్తే నాకు చాలు. నా మనస్సు భరతుణ్ణీ, నా తల్లులనూ చూడాలని తహతహ లాడుతున్నది. నా వనవాసం పూర్తి అయింది. భరతుడు ఘోర ప్రతిజ్ఞ చేశాడు. నే నిక్కడ ఎలా ఉండను? ఈ పుష్పక విమానం ఇచ్చినదే నాకు పదివేలు," అన్నాడు రాముడు.





# యుద్ధకాండ

విభీషణుడు వెళ్ళి పుష్పకవిమానం తెచ్చి రాముడి ముందుంచాడు. అది చాలా పెద్దది. అందులో బంగారంతో చేసిన భాగా లున్నాయి. వైడూర్య మణులతో చేసిన ఆసనా లున్నాయి. దానికి బంగారు కమ లాలూ, గజ్జెలూ, ఘంటలూ ఉన్నాయి.

"విభీషణా, వానరులు మహత్తరమైన కార్యం సాధించారు. వారిని కానుకలతో సంతోషపెట్టు. అందువల్ల నీకు గొప్ప కీర్తి కలుగుతుంది," అని చెప్పి రాముడు సీతా లక్ష్మణులతో సహా పుష్పకం ఎక్కాడు. అతను సుగ్రీవుడూ మొదలైన వారికీ, విభీషణుడికీ వీడ్కోలు చెప్పి, తాను అయోధ్యకు తిరిగి పోవటానికి వారి అను మతి కోరాడు.

"మమ్మల్ని కూడా నీ వెంట తీసుకు పోతే మేం నీ పట్టాభిషేకం చూసి ఆనం దిస్తాం," అన్నారు వాళ్ళంతా.

"అలా అయితే మరీ సంతోషం," అని రాముడు అందరినీ పుష్పకం లోకి రమ్మ న్నాడు. అందరినీ ఎక్కించుకుని పుష్పకం ఆకాశం లోకి లేచింది. అంత మంది ఎక్కినా విమానం ఇరుకనిపించ లేదు.

విమానం పోతూ ఉంటే రాముడు సీతకు రాక్షస వీరులు యుద్ధ భూమిలో చనిపోయిన స్థలాలూ, సేతువూ, విభీషణుడు తనను కలుసుకున్న చోటూ మొదలైనవి చూపుతూ వచ్చాడు. కిష్కింధ కనుచూపు మేర లోకి రాగానే సీత, తార మొదలైన సుగ్రీవుడి భార్యలనూ, ఇతర వానర వీరుల-









సుగ్రీవుడు కలుసుకున్న చోటు చూపించాడు. అలాగే అతను తనకు శబరి కనిపించిన చోటూ, జటాయువు రావణుడితో పోరాడిన చోటూ, జనస్థానంలో తాము నివశించిన ఆశ్రమమూ మొదలైన వన్నీ సీతకు చూపాడు.

క్రమంగా విమానం అయోధ్యకు చేర వచ్చింది. వానర రాక్షసు లందరూ లేచి నిలబడి దూరాన కనిపించే అయోధ్యా నగరాన్ని ఆశక్తితో చూశారు. కాని రాముడు తిన్నగా అయోధ్యకు వెళ్ళక భరద్వాజాశ్రమంలో దిగి, భరద్వాజమహాముని ద్వారా భరతుడి యోగ క్షేమాలూ, తన తల్లుల యోగక్షేమాలూ తెలుసుకున్నాడు. అతను చైత్రశుద్ధ పంచమి నాడు అయోధ్య నుంచి వనవాసం బయలుదేరాడు. ఇవాళ చైత్ర శుద్ధ చవితి. ఈ రోజుతో సరిగా పధ్నాలు గేళ్ళు నిండాయి. ఆ రోజు రాముడు తన ఆతిథ్యం స్వీకరించి మర్నాడు అయోధ్యకు వెళ్ళాలని భరద్వాజుడు కోరాడు.

రాముడు హనుమంతుణ్ణి పిలిచి, "నీవు అయోధ్యకు వెళ్ళు. దారిలో శృంగిబేర పురంలో గుహుణ్ణి కలుసుకుని నా క్షేమ సమాచారాలు చెప్పు. నా కతను ప్రాణం లాంటి వాడు. అతని ద్వారా నీకు అయోధ్య

భార్యలనూ, తన వెంట తీసుకుపోవా లన్న కోరిక ప్రకటించింది. రాముడు సరే నని పుష్పకాన్ని కిష్కింధలో దింపి, సీత కోరికను సుగ్రీవుడికి తెలిపాడు. సుగ్రీవుడు తన అంతఃపురానికి వెళ్ళి, తారతో వానర వీరుల భార్య లందరినీ ప్రయాణం చెయ్యమన్నాడు. తార అందరు వానర స్త్రీలనూ ప్రయాణానికి సిద్ధం చేసింది. వారందరూ బాగా అలంకారాలు చేసుకుని, సీతను చూడాలన్న అభిలాషతో వచ్చారు.

వానరవనిత లందరినీ ఎక్కించుకుని విమానం మళ్ళీ ప్రయాణం సాగించింది. సీతకు రాముడు ఋశ్యమూకం మీద తనను









వార్తలు తెలుస్తాయి. నా క్షేమ సమాచారం విని అతను చాలా సంతోషిస్తాడు. అయోధ్యకు వెళ్ళి భరతుడికి మన వార్త లన్నీ వివరంగా చెప్పు. నా విజయవార్త విన్నప్పుడు భరతుడి ముఖంలో ఏ మార్పులు కలిగేదీ శ్రద్ధగా గమనించు. ఇంత కాలం రాజ్యభోగా లనుభవించిన వాడికి అవన్నీ పోతాయంటే బాధగానే ఉంటుంది. అందు చేత అతని మనోభావం సరిగా గ్రహించు. అతనికే రాజ్యం చెయ్యాలని ఉంటే అలాగే చెయ్యవచ్చు. అతని కలాటి కోరిక ఉన్నట్టు తోస్తే, మేం అయోధ్యకు చేరక ముందే ఎదురు వచ్చి కలుసుకో," అన్నాడు.

హనుమంతుడు మానవ రూపం ధరించి వాయు మార్గాన బయలుదేరి, గంగా యమునా సంగమం దాటి శృంగిబేరపురం చేరుకుని, గుహుణ్ణి కలుసుకున్నాడు. గుహుడితో, రాముడు రేపు ఉదయం భరద్వాజాశ్రమం నుంచి బయలుదేరి వస్తున్నాడని చెప్పి, హనుమంతుడు బయలుదేరి, అయోధ్యకు కొంచెం దూరంగా ఉన్న నందిగ్రామానికి చేరుకున్నాడు.

అక్కడ భరతు డొక ఆశ్రమం కల్పించుకుని తపస్వి లాగా ఉంటున్నాడు. పద్నాలుగేళ్ళూ నిండినప్పటికీ రాము డింకా రానే



లేదే అని విచారిస్తున్నాడు. హనుమంతుడు భరతుణ్ణి కలుసుకుని, "రాజా, శుభవార్త తెచ్చాను. రాముడు రావణుణ్ణి చంపి, సీతను తిరిగి సంపాదించుకుని, మహాబలులైన మిత్రులతో వస్తున్నాడు. సీతారాముల వెంట లక్ష్మణుడు కూడా వస్తున్నాడు," అని చెప్పాడు.

ఈ మాట వినగానే భరతుడు ఆనంద పారవశ్యంతో మూర్ఛపోయాడు. అతను తిరిగి స్పృహ తెలియగానే హనుమంతుణ్ణి కౌగలించుకుని, "ఈ సంతోష వార్త తెచ్చిన నీవు మనిషివో, దేవతవో నాకు తెలీదు. ఇందుకు నీకు లక్ష గోవులనూ,









నూరు ఉత్తమ గ్రామాలనూ, పదహారు మంది అందగత్తె లైన కన్యకలనూ దానంగా ఇస్తాను," అన్నాడు.

ఇద్దరూ చాలాసేపు కూర్చుని మాట్లాడుకున్నారు. రామ వనవాస కాలంలో జరిగిన సంగతు లన్నిటినీ హనుమంతుడు భరతుడికి చెప్పాడు.

భరతుడు శత్రుఘ్నుడితో ఊరంతా అలంకరింపించమనీ, వాద్యాలు ఏర్పాటు చేయమనీ, రాముడి కెదురు వెళ్ళటానికి వేశ్యలను సిద్ధ పరచమనీ అన్నాడు.

నందిగ్రామానికీ అయోధ్యకూ మధ్య నున్న మార్గాన్ని చక్కగా చదును చేశారు. అంతటా నీళ్ళూ, పూలూ చల్లారు. రాజ మార్గాలు పూలతోరణాలు కట్టి, గంధం చల్లి రంగు రంగుల ముగ్గులు పెట్టారు. రాజపరివారమూ స్త్రీ జనమూ రామ దర్శనార్థం గుంపులు గుంపులుగా బయలుదేరారు. వేలాది ఏనుగులనూ, గుర్రాలనూ అలంకరించారు. వాటి పైన కొందరూ, రథా లెక్కి కొందరూ బయలుదేరారు. కౌసల్యా, కైకేయీ సుమిత్రల వెనకగా దశరథుడి భార్య లందరూ పల్లకీలెక్కి వచ్చారు. వీరందరితో బాటు నగరవాసు లందరూ నందిగ్రామం చేరుకున్నారు.

రాము డింకా రాడేమని భరతుడు ఆరాటపడి, హనుమంతుడు తనతో అబద్ధం చెప్పాడని సంశయించాడు. కాని అంతలోనే పుష్పకం కనబడింది. అది త్వరలోనే ఎగిరి వచ్చి నేల మీద వాలింది. భరతుడు రాముడికి ఎదురు వెళ్ళి నమస్కరించాడు. రాము డతన్ని ఆలింగనం చేసుకున్నాడు.

వానరవీరు లందరూ మానవ రూపాలు ధరించి ఉన్నారు. భరతుడు వారి నందరినీ పరామర్శించాడు. అతను సుగ్రీవుడితో, "సుగ్రీవా, మే మదివరకు నలుగురం అన్నదమ్ములం. నీ విప్పుడు మాలో అయిదో వాడి వయావు," అన్నాడు. విభీషణుణ్ణి









కూడా, అతను చేసిన సహాయానికి మెచ్చుకున్నాడు.

రాముడు కౌసల్యకూ, ఇతర తల్లులకూ, వశిష్ఠుడికీ నమస్కరించాడు. భరతుడు తన వద్ద ఉన్న రామపాదుకలను రాముడి కాళ్ళకు స్వయంగా తగిలించాడు. తరవాత అతను రాముడికి చేతులు మోడ్చి, "రాజా, నీ రాజ్యాన్ని నీవు తీసుకో. ఈ రాజ్యం తిరిగి నీకు అప్పగించటంతో నా జన్మ ధన్యమయింది. నీవు వెళ్ళే నాటి కన్న ఇప్పుడు బొక్కసమూ, ధాన్యమూ, సైన్యమూ పదింత లున్నది," అన్నాడు.

రాముడు నందిగ్రామం చేరుతూనే పుష్పక విమానాన్ని కుబేరుడి వద్దకు పంపేశాడు.

అందరూ కూర్చున్న మీదట భరతుడు రాముడితో, "అన్నా, నీవు నా తల్లిని సంతోష పెట్టటానికి రాజ్య త్యాగం చేసి వనవాసం వెళ్ళావు. ఈ రాజ్యాన్ని నా కిచ్చావు. నా వద్ద ఇల్లడగా ఉన్న రాజ్యాన్ని నీవు తిరిగి తీసుకో. దీన్ని నీవు కోర కుండానే తొందరపడి ఎందు కిచ్చేస్తున్నా నంటావేమో, ఈ రాజ్య భారం వహించటానికి నీ కున్న దార్ఢ్యం నాకు లేదు. హంసతో సమంగా కాకి ఎలా ఎగురుతుంది? మన తండ్రి పుత్రకామేష్టి చేసి నిన్ను ఎందుకు కన్నాడో ఆ ప్రయోజనం తీరాలంటే నీవీ రాజ్య భారం వహించాలి, మమ్మల్నందరినీ పాలించాలి," అన్నాడు.

భరతు డన్న దానికి రాముడు సమ్మతించాడు.

ముందు భరతుడూ, తరవాత లక్ష్మణుడూ, సుగ్రీవుడూ, విభీషణుడూ మంగళ స్నానాలు చేశారు. రాముడి జుట్టు చిక్కు తీసి సరిచేశారు, శరీరానికి లేపనాలు పూశారు, మాలలు ధరింపజేశారు. పీతాంబరం కట్టించారు. అతను సింహాసనం పైన కూర్చున్నాడు. దశరథుడి భార్యలు సీతను







చక్కగా అలంకరించారు. కౌసల్య వానర భార్య లందరికీ అలంకారాలు చేయించింది.

సుమంత్రుడు ఉత్తమాశ్వాలు పూన్చిన రథం తెచ్చాడు. రాము డందులో ఎక్కి కూర్చున్నాడు. రథం అయోధ్య కేసి బయలుదేరింది. సుగ్రీవ హనుమంతులు స్నానాలు చేసి, మంచి బట్టలు ధరించి, కుండలాలు ధరించి బయలుదేరారు. సీత సుగ్రీవుడి భార్యలతో కలిసి బయలుదేరింది.

దశరథుడి మంత్రులు వశిష్ఠుడితో సహా ముందుగానే అయోధ్యకు వెళ్ళి పట్టాభిషేకం ఏర్పాట్లు ప్రారంభించారు. తరవాత మంత్రులు రాముడి కెదురు వచ్చారు.

రాము డెక్కిన రథానికి కట్టిన గుర్రాలు పచ్చనివి. భరతుడు సారథిగా కూర్చున్నాడు. శత్రుఘ్నుడు ఛత్రం పట్టాడు. లక్ష్మణుడు వింజామర పట్టాడు. విభీషణుడు మరొక వింజామర పట్టాడు.

సుగ్రీవుడు శత్రుంజయ మనే మదగజాన్నెక్కాడు. రాముడి వెంబడి శంకాలూదారు. భేరీభాంకారాలూ, జనుల కోలాహలమూ మిన్ను ముట్టాయి. రాముడు అయోధ్య ప్రవేశించే సరికి ప్రతి ఇంటి మీదా జెండా ఎగిరింది. అతను తిన్నగా దశరథుడి ఇంటికి వెళ్ళి, సుగ్రీవుడికి విడిది చూపమని భరతుడితో చెప్పాడు.

సుగ్రీవుడు విడిది చేరుతూనే నాలుగు సువర్ణ కలశాలను నలుగురు వానరోత్తముల కిచ్చి, మర్నాడు తెల్లవారే లోపుగా వాటితో సముద్రజలం తీసుకు రమ్మన్నాడు. వాళ్ళు కలశాలు తీసుకుని ఆకాశ మార్గాన బయలుదేరి వెళ్ళారు. అలా వెళ్ళిన వారు జాంబవంతుడూ, హనుమంతుడూ, వేగదర్శీ, ఋషభుడూనూ.

తరవాత రామపట్టాభిషేకం జరిగింది. సీతా రాములను రత్న పీఠం పైన కూర్చోబెట్టారు. వసిష్ఠుడూ, వామదేవుడూ, జాబాలీ, కాశ్యపుడూ, కాత్యాయనుడూ, సుయజ్ఞుడూ,







గౌతముడూ, విజయుడూ అనే ఎనిమిది మంది మహర్షులూ రాముడికి అభిషేకం చేశారు. వారి అనంతరం బ్రాహ్మణులూ, కన్యలూ, మంత్రులూ, పౌరులూ, యోధులూ రాముణ్ణి అభిషేకించారు.

శత్రుఘ్నుడు రాముడికి ఛత్రం పట్టాడు. సుగ్రీవ విభీషణులు వింజామరలు పట్టారు. దేవేంద్రుడు వాయుదేవుడి ద్వారా నూరు కమలాలతో కూడిన బంగారు హారాన్నీ, నవరత్న హారాన్నీ పంపాడు.

రాముడు బ్రాహ్మణులకు లక్ష గుర్రాలనూ, దూడలు గల లక్ష అవులనూ, నూరు అబోతులనూ దానం చేశాడు; ముప్పై కోట్ల బంగారు నాణాలనూ, వస్త్రాలనూ, నగలనూ దానం చేశాడు, సుగ్రీవుడి కొక దివ్యమైన కాంచనమాలను బహూకరించాడు. సీత కొక ముత్యాల హారం ఇచ్చాడు. సీత హనుంతుడికి రెండు బట్టలు పెట్టి, అందమైన నగలిచ్చింది.

రాముడు సీతకు ఒక ముత్యాల హారం ఇచ్చి, "నీకు ఎక్కువ సంతోషం కలిగించినవాడికి ఇచ్చెయ్యి," అన్నాడు. సీత దాన్ని హనుమంతుడి కిచ్చింది. హనుమంతుడు దాన్ని వెంటనే మెడలో వేసుకున్నాడు.

రాముడు ఇతర వానర ప్రముఖులకూ, విభీషణుడికీ యథోచితమైన కానుక లిచ్చాడు. పట్టాభిషేకం ముగియగానే రాముడి వద్ద సెలవు తీసుకుని వానరులూ, విభీషణుడూ తిరిగివెళ్ళిపోయారు.

రాముడు రాజ్య భారం సగం లక్ష్మణుడి పైన ఉంచి, భరతుణ్ణి యువరాజుగా అభిషేకించి కీర్తివంతంగా రాజ్యం చేశాడు. అతను నూరు అశ్వమేధాలు చేశాడు. రాముడి పరిపాలనలో ప్రజలకు ఎలాటి ఈతి బాధలూ లేవు, అకాల మరణాలు లేవు. రామరాజ్యం అంటే ఆదర్శవంతమైన రాజ్యం అనే అర్థం ఏర్పడింది.

[ యుద్ధకాండ సమాప్తం ]








# ఉత్తర కాండ

శ్రీరాముడు రాక్షస సంహారం చేసి, అయోధ్యకు తిరిగి వచ్చి, రాజ్యాభిషిక్తుడై, రాజ్య పాలన చేస్తూ ఉండగా, ఒకనాడాయన ఇంటికి నాలుగు దిక్కుల నుంచీ అనేక మంది మునులు అగస్త్యుడు మొదలుగా గల వారు వచ్చి ద్వారపాలకుడి ద్వారా తాము రాముడి దర్శనానికి వచ్చినట్టు కబురు చేశారు. వెంటనే రాముడు వారిని లోపలికి రప్పించి, అర్ఘ్యపాద్యాలతో సత్కరించి, ఉచితాసనాల పైన ఆసీలను చేసి, కుశల మడిగాడు.

మునులు రాముణ్ణి మళ్ళీ రాజుగా చూడగలిగినందుకు తమ సంతోషాన్ని వెలిబుచ్చారు; రాముడు రావణుణ్ణి చంపటం ఒక లెక్కలోది కాదనీ, రాముడి చేతిలో చచ్చిన రాక్షస వీరు లందరూ గొప్పవాళ్ళే అయినప్పటికీ ఇంద్రజిత్తు వంటి అజేయుణ్ణి లక్ష్మణుడి చేత చంపించటం అత్యాశ్చర్యకరమైన విషయమనీ వా రన్నారు.

వారి మాటలు విని రాముడికి చాలా ఆశ్చర్యం కలిగింది. రావణ, కుంభకర్ణ, మహోదర, ప్రహస్త, దేవాంతక, నరాంతకుల వంటి రాక్షస వీరుల కన్న ఇంద్రజిత్తు పరాక్రమవంతు డని విని, అతను ఇంద్రజిత్తు ప్రభావ పరాక్రమాలను గురించి విన గోరాడు. అప్పు డగస్త్యుడు రాముడితో రావణవంశం గురించి ఈ విధంగా చెప్ప నారంభించాడు.

కృత యుగంలో బ్రహ్మ మానస పుత్రుడూ, రెండో బ్రహ్మ అన దగిన వాడూ







అయిన పులస్త్యుడు ఒకప్పుడు తపస్సు చేసుకుందామని, మేరుపర్వత ప్రాంతంలో ఉన్న తృణబిందుడి ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడ ఆయన తపస్సు చేసుకుంటూ ఉండేటప్పుడు, దేవ నాగ రాజర్షి కన్యలు రోజూ వచ్చి, ఆటలాడి గోల చేస్తూ, ఆయన తపస్సుకు విఘ్నం కలిగించ సాగారు. పులస్త్యుడు తన ఎదటికి వచ్చిన స్త్రీ గర్భవతి అవుతుందని శాపం పెట్టాడు. ఈ శాపం విని కన్యలంతా భయపడి ఆ ఆశ్రమానికి వెళ్ళటం మానుకున్నారు.

ఈ సంగతి తృణబిందుడి కుమార్తె ఎరగదు. ఆమె మామూలుగా పులస్త్యుడి ఆశ్రమానికి వచ్చి, తన స్నేహితురాళ్ళ కోసం వెతకసాగింది. ఒక్కరు కూడా ఆమెకు కనిపించలేదు. ఆమె తిన్నగా పులస్త్యుడు వేదాధ్యయనం చేస్తున్న చోటికి వెళ్ళింది. ఆయన దర్శనం కలగగానే ఆమెలో గర్భచిహ్నాలు కలిగాయి, శరీర మంతా పాలిపోయింది. ఆమె తనలో కలిగిన మార్పు చూసుకుని ఆశ్చర్యపోతూ, తన తండ్రి ఆశ్రమానికి తిరిగి వెళ్ళి, "నాన్నా నా ఒళ్ళెంతా ఎలా మారిందో చూడు. నా స్నేహితురాళ్ళ కోసం పులస్త్యాశ్రమానికి వెళ్ళే సరికి ఇలా జరిగింది. కారణం తెలీదు. నాకేమో భయంగా ఉంది," అన్నది.

తృణబిందుడు పులస్త్యుడి శాపఫలితంగా తన కుమార్తె గర్భవతి అయిందని గ్రహించి, ఆమెను తీసుకుని పులస్త్యుడి వద్దకు వెళ్ళి, "మహానుభావా, ఇది నా కూతురు. గుణవంతురాలు. మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చిన దీన్ని భార్యగా స్వీకరించి, దీనిద్వారా సేవలు పొందండి," అన్నాడు. పులస్త్యుడు సరే నన్నాడు.

తన భార్య గుణాలూ, నడవడీ పులస్త్యుడికి సంతోషం కలిగించాయి. ఆయన ఆమెతో, "నీవు చాలా యోగ్యురాలవు. నీ గర్భాన నా అంతటి కొడుకు కలుగుతాడు.







నేను చేసే వేదపఠనం వింటూండగా గర్భవతి వయావు గనక నీ కొడుకు విశ్రవసుడనే పేరు తెచ్చుకుంటాడు. నా కొడుకు గనుక పౌలస్త్యు డని అందరిచేతా చెప్పబడతాడు," అన్నాడు.

అలాగే కొంత కాలానికి ఆమె గర్భాన విశ్రవసుడు పుట్టి, సత్య శీల శౌచ శాంతాలకు ప్రసిద్ధి పొందాడు. అతన్ని గురించి గొప్పగా విని భరద్వాజ మహాముని తన కూతురైన దేవవర్ణిని తీసుకు వచ్చి అతనికి పెళ్ళి చేశాడు. విశ్రవసు డామెతో గృహస్థాశ్రమం గడుపుతూ ఒక కొడుకును కన్నాడు. ఆ కొడుకు పుట్టగానే బ్రహ్మ స్వయంగా వచ్చి, ఆ కుర్రవాడు ధనాధిపతి అవుతాడని చెప్పి, అతనికి వైశ్రవణు డని పేరు పెట్టి వెళ్ళిపోయాడు.

వైశ్రవణుడికి చిన్నతనం నుంచీ తపస్సే అతి ముఖ్య మనిపించింది. అతను మహారణ్యానికి వెళ్ళి, జలభక్షణా, వాయుభక్షణా నిరహారదీక్షా అవలంబించి, మూడు వేల సంవత్సరాలు కఠోర తపస్సు చేశాడు. ఆ తపస్సుకు మెచ్చి బ్రహ్మ ఇంద్రాది దేవతలతో సహా ప్రత్యక్షమై, "నాయనా, నీ తపస్సుకు సంతోషించాను. వరం కోరుకో," అన్నాడు.



"తాతా, నాకు లోక పాలకత్వమూ, ధనాధిపత్యమూ కావాలి," అన్నాడు వైశ్రవణుడు.

"నేను కూడా మరొక లోకపాలకుణ్ణి సృష్టించే ఆలోచన లోనే ఉన్నాను. ఇంద్ర యమ వరుణులతో బాటు నీవు కూడా నాలుగో లోకపాలకుడివిగా ఉండి నిధుల కధిపతివికా! ఇదిగో, సూర్య ప్రకాశంతో వెలిగే పుష్పక మనే విమానం. దీన్ని ఎక్కి తిరుగుతూ, దేవతలతో సమానుడవై ఉండు," అని చెప్పి, బ్రహ్మ వెళ్లిపోయాడు.

ఇలా బ్రహ్మ వల్ల కోరిన వరాలు పొంది వైశ్రవణుడు తన తండ్రి ఆశ్రమానికి వచ్చి,





"నాన్నా, బ్రహ్మ నాకు వరా లయితే ఇచ్చాడు గాని, నేను నివాసం కల్పించు కోవటానికి చోటు చూపలేదు. ఇతరులకు ఇబ్బంది కలగకుండా నే నుండ దగిన చోటుంటే చూడు," అన్నాడు.

కొడుకు చెప్పిన మాట విని విశ్రవుడు చాలా సంతోషించి, "నాయనా, దక్షిణ సముద్రతీరాన త్రికూటపర్వత శిఖరాన విశ్వకర్మ దేవేంద్రుడి అమరావతిని పోలిన నగరాన్ని, లంక అనే దాన్ని నిర్మించాడు. చాలా అందమైన పట్టణం. అది సువర్ణ ప్రాకారాలూ, పరిఖలూ కలది, వైడూర్య తోరణాలతో కూడుకున్నది. అది మొదట రాక్షసుల కోసమే నిర్మించబడింది, కాని విష్ణుమూర్తికి భయపడి రాక్షసులా పట్టణాన్ని విడిచి పాతాళానికి వెళ్ళిపోయారు. ఇప్పు డది శూన్యంగా ఉన్నది. దానికి రాజు లేడు. అక్కడ నీ నివాసం ఏర్పాటు చేసుకున్నావంటే ఎవరికీ ఇబ్బంది ఉండదు," అని చెప్పాడు.

వైశ్రవణుడు తండ్రి సలహా ప్రకారం అనేక వేల మంది నైరృతులతో సహా లంకా నగరానికి వెళ్ళి, అక్కడ నివాసం ఏర్పాటు చేసుకుని, సుఖంగా రాజ్యం ఏలుతూ, పుష్పకవిమానంలో అప్పుడప్పుడూ వచ్చి తన తల్లిదండ్రులను చూసి పోతూండేవాడు.



ఇదంతా విని రాముడు ఆశ్చర్యంతో అగస్త్యుడి కేసి చూసి, "మహాత్మా, రాక్షసులు పులస్త్య వంశంలోనే పుట్టా రని విన్నాను. కాని అంతకు ముందు కూడా రాక్షసు లుండినట్టు మీరు చెబుతున్నారు. ఈ రాక్షసులకు మూల పురుషు డెవరు?" అన్నాడు. దానికి అగస్త్యు డిలా చెప్పాడు.

కమలంలో పుట్టిన బ్రహ్మ నీటిని సృష్టించి, దాన్ని కాపాడటానికి కొందరు ప్రాణులను సృష్టించాడు. ఆ ప్రాణులు ఆకలి దప్పుల తోనూ, భయం తోనూ అలమటించుతూ, "మే మేం చెయ్యాలి?" అని బ్రహ్మ నడిగారు. బ్రహ్మ నవ్వుల కన్నట్టుగా, "ఈ జలాన్ని కాపాడటానికి ప్రయత్నించండి," అన్నాడు. కొందరు ప్రాణులు రక్షిస్తా మన్నారు; మరి కొందరు జక్షిస్తా మన్నారు. (జక్షించట మంటే భక్షించటం.) రక్షిస్తామన్న ప్రాణులు రాక్షసు లయారు. జక్షిస్తా మన్న వారు యక్షు లయారు.

రాక్షసులలో హేతీ, ప్రహేతీ అనే ఇద్దరు అన్నదమ్ము లుండేవారు. వారిలో ప్రహేతి తపస్సు చేసుకోవటానికి వెళ్ళిపోయాడు. హేతి అనే వాడు మాత్రం పెళ్ళి చేసుకోగోరి, భార్య కోసం వెతుకుతూ, చివరకు యముడి చెల్లెలు భయ అనే దాన్ని, భయంకర మైన దాన్ని పెళ్ళాడాడు.







బిడ్డ నోట్లో చెయ్యి దూర్చుకుని సన్నగా ఏడవ సాగాడు. ఆ సమయంలో వృషభ వాహనం మీద పార్వతీ పరమేశ్వరులు ఆకాశ మార్గాన పోతూ ఆ పసిగుడ్డు ఏడుపు విన్నారు. ఆ దంపతులు ఆ శిశువును చూసి జాలిపడి, దగ్గిరికి వచ్చి చూశారు. పార్వతి సంతృప్తి కోసం పరమేశ్వరు డా బిడ్డకు తల్లితో సమానమైన వయసూ, చిరంజీవిత్వమూ, ఆకాశంలో ఎగర గల ఒక పట్టణమూ ఇచ్చాడు. పార్వతీదేవి రాక్షసులకు సద్యోగర్భమూ, పుట్టగానే తల్లి వయసూ ఉండే లాగు వర మిచ్చింది.

పార్వతీ పరమేశ్వరుల వల్ల వరాలు పొందిన సుకేశు డనే ఆ రాక్షసుడు ఐశ్వర్యవంతుడై, ఆకాశగమనం గల పట్టణంలో విహరిస్తూ ఇంద్రుడికి సమాను డయాడు.

సుకేశుడు వరాలను పొందటమే గాక ధర్మాత్ము డని కూడా విని, గ్రామణి అనే గంధర్వుడు త్రిలోకసుందరి అయిన తన కూమార్తెను దేవవతి అనే దాన్ని తెచ్చి సుకేశుడి కిచ్చి పెళ్ళి చేశాడు. తన కంతటి భర్త దొరికినందుకు దేవవతి ఎంతో సంతోషించింది.

ఆ దంపతులకు మాల్యవంతుడూ, సుమాలీ, మాలీ అని ముగ్గురు కొడుకులు, వారికి విద్యుత్కేశు డనే కొడుకు, సూర్య సమ కాంతి గలవాడు పుట్టి పెరగ సాగాడు. వాడికి యౌవనం రాగానే వాడి తండ్రి అయిన హేతి వాడి కొక భార్యను నిశ్చయించాడు. ఆ పిల్ల సంధ్య అనేదాని కూతురు. దాని పేరు సాలకటంకట. సాలకటంకట విద్యుత్కేశుణ్ణి పెళ్ళాడి, భర్తతో సుఖంగా విహారాలు చేస్తూ, గర్భవతి అయి, మందర పర్వత ప్రాంతంలో ఒక కొడుకును కన్నది. అయితే ఆమె కా కొడుకు పైన కన్న భర్తతో విహరించటం మీదనే ఆసక్తి ఎక్కువైన కారణం చేత, కొడుకును కన్న చోటనే పారేసి భర్తతో విహరించ బోయింది.









మూడు అగ్నుల లాటి వారు కలిగారు. వారు మహా బలవంతులు, నిర్భయులు, భయంకరులు. తమ తండ్రి శివుడి వల్ల వరాలు పొందినట్టు తెలిసి, వారు మేరుపర్వతానికి వెళ్ళి, కఠోరమైన నియమాలతో అక్కడ తపస్సు సాగించారు. ఆ తపస్సుకు ముల్లోకాలూ అట్టుడికిపోయాయి. బ్రహ్మదేవుడు ఇంద్రాది దేవతలను వెంట బెట్టుకుని విమానం మీద వచ్చి, "మీ తపస్సుకు మెచ్చాను. ఏం వరాలు కావాలో కోరుకోండి," అన్నాడు.

"దేవా, నీకు మా పైన అనుగ్రహం కలిగిన పక్షంలో, మాకు ఎవరి చేతా ఓటమి కలగకుండానూ, మా చేతిలో శత్రువు లంతా చచ్చేటట్టూ, మేము దీర్ఘాయుష్మంతులమై వర్ధిల్లేటట్టూ వరమియ్యి," అన్నారు వాళ్ళు. బ్రహ్మ వారి కలాగే వరమిచ్చాడు.

ఇటువంటి వరం పొంది ఆ ముగ్గురు రాక్షసులూ మూడు లోకాలనూ పీడించసాగారు. దేవతలూ, ఋషులూ, సిద్ధులూ, సాధ్యులూ, చారణులూ మొదలైన వారికి జీవితం నరకమైపోయింది. వారిని కాపాడే నాధుడు లేడు.

ఆ రాక్షసులు విశ్వకర్మను పిలిపించి, "దేవత లందరికీ నీవే ఇళ్ళు కట్టావని



విన్నాం. హిమాలయం మీద గాని, మేరు పర్వతం మీద గాని, మందరగిరి మీద గాని కైలాసానికి సరివచ్చే టటువంటి అందమైన పట్టణం మాకు కట్టి ఇయ్యి," అని అడిగారు.

"దక్షిణ సముద్ర తీరాన త్రికూట మనీ, సువేల మనీ రెండు పర్వతా లున్నాయి. త్రికూట పర్వతం యొక్క నడిమి శిఖరం మీద ఇంద్రుడి కోరిక పైన లంకా పట్టణం కట్టి ఉంచాను. అది స్వర్గంతో సమానమైనది. బంగారు ప్రాకారాలూ, బంగారు తోరణాలూ కలది. మీరు మీ రాక్షసులతో సహా వెళ్ళి అక్కడ ఉన్నట్టయితే మిమ్మల్ని







ఎవరూ తేరి చూడలేరు," అని విశ్వకర్మ వారితో అన్నాడు.

విశ్వకర్మ చెప్పిన ఈ మాటలు విని ఆ రాక్షసులు చాలా సంతోషం చెంది, అనేక వేల మంది పరివారంతో సహా లంకకు చేరి ఆ నగరాన్ని చూసి పరమానంద భరితు లయారు. ఇదే సమయంలో నర్మద అనే గంధర్వ స్త్రీ చక్కని చుక్కల్లాటి తన కూతుళ్ళను ముగ్గురినీ తెచ్చి ఆ ముగ్గు రన్నదమ్ములకూ పెళ్ళి చేసింది.

పెద్దవాడైన మాల్యవంతుడి భార్య సుందరి. సుందరి గర్భాన వజ్రముష్టీ, విరూపాక్షుడూ, దుర్ముఖుడూ, సుప్తఘ్నుడూ, యజ్ఞకోపుడూ, మత్తుడూ, ఉన్మత్తుడూ అనే ఏడుగురు కొడుకులూ, అనల అనే ఒక కూతురూ కలిగారు.

సుమాలి భార్య కేతుమతి. సుమాలికి ఆ భార్య అంటే ప్రాణం కన్న ఎక్కువ. కేతుమతికి ప్రహస్తుడూ, అకంపనుడూ, వికటుడూ, కాలకార్ముకుడూ, ధూమ్రాక్షుడూ, దండుడూ, సుపార్శ్వుడూ, సంహ్రాదీ, ప్రఘసుడూ, భాసకర్ణుడూ, అనే కొడుకులూ, పుష్పోత్కటా, కైకసీ, శుచిస్మితా, కుంభీనసీ అనే కుమార్తెలూ కలిగారు.

మాలి భార్య వసుధ అసాధారణ సుందరి. ఆమెకు అనిలుడూ, అనలుడూ, హరుడూ, సంపాతీ అనే నలుగురు కొడుకులు మాత్రమే కలిగారు. వీరు నలుగురూ విభీషణుడికి మంత్రు లయారు.

ఈ విధంగా ఆ ముగ్గురు రాక్షసులూ తమ పిల్లల తోనూ, పరివారం తోనూ లంకలో నివసిస్తూ, ఇంద్రాది దేవతలనూ, ఋషులనూ, నాగులనూ, దానవులనూ బాధిస్తూ, మూడు లోకాల లోనూ తమను నిగ్రహించే వాడు లేక వీరవిహారం చేస్తూ, చావు భయం కూడా లేకుండా, యజ్ఞాలను ధ్వంసం చేస్తూ, వరం పొందిన గర్వంతో తిరగ సాగారు.






అగస్త్యమహర్షి రాముడికి, సుకేశుడి కుమారులైన మాల్యవంతుడూ, మాలీ, సుమాలీ లంకలో నివాసం ఏర్పాటు చేసుకుని, తమ భార్యల తోనూ, పిల్లల తోనూ నిర్విచారంగా ఉంటూ, వరాలు పొందిన గర్వంతో ముల్లోకాలనూ క్షోభ పెట్టారని తెలిపి, ఇంకా ఇలా అన్నాడు:

రాక్షసులు పెట్టే యాతనలు భరించలేక దేవతలూ, ఋషులూ మహేశ్వరుడి వద్దకు వెళ్ళి, "జగద్రక్షకా! సుకేశుడి కొడుకులు బ్రహ్మ నుంచి వరాలు పొంది పొగరెక్కి, స్వర్గం నుంచి దేవతలను తరిమేసి దాన్ని తాము ఆక్రమించుకున్నారు, మునుల ఆశ్రమాలూ, ఇళ్ళూ శూన్యం పెట్టేశారు. బ్రహ్మ, రుద్రుడూ, విష్ణువూ, ఇంద్రుడూ, యముడూ, వరుణుడూ, చంద్రుడూ, సూర్యుడూ అన్నీ తామే నని చెప్పుకుంటున్నారు. ఏ క్షణం చూసినా యుద్ధ సన్నద్ధులై ఉండే ఆ రాక్షసుల నుంచి, మమ్మల్ని కాపాడు," అని భయపడుతూ వేడుకున్నారు.

అయితే మహేశ్వరుడు సుకేశుడి పట్ల పక్షపాతం కలవాడు. అందుచేత ఆయన వారితో, "దేవతలారా, మహర్షులారా! ఆ రాక్షసులను చంపటం నాకు సాధ్యం కాదు. వారి చావు నా చేతిలో లేదు. నా మాట విని మీరు విష్ణువు వద్దకు వెళ్ళారంటే, ఆయన తప్పకుండా వాళ్ళను చంపగలడు," అన్నాడు.

దేవతలు మొదలైన వారు మహేశ్వరుడికి జయం పలికి విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి,







మహేశ్వరుడితో మొర పెట్టుకున్నట్టే మొర పెట్టుకుని, త్రికూటపర్వతం మీది లంకా నగరంలో చేరిన రాక్షసులను చంపి, తమను కాపాడమనీ, తమకు వేరే దిక్కు లేదనీ వేడుకున్నారు.

విష్ణుమూర్తి వారికి అభయ మిచ్చి, "నేను సుకేశుణ్ణీ, అతని ముగ్గురు కొడుకులనూ ఎరుగుదును. వారి ప్రవర్తన చూస్తే నాకూ మంటగానే ఉన్నది. నేను వాళ్ళను సంహరిస్తాను. మీరు భయపడకండి," అన్నాడు. ఈ మాటలు విని దేవతలు పరమానంద భరితులై, విష్ణుమూర్తిని ప్రశంసించి తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.



ఈ సంగతి లంకలో తెలిసింది. మాల్యవంతుడు తన తమ్ములతో, "దేవతలూ, ఋషులూ చేరి మనను చంపించటానికి చూస్తున్నారు. వాళ్ళు మహేశ్వరుడి వద్దకు వెళ్ళి మనను చంపమని కాళ్ళా, వేళ్ళా పడ్డారట. ఆ పని తనకు సాధ్యం కాదనీ, విష్ణుమూర్తి వద్దకు వెళ్ళమనీ, మహేశ్వరుడు సలహా ఇచ్చాడట. ఆ సలహా ప్రకారం వాళ్ళు విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి, ఆయన కాళ్ళ పైన పడ్డారట. ఆయన మన నందరినీ చంపుతానని వారికి అభయ మిచ్చి పంపేశాడట. విష్ణుమూర్తి మనని చంపటానికి నిశ్చయించి నట్టయితే మన మేం చెయ్యాలో ఆలోచించటం మంచిది. ఎందుకంటే, ఆయన హిరణ్యకశిపుడి లాటి అనేక మంది ప్రబల రాక్షసులను చంపి ఉన్నాడు. ఎన్నో వరాలు పొంది, యజ్ఞాలు చేసి, దివ్యాస్త్రాలు సంపాదించి, మాయలలో ఆరితేరిన రాక్షసు లాయనతో యుద్ధం చేసి చచ్చారు. ఈ సంగతి మనసులో ఉంచుకుని మన కర్తవ్యం నిర్ణయించుకోవాలి," అన్నాడు.

దీనికి మాలీ సుమాలీ ఇలా చెప్పారు:

"మనం పండితులం; యజ్ఞాలూ, దానాలూ చేసిన వాళ్ళం; మనకు అంతులేని ఐశ్వర్యం ఉన్నది; అత్యంత బలవంతు








లైన శత్రువులను జయించాం; విష్ణుమూర్తి అయేది, రుద్రు డయేది, ఇంద్రు డయేది మన ఎదట నిలబడలేడు. మనకే లోకాలన్నీ వణికిపోతాయి. విష్ణుమూర్తి మనని ద్వేషించ టానికి కారణ మేమీ కనబడదు. ఈ దేవ తలే ఆయనను రేపెట్టి ఉంటారు. అందుకు మనం సైన్యాలతో సహా బయలుదేరి వెళ్ళి ఆ దేవతల పని పట్టిద్దాం."

ఈ విధంగా ఆలోచించుకుని ఆ రాక్షస సహోదరులు యుద్ధ యత్నాలు చేసి, సైన్య సమేతులై స్వర్గం మీదికి బయలుదేరారు. లంక నుంచి వారి వెంట రథాలూ, ఏను గులతో, గుర్రాలతో, ఒంటెలు మొదలైన వాటితో నడిచే వాహనాలూ, స్వర్గాన్ని ముట్ట డించటానికి కదిలాయి. అపారమైన ఆ రాక్షససేనకు నాయకుడు మాలి. ఇలా రాక్షసులు లంకను విడిచి బయలుదేరగానే లంక పాడుపడి నట్టయిపోయింది.

రాక్షసులు యుద్ధానికి కదిలిన మాట తెలియగానే విష్ణుమూర్తి, ధగధగా మెరిసే కవచం ధరించి, బాణాలూ, విల్లూ, శంఖమూ, చక్రమూ, గదా, ఖడ్గమూ తీసు కుని, పీతాంబరంతో గరుడవాహన మెక్కి వచ్చి దేవసేనను చేరగానే ఉభయపక్షా లకూ యుద్ధం ప్రారంభమయింది.

విష్ణుమూర్తి తన బాణాలతోనూ, చక్రం తోనూ అనేక మంది రాక్షసులను చంపాడు. కాని మాలి విష్ణుమూర్తి నెదుర్కొని, అతి దారుణమైన యుద్ధం చేసి, విష్ణుమూర్తి వాహనమైన గరుత్మంతుడు తల మీద బలంగా కొట్టి, యుద్ధరంగం నుండి పారి పోయేటట్టు కూడా చేశాడు. అయితే చివ రకు విష్ణుమూర్తి తన చక్రాయుధంతో మాలి తల తెగనరికాడు. మాలి చావటం చూసి సుమాలీ, మాల్యవంతుడూ, తమ రాక్షస బలాలతో సహా లంకలోకి పారిపో యారు. విష్ణుమూర్తి ఆ రాక్షసులను వెన్నాడి వధించ సాగాడు.









అది చూసి మాల్యవంతుడు, "నీవు క్షత్రియ ధర్మం కూడా పాటించకుండా పారిపోతున్న మమ్మల్ని వెంటాడి చంపుతున్నావే! అటువంటి వాడికి వీరస్వర్గం కూడా రాదుగద. నీ కంతగా యుద్ధం చెయ్యాలని ఉంటే నాతో చెయ్యి," అంటూ, విష్ణువుకు ఎదురుగా నిలబడ్డాడు.

"మీరు యుద్ధరంగం నుంచి పారిపోవటమే గాదు, పాతాళ లోకంలో దాక్కున్నా వెతికి చంపుతాను. మిమ్మల్ని చంపుతానని దేవతలకు మాట ఇచ్చాను. ఆ మాట తప్పను," అన్నాడు విష్ణుమూర్తి. ఇద్దరూ యుద్ధానికి తలపడ్డారు. మాల్యవంతుడు



విష్ణుమూర్తినీ, గరుత్మంతుణ్ణీ కూడా చాలా పీడించాడు. అయితే గరుత్మంతుడు తన రెక్కలు విసిరి గాలి పుట్టించే సరికి, ఆ గాలి మాల్యవంతుణ్ణి ఆకాశం లోకి ఎగరగొట్టింది. అది చూసి సుమాలి తన సైన్యంతో సహా లంకలోకి పారిపోయాడు. మాల్యవంతుడు ఎలాగో తన సేనను కలుసుకుని, పుట్టెడు పరాభవంతో లంకకు చేరుకున్నాడు.

అటు తరవాత విష్ణుమూర్తి లంకావాసులైన రాక్షసులతో అనేక యుద్ధాలు చేసి, అనేక మంది రాక్షస వీరులను చంపిన అనంతరం, చావగా మిగిలిన రాక్షసులు తమ భార్యలతోనూ, పిల్లలతోనూ, పరివారంతోనూ లంకను విడిచిపెట్టి పాతాళలోకానికి వెళ్ళి, అక్కడ నివాసం ఏర్పరుచుకుని, సుమాలిని తమ అధిపతిగా చేసుకున్నారు. ఆ కాలంలో విష్ణుమూర్తి చేత చచ్చిన మాల్యవంతుడు మొదలైన రాక్షసులు రావణ కుంభకర్ణుల కంటె బలవంతులు.

రాక్షసులు లంకను విడిచి వెళ్ళిపోగానే వైశ్రవణుడు (కుబేరుడు) తిరిగి లంకలో నివసించ నారంభించాడు.

కొంత కాలం గడిచింది. సుమాలి ఒక నాడు కైకసి అనే తన కుమార్తెను వెంటబెట్టుకుని పాతాళలోకం నుంచి బయలు










దేరి భూలోకంలో విహరించ వచ్చాడు. వారు భూమి మీద తిరుగుతూ ఉండగా, పుష్పకం ఎక్కి తన తండ్రిని చూడటానికి వెళుతున్న కుబేరుడు వారికి కనిపించాడు.

కుబేరుడి ఐశ్వర్యంతో తన దౌర్భాగ్య స్థితిని పోల్చుకుని సుమాలి, "ఏం చేస్తే మేం వృద్ధిలోకి వస్తాం?" అని ఆలోచించుకుని, చివరకు ఒక ఆలోచన చేశాడు. అపర లక్ష్మీదేవి లాటి తన కుమార్తెతో అతను, "అమ్మా, నీకు పెళ్ళియీడు వచ్చింది. నిన్ను పెళ్ళాడగోరే వారు చాలా మంది ఉన్నారు, కాని నీవు ఒప్పుకోవని సంశయిస్తున్నారు. విశ్రవశుడి కొడుకైన కుబేరుడి మహావైభవం కళ్ళారా చూశావుగద. విశ్రవసుడు పులస్త్యబ్రహ్మ కొడుకు, మహాముని. ఆయనను సేవించావంటే నీ కూడా ఇలాటి కొడుకులే కలుగుతారు," అన్నాడు.

కైకసి తండ్రి మీది గౌవరం కొద్దీ బయలుదేరి, విశ్రవుడు తపస్సు చేసుకునే చోటికి వెళ్ళి నిలబడింది. ఆ సమయానికి విశ్రవుడు అగ్నిని అర్చిస్తున్నాడు. నిండు చంద్రుడి లాగా వెలిగిపోతున్న కైకసిని చూసి విశ్రవుడు, "సుందరీ, ఎవరి కుమార్తెవు? ఎక్కడి నుంచి వచ్చావు? ఏం పని మీద వచ్చావు? నిజం చెప్పు," అన్నాడు.

కైకసి చేతులు జోడించి, "మునీశ్వరా, మీరు తపశ్శక్తితో అంతా తెలుసుకోగలరు. నేను నా తండ్రి అజ్ఞ ప్రకారం వచ్చాను. నా పేరు కైకసి," అన్నది.

"అవును. తెలిసింది. నా వల్ల కొడుకులను కోరి వచ్చావు," అని విశ్రవు డామెను యథావిధిగా పెళ్ళాడి, "నీవు సంతానం కోరి వచ్చినది రాక్షస ఘడియలలో. ఆ కారణంగా నీకు దారుణమైన మహా క్రూరులైన రాక్షసులు కలుగుతారు," అన్నాడు.

"మీ వంటి తపశ్శాలికి అలాటి పిల్లలు పుట్టటమా? నాకు అవసరం లేదు. మంచి పిల్లలను దయచేసి అనుగ్రహించండి,"







అన్నది కైకసి. ఆమె ఎంతో బతిమాలిన మీదట విశ్రవుడు, "సరే, నీ చిన్న కొడుకు నీ వంశానికి తగి ఉంటాడులే," అన్నాడు.

కొంతకాలం గడిచాక కైకసి ఒక పిల్లవాణ్ణి కన్నది. వాడు చూడటానికి పరమ వికారంగా ఉన్నాడు—రాక్షసి రూపం, భయంకరాకారం, పది తలలు, పెద్ద కోరలు, కాటుక రంగు శరీరచ్ఛాయ, ఎర్రని పెదవులు, ఇరవై చేతులు, పెద్ద పెద్ద నోళ్ళు! అతనికి పది తల లుండటం చూసి, విశ్రవుడా కుర్రవాడికి దశగ్రీవుడు (పది కంఠాలు గలవాడు) అని నామకరణం చేశాడు. అతనే రావణుడు.



రావణుడి తరవాత పుట్టిన కుంభకర్ణుడు, మహాబలుడు, ఏ జంతువుకూ లేనంత పెద్ద శరీరం గలవాడు. అతని అనంతరం వికృతమైన ముఖం గల శూర్పణఖ పుట్టింది. అందరి కన్న ఆఖరుకు పుట్టిన వాడు విభీషణుడు. అతను సత్యగుణం గలవాడు.

రావణ కుంభకర్ణులు అరణ్యం లోనే పెరుగుతూ, తమ అసాధారణ బలంతో అందరికీ దిగులు పుట్టిస్తూ సంచరించసాగారు. కుంభకర్ణుడు ఋషులను పట్టుకుని తినేస్తూ ఉండేవాడు. విభీషణుడు మాత్రం స్వాధ్యాయం చేస్తూ, నియమితాహారుడై, ధర్మమార్గం అవలంబించాడు.

వా రందరూ ఆశ్రమం లోనే ఉండగా ఒకనాడు కుబేరుడు పుష్పకం పైన తన తండ్రిని చూడ వచ్చాడు. కుబేరుడి తేజస్సూ, ఐశ్వర్యమూ చూసి అసూయపడిన కైకసి తన పెద్ద కొడుకైన రావణుడితో, "మీ అన్న అయిన కుబేరుడి వైభవం చూశావా? ఆ తండ్రికి పుట్టినవాడివే గదా, నీవు చూడు ఏలా గున్నావో! నీవు ఆ కుబేరుడితో సమానంగా ఉంటే నేను సంతోషిస్తాను రా నాయనా," అన్నది.

అమిత ప్రతాపశాలి అయిన రావణుడికీ మాటలు రోషం తెప్పించాయి. అతను









తన తల్లితో, "అమ్మా, నేను నా సవతి అన్నతో సమానుణ్ణో, అంతకు మించినవాణ్ణో అయి తీరుతాను. విచారించకు," అని ప్రతిజ్ఞ చేశాడు. అతను కుంభకర్ణుడితో కలిసి మహత్తరమైన పనులు చేయాలని సంకల్పించుకుని, తన తమ్ములతో సహా గోకర్ణాశ్రమానికి వెళ్ళి, అక్కడ అతి తీవ్రమైన తపస్సు చేశాడు. అతనితో కుంభకర్ణ విభీషణులు కూడా తపస్సు చేశారు.

రావణుడు నిరాహారుడై పదివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. అతను వెయ్యి సంవత్సరాల కొక శిరస్సు చొప్పున నరికి అగ్ని గుండంలో వేశాడు. అతని పది తలలలో తొమ్మిది ఆహుతి అయి, ఒక్కటి మిగిలింది. పదివేల సంవత్సరాలూ ముగిసి, రావణుడు తనకు మిగిలిన ఒక్క తలనూ నరుక్కో బోతుండగా, బ్రహ్మ దిక్పాలకులను వెంట బెట్టుకుని వచ్చి, "దశగ్రీవా, నీ తపస్సుకు మెచ్చాను. నీ కిష్టమైన వరం కోరుకో," అన్నాడు.

రావణుడు పరమానందంతో బ్రహ్మకు సాష్టాంగ నమస్కారం చేసి, "తాతా, ప్రాణులకు మరణ భయాన్ని మించిన భయం మరొకటి లేదు. నాకు చావు లేకుండా వరమియ్యి," అన్నాడు.



"నాయనా, అలాటి వర మియ్యటం సాధ్యం కాదు, మరొక వరం కోరుకో," అన్నాడు బ్రహ్మ.

"ఇతర ప్రాణుల భయం నా కేమీ లేదు గాని, నాకు సుపర్ణులూ, నాగులూ, యక్షులూ, దైత్యులూ, దానవులూ, రాక్షసులూ, దేవతలూ మొదలైన వారి వల్ల చావు లేకుండా వరమియ్యి. మనుష్యులు మొదలైన వాళ్ళు నాకు తృణప్రాయులే," అన్నాడు రావణుడు.

రావణుడు కోరినట్టే బ్రహ్మ వర మిచ్చాడు; ఆ వరంతో బాటు రావణుడికి పది తలలూ ఎప్పటి లాగే ఉండేటట్టూ,






అతనికి కోరిన రూపం సిద్ధించేటట్టూ కూడా వరమిచ్చాడు.

తరవాత బ్రహ్మ విభీషణుణ్ణి కూడా వరం కోరుకో మన్నాడు. తన మనసు ధర్మం తప్పకుండానూ, తలచినప్పుడు తనకు బ్రహ్మాస్త్రం స్ఫురించేటట్టూ విభీష ణుడు వరం కోరాడు. బ్రహ్మ అతనికి కోరిన వరమిస్తూ, చావు లేకుండా కూడా వరమిచ్చాడు.

తరవాత వరం పుచ్చుకునే వంతు కుంభకర్ణుడిది. దేవతలు బ్రహ్మతో, "దేవా, కుంభకర్ణుడికి వర మియ్యవద్దు. నందన వనంలో విహరిస్తున్న అప్సర స్త్రీలను ఏడు గురిని తినేశాడు, దేవేంద్రుడి అనుచరులను పది మందిని తినేశాడు, ఎంత మంది ఋషులనూ, మునులనూ తిన్నాడో లెక్కే లేదు. వరాలు పొందకుండానే వీడిలా ఉంటే, వరాలు పొంది ఎలా తయారవు తాడో!" అన్నారు.

ఈ మాటలు విని బ్రహ్మ సరస్వతిని స్మరించి రప్పించి, కుంభకర్ణుడి వాక్ స్థానాన్ని వశపరుచుకో మని చెప్పాడు. తర వాత ఆయన కుంభకర్ణుణ్ణి చూసి, "నీ కిష్ట మైన వరం కోరు," అన్నాడు.

సరస్వతీ ప్రభావం చేత కుంభకర్ణుడు, "నాకు సంవత్సరాల తరబడి నిద్రపోయే టట్టు వరమియ్యి," అన్నాడు. తథాస్తు అని చెప్పి బ్రహ్మ అదృశ్యుడయాడు. కుంభకర్ణుడి వాక్కు నుంచి సరస్వతి కూడా దిగిపోయింది.

వెంటనే కుంభకర్ణుడికి స్పృహ వచ్చి నట్టయింది. "ఛీ, ఛీ! ఏమిటిలాటి వరం కోరాను? దేవత లేదో మాయపన్ని నన్ను మోసగించారు," అని చింతించాడు.

రావణ కుంభకర్ణ విభీషణులు ఈ విధంగా బ్రహ్మ వల్ల వరాలు పొంది, శ్లేష్మాతక వనానికి వెళ్ళి, అక్కడ నివ సించసాగారు.






తన మనమలు ముగ్గురూ బ్రహ్మ వల్ల వరాలు పొందిన సంగతి పాతాళంలో ఉన్న సుమాలికి తెలిసింది. భయం తీరిపోయి అయన తన మంత్రులైన మారీచ, ప్రహస్త, విరూపాక్ష, మహోదరులను వెంటబెట్టుకుని అట్టహాసంగా బయలుదేరి రావణుడి వద్దకు వచ్చి, అతన్ని కౌగలించుకుని, "బాబూ, ఇంత కాలానికి నా కోరిక పండింది. ఏ విష్ణుమూర్తి భయం చేత మేం లంకను విడిచిపెట్టి పాతాళానికి వెళ్ళిపోయామో ఆ విష్ణు భయం పోయింది, ఎందుకంటే నీవు బ్రహ్మ నుంచి ఉత్తమ వరాలు పొందావు. అసలు లంక మన రాక్షసులదే. దాన్ని బుద్ధిశాలి అయిన నీ సవతి అన్న కుబేరుడు ఆక్రమించి కూర్చున్నాడు. వీలును బట్టి మంచి మాటలతోనో, లంచం పెట్టో, బలాత్కారంగానో నీవు మీ అన్న వద్ద నుంచి లంకను తిరిగి సంపాదించు. నిక్షేపంగా నీవే లంకకు రాజుగా ఉండు. ఇలా చేశావంటే దిక్కు లేకుండా ఉన్న రాక్షసవంశాన్ని ఉద్ధరించిన వాడివవుతావు," అన్నాడు.

అంతా విని రావణుడు, "అదేమిటి, తాతా? కుబేరుడు మాకు తండ్రితో సమానుడు. నీ విలా అనకూడదు, నేను వినకూడదు," అన్నాడు. సుమాలి ఇంకేమీ అనలేకపోయాడు. ఆ తరవాత, సుమాలి మంత్రులలో ఒకడైన ప్రహస్తుడు రావణుణ్ణి ఒంటరిగా పట్టుకుని ఈ విధంగా నూరిపోశాడు:









అందుచేత నేను చెప్పినట్టు చెయ్యి మన వాళ్ళందరూ సుఖపడతారు."

రావణుడు కొంచెం సేపు ఆలోచించి సరే నన్నాడు. అతను ప్రహస్తుణ్ణి దూతగా కుబేరుడి వద్దకు పంపి, యిలా అడిగించాడు:

"అన్నా, ఇప్పుడు నీ అధీనంలో ఉన్న లంక అసలు రాక్షసులది. అందుచేత నీవు లంకను రాక్షసుల కిచ్చేసినట్టయితే ధర్మంగా వర్తించిన వాడి వవుతావు, తమ్ముడి నైన నా ముద్దు తీర్చిన వాడివీ అవుతావు."

ప్రహస్తుడు వచ్చి ఈ మాటలు రావణుడి తరఫున చెప్పగానే కుబేరుడు రావణుడితో తన మాటగా ఇలా చెప్ప మన్నాడు:

"తమ్ముడూ, మన తండ్రి నా కీ లంకా నగరా న్నిచ్చినప్పు డక్కడ రాక్షసు లెవరూ లేరు. నేనూ, నా యక్షులూ ఇక్కడ ఉంటున్నాం. నా రాజ్యమూ, నా పట్ట ణమూ, నా ఐశ్వర్యమూ నీది కాదా? వచ్చి హాయిగా రాజ్య మేలు. ఒక తండ్రి బిడ్డల మైన మన మధ్య తేడాలు దేనికి?"

ఈ మాటలు చెప్పి ప్రహస్తుణ్ణి పంపేసి, కుబేరుడు పుష్పక మెక్కి తన తండ్రి వద్దకు వెళ్ళి జరిగిన సంగతి చెప్పాడు.

విశ్రవసుడు కుబేరుడు చెప్పిన దంతా విని, "నాయనా నే నొకటి చెబుతాను

"అబ్బాయీ, నీవు మీ తాతగారితో అన్న మాట భావ్యంగా లేదు. శూరు డైన వాడికి అన్నదమ్ము లన్న విచక్షణ ఏమిటి? అన్న దమ్ముల వైరం ఆది నుంచీ వస్తున్నదే. అదితీ, దితీ అక్కచెల్లెళ్ళే. ఇద్దరూ కశ్యప బ్రహ్మకు భార్యలై దేవతలనూ, రాక్షసు లనూ కన్నారు. కాని విష్ణువు రాక్షసులను చావగొట్టి మూడు లోకాలూ దేవతలకు కట్ట బెట్టాడు. ఈ లంకే గాక, భూమండలం యావత్తూ ఒకప్పుడు రాక్షసులే అనుభవిం చారు. మేం నిన్ను కొత్తగా తప్పు పని చెయ్యమని చెప్పటం లేదు. ఈ దుర న్యాయం అదివరకు జరుగుతూ వస్తున్నదే.







విను. రావణు డీ మాట నాతో అంటే కోప్పడ్డాను. వాడి కిప్పుడు వరాలు రావటం చేత ఒళ్ళు తెలియకుండా ఉంది. నీవు మటుకు లంకను విడిచిపెట్టి, కైలాస పర్వతం మీదికి వెళ్ళి, అక్కడ నివాసం ఏర్పాటు చేసుకో. అక్కడ మందాకినీ నదిలో బంగారు తామరపువ్వు లున్నాయి. ఆ పర్వతం మీద ఎప్పుడూ దేవతలూ, గంధర్వులూ, అప్సరలూ, ఉరగులూ, కిన్నరులూ విహరిస్తూ ఉంటారు. ప్రస్తుతం రావణుడితో వైరం మటుకు పెట్టుకోకు," అని సలహా ఇచ్చాడు.

కుబేరుడు తండ్రి మాట పాటించి, తన భార్యనూ, బిడ్డలనూ, మంత్రులనూ, పరివారాన్నీ, ధనాన్నీ, వాహనాలనూ వెంటబెట్టుకుని కైలాస పర్వతానికి వెళ్ళిపోయాడు.

ప్రహస్తుడు రావణుడి వద్దకు పరమానందంతో వెళ్ళి, "రావణా, లంక ఖాళీ అయింది. కుబేరుడు అక్కడి నుంచి పరివారంతో సహా వెళ్ళి పోయాడు. అక్కడికి వెళ్ళి మమ్మల్నందరినీ పెట్టుకుని రాజ్యం చెయ్యి," అన్నాడు.

రావణుడు తన తమ్ములనూ, బలగాన్నీ వెంటబెట్టుకుని లంకకు వెళ్ళాడు. అక్కడ అతనికి వైభవంగా రాజ్యాభిషేకం జరిగింది.



రాక్షసులతో క్రిక్కిరిసిన లంకకు కళ వచ్చినట్టయింది. ఇవతల రావణుడు లంకానగరాన్ని పాలిస్తుంటే అవతల అతని అన్న అయిన కుబేరుడు అలకా నగరాన్ని పాలించసాగాడు.

లంకా రాజ్యాధిపత్యం పొందాక రావణుడు తన చెల్లెలైన శూర్పణఖను కాలకేయ వంశంలో పుట్టిన విద్యుజ్జిహ్వు డనే వాడి కిచ్చి పెళ్ళి చేశాడు.

కొంత కాలం గడిచాక రావణుడు వేటకు వెళ్ళి అరణ్యంలో ఒక పెద్దమనిషినీ, ఆయన వెంట ఉన్న ఒక అమ్మాయినీ చూసి, "మీ రెవరు? నిర్జనమైన ఈ అర









ణ్యంలో ఈ పిల్లను వెంటబెట్టుకుని ఎందుకు తిరుగుతున్నావు?" అని అడిగాడు.

దానికా పెద్దమనిషి ఇలా చెప్పాడు :

"నాయనా, నేను దితి కొడుకును. నా పేరు మయుడు. నీవు హేమ అనే అప్సరస గురించి వినే వుంటావు. దేవతలు నాకా హేమ నిచ్చి పెళ్ళిచేశారు. ఈ పిల్ల మా ఇద్దరికీ పుట్టిన కూతురు. దీని పేరు మందోదరి. పధ్నాలుగేళ్ళ క్రితం హేమ నన్ను విడిచిపెట్టి స్వర్గానికి వెళ్ళిపోయింది. ఈ పిల్లకు తగిన భర్తను వెతుక్కుంటూ బయలుదేరాను. ఈ పిల్ల కాక మరి ఇద్దరు కొడుకులు కూడా నాకు హేమ వల్ల కలిగారు. ఒకడి పేరు మాయావి, రెండో వాడి పేరు దుందుభి. నా సంగతి అడిగావు గనక చెప్పాను. నీ సంతతి కూడా కాస్త చెబుతావా ఏమిటి?"

"నేను పులస్త్యబ్రహ్మ మనమణ్ణి, విశ్రవో బ్రహ్మ కొడుకును. నా పేరు దశగ్రీవుడు," అన్నాడు రావణుడు.

రావణుడు మహర్షుల వంశంలో పుట్టాడని తెలియగానే మయుడు తన కుమార్తెను అతని కిచ్చి పెళ్ళి చెయ్యటానికి సిద్ధపడ్డాడు. రావణుడు సరే నన్నాడు. అక్కడే అప్పుడే అగ్నిని ప్రజ్వలింపజేసి, మయుడు తన కూతురి చెయ్యి రావణుడి చేతిలో పెట్టి, అగ్నిసాక్షిగా ఆ ఇద్దరికీ వివాహం చేశాడు. అప్పుడే ఆయన తన అల్లుడికి ఒక మహాశక్తిని ఇచ్చాడు. అది ఎంతో తపస్సు చేయగా లభించిన ఆయుధం; దానితోనే రావణుడు లక్ష్మణుణ్ణి మూర్ఛపోగొట్టాడు.

రావణుడు తన భార్యతో సహా లంకకు వెళ్ళి, తన తమ్ముల పెళ్ళి ప్రయత్నాలు చేశాడు. వైరోచనుడి మనుమరాలు వజ్రజ్వాల అనే దాన్ని కుంభకర్ణుడికీ, శైలూషుడనే గంధర్వరాజు కూతురు సరమ అనే దాన్ని విభీషణుడికీ నిశ్చయించి వైభవంగా పెళ్ళి చేశాడు.











ముగ్గు రన్నదమ్ములూ లంకలో తమ భార్యలతో సుఖంగా కాపరం చేస్తుండగా రావణుడి భార్య మండోదరి మేఘనాదుణ్ణి కన్నది. ఆ కుర్రవాడు భూమి మీద పడుతూనే ఉరిమి నట్టుగా ఏడ్చాడట. అందుకని వాడికి మేఘనాదు డని పేరు పెట్టుకున్నారు. ఆ కుర్రవాడంటే తల్లిదండ్రు లకు ఎంతో ప్రేమ. ఆ మేఘనాదుడే లక్ష్మ ణుడి చేతిలో చచ్చిన ఇంద్రజిత్తు.

ఒకనాడు రావణుడు కొలువు తీరి ఉండగా కుంభకర్ణుడు బ్రహ్మాండంగా ఆవ లించి, "అన్నా, నాకు నిద్ర ముంచుకొస్తు న్నది. నేను పడుకోవటాని కేదన్నా ఏర్పాటు చెయ్యి," అన్నాడు. అది బ్రహ్మ వరం వల్ల ఆవహించిన నిద్ర.

రావణుడు కుంభకర్ణుడి కొక నిద్రా భవనం అద్భుతంగా కట్టించి ఇచ్చాడు. అది చాలా వెడల్పూ, అంతకు రెండింతలు పొడుగూ కలిగి, స్ఫటిక శిలా స్తంభాలూ, దంతపు తోరణాలూ అమర్చి, బంగారమూ, మణులూ పొదిగినటువంటిది. కుంభకర్ణుడు అందులో పడుకుని సంవత్సరాల తరబడి నిద్రపోయాడు.

ఒకవంక కుంభకర్ణుడు అలా పడి నిద్ర పోతుంటే రావణుడు తన అసాధారణ బలాన్ని అండ చేసుకుని, దేవతలనూ, ఋషులనూ, యక్షులనూ, గంధర్వులనూ యథేచ్ఛగా బాధించ సాగాడు. మదించిన ఏనుగు నీటిలో ప్రవేశించి కెలికినట్టుగా రావణుడు నందనోద్యానం మొదలైన దేవతల ఉద్యానాలను ధ్వంసం చేశాడు.

తన తమ్ముడు చేస్తున్న పనులు దూష్య మైనవని బాధపడి, కుబేరుడు, తన వంశ గౌరవానికి తగిన బోధలను తమ్ముడికి చేయ దలచి, రావణుడి వద్ద కొక దూతను పంపాడు. ఆ దూత లంకకు వచ్చి, ముందుగా విభీషణుణ్ణి చూశాడు. విభీష ణుడు దూతకు తగిన గౌరవ మర్యాదలు









జరిపి, కుబేరుడు మొదలైన వారి క్షేమ సమాచారాలు అడిగి కనుక్కని, అతను వచ్చిన పని తెలుసుకున్నాడు. తరవాత అత నా దూతను నిండు సభలో రావణు డికి పరిచయం చేశాడు.

దూత కుబేరుడి మాటలుగా రావణుడితో ఇలా అన్నాడు :

"తమ్ముడా, ఇప్పటికే నీకు చాలా కీర్తి వచ్చింది. అంతతో తృప్తిపడు. ఇక నుంచీ సాధ్యమైన మేరకు సాధు మార్గాన నడ వటం మంచిది. నీవు ధ్వంసం చేసిన నందనవనాన్ని నేను కళ్ళారా చూశాను. ఋషులను చంపావని విన్నాను. నీ చేత పీడించబడిన దేవతలు నీపై పగ తీర్చుకునే ప్రయత్నంలో ఉన్నట్టు తెలుస్తున్నది. నే నీ మధ్య రౌద్రవ్రతాన్ని నియమంగా చెయ్యగోరి హిమాలయానికి వెళ్ళి, అక్కడ శివుడితో ఉన్న పార్వతిని చూశాను. మరే ఉద్దేశమూ లేకుండానే, పార్వతి సౌందర్యానికి బందీ అయి నా ఎడమ కన్ను ఆమె పైన పడింది. వెంటనే నా కన్ను దగ్ధమై, పింగళ వర్ణం పొందింది. తరవాత నేను అపారమైన ఆ పర్వతం మీద మరొక చోటికి వెళ్ళి రౌద్ర వ్రతం అవలంబించాను. వ్రత నియమం పూర్తి కాగానే ఈశ్వరుడు మెచ్చి, తాను ఒకప్పు డీ వ్రతం చేసినట్టూ, అనం తరం నేను మాత్రమే ఈ వ్రతాన్ని పూర్తి చేసినట్టూ చెప్పి నన్ను తన స్నేహితుడుగా వుండమని కోరాడు. ఆయన నాకు ఏకాక్షీ పింగళు డనే పేరు కూడా పెట్టాడు. ఆయన వద్ద సెలవు పుచ్చుకుని ఇంటికి వచ్చే సరికి నీవు చేసే దుష్కృత్యాల మాట చెవిన పడింది. వంశానికి అపఖ్యాతి తెచ్చే ఇలాటి పనులు మాను, నాయనా. ఋషులూ, దేవతలూ చేరి నీ చావుకు ఉపాయ మాలో చిస్తున్నట్టు వింటున్నాను కూడా."

కుబేరుడి మాటలను ఈ విధంగా దూత చెప్పే సరికి రావణుడు ఆగ్రహావేశంతో,







"ఓరీ, దూతా! ఈ మాటలు చెప్పిన నిన్నూ, చెప్పించిన నా అన్ననూ ఏం చేస్తానో చూడు. కుబేరుడా నాకు హితబోధ చేసేది? తనకు శివుడి స్నేహం దొరికిందని కబురు చేస్తాడా? పెద్దవాడూ, తండ్రిలాటి వాడూ అని ఇంత కాలమూ చంపక మన్నించాను. నీ మాటలు విన్నాక మూడు లోకాలూ జయించాలని బుద్ధి పుట్టుతున్నది. మా అన్న కారణంగా మిగిలిన దిక్పాలకు లను కూడా నాశనం చేస్తాను," అంటూ కుబే రుడి దూతను కత్తితో నరికి, రాక్షసులకు తిన మని ఇచ్చి, ప్రయాణ సన్నాహం చేసి, రథ మెక్కి మూడు లోకాలూ జయించటానికి బయలుదేరాడు.

అతను మొట్టమొదట కుబేరుడి పైకే వెళ్ళ నిశ్చయించుకుని, మహోదరుడూ, ప్రహస్తుడూ, మారీచుడూ, శుకుడూ, సార ణుడూ, ధూమ్రాక్షుడూ అనే మహాశూరు లైన అరుగురు మంత్రులతో బయలుదేరి, కొద్ది కాలం లోనే నదులనూ, కొండలనూ, వనాలనూ దాటి, కైలాస పర్వతం చేరాడు. అక్కడ రావణుడూ, అతని అనుచరులూ కూర్చుని ఉండటం చూసి, ఆ వచ్చినవాడు కుబేరుడి తమ్ముడేనని తెలుసుకుని యక్షులు వెళ్ళి కుబేరుడితో చెప్పారు.



వెంటనే కుబేరుడు తన యక్షులను రావ ణుడి పైకి పంపుతూ, యుద్ధం చెయ్యమని ఉత్తరు విచ్చాడు. అసంఖ్యాకు లైన యక్షులు వచ్చి, రావణుణ్ణీ, అతని మంత్రు లనూ, చుట్టుముట్టి యుద్ధం ప్రారంభిం చారు. రావణుడి మంత్రి ప్రతి ఒక్కడూ వెయ్యేసి మంది యక్షులతో యుద్ధం చేశాడు. ఇక రావణుడు, ఎండుగడ్డిని అగ్ని దహించి నట్టుగా, యక్షులను నిర్మూలించాడు. ఈ యుద్ధంలో చచ్చిన యక్షులు చావగా, మిగిలిన వారు పారిపోయారు.

ఈ సంగతి విని కుబేరుడు మరి కొందరు యక్షులను రావణుడి పైకి పంపాడు. వారిలో







సంయోధకంటకు డనే వాడు మారీచుడి పై చక్రాయుధం ప్రయోగించి, కొండపై నుంచి కిందికి పడేటట్టు కొట్టాడు. మారీచుడు తెప్పరిల్లి తన పైకి వచ్చి యుద్ధం చేసే సరికి ఆ యక్షుడు పారిపోయాడు.

అలాగే అలకానగరం లోపలికి ప్రవేశించకుండా అడ్డంగా ఉండిన ఒక యక్షుణ్ణి రావణుడు తోరణం పీకి, కొట్టి చంపేశాడు. తరవాత యక్షు లందరూ రణరంగం నుంచి పారిపోయి, నదుల లోనూ గుహల లోనూ దాక్కున్నారు.

తాను రెండోసారి పంపిన యక్షులు కూడా ఓడిపోయే సరికి కుబేరుడు మాణిభద్రు డనే మహాయక్షుణ్ణి రాక్షసుల పైకి పంపాడు. ఆ మాణిభద్రుడు నాలుగు వేల యక్షులను వెంట తీసుకుని యుద్ధం ప్రారంభించాడు. వారందరూ అనేక ఆయుధాలతో తమ మీద విరుచుకుపడే సరికి రాక్షసులు పరిగెత్తసాగారు. తరవాత ఉభయ పక్షాలకూ దొమ్మి యుద్ధం జరిగింది. ఆ దొమ్మి యుద్ధంలో ప్రహస్తుడొక వెయ్యిమంది యక్షులనూ, మహోదరుడు మరొక వెయ్యిమందినీ, మారీచుడు దారుణంగా రెండు వేల మంది యక్షలనూ చంపారు. మాయలు తెలియని యక్షులు రాక్షసుల ముందెలా నిలుస్తారు?

అయినా మాణిభద్రుడు గొప్ప యుద్ధం చేశాడు. ధూమ్రాక్షుడు తనను ముసలంతో గుండెల మీద కొట్టినా చలించక, మాణిభద్రుడు తన గద గిరగిరా తిప్పి నెత్తిన కొట్టే సరికి ధూమ్రాక్షుడు నేల కరిచాడు. అది చూసి రావణుడు మాణిభద్రుడి పైకి వచ్చాడు. మాణిభద్రుడు తన పైన మూడు శక్తులు వరసగా ప్రయోగించినా లక్ష్య పెట్టక, రావణు డతని నెత్తి మీద కొట్టాడు. ఆ దెబ్బతో మాణిభద్రుడి కిరీటం ఒక పక్కకు ఒరిగిపోయి, అతనికి పార్శ్వ మౌళి అనే పేరు కూడా వచ్చేసింది.








ఈసారి కుబేరుడు ఇద్దరు మంత్రులను, శుక్రుడూ, ప్రోష్టపదుడూ అనే వాళ్ళను వెంట బెట్టుకుని రావణుడి వద్దకు వచ్చి, "ఓరీ, దుర్మార్గుడా, నే నెంత చెప్పినా నీ చెవికెక్కలేదు. అజ్ఞానం చేత విషం తాగిన వాడికి దాని ఫలితం పొందేటప్పుడు గాని జ్ఞానం రాదు. నీ అజ్ఞానం నీవు గ్రహించటం లేదు. నరకం అనుభవించే టప్పుడు తెలుసుకుంటావు. నీతో మాట్లా డటం వృథా," అన్నాడు.

తరవాత అన్నదమ్ము లిద్దరికీ ద్వంద్వ యుద్ధం జరిగింది. కుబేరుడు తన పైన ప్రయోగించిన అస్త్రా లన్నిటికీ విరుగుడు చేసి, రావణుడు మాయా యుద్ధం సాగిం చాడు. కుబేరుడికి అనేక రకాల రూపాలు కానవచ్చాయి గాని, ఎక్కడా రావణుడి రూపం కనబడలేదు. ఆ స్థితిలో రావణుడు గదతో కుబేరుడి తల పైన బలంగా కొట్టి, కింద పడగొట్టాడు. రక్తం కారుతూ పడి ఉన్న కుబేరుణ్ణి నిధుల అధిదేవతలు నందనవనానికి చేర్చి, చికిత్సలు చేశారు.

ఈ విధంగా రావణుడు కుబేరుడి పై విజయం సాధించి, పుష్పక విమానాన్ని తీసుకుని, దానిలో ఎక్కి శరవణానికి వెళ్ళాడు. ఆ కొండ బంగారం రంగులో వెలిగిపోతూ రెండో సూర్యుడి లాగా ఉన్నది. దాని పైకి వచ్చేసరికి పుష్పకం గమనం మాని ఆకాశంలో నిలిచిపోయింది.













అది చూసి రావణుడు, "కోరిన ప్రకారం నడిచే ఈ విమానం ఎందు కిలా ఆగిపోయి ఉంటుంది ?" అని వెంట ఉన్న తన మంత్రులను అడిగాడు.

ఇంత లోనే, ఈశ్వరుడి పార్శ్వచరుడూ, మహాబలుడూ అయిన నంది రావణుడితో, "దశగ్రీవా, వెంటనే వెనక్కు వెళ్ళిపో. ఈ పర్వతం మీద శివుడు క్రీడిస్తున్నాడు. సుపర్ణులూ, నాగులూ, యక్షులూ, దైత్యులూ, దానవులూ, రాక్షసులూ, ఏ ఇతర ప్రాణులూ ఈ పర్వతం మీదికి రారాదు," అన్నాడు.

ఈ మాటలు వినగానే రావణుడు ఆగ్రహావేశంతో చలించిపోతూ, "శంకరుడెవడు ?" అంటూ విమానం దిగి కొండ కిందికి వచ్చాడు. అక్కడ అతనికి శివుడూ, ఆయనకి కొద్ది దూరంలో శూలం పట్టుకుని, రెండవ శివుడి లాగా నిలబడి ఉన్న నందీశ్వరుడూ కనిపించారు. నందీశ్వరుడి వానర ముఖం చూసి రావణుడు మేఘం గర్జించి నట్టుగా పగలబడి నవ్వాడు.

అపరశంకరు డైన నంది రావణుడి నవ్వుకు కోపించి, "నా కోతి ముఖం చూసి నవ్వావు గనక, నా రూపమే కలిగి, నాతో సమానమైన శక్తి గల వానరులు నిన్నూ, నీ కులాన్నీ తప్పక నిర్మూలిస్తారు," అని శపించాడు.

రావణుడు నిర్లక్ష్యంగా పర్వతాన్ని సమీపించి నందితో, "నా విమానాన్ని ఆపిన ఈ పర్వతాన్నే ఇప్పుడు పెల్లగించేస్తాను. నేను భయంకరుణ్ణని తెలియదు లాగుంది," అంటూ తన చేతులను పర్వతం కిందికి దూర్చి ఆ పర్వతాన్ని ఎత్తసాగాడు. పర్వతం సంచలించి పైకి లేచింది.

శివు డిదంతా చూసి చిరునవ్వు నవ్వి తన కాలి బొటనవేలితో పర్వతాన్ని కొద్దిగా నొక్కాడు. దానితో రావణుడి చేతులు కొండ కింద చిక్కుకుని నలిగాయి. ఆ బాధకు రావణుడు మహా దారుణంగా





అక్రోశించాడు. రావణుడి మంత్రులు నిర్ఘాంత పోయారు. వాళ్ళు రావణుడితో, "రాజా, శంకరుణ్ణి తృప్తి చెయ్యి. ఆయన తప్ప మరే దిక్కూ కనబడదు. ఆయనను స్తోత్రం చెయ్యి," అని సలహా ఇచ్చారు. రావణుడు బాధతో ఏడుస్తూనే శివుణ్ణి స్తోత్రం చేశాడు.

చివరకు శివు డనుగ్రహించి, రావణుడి చేతులను కొండ కింది నుంచి తీసుకోనిచ్చి, "నీ వీర్యమూ, మదమూ, స్తోత్రమూ చూసి సంతోషించాను. నీ చేతులు నలిగినప్పుడు నీవు చేసిన దారుణమైన ధ్వనిని బట్టి ఇక ముందు నీకు రావణు డనే పేరు సార్థకంగా ఉంటుంది. ఇక నీవు నీ ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళు," అన్నాడు.

అప్పుడు రావణుడు, "మహాదేవా, నీకు నా పై తృప్తి కలిగిన పక్షంలో నేను కోరేది అనుగ్రహించు. నే నిదివరకే దేవతలు మొదలైన వారి చేత చావు లేకుండా వరం పొంది ఉన్నాను. అల్పులైన మానవులను నే నసలు లక్ష్యపెట్టను. బ్రహ్మ దేవుడు నాకు దీర్ఘాయువు కూడా ఇచ్చాడు. నేను నీ నుంచి మిగిలిన నా ఆయువునూ, ఒక ఆయుధాన్నీ వేడుతున్నాను. దయచేసి వాటిని అనుగ్రహించు," అన్నాడు.




శివుడు రావణుడికి, ఆయుశ్శేషాన్నీ, చంద్రహాస మనే ఖడ్గాన్నీ ఇస్తూ, "ఈ ఖడ్గాన్ని ఎన్నడూ అవమానించకు. ఏ నాడు దీనికి అవమానం జరిగితే అది అప్పుడే నిశ్చయంగా నా దగ్గిరికి తిరిగి వస్తుంది," అన్నాడు.

ఈ విధంగా శివుడి చేత వరాలు పొంది, రావణుడు తన పుష్పకం ఎక్కి భూమి అంతటా సంచరిస్తూ, వీరులైన రాజు లందరినీ క్షోభపెట్టాడు. పరాక్రమ సంపన్నులు అతనితో యుద్ధాలు చేసి నశించారు. తెలివి గలవాళ్ళు అతన్ని గెలవలేమని తెలుసుకుని, ఓటమి ఒప్పుకుని, అతనికి లొంగిపోయారు.







అలా లోకసంచారం చేస్తూ రావణుడొకసారి హిమాలయానికి వెళ్ళి, అక్కడ ఒక దేవస్త్రీ లాటి రూపవతిని చూశాడు. ఆమె ఋషుల లాగా కృష్ణాజినమూ, జటావల్కలాలూ ధరించి తపోదీక్షలో ఉన్నది. రావణుడామె సౌందర్యానికి సమ్మోహితుడై, సరదాకు అడుగుతున్నవాడి లాగా, "సుందరీ, ఈ యౌవనంలో తపస్సు పెట్టుకున్నావేమిటి? నీ అందం చూసి పురుషులు సమ్మోహితు లవుతారు గదా! ఎందుకీ కఠిన వ్రతం?" అని అడిగాడు.

ఆమె రావణుడికి తన వృత్తాంతం ఈ విధంగా చెప్పింది:



"బృహస్పతి కొడుకైన కుశధ్వజుడు నా తండ్రి. నా పేరు వేదవతి. అనేకమంది దేవతలూ, గంధర్వులూ, యక్షులూ, రాక్షసులూ మా తండ్రి వద్దకు వచ్చి, నన్ను తమ కిచ్చి పెళ్ళి చెయ్యమని కోరారు. కాని మా తండ్రి ఒప్పుకోలేదు. కారణమేమిటంటే, ఆయనకు విష్ణుమూర్తినే తన అల్లుడుగా చేసుకోవాలనే కోరిక ఉండేది. ఈ సంగతి తెలిసి దంభు డనే రాక్షసుడు, ఒక రాత్రి మా తండ్రి నిద్రపోతుండగా వచ్చి, ఆయనను చంపేశాడు. మా అమ్మ ఆయనతో బాటు సహగమనం చేసింది. నేను మా తండ్రి కోరికను పూర్తిచేసే ఉద్దేశంతో విష్ణువునే నా భర్తగా మనసులో భావించుకుని తపస్సు చేస్తున్నాను. కనక, రావణా, ఇక నీవు వెళ్ళవచ్చు."

ఈ మాటలు విని రావణుడు మోహావేశపరుడై విమానం నుంచి దిగి, "అమ్మాయీ, పొగరెక్కి నీ మనస్సు వికటించింది. లేకపోతే త్రిలోక సుందరివై ఉండి, నీ యౌవనమిలా పాడుచేసు కుంటావా? నేను దశగ్రీవుణ్ణి, లంకాధిపతిని. నా భార్యవై సమస్త భోగాలూ అనుభవించు. విష్ణువు ఎవడు? నా కున్న తపస్సూ, భోగాలూ, బలమూ వాడి కున్నాయా?" అన్నాడు.











"నీ కేమాత్రమైనా బుద్ధి ఉంటే విష్ణువును గురించి అలా చులకనగా మాట్లాడవు," అన్నది వేదవతి.

వెంటనే రావణుడు ఆమె జుట్టు పట్టుకున్నాడు. వేదవతి కోపావేశంతో తన చేతులను కత్తులు లాగా చేసి తన జుట్టును కోసేసింది. తన క్రోధాగ్నితో రావణుణ్ణి దహించేదాని లాగా అయిపోయి, ఆ వేదవతి అగ్నిని ప్రజ్వలింప జేసి, రావణుడితో, "నీచుడా, నీ చేత అవమానించబడి ఇక జీవించను. ఈ అగ్నిలో పడి ప్రాణాలు వదిలి, నిన్ను చంపటానికి అయోనిజను గానూ, పతివ్రతగానూ పుట్టి తీరుతాను," అంటూ అగ్నిలో దూకేసింది. ఆ వేదవతే సీతగా పుట్టి, జనకుడి ఇంట పెరిగి, రాముడికి భార్య అయి, రాముడి బలంతో రావణుడి చావుకు కారకురా లయింది.

వేదవతి అగ్నికి అహుతి అయిపోయాక రావణుడు తిరిగి పుష్పకం మీద లోక పర్యటన చేస్తూ, మరుత్తమహారాజు దేవతలను దగ్గిర పెట్టుకుని, యజ్ఞం చేస్తున్న చోటికి వచ్చాడు. బృహస్పతి తమ్ముడైన సంవర్తుడు యజ్ఞం చేయిస్తున్నాడు. రావణుణ్ణి చూస్తూనే అక్కడ చేరిన దిక్పాలకులు భయభ్రాంతులై మారు రూపాలు ధరించారు. ఇంద్రుడు నెమిలి అయాడు, యముడు కాకిగా మారాడు, కుబేరుడు తొండ రూపాన్నీ, వరుణుడు హంస రూపాన్నీ ధరించారు. మిగిలిన దేవతలు తలా ఒక జంతువు రూపమూ పొందారు.

ఇంతలో రావణుడు నిస్సంకోచంగా యజ్ఞవాటికలో జొరబడి, మరుత్తును చూసి, "యుద్ధం చేస్తావా? ఓడానని ఒప్పుకుంటావా?" అని అడిగాడు.

"నువ్వెవరు?" అని మరుత్తుడు రావణుణ్ణి అడిగాడు.

రావణుడు పెద్దగా నవ్వి, "భేష్, రావణుణ్ణి కూడా నీ వెరగవు! నా బలపరాక్ర







మాలను గురించి ఎరగనివాడు మూడు లోకాలలోనూ మరొకడు ఉంటాడనుకోను. నా అన్నను జయించి నేనీ విమానం కాజేశాను," అన్నాడు.

ఆ మాట విని మరుత్తు మండిపడుతూ, "తండ్రి లాటి అన్ననే జయించిన నీ వెంత ఘనుడవు! అటువంటి దుర్మార్గం చేసినందుకు గర్వపడుతున్నావా? కొంచెం ఆగు, నా బాణాలతో నీ ప్రాణాలు తీస్తాను," అని లేచి వెళ్ళి ధనుర్బాణాలు తీసుకున్నాడు.

అప్పుడు మరుత్తమహారాజుకు సంవర్తుడడ్డుపడి, "రాజా, తొందర పడక నేను చెప్పేది విను. ఈ మహేశ్వర యజ్ఞం మధ్యలో విఘ్నం అయితే వంశ నాశనం జరుగుతుంది. యజ్ఞ దీక్షలో ఉన్న నీవు ఆగ్రహించట మేమిటి? యుద్ధం చెయ్యట మేమిటి? అది అలా ఉంచి, యుద్ధంలో ఈ రాక్షసుణ్ణి ఎలా జయిస్తావు? వాడు దుర్జయుడు!" అన్నాడు.

గురువు చెప్పిన మాట విని మరుత్తు ధనుర్బాణాలు వదిలేసి తిరిగి యజ్ఞ దీక్షలో కూర్చున్నాడు. అది చూసి రావణుడి మంత్రి అయిన శుకుడు సంతోషంతో, "రావణుడిదే గెలుపు!" అని పెద్దపెట్టున కేకలు పెట్టాడు. రావణుడు యజ్ఞవాటికలో ఉండే ఋషులను తిని తృప్తి చెంది, తన దారిన తాను వెళ్ళాడు.

తరవాత దిక్పాలకులు తమ నిజ రూపాలు ధరించి, తాము ఏయే ప్రాణుల రూపాలు ధరించారో వాటికి వేరు వేరుగా వరా లిచ్చారు.

అప్పటి దాకా నెమళ్ళు నల్లగా ఉండేవి, ఇంద్రుడు వాటికి అనేక రంగు లుండేటట్టూ, తన వెయ్యి కళ్ళూ వాటి పించాలలో అలంకారంగా ఉండేటట్టూ, వాటికి పాముల భయం లేకుండా ఉండేటట్టూ, ఇంద్రుడు పంపే వర్షం వాటికి ఆహ్లాదం కలిగించేటట్టూ వర మిచ్చాడు.










అలాగే యముడు కాకులకు ఏ రోగమూ లేకుండానూ, వాటికి సహజ మృతి లేకుండానూ, కాకుల కడుపు నిండితే తన లోకంలో ఉండే పితృదేవతల కడుపులు నిండేటట్టూ వర మిచ్చాడు.

వరుణుడు హంసలకు నురుగు లాటి దేహ కాంతీ, జలజీవనమూ, సుఖప్రదమైన జీవితమూ ఇచ్చాడు. కుబేరుడు తొండలకు బంగారు వర్ణం ఇచ్చాడు.

రావణుడు లోకమంతా తిరుగుతూ మరుత్త మహారాజును అడిగినట్టే, గొప్ప గొప్ప రాజు లందరి వద్దకూ వెళ్ళి, "నాతో యుద్ధం చేస్తావా ఓడినట్టు ఒప్పుకుంటావా?" అని అడుగుతూ వచ్చాడు. దుష్యంతుడూ, సురథుడూ, గాధీ, గయుడూ, పురూరవుడూ మొదలైన రాజులందరూ రావణుడికి ఓడినట్టు ఒప్పుకున్నారు. అయోధ్యను పాలిస్తూ ఉండిన అనరణ్య మహారాజు మటుకు రావణుణ్ణి యుద్ధానికి రమ్మన్నాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో అనరణ్యుడి సేనలు కార్చిచ్చులో నల్లులు మాడినట్టు మాడి చనిపోయారు. ద్వంద్వ యుద్ధంలో అనరణ్యుడి బాణాలు రావణుణ్ణి ఏమీ చెయ్యలేక పోయాయి. రావణుడు తన నెత్తిన చేతితో చరిచేసరికి అనరణ్యుడు రథం నుంచి కిందికి పడిపోయి, ప్రాణాలు విడుస్తూ, తన ఇక్ష్వాకు వంశంలో పుట్టబోయేవాడి చేతిలో రావణుడు చస్తాడని శపించాడు.

రావణు డీ విధంగా గగన విహారం చేస్తూ, మానవ జాతిని మహా భయపెడుతూ తిరుగుతుండగా ఒకనా డతని పుష్పకానికి ఎదురుగా నారద మహాముని మబ్బుల మీదుగా వస్తూ ఎదురయాడు. ఇద్దరూ ఆగి మాట్లాడుకున్నారు.

"నాయనా, రావణా! నీ బలపరాక్రమాలు చూసి ఎంతో సంతోషించాను. కాని ఒకటి నాకు నచ్చలేదు. దేవతల వల్ల





కూడా చావు లేని నీవు అల్పులైన మానవుల మీద నీ ప్రతాపం చూపిస్తా వేమిటి? మానవులు అనేక వ్యసనాల తోనూ, రోగాల తోనూ, క్షణంలో వచ్చిపడే వార్థక్యం తోనూ, రకరకాల కష్టాల తోనూ తీసుకుంటూ ఉంటారుగదా, అలాటి వాళ్ళతో వీరు డెవడైనా యుద్ధానికి తలపడతాడా? వాళ్ళందరినీ యముడు చంపుతూనే ఉన్నాడు. ఆ యముడితో యుద్ధం చెయ్యి, అతణ్ణి చంపు. యముణ్ణి చంపితే నరలోకమంతా జయించినట్టే గద," అన్నాడు నారదుడు.

"అయ్యో, నారదా! నేను ముందు పాతాళాన్నీ, తర్వాత స్వర్గాన్నీ జయించి, మూడు లోకాలనూ, స్వాధీన పరచుకుని, తరవాత సముద్రాన్ని మథించి, అమృతం సంపాదించే ఆలోచనలో ఉన్నాను," అన్నాడు రావణుడు.

"ఈ పక్కనే ఉన్న యమలోకాన్ని వదిలి ఇంకెక్కడికో పోతానంటా వేమిటి? నీ విప్పుడు వెళ్ళే దారే అది," అన్నాడు నారదుడు.

రావణుడు కాలమేఘం మెరిసినట్టుగా నవ్వి, "చాలా బాగా చెప్పావు, నారదా. మంచి సంతోషకరమైన మాట. నే నిప్పుడే యమలోకానికి పోతాను. అసలు దిక్పాలకులను నలుగురినీ జయించాలని అదివరకే ప్రతిజ్ఞ పట్టాను. ఇప్పుడు వెళ్ళి, అన్ని ప్రాణులకూ మరణభయం కలిగించే ఆ యముడి ప్రాణాలు తీస్తాను," అని నారదుడికి నమస్కారం చేసి శలవు పుచ్చుకుని, తన మంత్రులతో సహా దక్షిణ దిక్కుగా బయలుదేరాడు.

అన్ని ప్రాణులనూ చంపే యముడికి చావనేది ఎలా కలుగుతుందో నారదుడికి కొంచెం కూడా అర్థంకాలేదు. ఆ యముణ్ణి రావణుడు ఎలా జయిస్తాడో కళ్ళారా చూడాలని కుతూహలం పుట్టి నారదుడు కూడా యమపట్టణానికే బయలుదేరాడు.








# ఉత్తర కాండ

యముడితో యుద్ధానికి బయలుదేరిన రావణుడు యమలోకాన్ని చేరవచ్చి, అక్కడ నరకయాతన లనుభవిస్తున్న పాపకర్ములనూ, స్వర్గసుఖా లనుభవిస్తున్న పుణ్యకర్ములనూ చూశాడు. ఘోరాకారులూ, క్రూరులూ అయిన యమకింకరులు పాపులను పురుగుల చేత తినిపిస్తున్నారు, కుక్కల చేత కరిపిస్తున్నారు, వైతరణీ నదిలో ఈదిస్తున్నారు, కాలిన ఇసుక దిబ్బల మీద వేసి బాధిస్తున్నారు. నరక యాతన లనుభవించేవారు శవాల లాగా ఉండి, బాధతోనూ, దప్పికతోనూ అలమటిస్తున్నారు. మరొక వంక పుణ్యం చేసుకున్నవారు పుణ్యఫలాన్ని సమస్త సుఖాల రూపంలోనూ అనుభవిస్తున్నారు.

రావణుడు లక్షలాదిగా గల పాపులు అనుభవించే యాతనలను చూసి జాలిపడి, వారిని విడిపించ నారంభించాడు. అది చూసి యమదూతలకు కోపం వచ్చింది. వాళ్ళు రావణుడి పైకి వెళ్ళి, పరిఘలూ, శూలాలూ, ముసలాలూ, శక్తులూ, తోమరాలూ పుష్పకం మీదికి విసిరారు. కొందరు తేనెటీగల్లాగా పుష్పకం మీదికి ముసిరి, అందులోని ఆసనాలూ, వేదికలూ, మంటపాలూ విరిచి పారెయ్యసాగారు. అయితే అది అక్షయమైన విమానం కావటం చేత, వారెంత నాశనం చేసినా ఎప్పటిలాగే చెక్కుచెదర కుండా ఉన్నది.

ఈలోపుగా నారదుడు తిన్నగా యముడి వద్దకు వెళ్ళాడు. యము డాయనను అర్ఘ్య







పాద్యాలతో సత్కరించి, క్షేమ మడిగి, వచ్చిన పని తెలుసుకో గోరాడు.

"యమరాజా, దశగ్రీవు డనే అజేయుడైన రాక్షసుడు నిన్ను జయించి, వశపరుచుకోవటానికి నీ పైకి యుద్ధానికి వస్తున్నాడు. నీ యమదండం ఏం కానున్నదో!" అన్నాడు నారదుడు. ఆయన అలా అంటుండగానే దూరాన వెలిగిపోతూ పుష్పకం కనబడింది.

రావణుడు యమకింకరులతో కొంత సేపు యుద్ధం చేసి, చివరకు వారి పైన పాసుపతాస్త్రం ప్రయోగించాడు. అది కార్చిచ్చు లాగా ఆ ప్రాంతాన ఉండే



చెట్లనూ, పొదలనూ బూడిద చేస్తూ, తన జ్వాలలను అన్ని వైపులకూ వ్యాపింపజేసింది. యమదూతలు ఆ జ్వాలలో మిడతల్లాగా మాడిపోయారు. రావణుడూ, అతని మంత్రులూ దిక్కులు పిక్కటిల్లేటట్టు భయంకరమైన కేక పెట్టారు.

ఆ కేక విని యముడు, యుద్ధంలో రావణుడు జయించాడని గ్రహించి, తన సారథిని పిలిచి, తన రథాన్ని యుద్ధానికి ఆయత్తపరచ మన్నాడు. క్షణంలో ఎర్రని గుర్రాలు పూన్చిన రథం వచ్చింది. మృత్యుదేవత పాశాన్నీ, ముద్గరాన్నీ ధరించి, రథంలో యముడి ముందు నిలిచింది. యముడు రథంలో ఎక్కి కూర్చుంటే ఒక పక్కన కాలదండమూ, రెండో పక్క కాల పాశాలూ ఉన్నాయి. ఈ విధంగా యముడు యుద్ధానికి బయలుదేరే సరికి, మూడు లోకాలూ సంక్షోభం పొందాయి, దేవతలు కంపించారు.

మనోవేగం గల రథాశ్వాలు యముడి రథాన్ని క్షణంలో రావణుడి ముందుకు తెచ్చాయి. మృత్యుదేవతతో సహా అతి భయానకంగా ఉన్న యమరథాన్ని చూస్తూనే రావణుడి మంత్రులు భయవిభ్రాంతులై, నాలుగు దిక్కులకూ పారి









పోయారు. రావణుడు మాత్రం లేశమాత్ర మైనా భయపడక, స్థిరంగా నిలబడ్డాడు.

ఇద్దరికీ ఏడు రాత్రుల పాటు మహా భయంకరమైన యుద్ధం జరిగింది. యముడు తాను ప్రయోగించిన అస్త్రాలతో రావణుణ్ణి మహా తీవ్రంగా గాయపరిచాడు, కాని రావణుడు ఓడిపోనూలేదు, రణరంగం నుంచి పారిపోనూ లేదు. మీదు మిక్కిలి అతను తన బాణాలతో యముణ్ణీ, మృత్యు దేవతనూ, సారథినీ కూడా ఎంతో నొప్పించాడు.

అది చూసి మృత్యువు యముడితో, "యమధర్మరాజా, ఈ రాక్షసుడితో నన్ను యుద్ధం చెయ్యనీ. వీణ్ణి క్షణంలో చంపేస్తాను. చంపటం నా హక్కు. నేను ఎందరో రాక్షసుల చావు చూశాను, ప్రళయకాలంలో లోకాలకు లోకాలే నాశనం కావటం చూశాను. ఇత డనగా ఎంత?" అన్నది.

"నువు ఊరికే చూస్తూ ఉండు. వీణ్ణి నేనే చంపుతాను," అంటూ యముడు కాల దండాన్ని పట్టి ఎత్తాడు. అది మంటలు కక్కుతూ మహా భయంకరంగా కనబడింది. యముడు దాన్ని రావణుడి పైకి విసర బోతూ వుండగా బ్రహ్మ ప్రత్యక్షమై, "యమధర్మరాజా, దాన్ని ప్రయోగించకు. దీనితో రావణుడు చచ్చినట్టయితే నేను వీడి కిచ్చిన వరం అబద్ధమవుతుంది. వాడు చావనట్టయితే ఈ కాలదండాన్ని నేను సృష్టించిన ఉద్దేశం అబద్ధమవుతుంది. మృత్యువుతో బాటు నే నీ దండాన్ని అమోఘంగా ఉండే లాగు పూర్వం సృష్టించాను. అందుచేత, కాలదండాన్ని రావణుడి పైన ప్రయోగించావంటే, ఒక విధంగా కాకపోతే మరొక విధంగా నా మాట వ్యర్థమై పోతుంది," అన్నాడు.

బ్రహ్మ మాట మన్నించి యముడు కాలదండాన్ని అవతల పెట్టేశాడు. రావణా సురుణ్ణి చంపటానికి తనకు అవకాశం లేని





పక్షంలో తాను యుద్ధరంగంలో ఏం చెయ్యాలో తెలియక, యముడు తన రథంతో సహా అంతర్ధానమై బ్రహ్మతో స్వర్గానికి వెళ్ళిపోయాడు.

రావణుడు తాను యముణ్ణి జయించానని ప్రకటన చేసి పుష్పకంలో యమపురం వెళ్ళిపోయాడు. ఇదంతా కళ్ళారా చూసిన నారదుడు పరమానందం చెందాడు.

యముణ్ణి జయించి, మారీచుడు మొదలైన మంత్రుల చేత ప్రశంస లందుకుని, రావణుడు పుష్పకంలో పాతాళ లోకానికి బయలుదేరి, వరుణుడి పరిపాలనలో ఉన్న సముద్రంలో ప్రవేశించి, వాసుకి మొదలైన నాగు లుండే భోగవతీ నగరాన్ని స్వాధీనం చేసుకుని, నివాతకవచు లుండే మణిమతి అనే నగరానికి వెళ్ళాడు. రకరకాల ఆయుధాలు కలిగి, అజేయులైన నివాతకవచులు రావణుడితో యుద్ధానికి తలపడ్డారు.

ఒక్క సంవత్సరం పాటు యుద్ధం సాగినా జయాపజయాలు తేలలేదు. అప్పుడు బ్రహ్మ విమానం మీద అక్కడికి వచ్చి, ఉభయ పక్షాలకూ సంధి చేసి, అగ్నిసాక్షిగా వారి మధ్య స్నేహం నెలకొల్పి వెళ్ళిపోయాడు. రావణుడు నివాతకవచులకు ఏడాది పాటు అతిథిగా ఉండి, తన సొంత



నగరంలో ఉన్నట్టే సుఖంగా కాలం పుచ్చి, నివాతకవచుల వద్ద తనకు తెలియని మాయలు తొంభైతొమ్మిది నేర్చుకుని, వరుణు డుండే నగరాన్ని వెతుకుతూ బయలుదేరాడు.

దారిలో అతనికి కాలకేయు లుండే అశ్మనగరం తగిలింది. అక్కడ రావణుడికీ కాలకేయులకూ యుద్ధ మయింది. రావణుడు కాలకేయ వీరులను చాలా మందిని చంపాడు. అలా చచ్చిన వారిలో విద్యుజ్జిహ్వు డనేవాడు, శూర్పణఖ భర్త కూడా ఉన్నాడు. వాడు బలగర్వితుడు, మెరపు లాగా తన నాలుకను చాచి రాక్షసు







లను నాకేశేవాడు. రావణుడు వాణ్ణి కత్తితో నరికి చంపాడు. మొత్తం మీద నాలుగు వందల మంది కాలకేయ వీరులు రావణుడి చేతిలో చచ్చారు.

అక్కడి నుంచి బయలుదేరి రావణుడు వరుణుడి మందిరానికి వచ్చాడు. ఆ భవనం తెల్లని మబ్బు లాగానూ, కైలాసం లాగానూ ఉంది. అక్కడ అనుక్షణమూ పాలధారలు స్రవించే సురభి అనే కామధేనువు రావణుడికి కనబడింది. దాని పాలతోనే పాల సముద్రం ఏర్పడింది. ఆ పాలసముద్రం నుంచి చంద్రుడు పుట్టాడు, అమృతం పుట్టింది. పాలసముద్రపు నురుగు తిని



కొందరు మహర్షులు జీవిస్తారు. శివుడికి వాహనమైన నంది కామధేనువుకు పుట్టినదే.

అలాటి కామధేనువుకు రావణుడు ప్రదక్షిణం చేసి, వరుణ మందిరాన్ని సమీపించాడు. వరుణుడి యోధులు రావణుడితో యుద్ధం చేశారు. రావణుడు వారి నాయకులను చంపి, యోధులతో, "రావణుడు యుద్ధం చెయ్య వచ్చాడని వరుణుడితో చెప్పండి," అన్నాడు.

వరుణుడి కొడుకులూ, మనమలూ తమ పరివారాలతో సహా రథా లెక్కి రావణుడి పైకి వచ్చి, ఒక్క తృటిలో రావణుడి చేతిలోనూ, అతని మంత్రుల చేతిలోనూ ఓడిపోయారు. తమ పరివారం నశించాక వరుణ పుత్రులు వీరోచితంగా పోరాడి, తాము కూడా దెబ్బతిన్నారు. తరవాత రావణుడు వరుణుడికి కబురు చెయ్యగా, వరుణుడు ఇంట లేడనీ, ఆయన సంగీతం వినటానికి బ్రహ్మలోకానికి వెళ్ళాడనీ తెలిసింది.

రావణుడు తాను గెలిచినట్టు ప్రకటన చేసి, పుష్పకం మీద ఎక్కి తిరిగి అశ్మనగరానికి వచ్చాడు. అక్కడ అతను మదగర్వితుడై విహరిస్తూండగా అతని కొక అద్భుతమైన భవనం కనబడింది. దానికి అలంకారాలుగా వైడూర్య తోరణాలూ,











ముత్యాల జాలరులూ, బంగారు స్తంభాలూ, స్ఫటిక సోపానాలూ మొదలైనవి ఉన్నాయి. రావణుడు ప్రహస్తుడితో, "ఇంత అందమైన ఇల్లెవరిదో కనుక్కు నిరా," అన్నాడు.

ప్రహస్తుడు మొదటి ప్రాకారం దాటి లోపలికి వెళితే ఎవరూ కనిపించలేదు. అతను అలాగే ఏడు ప్రాకారాలూ దాటి లోపలికి వెళ్ళేసరికి లోపల ఒక జ్వాల కనిపించింది. దాని మధ్య ఒక దివ్య పురుషు డున్నాడు. ఆయన సూర్యుడి లాగా వెలిగిపోతూ తేరి చూడరాకుండా ఉన్నాడు. ఆ మహాపురుషుడు ప్రహస్తుణ్ణి చూడగానే సంతోషంతో నవ్వాడు. ఆ నవ్వు విని ప్రహస్తుడి శరీరం పులకరించింది. అతను వెంటనే రావణుడి దగ్గిరికి తిరిగి వచ్చి, తాను చూసినదంతా తెలిపాడు.

సంగతి వింటూనే రావణుడు పుష్పకం నుంచి దిగి, ఆ భవనంలోకి ప్రవేశించ బోయే సరికి ద్వారాన్ని పూర్తిగా ఆక్రమించి ఒక భయంకరాకారుడు ఎదురుపడ్డాడు. ఆ ఆకారం నెత్తిన చంద్రు డున్నాడు, నోట భయంకరమైన జ్వాలలు వెలువడు తున్నాయి, కళ్ళూ, పెదవులూ ఎర్రగానూ, ముఖం తెల్లగానూ ఉన్నాయి, జుట్టు పైకి లేచి ఉన్నది, దట్టమైన మీసాలూ, గడ్డమూ, పెద్ద పెద్ద కోర లున్నాయి, చేతిలో పెద్ద ముద్గర మున్నది. ఆ భయంకరాకారాన్ని చూడగానే రావణుడి శరీర మంతా జలదరించింది. ఆ ఆకారం రావణుణ్ణి చూసి, "రాక్షసుడా, భయపడకు. నీ కోరిక ఏమిటో చెప్పు," అని అడిగింది.

"నాకు యుద్ధం కావాలి," అన్నాడు రావణుడు.

"ఎవరితో యుద్ధం చేస్తావు? నాతోనా? బలితోనా?" అని ఆకారం అడిగింది.

"ఈ ఇల్లెవరిదో వారితో చేస్తాను? లేదా, నువ్వెవరితో చెయ్యమంటే వారితోనే చేస్తాను," అన్నాడు రావణుడు.







"బలి లోపల ఉన్నాడు. కావలిస్తే ఆ మహామహుడితో నిరభ్యంతరంగా యుద్ధం చెయ్యి," అన్నది ఆకారం.

రావణుడు లోపలికి వెళ్ళి, సూర్యుడి లాగా వెలిగిపోతున్న బలిని తేరి చూడలేక పోయాడు. బలి రావణుణ్ణి తేలికగా ఎత్తి తన తొడ మీద కూర్చోబెట్టుకుని, "ఏం పని మీద వచ్చావు, బాబూ? నీ కోరిక ఏమిటో తెలిపితే నేను తీర్చుతాను," అన్నాడు.

"మరేం లేదు, మహానుభావా! నిన్ను పూర్వం విష్ణువు మోసం చేసి నిర్బంధంలో ఉంచాడన్నారు. నిన్ను విడిపించే శక్తి నాకున్నది. అందుచేత ఆ పని చేసి పోదామని వచ్చాను," అన్నాడు రావణుడు.

"అదా సంగతి? అయితే నీ కొక్క చిన్న విషయం చెప్పాలి. అక్కడ పడి ఉన్న కుండలాన్ని ఒక్కసారి పట్టుకురా," అన్నాడు బలి. రావణుడు దగ్గిరికి వెళ్ళి చూస్తే ఆ కుండలం ఒక పెద్ద చక్రమంత ప్రమాణంలో ఉన్నది. రావణుడు సునాయాసంగా దాన్ని ఎత్తబోయి పరాభవం పొందాడు. అది కదలలేదు. రావణుడు తన రెండు చేతులతోనూ, బలమంతా ఉపయోగించి కూడా దాన్ని ఏమాత్రం కదల్చలేక పోయాడు.

అది చూసి బలి రావణుణ్ణి దగ్గిరికి పిలిచి, "నువు కదల్చలేకపోయిన ఆ కుండలం మా పూర్వీకుడైన హిరణ్యకశిపుడు చెవికి పెట్టుకున్నటువంటిది. ఆయన ఎవరివల్లా చావు లేకుండా వరాలు పొంది చివరకు నరసింహరూపం దాల్చిన విష్ణువు చేతిలోనే చచ్చిపోయాడు. ఆ విష్ణువునే నువ్వు ద్వారం వద్ద చూశావు. ఆయన ఎప్పుడూ అక్కడే ఉంటూ ఉంటాడు," అన్నాడు.

ఈ మాటలు విని రావణుడు క్రోధంతో ద్వారం వద్దకు వచ్చాడు. కాని అతనికక్కడ ఎవరూ కనిపించ లేదు.






రావణుడు వరుణలోకం నుంచి బయలు దేరి లంకకు తిరిగివస్తూ, దారిలో కనిపించిన అందగత్తెలైన కన్యలను వేలసంఖ్యలో చెరపట్టి తెచ్చి పుష్పకంలో ఎక్కించుకున్నాడు. వాళ్ళందరూ గొల్లున ఏడుస్తూ, రావణుణ్ణి శాపనార్థాలు పెట్టారు.

అతను ఇంటికి చేరుతూండగానే అతని చెల్లెలు శూర్పణఖ ఎదురువచ్చి, పెద్ద పెట్టున ఏడుస్తూ, "ఏం చెప్పేది? నా భర్తను మిగిలిన కాలకేయులతో బాటు చంపి నన్ను విథవను చేసేశావు. బావ మరిది అన్న జ్ఞానం కూడా నీకు లేకపోయింది," అని నిందించింది.

"అమ్మాయీ, జరిగినదానికి ఏడ్చి లాభమేమిటి? యుద్ధోన్మాదిగా ఉన్న సమయంలో, వీడు నా వాడన్న జ్ఞానం కూడా నాకు లేకపోయింది. ఇకముందు నువు మన ఖరుడి వెంట ఉండు. వాడు నీ కే కొరతా లేకుండా చూస్తాడు. పధ్నాలుగు వేల రాక్షసులకు వాణ్ణి నాయకుడుగా చేసి, దూషణుణ్ణి కూడా తోడిచ్చి దండకారణ్యాన్ని రక్షించటానికి పంపిస్తున్నాను. వాళ్ళంతా నీకు విధేయులై ఉండి, నువు కోరినట్టు చేస్తారు," అన్నాడు రావణుడు. ఆ ప్రకారమే శూర్పణఖ ఖరదూషణుల వెంట దండకారణ్యానికి వెళ్ళి అక్కడ సుఖంగా జీవిస్తూ వచ్చింది.

తరవాత రావణుడు నికుంభిల వనానికి వెళ్ళి అక్కడ యజ్ఞం చేస్తున్న తన కుమారుణ్ణి, మేఘనాదుణ్ణి చూసి, కౌగలించు







కుని, "ఇక్కడ ఏం చేస్తున్నావు నువు?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు సమాధానం శుక్రాచార్యుడు చెప్పాడు: "నీ కొడుకు ఏడు యజ్ఞాలు తలపెట్టాడు. అగ్నిష్టోమమూ, అశ్వమేధమూ, రాజసూయమూ, గోమేధమూ, వైష్ణవమూ అన్నవి గాక, అత్యంత దుర్లభమైన మహేశ్వర యజ్ఞం చేసి శివుణ్ణి ప్రత్యక్షం చేసుకుని, కామగమనం గల రథాన్నీ, అంతటా చీకటి ఆవరింప జేయ గల మాయనూ, శక్తివంతమైన ధనుర్బాణాలనూ వరంగా పొందాడు. ఇప్పుడు చేస్తున్నదే ఆఖరు యజ్ఞం."



శుక్రాచార్యుడు చెప్పిన ఈ మాటలతో ఏమాత్రమూ తృప్తిపడక రావణుడు, "మీరు చేసిన పని ఏమీ బాగాలేదు. మన శత్రువులైన ఇంద్రాదులను అర్చించటానికి ద్రవ్యం నష్టపరిచారు. సంపాదించిన పుణ్యం చాలు," అని మేఘనాదుణ్ణి తన వెంట తీసుకుపోయాడు.

అప్పుడు విభీషణుడు రావణుడి కొక దుర్వార్త చెప్పాడు. రావణుడికి చెల్లెలి వరస అయిన కుంభీనస అనే పిల్ల రావణుడి ఇంట పెరుగుతున్నది. రావణుడి తల్లికి పెదనాన్న అయిన మాల్యవంతుడి కూతురి కూతురు కుంభీనస. మధు వనే రాక్షసుడు వచ్చి, ఎవరూ లేని సమయంలో దాన్ని ఎత్తుకుపోయాడు. ఆ సమయంలో రావణుడు దిగ్విజయం వెళ్ళి ఉన్నాడు, కుంభకర్ణుడు నిద్రపోతున్నాడు, విభీషణుడు నీటిలో మునిగి తపస్సు చేసుకుంటున్నాడు.

తాను ఎందరు కన్యలను అపహరించి తెచ్చినా తన చెల్లెలిని ఎవరో అపహరించారనే సరికి రావణుడు మండి పడ్డాడు. అతను కుంభకర్ణుణ్ణి నిద్ర లేపించి, రాక్షస వీరులనూ, సైనికులనూ యుద్ధానికి సిద్ధం చేయించి, మధువు వుండే మధుపురం మీదికి వెళ్ళాడు.







తన భర్తను చంపటానికి తన అన్న అయిన రావణుడు పెద్ద సేనతో వస్తున్నాడని తెలిసి, కుంభీనస ఏడుస్తూ అతనికి ఎదురు వచ్చి, "అన్నా, నీ బావమరిదిని చంపి నాకు వైధవ్యం కలిగించకు," అని బతిమాలింది.

రావణుడు కుంభీనస దైన్యానికి కరిగి, "నీ భర్తను చంపనులే. అతను ఎక్కడ ఉన్నాడో చూపించు. నేను దేవతలను జయించటానికి స్వర్గానికి వెళుతున్నాను. అతన్ని కూడా వెంట తీసుకుపోతాను," అని చెప్పాడు.

కుంభీనస తన భర్త అయిన మధువు వద్దకు వెళ్ళి, "మా అన్న నిన్ను దేవతలతో యుద్ధం చెయ్యటానికి పిలుస్తున్నాడు, వెళ్ళు. అలాటి వాడి స్నేహం మనకు చాలా మంచిది," అని చెప్పింది.

మధువు రావణుడి వద్దకు వచ్చి, అతన్ని అర్ఘ్యపాద్యాలతో సత్కరించి, ఎన్నో మర్యాదలు చేశాడు.

రావణుడు ఒక్క రాత్రి తన బావమరిది ఆతిథ్యం స్వీకరించి, మర్నాడు బయలుదేరి వైశ్రవణు డుండే కైలాసం వద్దకు చేరుకున్నాడు. అప్పటికి సాయంకాలం కావటం చేత రావణుడి సేన అక్కడే విడిసింది.



ఆ రాత్రి చంద్రుడు చక్కటి వెన్నెల కాస్తున్నాడు. చల్లని మందమారుతం వీస్తున్నది. చెట్ల మధ్య కిన్నరులు బృంద గానాలు చేస్తున్నారు. కుబేరుడి మందిరంలో అప్సరసలు పాడే పాటలు వినవస్తున్నాయి. అంతటా పూలు వాసనలు వెదజల్లుతున్నాయి, కొండ మీద కూర్చుని వెన్నెలలో చుట్టూ ఉండే దృశ్యాలు చూస్తున్న రావణుడికి విరహబాధ పుట్టుకొచ్చింది.

ఆ సమయంలో అప్సరస లందరిలోకీ మిన్న అయిన రంభ, నిద్రలో మునిగి ఉన్న రావణుడి సేనల మధ్యగా నడుచుకుంటూ అటుగా వచ్చింది. ఆమె దివ్యాభర







ణాలు ధరించి, దివ్య పుష్పమాలలు వేసుకుని, తలలో మందారాలు పెట్టుకుని, నల్లని ముసుగు వేసుకుని, రెండో లక్ష్మీదేవి లాగా రావటం చూసి రావణుడు కూర్చున్న చోటి నుంచి లేచి వెళ్ళి, ఆమె చెయ్యి పట్టుకుని, "ఇప్పుడు నువు ఎవరి దగ్గిరికి పోతున్నావు? ఎవడా అదృష్టశాలి? నేను తక్కువ వాణ్ణి కాను. మూడు లోకాలలోనూ నన్ను మించినవాడు లేడు. నిన్ను చేతులుమోడ్చి వేడుకుంటాను. నా కోరిక తీర్చి వెళ్ళు," అన్నాడు.

రంభ అతని మాటలు విని వణికిపోతూ, "మీరు నాతో ఇలా మాట్లాడకూడదు. నాకు ఇతరులు బాధ కలిగిస్తే రక్షించవలిసిన వారు. నేను మీకు కోడలు వరస దాన్ని. మీ అన్న కొడుకు నలకూబరుడు నా కోసం వేచి ఉన్నాడు. నే నతన్ని తప్ప మరెవ్వరినీ ప్రేమించలేను," అని వేడుకున్నది.

"మీ అప్సరసలకు మొగుడూ, వావి వరసలూ ఎక్కడివి?" అంటూ రావణుడు రంభను బలాత్కరించాడు.

రంభ నలిపివేసిన పువ్వు లాగానూ, తెంపివేసిన లత లాగానూ అయిపోయి, పుట్టెడు సిగ్గుతోనూ, భయంతోనూ, దుఃఖంతోనూ వెళ్ళి నలకూబరుడి కాళ్ళ మీద పడి రావణుడు తనకు చేసిన అన్యాయం గురించి చెప్పింది.

నలకూబరుడు కోపోద్రేకంతో జలం స్పృశించి, "ఈ రావణుడు ఇక ముందు తనను కోరని స్త్రీని బలాత్కరించే పక్షంలో వాడి తల వెయ్యి ముక్కలవుతుంది," అని శపించాడు.

ఈ శాపం సంగతి విన్నాక రావణుడు చెరబట్టి తెచ్చిన స్త్రీలలో పతివ్రత లైన వాళ్ళు పరమానందం చెందారు. రావణుడు కూడా అదిమొదలు స్త్రీలను బలాత్కరించటం మానుకున్నాడు.







రావణుడు కైలాసం నుంచి బయలుదేరి తన సైన్యాలను స్వర్గం పైకి నడిపించుకు వెళ్ళాడు. రాక్షససేన నాలుగు వైపుల నుంచీ స్వర్గాన్ని ముట్టడించుతున్న దన్న వార్త విని, ఇంద్రుడు దేవగణాలను యుద్ధానికి సిద్ధం కమ్మని హెచ్చరించి, విష్ణువ వద్దకు వెళ్ళి, "రావణుడు దండెత్తి వచ్చాడు. ఏం చేసేటట్టు? నీ సహాయంతో పూర్వం ఎందరో రాక్షసులను జయించాను. చక్రం పట్టుకుని వెళ్ళి రావణుడితో యుద్ధం చేస్తావా?" అని అడిగాడు.

"నే నిప్పుడు వాడితో యుద్ధం చెయ్యను. వాడు మన చేతిలో చావడు. వాడి కింకా కాలం తీరలేదు. ప్రస్తుతానికి నువే వాణ్ణి ఎదిరించు. నీ కేమీ భయం లేదు," అన్నాడు విష్ణువు.

దేవతలకూ, రాక్షసులకూ గొప్ప యుద్ధం జరిగింది. రావణుడి బలాలకు అతని తాత అయిన సుమాలి నాయకత్వం వహించి, ఈ యుద్ధంలో సావిత్రుడనే వసువు చేతిలో చనిపోయాడు. రాక్షస సేన కూడా బాగా దెబ్బతిన్నది. పదింట తొమ్మిది వంతుల మంది రాక్షసులు చచ్చారు. ఇంద్రుడు గొప్పగా యుద్ధం చేసి రావణుణ్ణి ప్రాణాలతో పట్టుకున్నాడు. ఈ సంగతి తెలిసి



మేఘనాదుడు తన మాయను ప్రయోగించి, అదృశ్యుడుగా యుద్ధం చేస్తూ వచ్చి, ఇంద్రుణ్ణి పట్టుకుని తన తండ్రిని విడిపించి, "యుద్ధం అయిపోయింది. మనం గెలిచాం. ఇడుగో, ఇంద్రుడు మనకు చిక్కాడు. నువు యథేచ్ఛగా మూడు లోకాలూ ఏలుకోవచ్చు," అన్నాడు.

ఇంద్రుణ్ణి పట్టుకుని మేఘనాదుడు ఇంద్రజిత్తు అయాడు. తన కొడుకునూ, పట్టుబడిన ఇంద్రుణ్ణీ తీసుకుని రావణుడు లంకకు తిరిగి వెళ్ళాడు. ఇంద్రుణ్ణి విడిపించటానికి దేవతలు బ్రహ్మను వెంట బెట్టుకుని లంకకు వెళ్ళారు. బ్రహ్మ కొలు









వులో ఉన్న రావణుడితో, "నీ కొడుకు పరాక్రమం నిజంగా చాలా గొప్పది. దాన్ని చూసి నేను సంతోషించాను. ఇక నుంచీ నీ కొడుకు ఇంద్రజిత్తు అనే పేరుతో ప్రఖ్యాతి పొందుతాడు. వాణ్ణి ఎవరూ జయించలేరు. వాడి సహాయంతో దేవతలను జయించావుగద, ఇక ఇంద్రుణ్ణి విడిచిపెట్టెయ్యి," అన్నాడు.

"తాతా, ఇంద్రుణ్ణి విడిచిపెట్ట తీరాలనే పక్షంలో నాకు అమరత్వం ఇయ్యి," అన్నాడు ఇంద్రజిత్తు.

"నాయనా, ఏ ప్రాణికీ పరిపూర్ణమైన అమరత్వం లేదు," అన్నాడు బ్రహ్మ.

"అలా అయితే, నాకక్కర్లేదు పరిపూర్ణమైన అమరత్వం వద్దు. నేను నీకు తృప్తి కలిగే లాగా రోజూ అగ్నిని మంత్రాలతోనూ, హవ్యాలతోనూ అర్చిస్తాను. నేను యుద్ధానికి బయలుదేరే ముందు గుర్రాలు పూన్చిన రథం అగ్ని నుంచి రావాలి; దాని పైన నే నున్నంతసేపూ నాకు అమరత్వం ఉండాలి. ఇదే నేను కోరే వరం. నేను అగ్నిని అర్చించటం పూర్తికాని పక్షంలో చస్తే చస్తానుగాక," అన్నాడు ఇంద్రజిత్తు.

బ్రహ్మ దీనికి ఒప్పుకున్న మీదట అతను దేవేంద్రుణ్ణి విడిచిపెట్టేశాడు. ఇంద్రుడితో సహా దేవతలు స్వర్గానికి వెళ్ళిపోయారు.

యుద్ధోన్మాదంతో రావణుడు భూలోకం పర్యటించేటప్పుడు అతనికి కొన్ని అపజయాలు కూడా కలిగాయి. వాటిని గురించి కూడా అగస్త్యమహాముని రాముడికి చెప్పాడు.

వెయ్యి చేతులు గల కార్తవీర్యార్జునుణ్ణి గెలవాలనే ఉద్దేశంతో రావణుడు తన పరివారాన్ని వెంటబెట్టుకుని మాహిష్మతీ నగరానికి వెళ్ళాడు. అర్జునుడు ఆ రోజే తన భార్యలతో సహా నర్మదానదిలో జలక్రీడలాడటానికి బయలుదేరి వెళ్ళినట్టు తెలిసింది.







రావణుడు సపరివారంగా తాను కూడా నర్మదానదికి వెళ్ళి, అక్కడ స్నానం చేసి శివపూజ చెయ్యటానికి కూర్చున్నాడు. అతని మంత్రులు పూజా పుష్పాలు తెచ్చి నదీతీరాన పెద్ద పోగు పోశారు. రావణుడు తన వెంట ఎప్పుడూ ఉండే బంగారు లింగాన్ని ఒక ఇసుక తిన్నె మీద పెట్టి, అర్చించి, దాని ముందు పాడుతూ నాట్యం చెయ్యసాగాడు.



నర్మదానది తూర్పు నుంచి పడమరగా ప్రవహించి, పడమటి సముద్రంలో పడుతుంది. అలాటి నది ఇప్పుడు పడమర నుంచి తూర్పుగా ప్రవహించసాగింది. అంతే గాక నది అంతకంతకూ పొంగి, రావణుడు పూజించిన పుష్పాలను తనతోబాటు తీసుకు పోయింది. అది చూసి రావణుడు చిటికెలు వేసి శుకసారణులను పిలిచి, నర్మద ఎదురు ప్రవహించడానికి కారణం తెలుసుకు రమ్మన్నాడు.

వాళ్ళు వెళ్ళి చూసేసరికి కార్తవీర్యార్జునుడు తన భార్యలతో జలక్రీడ లాడుతూ కనిపించాడు. అతను తన వెయ్యిచేతుల తోనూ నదీ ప్రవాహాన్ని అడ్డేసరికి, నది పొంగి ఎదురు ప్రవహించుతున్నది. శుకసారణులు తిరిగి వచ్చి రావణుడితో ఈ సంగతి చెప్పారు. వాళ్ళు వర్ణించిన "మహావృక్షం" లాటి మనిషి కార్తవీర్యార్జునుడే అయి ఉంటాడని గ్రహించి రావణుడు యుద్ధానికి బయలుదేరి వచ్చి, కార్తవీర్యార్జునుడి మంత్రులతో, "రావణుడు యుద్ధానికి పిలుస్తున్నాడని మీ రాజుతో చెప్పండి," అన్నాడు.

"యుద్ధానికి మంచి సమయం చూశావే! రాజు స్త్రీలతో జలక్రీడ లాడేటప్పుడు యుద్ధానికి పిలుస్తారా? రేపు వచ్చి నీ చేతుల తీట తీర్చుకో," అన్నారు మంత్రులు. కాని రావణుడు అప్పుడే యుద్ధం కావాలన్నాడు. కార్తవీర్యార్జునుడి మంత్రులు తమతో ముందు యుద్ధం చెయ్యమన్నారు.







ఉభయపక్షాల వారికీ యుద్ధం జరిగింది. రాక్షసులు విజృంభించి అర్జునుడి పరివారంలో చాలా మందిని చంపారు, కొందరిని తిన్నారు కూడా. ఈ యుద్ధపు కోలాహలం విని కార్తవీర్యార్జునుడు తన భార్యలకు భయపడ వద్దని చెప్పి, గద తీసుకుని, దాన్ని తన అయిదువందల చేతులతోనూ, గిర గిరా తిప్పుతూ, యుద్ధం జరిగే చోటికి వచ్చాడు. ప్రహస్తుడు ముసలం తీసుకుని అతని దారికి అడ్డంగా నిలబడ్డాడు. అర్జునుడు ప్రహస్తుడు విసరిన ముసలాన్ని తన గదతో విరగగొట్టి అతని వెంటపడ్డాడు. గదతో కొట్టిన దెబ్బలకు ప్రహస్తుడు పడిపోగానే మారీచ శుకసారణ ధూమ్రాక్ష మహోదరులు మొదలైనవారు పారిపోయారు.

ఆ తరవాత రావణుడు అర్జునుడితో యుద్ధం ప్రారంభించాడు. ఇద్దరూ గదలతో ఒకరి నొకరు మోదుకున్నారు, కాని కొండల్లాగా ఏ ఒకరూ చలించలేదు. చిట్టచివరకు అర్జునుడు బలం కొద్దీ తన గదతో రావణుడి రొమ్ము మీద కొట్టే సరికి, అది తుంపులు తుంపులై పోయింది. అయితే ఆ దెబ్బతో రావణుడు వివశుడై పడిపోయాడు. వెంటనే అర్జునుడు రావణుణ్ణి పట్టి కట్టేసి, తన పట్టణానికి తీసుకుపోయాడు.

ఈ సంగతి స్వర్గంలో ఉన్న పులస్త్య బ్రహ్మకు తెలిసింది. ఆయన మాహిష్మతికి ఆదరాబాదరా వచ్చాడు. కార్తవీర్యార్జునుడు ఆయనకు ఎంతో భక్తిగా అతిథిసేవ చేసి, ఆయన వచ్చిన పని అడిగాడు.

"నాయనా, లోకాలన్నీ జయించి అజేయుడనిపించుకున్న నా మనమణ్ణే గెలిచావు. ఏమి నీ పరాక్రమం! ఏమి నీ కీర్తి! వాణ్ణి విడిచిపెట్టెయ్యి," అన్నాడు పులస్త్యుడు.

కార్తవీర్యార్జునుడు మారు మాటాడక రావణుడి కట్లు విప్పి, అగ్నిసాక్షిగా అతనితో అహింసాస్నేహం చేసుకుని, వస్త్రాభరణాలు కానుకగా ఇచ్చి పంపేశాడు.








కార్తవీర్యార్జునుడికి పట్టుబడి విడుదల అయి కూడా రావణుడి మదగర్వం అణగ లేదు. అతను ప్రపంచ మంతా తిరుగుతూ బలవంతులైన రాక్షసులనూ, మానవులనూ యుద్ధానికి సవాలు చేస్తూండేవాడు. ఒక సారి అతను కిష్కింధకు వెళ్ళి, వాలిని యుద్ధానికి ఆహ్వానించాడు.

వాలి మంత్రి అయిన తారుడు రావణుడితో, "రావణా, ప్రస్తుతం వాలి కిష్కింధలో లేడు. మిగిలిన వానరులు నీతో యుద్ధం చెయ్యటానికి చాలరు గదా. వాలి సంధ్యావందనం చెయ్యటానికి నాలుగు సముద్రతీరాలకూ వెళ్ళి ఉన్నాడు. ఇదుగో ఈ ఎముకల గుట్ట చూడు. ఇది వాలి చేతిలో చచ్చినవారి ఎముకల పోగు. నువు కూడా ఆ గుట్ట మీద చేరదలిస్తే కొంచెం ఆగు, వాలి త్వరలోనే తిరిగి వస్తాడు. లేక మరీ అంత తొందరలో ఉన్నట్టయితే, దక్షిణ సముద్ర తీరానికి వెళ్ళి, అక్కడే వాలి చేతిలో శీఘ్రంగా చచ్చిపోవచ్చు," అన్నాడు.

రావణుడు తారుణ్ణి తిట్టి, పుష్పకం మీద దక్షిణ సముద్ర తీరానికి వెళ్ళాడు. అక్కడ అతనికి మేరుపర్వతం లాటి వాలి సంధ్య వార్చుతూ కనిపించాడు. రావణుడు కొంత దూరంలో పుష్పకం దిగి, వాలిని వెనక నుంచి పట్టుకునే ఉద్దేశంతో, అడుగుల చప్పుడు వినపడకుండా వాలిని సమీపించాడు. కాని హఠాత్తుగా వాలి వెనక్కు తిరిగి, రావణుణ్ణి చూసి, అతని ఉద్దేశం





గ్రహించి కూడా, ఏమీ ఎరగనట్టు ఉండి పోయాడు. కాని రావణుడు సమీపంలోకి వచ్చినట్టు తెలియగానే వాలి, గరుత్మంతుడు పామును పట్టినట్టుగా, రావణుణ్ణి పట్టుకుని, చంకలో పెట్టుకుని, రివ్వున ఆకాశంలోకి లేచాడు.

రావణుణ్ణి విడిపించాలని అతని మంత్రులు కేకలు పెడుతూ వాలి వెంట పడ్డారు. కాని కొంత దూరం వెళ్ళి, వాలిని అందుకోలేక, అలిసిపోయి, వారు వెనక్కు వెళ్ళిపోయారు. అదే మంచి దయింది, లేకపోతే వారు వాలికి చిక్కి, ప్రాణాలతో బయటపడి ఉండేవారు కారు.

వాలి రావణుణ్ణి చంకలో పెట్టుకుని పడమటి సముద్రతీరాన దిగి, అక్కడ స్నానం చేసి, సంధ్యవార్చి, ఉత్తర సముద్రానికి వెళ్ళాడు, ఆ తరవాత తూర్పు సముద్రానికి వెళ్ళాడు. అన్ని సముద్రాల వద్దా సంధ్యానుష్ఠానాలు ముగించుకుని వాలి రావణుడితో సహా కిష్కింధకు తిరిగి వచ్చాడు. కిష్కింధలోని ఉద్యానంలో వాలి రావణుణ్ణి కిందికి దించి, నవ్వుతూ, "ఏం రావణా? ఎక్కడి నుంచి రావటం?" అని అడిగాడు.

రావణుడు వాలికి క్షమాపణ చెప్పుకుంటూ, "నీ వంటి బలశాలీ, వేగవం







తుడూ సృష్టిలో మరొకడు లేడు. నన్ను పట్టుకుని నాలుగు సముద్రాలలోనూ నువ్వొక్కడవే ముంచగలిగావు. నీ శక్తి అపూర్వం. నేను నీతో అగ్నిసాక్షికమైన స్నేహం వాంఛిస్తున్నాను," అన్నాడు.

ఆ ప్రకారమే అగ్నిని ప్రజ్వలింపజేసి, ఇద్దరూ కౌగలించుకుని, భ్రాతృస్నేహం అవలంబించారు. రావణుడు కిష్కింధలో ఒక నెలరోజు లుండి, సుగ్రీవుడు పొందే మర్యాదలన్నీ పొందాడు. తరవాత రావణుణ్ణి, అతని మంత్రులు వచ్చి లంకకు తీసుకుపోయారు.

అగస్త్యుడు రాముడికి ఈ వృత్తాంతం చెప్పి, "రామా, నీ చేతిలో ఒక్క బాణంతో చచ్చిన వాలి అలాటి అపార బలసంపన్నుడు!" అన్నాడు.

దానికి రాముడు, "అగస్త్యమహర్షీ, వాలి బలమూ, రావణుడి బలమూ అపూర్వమైనవని నేను అంగీకరిస్తాను గాని, నా ఉద్దేశంలో హనుమంతుడు వీరి కన్న కూడా శక్తిమంతుడుగా కనిపిస్తాడు. అతడు నూరుయోజనాల సముద్రాన్ని లంఘించటమే గాక, రావణుడి లంకలోని అంతఃపురంలోకి అవలీలగా ప్రవేశించి, ఎందరో రాక్షస వీరులను ఒంటరిగా చంపి, లంకా నగరాన్ని తగలబెట్టినవాడు. అతను చేసిన సాహసాలు మూడు లోకాలలోనూ ఎవరికీ సాధ్యంకా వనిపిస్తుంది. అంత మహా బలశాలి వాలిని చంప కుండా, తన రాజైన సుగ్రీవుడు అష్ట కష్టాలూ పడుతూంటే ఎందుకు చూస్తూ ఊరుకున్నాడు? ఈ నా సందేహన్ని తీర్చండి," అని కోరాడు.

అది విని అగస్త్యుడు, "రామా, హనుమంతుణ్ణి గురించి నీ వన్న దంతా నిజమే. అంతటి బలశాలీ, వేగవంతుడూ, బుద్ధిశాలీ మరొకడుండడు. అతడు అతి బాల్యంలోనే ఎన్నో అద్భుతాలు చేశాడు. బహుశా అతని కా విషయాలు జ్ఞాపకం కూడా









ఉండవు. కాని మును లతనికి బాల్యంలోనే శాపం ఇచ్చారు. అతని విచిత్ర కథ చెబు తాను," అంటూ ఇలా చెప్పాడు.

హనుమంతుడి తండ్రి కేసరి మేరు పర్వతం మీద రాజ్యం చేస్తూ ఉండేవాడు. కేసరి భార్య అంజన. ఆమె వాయుదేవుడికి హనుమంతుణ్ణి కన్నది. పసివాడైన హను మంతుణ్ణి ఆమె ఒక చోట పడుకోబెట్టి, పళ్ళు తెద్దామని అడవికి పోయింది. ఇంతలో హనుమంతుడికి ఆకలి అయి ఏడవసాగాడు. అప్పుడే తూర్పుకొండ మీద ఎర్రగా సూర్యబింబం ఉదయించింది. అదేదో పండు అనుకుని దాన్ని పట్టుకోవటా నికి ఆ శిశువు ఆకాశంలో ఎగిరి వెళ్ళ సాగాడు. సూర్యుడి కెదురుగా వెళ్ళే మరొక సూర్యుడి లాటి హనుమంతుణ్ణి చూసి, దేవ తలూ, దానవులూ, యక్షులూ దిగ్భ్రమ చెందారు. ఎందుకంటే, అప్పటికే అతని వేగం వాయువేగాన్నీ, గరుత్మంతుడి వేగాన్నీ మించింది.

అలా సూర్యుడి కేసి ఎగురుతూ పోతున్న తన కొడుకు వెంట వాయుదేవుడు కూడా పరిగెత్తుతూ, ఆ శిశువుకు సూర్యుడి వేడి తగలకుండా మంచు బిందువులు చల్లుతూ వెళ్ళాడు. ఈ విధంగా తనను సమీపించే బాల హనుమంతుడి పైన సూర్యుడు కూడా తన ప్రతాపం చూపలేదు.

అదీగాక, హనుమంతుడు సూర్యుణ్ణి చేరుకునే సమయానికే సూర్యుణ్ణి పట్టటా నికి రాహువు కూడా సూర్యుడి రథం పైకి వచ్చాడు. రాహువును చూడగానే హనుమం తుడు సూర్యుణ్ణి వదిలేసి రాహువును పట్టుకోబోయాడు. రాహువు భయపడి పారి పోయి, నిండు సభలో ఉన్న ఇంద్రుడి వద్దకు వెళ్ళి, "ఇంద్రా, ఏమిటీ అన్యాయం? పర్వకాలం గదా అని నేను సూర్యుణ్ణి మింగబోయే సమయంలో అక్కడికి మరొక రాహువును పంపావు. వాడు సూర్యుడితో





బాటు నన్ను కూడా పట్టుకుని మింగ బోయాడు," అన్నాడు.

వెంటనే ఇంద్రుడు రాహువును వెంట బెట్టుకుని ఐరావతం మీద సూర్యుడి వద్దకు వచ్చాడు. ఇంకా అక్కడే ఉన్న హనుమం తుడు రాహువును చూడగానే పట్టుకో వచ్చాడు. "ఇంద్రా, రక్షించు, రక్షించు," అన్నాడు రాహువు.

"నేను వీణ్ణి చంపుతాను, భయపడకు," అని ఇంద్రుడు రాహువుతో అంటూండగానే హనుమంతుడు ఐరావతాన్ని చూసి, అదేదో తెల్లని పండనుకుని, దాని పైకి వచ్చాడు. ఇంద్రుడు తన చేతిలో ఉన్న వజ్రాయు ధంతో మెల్లగానే హనుమంతుణ్ణి కొట్టాడు. ఆ దెబ్బకు బాల హనుమంతుడు ఒక కొండ మీద పడిపోయాడు. అతని ఎడమ దవడ నలిగిపోయింది.

తన కొడుకును కొట్టినందుకు ఇంద్రుడి పైన కోపం వచ్చి వాయుదేవుడు ప్రపంచ మంతటా సంచరించటం మాని, తన కొడుకు నెత్తుకుని ఒక కొండ గుహలో కూర్చు న్నాడు. ప్రాణులన్నీ ఉక్కిరిబిక్కిరి అయి పోయాయి. గంధర్వులూ, దేవతలూ మొద లైనవారు బ్రహ్మ దగ్గిరికి వెళ్ళి మొర పెట్టు కున్నారు. బ్రహ్మ వా రందరినీ వెంటబెట్టు కుని వాయుదేవు డున్న గుహకు వెళ్ళాడు.





బ్రహ్మ మొదలైన వారిని చూడగానే వాయు దేవుడు తన కొడుకు నెత్తుకుని వచ్చి, బ్రహ్మ కాళ్ళ మీద పడ్డాడు. బ్రహ్మ చేతితో నిమరగానే, ప్రాణం కడబట్టి ఉన్న హనుమంతుడు తిరిగి ఎప్పటి లాగా అయాడు. వాయుదేవుడు సంతోషించి, తిరిగి ప్రపంచ మంతటా సంచరించ సాగాడు.

వాయుదేవుణ్ణి మరింత సంతోషపెట్టే ఉద్దేశంతో బ్రహ్మ, దిక్పాలకులను హను మంతుడికి వరా లివ్వమన్నాడు. తన మూలంగా హనువు (దవడ) దెబ్బతిన్నది గనక అతనికి హనుమంతుడని పేరు పెట్టుతూ, ఇక ఎన్నటికీ అతనికి వజ్రా



యుధం చేత దెబ్బతగల కుండా ఇంద్రుడు వర మిచ్చాడు. సూర్యుడు హనుమంతుడికి తన తేజస్సులో ఒక శాతం ఇచ్చాడు; హనుమంతుడు గొప్ప వక్తా, మహాపండి తుడూ అయేటట్టు వరం కూడా ఇచ్చాడు. హనుమంతుడికి జల గండం లేకుండా వరుణుడూ, కాలదండం వల్ల చావు లేకుండా యముడూ, తన గద వల్ల హను మంతుడికి ప్రమాదం కలగకుండా కుబే రుడూ వరా లిచ్చారు. తన వల్ల గాని, తన అస్త్రాల వల్ల గాని హనుమంతుడికి అపాయం లేకుండా శివుడు వరమిచ్చాడు. బ్రహ్మదేవుడూ, విశ్వకర్మా కూడా అలాటి వరాలే ఇచ్చారు. ఈ వరాలన్నిటి వల్లా హనుమంతుడు శత్రువులకు భయంక రుడూ, యుద్ధంలో ఓటమి లేనివాడూ, కామరూపీ, కామగమనం గలవాడూ అయాడు. వాయుదేవుడు పొందిన సంతోషం అంతా ఇంతా కాదు.

ఆ తరవాత హనుమంతుడు అపార బలసంపన్నుడై, నిర్భయంగా సంచరిస్తూ, ఆశ్రమాలలోని మునులకు నానా యాత నలూ కలిగిస్తూ వచ్చాడు. అతను దేవతల చేత వరాలు పొందిన వాడని తెలిసిన మునులు, అతను తమ నారబట్టలనూ,







అగ్నిహోత్రాలనూ, కుండలనూ, కృష్ణాజినాలనూ ధ్వంసం చేస్తూ ఉన్నప్పటికీ చూసీ చూడనట్టుగా ఉండిపోయారు. ఒక వంక కేసరీ, మరో వంక వాయుదేవుడూ వద్దని చెబుతున్నా హనుమంతుడు తన ఆకతాయితనం మానలేదు. చివరకు మహర్షులు హనుమంతుడి పైన అలిగి, "నీ బలం చూసుకునే గదా నువ్వీ దుండగాలు చేస్తున్నావు? ఇంకొకరు చెబితే తప్ప నీ బలం నీకు తెలియకపోవు గాక!" అని అతడికి శాపం పెట్టారు.

అటు పైన హనుమంతుడు తన సంగతి తానే ఎరగకుండా బుద్ధిమంతుడై ఆశ్రమాలలో ఉంటూ వచ్చాడు. ఆ కాలంలో వాలి సుగ్రీవుల తండ్రి అయిన ఋక్షరజసుడు వానరరాజుగా ఉంటూ చనిపోయాడు. అప్పుడు వానరులు, పెద్దవాడైన వాలికి రాజ్యాభిషేకం చేసి, చిన్నవాడైన సుగ్రీవుణ్ణి యువరాజు చేశారు. హనుమంతుడికీ, సుగ్రీవుడికీ బాల్యంలోనే ఎడతెగని స్నేహం ఏర్పడింది. కాని, వాలికీ, సుగ్రీవుడికీ వైరం ఏర్పడి సుగ్రీవుడు నానా పాట్లూ పడినప్పుడు హనుమంతుడు తన బలం తానే ఎరగని కారణం చేత అతనికి ఏ విధంగానూ సహాయపడలేక పోయాడు.

ఈ విధంగా హనుమంతుడి కథ రాముడికి చెప్పి అగస్త్యమహాముని, "రామా, ఈ హనుమంతుడు ఎలాటి శక్తి గలవాడనుకున్నావు? ఇతను వ్యాకరణం నేర్చుకోగోరి సూర్యుడితో బాటు ఉదయగిరి నుంచి అస్తగిరి దాకా తిరిగేవాడు. ఏ విద్యలోనూ ఇతనితో సమానులు లేరు. ఇతను ముందు కాబోయే బ్రహ్మ," అన్నాడు.

ఈ విధంగా హనుమంతుడి కథ విన్న రాముడు అగస్త్యుడితో, "స్వామీ, వాలి సుగ్రీవుల తండ్రి అయిన ఋక్షరజసుడెవరు? వారి తల్లి ఎవరు? ఆ కథ కూడా చెబితే సంతోషిస్తాను," అన్నాడు.






అగస్త్యుడు రాముడికి వాలి సుగ్రీవుల కథ ఇలా చెప్పాడు:

మేరుపర్వతం మీది మధ్య శిఖరం దేవతలకు కూడా పవిత్రమైనది. దాని మీద విశాలమైన బ్రహ్మసభ ఉన్నది.

ఒకసారి బ్రహ్మ యోగాభ్యాసం చేస్తూ, కంటి నుండి కారిన నీటిని విదిలించేసరికి, దాని నుంచి ఒక వానరుడు పుట్టాడు. బ్రహ్మ ఆ వానరుణ్ణి కొంత కాలంపాటు తన వద్దనే ఉండమనీ, మేరుపర్వతం మీది దుంపలూ, పళ్ళూ తింటూ ఉండమనీ అన్నాడు. అది మొదలు ఆ వానరుడు పగ లల్లా చెట్ల మీద సంచరించి, సాయంకాలం కాగానే మంచి మంచి పూలూ, పళ్ళూ తీసుకుని బ్రహ్మ వద్దకు వస్తూండేవాడు.

ఇలా చాలా కాలం గడిచింది. ఒకనాడా వానరుడికి దాహం కలిగింది. అతను మేరుపర్వతం యొక్క ఉత్తర శిఖరానికి వెళ్ళాడు. అక్కడ అనేక పక్షులతో కూడిన సరస్సొకటి కనిపించింది. వానరుడు తన శరీర మంతా ఒక్కసారి విదుల్చుకుని, నీటి దగ్గిర కూర్చుని, తన దాహం తీర్చుకునే టందుకుగాను నీటిలోకి తొంగి చూసే సరికి, అందులో అతని ప్రతిబింబం కనిపించింది. నీటిలో తన శత్రువైన మరొక వానరుడు దాగి ఉన్నాడనీ, వాడి అంతు కనుక్కోవాలనీ అనుకుని వానరుడు నీటి లోకి చెంగున దూకి, ఎంతో వెతికాడు. లోపల మరొక వానరుడు కనిపించకపోయే సరికి అతను ఒడ్డుకు తిరిగి వచ్చాడు.







ఒడ్డుకు చేరుతూనే ఆ వానరుడు ఒక అందమైన ఆడదిగా మారిపోయాడు. జగన్మోహనమైన రూపంతో ఆ ఆడది అక్కడే కూర్చుని ఉండగా, ఇంద్రుడూ, సూర్యుడూ బ్రహ్మను చూసి వెళ్ళిపోతూ అటుగా వచ్చారు. ఇద్దరి కళ్ళూ ఒకసారే ఆమె పైన పడ్డాయి. ఇద్దరికీ ఆమె పైన మోహం కలిగింది. వారిద్దరి వల్లా ఆమె గర్భవతి అయి, వాలి సుగ్రీవులను కన్నది. ఇంద్రుడు తన కొడుకైన వాలికి బంగారు తామరల మాలను కానుకగా ఇచ్చాడు. సూర్యుడు తన కొడుకైన సుగ్రీవుడికి హనుమంతుణ్ణి స్నేహితుడుగా నిరూపించాడు.



తరవాత ఆ వానరుడికి స్త్రీ రూపం పోయి తిరిగి మామూలు రూపం వచ్చేసింది. అతనే తన కొడుకులిద్దరినీ పెంచాడు. అతనే ఋక్షరజసుడు. బ్రహ్మదేవుని ఆజ్ఞ పైన ఋక్షరజసుడు తన కొడుకులిద్దరినీ తీసుకుని వానరుల నగరమైన కిష్కింధకు వెళ్ళాడు. అక్కడ అతను రాజ్యాభిషేకం చేసుకుని, సప్తద్వీపాలలోనూ ఉండే వానరులకందరికీ రాజయాడు.

"రామా, వాలి సుగ్రీవులకు తండ్రీ, తల్లీ కూడా ఋక్షరజసుడే," అని చెప్పి అగస్త్యుడు ఆ కథ ముగించాడు.

రామపట్టాభిషేకం జరిగాక చాలా రోజులపాటు వచ్చినవారందరికీ సుఖంగా గడిచింది. అనంతరం ఒకరొకరే వెళ్ళిపోసాగారు. రాముడు అందరికీ తన కృతజ్ఞత తెలుపుకుని, తగిన విధంగా సత్కరించి సాగనంపాడు. భరతుడు వెంట రాగా జనక మహారాజూ, లక్ష్మణుణ్ణి వెంటబెట్టుకుని కేకయమహారాజూ వెళ్ళిపోయారు. భరతుడి ఆహ్వానం పైన వచ్చిన కాశీరాజు ప్రతర్దనుడూ ఇతర రాజులూ కూడా తమ తమ దేశాలకు తిరిగి వెళ్ళారు.

రాముడి వెంట వచ్చిన వానరులూ, రాక్షసులూ రెండు నెలలపాటు అయోధ్యలో







సుఖంగా గడిపి వారు కూడా బయలు దేరారు. తనకు యుద్ధంలో తోడ్పడిన సుగ్రీవాంగద హనుమంతాదులను రాముడు చక్కగా సత్కరించాడు, అలాగే విభీష ణుడికీ, అతని రాక్షసులకూ సన్మానాలు చేశాడు. వారందరూ బయలుదేరి కిష్కింధకూ, లంకకూ వెళ్ళిపోయారు.

తరవాత రాముడు సీతతో వనవిహారాలు చేస్తూ, మిత్రులతో గోష్ఠి జరుపుతూ కాలక్షేపం చేస్తూ వచ్చాడు. సీతలో గర్భ చిహ్నాలు కనిపించాయి. రాము డామెతో, "సీతా, గర్భిణివిగా ఉన్నావు గదా, నీ కేమైనా కోరిక లుంటే చెప్పు, తీరుస్తాను," అని ఒకనా డన్నాడు.

సీత చిరునవ్వుతో ముఖం పంచుకుని, "నాకు గంగాతీరాన ఋషుల ఆశ్రమాలు చూసి, వారి కందమూల ఫలాలు తిని, అక్కడి చెట్ల కింద విహరించాలని ఉన్నది," అన్నది.

రాముడు, "అలాగే చేతువుగాని, రేపే నిన్ను అక్కడికి పంపుతాను," అన్నాడు.

సీతతో ఈ మాట అని అతను తన మిత్రుల మధ్యకు వచ్చి హాస్యపు కథలు చెప్పుకుంటూ కూర్చుని, భద్రుడనే వాణ్ణి చూసి, "అయితే, భద్రా, నన్ను గురించీ,



సీత గురించీ, నా తల్లులను గురించీ, తమ్ములను గురించీ ప్రజలు ఏమను కుంటూంటారు?" అని అడిగాడు.

భద్రుడు చేతులు జోడించి, "ప్రజలు అనేక రకాలగా చెప్పుకుంటారు. వాళ్ళు జాస్తిగా మాట్లాడుకునేది రావణసంహారం గురించి," అన్నాడు.

భద్రు డేదో దాస్తున్నాడని రాముడికి అనుమానం వేసింది. "భద్రా, ఉన్నమాట చెప్పు. మంచిదయినా, చెడ్డదయినా దాచకు," అన్నా డతను.

"సముద్రానికి సేతువు కట్టావనీ, రావణుణ్ణి సమూలంగా నాశనం చేశావనీ







ప్రజలు నిన్ను గురించి గొప్పగా చెప్పు కుంటారు. నిన్ను చూసి చాలా గర్వపడ తారుకూడా. కాని రావణుడు తన ఒడిలో కూర్చోబెట్టుకుని లంకకు తీసుకుపోయి, అంతకాలం తన ఆధీనంలో ఉంచుకున్న సీతను మళ్ళీ తెచ్చుకున్న నీకు మంచి చెడ్డలు తెలియ వంటున్నారు. రేపు తమ భార్యల కేమైనా జరిగినా తాము చచ్చినట్టు భరించవలిసిందే గదా అంటున్నారు. యథారాజా తథాప్రజా అన్నారు గద. ఎక్కడికి పోయినా జనం గుంపులు గుంపులుగా కూడి ఈ మాటలే చెప్పుకుంటు న్నారు," అన్నాడు భద్రుడు.



రాముడు లోపల తీవ్రంగా బాధపడుతూ మిగిలిన మిత్రులతో, "ఈ మాట నిజ మేనా?" అన్నాడు.

అందరూ తలలు వంచుకుని, నిజమే నని చెప్పారు.

రాముడు వారందరినీ పంపేసి, సమీ పంలో ఉన్న ద్వారపాలకుణ్ణి పిలిచి, "లక్ష్మణుణ్ణీ, భరతశత్రుఘ్నులనూ పిలుచుకురా," అన్నాడు. త్వరలోనే వారు ముగ్గురూ రాముడి వద్దకు వచ్చారు. కాంతి లేని ముఖంతో, కన్నుల నీరు కారుస్తూ రాముడు తన తమ్ములను ఆలింగనం చేసుకుని, ఆసనాల మీద కూర్చోబెట్టి, వారికి సీత గురించి తాను పొందిన జనాపవాదం గురించి తెలిపాడు.

"సీత నిర్దోషురాలని అగ్నీ ఇతర దేవ తలూ చెప్పారు. నా అంతరాత్మలో కూడా అలాగే అనిపించింది. లక్ష్మణా, ఇది నీ ఎదటే గదా జరిగింది? అందుచేతనే సీతను అయోధ్యకు తెచ్చాను. కాని ఈ అప వాదు భరించటం చాలా బాధగా ఉంది. ప్రాణాలనూ మిమ్మల్నీ అయినా వదులు తాను గాని అపకీర్తిని సహించలేను. సీతను విడవటమనగా ఎంత? ఈ అపవాదును మించిన దుఃఖం నా కుండబోదు. అందు







చేత, లక్ష్మణా, రేపు తెల్లవారుజామున సీతను రథం మీద తమసానదీ తీరాన, వాల్మీకి ఆశ్రమప్రాంతంలో అరణ్యంలో వదిలిపెట్టిరా. నా మాటకు ఎదురు చెప్పకు, సీతను గురించి ఏమీ అనకు. అంటే నా పైన ఒట్టే! సీత ఋషుల ఆశ్రమాలను చూడాలని కోరింది. ఆ కోరిక తీరుతుంది," అన్నాడు రాముడు.

ఈ మాటలు చెప్పి అతను బాధగా నిట్టూర్పులు విడుస్తూ అంతఃపురంలోకి వెళ్ళిపోయాడు.

మర్నాడు తెల్లవారుతూనే లక్ష్మణుడు సుమంత్రుడి వద్దకు వెళ్ళాడు. అతని వాలకం దీనంగా ఉన్నది, నోరెండిపోతున్నది. అతను సుమంత్రుడితో, "సీతను మునుల ఆశ్రమాలకు తీసుకుపొమ్మని రాముడి ఆజ్ఞ అయింది. నేనూ, సీతా ఇప్పుడే బయలుదేరుతున్నాం. వెంటనే రథం సిద్ధం చెయ్యి. సీత కోసం రాజభవనం నుంచి మెత్తని ఆసనం తెచ్చి రథంలో అమర్చు," అన్నాడు.

సుమంత్రుడు రథాన్ని అయత్తం చేసి తేగానే లక్ష్మణుడు సీత వద్దకు వెళ్ళి, "అమ్మా, ఆశ్రమాలు చూడాలని ఉన్నట్టు రాజుగారితో అన్నావుట. రాజుగారి ఆజ్ఞ



అయింది. గంగా తీరాన గల ఆశ్రమాలకు పోదాం, బయలుదేరు. మా అన్న ఆజ్ఞ ప్రకారం నేను కూడా నీ వెంట వస్తున్నాను," అన్నాడు.

సీత ఈ మాటలకు పరమానందం చెంది, వెలగల బట్టలూ, రత్నాలూ, ఆభరణాలూ మునిపత్నుల కోసం తీసుకుని, లక్ష్మణుడి వెంట రథం మీద బయలుదేరింది. రథం వేగంగా పోతూంటే సీతకు దుశ్శకునాలు కనిపించాయి. ఆ సంగతి లక్ష్మణుడితో చెప్పి, "అత్తలూ వాళ్ళూ క్షేమంగా ఉన్నారు కద!" అన్నది. లోపల గుండె గుబగుబలాడుతున్నప్పటికీ, లక్ష్మ







ణుడు పైకి నవ్వుతూ, "వారంతా క్షేమంగానే ఉన్నారు," అన్నాడు.

రాత్రి అయే సరికి రథం గోమతీతీర్థం చేరింది. ఆ రాత్రి అక్కడ గడిపి, తెల్లవారి బయలుదేరి, మధ్యాహ్నానికల్లా గంగా తీరానికి చేరుకున్నారు. గంగను చూడగానే లక్ష్మణుడికి దుఃఖం ఆగలేదు. అది చూసి, "ఇదేమిటి, లక్ష్మణా? ఎందుకేడుస్తున్నావు? ఎంతో కాలంగా కోరుకున్న నా కోరిక తీరిందని నేను సంతోషిస్తుంటే, నీ దుఃఖంతో నా ఆనందాన్ని పాడుచేస్తున్నావెందుకు? నన్ను వేగంగా గంగ దాటించి మునుల ఆశ్రమాలకు తీసుకుపో. మునుల



భార్యలకు ఈ కానుకలన్నీ ఇస్తాను. అక్కడ ఈ రాత్రి గడిపి, రేపుదయం అయోధ్యకు తిరిగి పోదాం. రాముణ్ణి ఎప్పుడు మళ్ళీ చూస్తానా అని నాకూ తహతహగానే ఉన్నది," అని సీత అన్నది.

లక్ష్మణుడు కళ్ళు తుడుచుకుని దగ్గిరలో ఉన్న పడవ వాళ్ళను పిలిచి, పడవ ఏర్పాటు చేసి, దాని మీద సీతతో సహా గంగ దాటాడు. రథంతో సహా సుమంత్రుడు ఇవతలి ఒడ్డునే ఉండిపోయాడు.

అవతలి ఒడ్డు చేరాక లక్ష్మణుడు సీతకు చేతులు జోడించి నమస్కారం చేస్తూ, "సీతా, మా అన్న నా గుండెలో శూలం గుచ్చేశాడు. ఇంత పాపిష్టి పని చేసే కన్న నేను చచ్చిపోయినా బాగుండిపోను," అంటూ దుఃఖవివశుడై కూలబడిపోయాడు.

సీత అతని స్థితి చూసి కంగారు పడి, "లక్ష్మణా, నీ మాటలు నా కేమీ అర్థం కావటం లేదు. నువ్వేదో ఉద్రేకంలో ఉన్నట్టున్నావు. నీ బాధకు కారణమేమిటో కాస్త స్పష్టంగా చెప్పు. లేకపోతే మీ అన్న మీద ఒట్టే!" అన్నది.

అప్పుడు లక్ష్మణుడు సీతతో, "అమ్మా, మా అన్న స్నేహితులతో కబుర్లు చెబుతూ నిన్ను గురించి భయంకరమైన లోకాపవాదు







విన్నాడు. ఆ అపవాదు నీ చెవుల పడరా నిది. దానితో మా అన్న కుమిలిపోయి నిన్ను వదిలిపెట్టేశాడు. నీ వల్ల ఏ దోషమూ లేదని మా అన్నకూ తెలుసు, నాకూ తెలుసు. అయినా అపవాదుకు వెరచి ఇలా చేశాడు. నిన్నిక్కడే విడిచిపెట్టి నేను అయోధ్యకు తిరిగి వెళ్ళాలి. ఇది రాజాజ్ఞ. నువు మనస్సును అధికంగా కష్టపెట్టుకోక, పుణ్యప్రద మైన ఈ ముని ఆశ్రమాలలో ఉండు. వాల్మీకిమహాముని మా తండ్రికి ఆప్తస్నేహితుడు. ఆయనను ఆశ్రయించి సుఖంగా ఉండు," అన్నాడు.

ఈ మాటలు విని సీత ఒక్క క్షణం పాటు దిమ్మరపోయిన ట్టయింది. తరవాత ఆమె తెప్పరిల్లి, దీనంగా ఏడుస్తూ, "లక్ష్మణా, నేను కష్టాలు పడటానికే పుట్టాను. పూర్వజన్మలో ఏదో పాపం చేసి ఉంటాను, ఏ దంపతులకో ఎడబాటు కలిగించి ఉంటాను. అరణ్యవాస మప్పుడు, రాముడు దగ్గిర ఉండి నన్ను ఓదార్చుతున్నా, నేను దుఃఖిస్తూనే ఉండేదాన్ని; అలాటిది రాముడు వెంట లేని ఈ అరణ్యవాసం ఎలా ఉంటుందో ఆలోచించు. నా దుఃఖం ఎవరితో చెప్పుకునేది? నిన్ను నీ భర్త ఎందుకు వదిలేశాడని మునులు అడిగితే ఏం చెప్పను? ఈ గంగానదిలో పడి చావవచ్చు, కాని అందువల్ల మీ వంశం అపహాస్యంపాలు కావచ్చు. మీ అన్నగారి ఆజ్ఞ నిర్వర్తించావు, ఇక నువు వెళ్ళు, నాయనా. అత్త లందరికీ నా నమస్కారాలు చెప్పు, రాజుగారి క్షేమ మడిగాననీ, ఆయనకు సాష్టాంగ నమస్కారాలు చేశాననీ చెప్పు. ఆయనకు వచ్చిన అపవాదును పోగొట్టటం నా విధి. ధర్మంగా రాజ్యపాలన చేస్తూ, తమ్ముళ్ళనూ, ప్రజలనూ ఒకే విధంగా చూస్తూ, లోకంలో సాటిలేని కీర్తి సంపాదించమని కోరానని ఆయనతో చెప్పు," అన్నది.





# ఉత్తర కాండ

లక్ష్మణుడు ఏమీ మాట్లాడలేక, ఏడుస్తూ సీతకు సాష్టాంగ నమస్కారం చేసి, ఆమె చుట్టూ ప్రదక్షిణం చేసి, పడవలో ఎక్కి ఉత్తర తీరానికి చేరుకుని, రథమెక్కి, అనాథురాలి లాగా అవతలి ఒడ్డున ఏడుస్తున్న సీతను మళ్ళీమళ్ళీ వెనక్కు తిరిగి చూస్తూ వెళ్ళిపోయాడు. సీత ఆ రథం కేసే చూస్తూ ఉండిపోయి, పట్టలేక గట్టిగా ఏడవ నారంభించింది. ఆమె ఏడుపుకు నిర్జనమైన అరణ్యం మారుమోగింది.

ఆ నిర్జనారణ్యంలో ఒంటరిగా ఏడుస్తున్న సీతను కొందరు మునికుమారులు చూసి వాల్మీకి వద్దకు పరిగెత్తి వెళ్ళి, "స్వామీ, గంగాతీరాన ఎవరో ఒక స్త్రీ ఏ కారణం వల్లనో ఏడుస్తూ కనబడింది. మనిషి చూడబోతే ఆకాశం నుంచి దిగి వచ్చిన దేవతా స్త్రీ లాగా ఉన్నది. ఆమె కెవరూ ఉన్నట్టు లేరు. మీరు వెంటనే వెళ్ళి ఒకసారి చూడండి," అని చెప్పారు.

వాల్మీకిమహాముని, తన శిష్యులు వెంట రాగా, అర్ఘ్యం తీసుకుని సీత ఉన్న చోటికి వచ్చి, ఆమెను గుర్తించి, "దశరథుడి కోడలికి స్వాగతం. అమ్మా, నీ విక్కడికి ఎలా చేరావో అది నేను నా శక్తి చేత గ్రహించాను. మూడు లోకాల వృత్తాంతాలూ నాకు తెలుస్తూనే ఉంటాయి. నే నుండగా నీ కే భయమూ లేదు. నా ఆశ్రమం దగ్గిరలోనే ఉన్నది. అక్కడ తాపస స్త్రీ లున్నారు. వారు నిన్ను కనిపెట్టి ఉంటారు. దుఃఖించకు. ఈ అర్ఘ్యం







తీసుకో. మా ఆశ్రమంలో నీవు నీ సొంత ఇంట్లో ఉన్నట్టే ఉండవచ్చు," అన్నాడు.

సీత ఆయనకు నమస్కారం చేసి, వాల్మీకి వెంట ఆయన ఆశ్రమం ప్రవేశించింది. వాల్మీకి ఆమెను మునిభార్యలకు అప్పజెప్పి, ఆమెను స్నేహ గౌరవాలతో చూడవలసిందని చెప్పాడు.

అయోధ్యకు తిరిగి పోతున్న లక్ష్మణుడు సుమంత్రుడితో, "సుమంత్రా, అన్నకు సీతా వియోగం వల్ల ఎంతటి దుఃఖం సంప్రాప్తమయిందో చూశావు గదా. నిర్దోషురాలైన సీతకు ఎంత కష్టం వచ్చిందో చూడు," అన్నాడు.



సుమంత్రుడా మాటకు, "లక్ష్మణా, రాముడికి సుఖం అల్పమనీ, అయినవారితో వియోగం కలుగుతుందనీ పూర్వం మునులు చెప్పనే చెప్పారు. ఇది చాలా రహస్యం. నేను నీకు చెబుతాను, కాని నీవు మాత్రం భరత శత్రుఘ్నులకు చెప్పకు," అంటూ ఇలా చెప్పాడు.

ఒకనాడు దశరథుడు వసిష్ఠుడి ఆశ్రమానికి వెళ్ళేసరికి అక్కడ అత్రిమహాముని కుమారుడైన దుర్వాసుడున్నాడు. దశరథుడు మునుల నుంచి స్వాగతసత్కారాలు పొంది, మాటల సందర్భంలో దుర్వాసుణ్ణి, "మహాత్మా, నా సంతతియొక్క భవిష్యత్తు ఎలా ఉండబోతుంది? మా రాముడి ఆయుర్దాయమెంత? మిగిలిన నా కొడుకులెంత కాలం జీవిస్తారు? మా రాముడికెంతమంది కొడుకులుంటారు? వారెంత కాలం జీవిస్తారు?" అని అడిగాడు. ఆ ప్రశ్నలకు సమాధానంగా దుర్వాసుడు ఒక పాత గాథ చెప్పాడు.

దేవాసుర యుద్ధంలో ఓడిపోయి అసురులు భృగుమహాముని భార్యను శరణుజొచ్చారు. ఆమె వారికి అభయమిచ్చింది. ఇది చూసి విష్ణువు ఆగ్రహించి, భృగుడి భార్య శిరస్సును తన చక్రాయు







ధంతో ఖండించాడు. వెంటనే భృగుమహా ముని మండిపడి, విష్ణువును భూలోకంలో పుట్టి భార్యావియోగంతో తపించమని శపించాడు. ఆ శాప ప్రభావం చేత విష్ణువు దశరథుడికి కొడుకుగా పుట్టి, రాముడనే పేరుతో ప్రసిద్ధి చెందాడు.

"రాముడు భృగు శాప ఫలం అనుభవించి తీరుతాడు. అతను పదకొండు వేల ఏళ్ళు అయోధ్యను పాలించి, అనేక అశ్వమేధాలు చేసి, బ్రహ్మలోకానికి పోతాడు. అతనికి ఇద్దరు కొడుకులు పుట్టుతారు, అయితే వారు అయోధ్యలో గాక మరొక చోట పుట్టుతారు. వారికి రాముడు పట్టాభిషేకం చేస్తాడు," అని దుర్వాసుడు దశరథుడితో చెప్పాడు.

ఇలా మాట్లాడుకుంటూ, లక్ష్మణ సుమంత్రులు సాయంకాలానికి గోమతి అనే చోటికి వచ్చి అ రాత్రి అక్కడ గడిపారు. మర్నాడు ఉదయం వారు తిరిగి ప్రయాణం సాగించి అయోధ్యకు వెళ్ళేటప్పుడు లక్ష్మణుడు, రాముడితో ఏమని చెప్పటమా అని చాలా మథనపడ్డాడు.

రథం అయోధ్య చేరింది. రాముడి ఇంటి ముందు లక్ష్మణుడు రథం దిగి, లోపలికి వెళ్ళి, దీనంగా కన్నీరు కార్చుతూ, సింహాసనం మీద కూర్చుని ఉన్న రాము





డికి సమస్కరించి, "మీ ఆజ్ఞానుసారం సీతను గంగాతీరాన వాల్మీకిమహాముని ఆశ్రమంలో విడిచి వచ్చాను. విచారించవద్దు. వృద్ధి నుంచి క్షయమూ, ఉన్నతి నుంచి పతనమూ, సంయోగం నుంచి వియోగమూ తప్పవు. వచ్చిన అపవాదు దానంతట అదే పోతుంది," అన్నాడు.

"లక్ష్మణా, నా మాట పాటించావు. చాలా సంతోషం. నాకు విచార మేమీ లేదు," అన్నాడు రాముడు. అప్పటి కతను నాలుగు రోజులుగా ప్రజల గొడవలు విచారించలేదు. అది చాలా తప్పు. రాముడా సంగతి లక్ష్మణుడితో అని, అందుకు తార్కాణంగా నృగమహారాజు కథ యిలా చెప్పాడు.

పూర్వం నృగమహారాజు కోట్ల కొద్దీ అవులను బ్రాహ్మణులకు దానం చేశాడు. ఆయన దాన మిచ్చిన అవులలో ఒకటి ప్రమాద వశాన తిరిగి రాజుగారి అవుల మందలలో కలిసిపోయింది. అది తెలియక రాజు దాన్ని మరొక బ్రాహ్మణుడికి దాన మిచ్చాడు. మొదట దానం పుచ్చుకున్న బ్రాహ్మణుడు తన ఆవును వెతుక్కుంటూ తిరుగుతూ, కనఖలం అనే చోట రెండో బ్రాహ్మణుడి ఇంట తన అవును చూసి గుర్తించి, దానికి తాను పెట్టుకున్న పేరుతో పిలిచాడు. ఆ ఆవు తన పాత యజమాని గొంతు గుర్తించి, కట్టుతాడు తెంచుకుని, అతని వెంట బయలుదేరింది. అది చూసి రెండో బ్రాహ్మణుడు, "నా అవును నువ్వు తోలుకుపోతున్నా వేమిటి? దీన్ని నాకు నృగమహారాజు దాన మిచ్చాడు," అన్నాడు.

"ఆ నృగమహారాజే దీన్ని నాకన్నా దాన మిచ్చాడు," అన్నాడు మొదటి బ్రాహ్మణుడు. ఈ తగాదా వారిద్దరి మధ్యా పరిష్కారం అయేది కాదు గనక వారు తిన్నగా నృగమహారాజు వద్దకే వెళ్ళారు.

అయితే వారికి రాజదర్శనం ఎంతకూ కాలేదు. బయటి ద్వారం వద్ద రోజుల తరబడి పడిగాపులు కాయవలిసి వచ్చింది. చివరకు వాళ్ళు ఆగ్రహించి, ఊసరవెల్లి అయిపోయి ఎవరి కంటా పడకుండా గోతిలో జీవించమని రాజును శపించారు. రాజు బతిమాలగా, యదువంశంలో వాసుదేవుడు పుట్టి శాపవిమోచనం కలిగిస్తాడని చెప్పి ఆ బ్రాహ్మణులు వెళ్ళిపోయారు.

తరవాత నృగమహారాజు వసువనే తన కుమారుడికి పట్టాభిషేకం చేసి, తాను ప్రజల కంట పడకుండా ఊసరవెల్లి జీవితం సుఖంగా గడపటానికిగాను కొన్ని గోతులు తవ్వించి, వాటి మీద చెట్ల నీడా, వాటి చుట్టూ పూల మొక్కలూ ఏర్పాటు చేయించుకున్నాడు.

రాముడు లక్ష్మణుడికి నృగమహారాజు కథ చెప్పి, ఆ తరవాత నిమి అనే వాడి కథ కూడా చెప్పాడు.

నిమి ఇక్ష్వాకుమహారాజు కొడుకులలో పన్నెండోవాడు. అతను ఒక దివ్యమైన పురం కట్టించి, దానికి వైజయంత మని పేరు పెట్టాడు. అతను తన తండ్రికి సంతోషం కలిగించటానికై ఒక యజ్ఞం తలపెట్టి, వసిష్ఠుణ్ణి ఋత్విక్కుగా ఉండమని కోరాడు. అయితే వసిష్ఠుడు తనను







ఇంద్రుడు ముందుగానే యజ్ఞం చేయించమని కోరాడనీ, ఇంద్రుడి యజ్ఞం పూర్తి కాగానే తాను వచ్చి నిమి చేత యజ్ఞం చేయిస్తాననీ చెప్పి వెళ్ళిపోయాడు. అందుచేత నిమి గౌతముణ్ణి పెట్టుకుని యజ్ఞం పూర్తిచేసేశాడు. ఇంద్రుడి యజ్ఞం పూర్తి కాగానే వసిష్ఠుడు తిరిగి వచ్చి, నిమి తన కోసం వేచి ఉండక గౌతముడి చేత యజ్ఞం పూర్తి చేయించుకున్నాడని తెలుసుకుని, కోపం చెంది, రాజును చూడబోయాడు. సరిగా ఆ సమయానికి నిమి నిద్రపోతూ ఉండటం జరిగింది. వసిష్ఠుడు రాజదర్శనం కోసం కొద్దిసేపు చూసి, కావాలనే నిమి



తనను వేచి ఉంచాడనుకుని, "రాజా, మరొకరి చేత యజ్ఞం చేయించుకుని నన్నవమానించావు గనక నీ శరీరం నిశ్చేతన మగుగాక," అని శపించాడు.

తరవాత రాజు మేలుకుని వసిష్ఠు డిచ్చిన శాపం తెలుసుకుని, "నిద్రపోయే నన్ను శపించిన నీ శరీరం కూడా చేతనం లేనిదై పోవుగాక," అని ప్రతిశాప మిచ్చాడు.

ఇలా ఒకరినొకరు శపించుకుని నిమి వసిష్ఠులు "విదేహు" లయిపోయారు. అప్పుడు వసిష్ఠుడు తన తండ్రి అయిన బ్రహ్మ వద్దకు వాయురూపం ధరించి వెళ్ళి, "తండ్రీ, నిమి శాపం వల్ల నా దేహం కాస్తా పోయింది. దేహం లేకపోవటం చేత ఎంతో బాధ, ఏ పనీ చెయ్యటానికి లేదు. అందుచేత నన్ను అనుగ్రహించి నాకు మరొక శరీరం కలిగేటట్టు చెయ్యి," అన్నాడు.

బ్రహ్మ వసిష్ఠుణ్ణి మిత్రావరుణుల తేజస్సుతో తిరిగి శరీరాన్ని సంపాదించుకో మన్నాడు. ఆ విధంగా మరొక దేహాన్ని సంపాదించుకున్న వసిష్ఠుడే ఇక్ష్వాకువంశం వారికి పురోహితు డయాడు.

ఇక నిమి సంగతి. నిమి శరీరాన్ని మునులు రక్షించి, దేహం పోయిన నిమి సమస్త ప్రాణుల కళ్ళలోనూ ఉండేటట్టుగా







వరమిచ్చారు. తరవాత వారు నిమి దేహాన్ని మధించగా అందులో నుంచి ఒక పిల్లవాడు పుట్టి మిథి అని పిలవ బడ్డాడు. అతని పేరనే మిథిలానగరం ఏర్పడింది. అతనికి జనకుడని కూడా పేరు.

రాముడు చెప్పిన ఈ కథలు విని లక్ష్మ ణుడు, "అన్నా, క్షత్రియుడై ఉండి కూడా నిమి వసిష్ఠుడి లాటి మహాత్ముడి పట్ల ఎందుకు శాంతి వహించలేదు?" అన్నాడు.

"రోషం మూలాన ఎలాటి వాడైనా శాంతిని కోల్పోవటం సహజం. అలా రోషాన్ని నిగ్రహించుకున్న వాడు ఒక్క యయాతి మాత్రమే," అంటూ రాముడు లక్ష్మణుడికి యయాతి వృత్తాంతం ఈ విధంగా చెప్పాడు.

యయాతి నహుషుడి కొడుకు. అతని కిద్దరు భార్యలు. ఒకతె వృషపర్వమహా రాజు కుమార్తె అయిన శర్మిష్ఠ, రెండవది శుక్రాచార్యుడి కుమార్తె అయిన దేవయాని. కాని యయాతికి శర్మిష్ఠ పైన ఉండే ప్రేమ దేవయాని పైన ఉండేది కాదు. అదేవిధంగా అతనికి శర్మిష్ఠ కొడుకైన పూరుడి పైన ఉన్నంత మమకారం దేవయాని కొడుకైన యదుడి పైన ఉండేది కాదు. నిజానికి పూరుడు మంచి గుణవంతుడు, ఆ పైన శర్మిష్ఠ కొడుకు కూడానూ. తన తండ్రి



పూరుడి పైన హెచ్చు ప్రేమ చూపటం సహించలేక యదుడు తన తల్లి అయిన దేవయానితో, "అమ్మా, శుక్రాచార్యు డంతటి వాడి కూతురువై ఉండి నువ్వూ, నీ కొడుకైన నేనూ ఇంత అవమానాన్ని ఎందుకు సహించాలి? మన మిద్దరమూ అగ్నిలో దూకి ప్రాణత్యాగం చేద్దాం. ఈ అవమానాన్ని ఒక వేళ నువు సహించినా, నేను సహించ లేను. ఆత్మహత్య చేసుకుంటాను, నాకు అనుజ్ఞ ఇయ్యి," అని పెద్ద పెట్టున ఏడ్చాడు.

కొడుకు దుఃఖం చూసి దేవయానికి రోషం వచ్చింది. ఆమె తన తండ్రిని తలుచు కున్నది, వెంటనే శుక్రాచార్యుడు వచ్చాడు.





"నా భర్త నన్ను చాలా లోకువగా చూస్తున్నాడు. ఆ అవమానం భరించటం కష్టంగా ఉంది. నేను అగ్నిలో దూకో, విషం తినో, నీటిలో పడో ఆత్మహత్య చేసుకుందా మనుకుంటున్నాను," అన్నది దేవయాని తండ్రితో.

శుక్రాచార్యుడికి పట్టరాని ఆగ్రహం వచ్చి, యయాతిని ముసలితనంతో జీవించమని శపించి, కూతురి నోదార్చి, ఇంటికి తిరిగి పోయాడు. శుక్రాచార్యుడి శాపాన్ని యయాతి ఎంతో సహనంతో స్వీకరించాడు.

అతను యదువును పిలిచి, "నాయనా, నేనింకా భోగాలతో తృప్తిపడలేదు. అందుచేత నా ముసలితనాన్ని నువు కొంత కాలం భరిస్తావా? నాకు భోగాలతో తృప్తి కలిగాక నీ యౌవనం నీ కిచ్చి ముసలితనం తీసుకుంటాను," అన్నాడు.

"నీ సరసన భోజనం చెయ్యటానికి అర్హుడైన పూరు డుండగా నీ ముసలితనాన్ని నే నెందుకు తీసుకోవాలి? వాణ్ణే తీసుకోమను," అన్నాడు యదువు.

అప్పుడు యయాతి పూరుణ్ణి పిలిచి యదువు నడిగినట్టే అడిగాడు. తన తండ్రి వార్ధక్యాన్ని స్వీకరించటానికి పూరుడు మనస్ఫూర్తిగా అంగీకరించాడు. యయాతి తన ముసలితనాన్ని పూరుడి కిచ్చి, వాడి యౌవనం తాను పొంది, అనేకవేల యజ్ఞాలు చేశాడు, అనేకవేల సంవత్సరాలు రాజ్యం చేశాడు. చివర కతను తన కొడుకు నుంచి ముసలితనం తీసుకుని, వాడికే రాజ్యాభిషేకం చేసి, దేవయాని కొడుకైన యదువుకు రాజ్యార్హత లేకుండా చేశాడు.

యయాతి అనంతరం పూరుడు ప్రతిష్ఠానపురం రాజధానిగా పెట్టుకుని చాలా కాలం రాజ్యం చేశాడు.

రామలక్ష్మణు లిలా కథలు చెప్పుకుంటూండగానే రాత్రి గడిచిపోయింది. తూర్పున అరుణరేఖలు కనిపించాయి.






వున్నాడు రాముడు కొలువుతీరి ఉండగా, ఒక కుక్క వచ్చి బయట మొరిగింది. లక్ష్మణుడు, ఆ కుక్క రాజుతో ఏదో ఫిర్యాదు చెయ్యగోరుతున్న దని తెలుసుకుని, దాన్ని సభలోకి తీసుకువచ్చాడు.

తల పగిలి ఉన్న ఆ కుక్కను చూసి రాముడు, "నీకు కలిగిన కష్టం గురించి నాతో నిర్భయంగా చెప్పు," అన్నాడు.

"సర్వార్థసిద్ధి అనే భిక్షువు నా తల పగలగొట్టాడు. నే నతని కే అపకారమూ చెయ్యలేదు," అన్నది కుక్క.

రాముడు వెంటనే ఆ భిక్షువును పిలిపించి, "నీ వీ కుక్క తల ఎందుకు పగలగొట్టావు? అది నీ కే మపకారం చేసింది?" అని అడిగాడు.

"రాజా, నేను భిక్ష కోసం ఇల్లిల్లు తిరుగుతున్నాను. నా కెక్కడా భిక్ష దొరక లేదు. ఈ స్థితిలో ఈ కుక్క నా దారికి అడ్డంగా నిలబడి, ఎంత అదిలించినా పోలేదు. కోపం ఆచుకోలేక దాన్ని తల మీద కొట్టిన మాట నిజమే. దాని కేమి దండన విధిస్తారో విధించండి," అన్నాడు సర్వార్థసిద్ధి.

అతనికి ఎలాటి శిక్ష విధిస్తే బాగుంటుం దని రాముడు సభలోని వాళ్ళను అడిగాడు. సభలో ఎందరో పండితు లుండి కూడా ఒక్కరూ సూటిగా సమాధానం చెప్పలేదు.

అప్పుడు కుక్క రాముడితో, "రామా, ఇతనికి నేను చెప్పిన శిక్ష వెయ్యి. కాలం చర మనే చోట కులపతిగా ఇతనికి







ఉద్యోగమియ్యి," అన్నది. రాము డతనికి ఆ ఉద్యోగం ఇచ్చి, ఏనుగు మీద ఎక్కించి పంపేశాడు. భిక్షువు కూడా పరమానందం చెంది వెళ్ళిపోయాడు.

తరవాత రాముడూ, మంత్రులూ ఆ కుక్కను, "ఆ భిక్షువుకు ఇలాటి శిక్ష ఎందుకు వేయించావు? దీని కేదో కారణం ఉండాలి," అన్నారు.

"నేను కిందటి జన్మలో ఆ ఉద్యోగమే చేశాను. ఆ పదవిలో నాకు చక్కని భోజనమూ, దాసదాసీలూ, సమస్తమూ అమరి ఉండేవి. ఎంతో భూతదయ గలిగి, వినయమూ, శీలమూ కలవాడి ననిపించుకున్నాను. దేవ బ్రాహ్మణ పూజ చేశాను. అయినప్పటికీ ఆ పదవిలో ఉండిన కారణంగా నా కీ నీచజన్మ కలిగింది. మహా కోపీ, దయారహితుడూ అయిన ఈ భిక్షువు ఆ పదవి నిర్వహించాడే జన్మజన్మలకీ ఘోర నరకంపాలు అయితీరుతాడు," అన్నది కుక్క.

కుక్క వెళ్ళిపోయ్యాక ఒక గుడ్లగూబా, గద్దా తగాదాపడి తీర్పు చెప్పమని రాముడి వద్దకు వచ్చాయి. ఒక వనంలో ఒక ఇల్లున్నది. ఆ ఇల్లు నాదంటే నాదని రెండు పక్షులూ తగాదా పడుతున్నాయి. ఈ తగాదా తీర్చేటందుకు గాను రాముడు పుష్పక విమానం మీద తన మంత్రులతో సహా ఆ ఇల్లున్న చోటికి వెళ్ళాడు.

"ఈ ఇంటిని నువ్వెప్పుడు కట్టుకున్నావు?" అని రాముడు గద్ద నడిగాడు.

"భూమి మీద మనుషులు పుట్టిన కాలంలో నే నీ ఇల్లు కట్టుకున్నాను. ఇది నా ఇల్లే," అన్నది గద్ద.

వెంటనే గుడ్లగూబ, "రామా, భూమి మీద చెట్లు ఏర్పడిన కాలంలో నే నీ ఇంటిని కట్టాను," అన్నది.

వెంటనే రాముడి మంత్రులు ఆ ఇల్లు గుడ్లగూబదే నని తేల్చారు. ఎందుచేతనంటే





సృష్టిలో మొదట వచ్చినవి వృక్ష జాతులు. గుడ్లగూబ ఇంటిని కాజెయ్యాలని చూస్తున్నది గనక గద్దను శిక్షిస్తానన్నాడు రాముడు. అప్పుడు ఆకాశవాణి ఇలా పలికింది:

"రామా, అసలే శాపం తిని ఉన్న ఈ గద్దను ఇంకా ఎందుకు శిక్షిస్తావు? ఈ గద్ద బ్రహ్మదత్తు డనే రాజు, మహా ధనికుడు, శూరుడు, సత్యవ్రతుడు. ఇతని ఇంటికి గౌతముడు వచ్చి అతిథిగా ఉన్నాడు. గౌతముడికి రాజు స్వయంగానే అర్ఘ్యపాద్యాలిచ్చాడు. గౌతముడు బ్రహ్మదత్తుడి ఆతిథ్యం స్వీకరిస్తున్న సమయంలో ఒక నాడు ఆయన భోజనం లోకి పొరపాటున మాంసం వచ్చింది. అది చూసి గౌతముడు కోపించి, రాజును గద్దవు కమ్మని శపించాడు. ఆ తరవాత, ఇక్ష్వాకు వంశంలో పుట్టే రాముడు తాకినప్పుడు శాపవిముక్తి కలుగుతుందని కూడా గౌతము డన్నాడు."

ఆకాశవాణి పలికిన ఈ మాటలు విని రాముడా గద్దను తాకాడు. వెంటనే గద్ద ఒక దివ్యపురుషుడుగా మారింది. ఆ పురుషుడు రాముడికి కృతజ్ఞత తెలుపుకుని వెళ్ళిపోయాడు.

యమునా తీర వాసులైన మునులు నూరుమందికి పైగా రాముడి దర్శనార్థం



ఒకనాడు వచ్చారు. వారు కలశాలతో తెచ్చిన నీరూ, పళ్ళూ మొదలైన కానుకలు స్వీకరించి, వారందరినీ సుఖాసీనులను చేసి రాముడు, వారు వచ్చిన పని అడిగాడు. లవణాసురు డనేవాడు తమని మహాబాధ పెడుతున్నాడనీ, వాడి బాధ నుంచి విముక్తి కలిగించమనీ మునులు రాముణ్ణి కోరారు.

ఈ లవణాసురు డనేవాడు మధు వనే రాక్షసుడి కొడుకు. మధువు రుద్రుణ్ణి గురించి బహుదీర్ఘమైన తపస్సు చేసి, ఆయనను మెప్పించాడు. దాని ఫలితంగా రుద్రుడు తన త్రిశూలంలో నుంచి మరొక త్రిశూలం చేసి మధువు కిస్తూ, "అది







వెంట ఉన్నంత కాలమూ నిన్నెవరూ జయించలేరు," అని చెప్పాడు. ఆ త్రిశూలాన్ని వంశపరంపరగా తన ఇంటనే ఉండేటట్టు అనుగ్రహించమని మధువు శివుణ్ణి వేడుకున్నాడు. "నీ అనంతరం ఈ త్రిశూలం నీ కొడుక్కు మాత్రమే ఉంటుంది. అటు పైన ఉండదు," అన్నాడు శివుడు. ఆ మధువు రావణుడికి చెల్లెలు వరస అయిన కుంభీనసను పెళ్ళాడాడు. వారికి లవణుడు పుట్టాడు. వాడు పసితనం నుంచీ మహాపాపి. వాణ్ణి మంచిదారిన పెట్టటం మధువు వల్ల కాలేదు. మధువు వరుణలోకానికి వెళ్ళిపోతూ, శివుడు తన కిచ్చిన త్రిశూలాన్ని లవణుడి కిచ్చాడు. దాని అద్భుతశక్తి నెరిగిన లవణుడు మరింత విజృంభించి, అందరినీ బాధిస్తున్నాడు, మునులను మరింత వేపుకుతింటున్నాడు.

మునులు చెప్పిన విషయాలన్నీ ఆలకించి రాముడు వారితో, "లవణాసురుణ్ణి నేను చంపిస్తాను. మీరు నిర్భయంగా ఉండండి," అని అభయమిచ్చాడు. తరవాత అతను తన తమ్ములను చూసి, "లవణాసురుణ్ణి చంపే పనికి ఎవరు పూనుకుంటారు?" అని అడిగాడు.

భరతుడు తా నా పని చేస్తానన్నాడు. కాని శత్రుఘ్నుడు భరతుడి పైన పోటీకి వచ్చి, తానే లవణాసురుణ్ణి చంపుతాననీ, తానుండగా భరతుడు శ్రమపడటం భావ్యం కాదనీ, పడవలసిన శ్రమలన్నీ భరతుడు లోగడ నందిగ్రామంలో ఉన్నప్పుడే పడ్డాడనీ అన్నాడు.

రాముడందుకు ఒప్పుకుని శత్రుఘ్నుణ్ణి మధుపురానికి రాజుగా అభిషేకించే ఏర్పాట్లు చేశాడు. ఒక రాజు చచ్చిపోతే మరొకడు వెంటనే రాజ్యభారం వహించటానికి సిద్ధంగా ఉండాలి. శత్రుఘ్నుడి రాజ్యాభిషేకోత్సవం ముగియగానే రాముడు అతని కొక బాణం





ఇచ్చి, ఇలా చెప్పాడు: "ఈ బాణం మధుకైటభులను చంపినది. దీన్ని నేను రావణుడి పైన కూడా ప్రయోగించలేదు. దీనితో నీవు లవణాసురుణ్ణి చంపు. మరొక సంగతి. లవణుడి వద్ద శివుడి త్రిశూలానికి సమమైన శూలం ఉన్నది. అది వాడి చేతిలో ఉండగా ఎవరూ వాణ్ణి జయించ లేరు. అందుచేత నీ వేం చేస్తావంటే—లవణుడి త్రిశూలం వాడి ఇంటనే ఉంటుంది. వాడు నగరం వదిలి ఎటైనా వెళ్ళి ఉన్న సమయంలో నీవు నగరద్వారం ముట్టడించి, వాడు తిరిగి వచ్చినప్పుడు ద్వారం వద్దనే అటకాయించి చంపు. ఏ పరిస్థితిలోనూ వాడు నగరం లోకి వెళ్ళ రాదు, త్రిశూలం వాడి చేతికి చిక్కరాదు."

అంతేకాదు; శత్రుఘ్నుడు ముందుగా సేనను పంపి, తరవాత తాను ఒంటరిగా వెళ్ళాలి. తనను చంపటాని కెవరో వస్తు న్నట్టు లవణుడికి తెలియగూడదు. గ్రీష్మర్తువు లోనే సేనలు గంగ అవతలి ఒడ్డు చేరి అక్కడ విడియాలి. శత్రుఘ్నుడు వర్షాకా లారంభంలో విల్లుబాణాలు తీసు కుని బయలుదేరి వెళ్ళి లవణాసురుణ్ణి చంపాలి. ఈ విధంగా రాముడు యుద్ధగతి నిర్ణయించాడు.

ఆ ప్రకారమే శత్రుఘ్నుడు ముందుగా తన సేనలను పంపి, ఒకమాసం గడిచాక తాను బయలుదేరాడు. దారిలో రెండు రోజులపాటు అతను వాల్మీకి ఆశ్రమంలో నిలిచాడు. వాల్మీకి అతనికి ఆతిథ్య మిచ్చి, ఆ ఆశ్రమం ఒకప్పుడు రఘువంశం వారిదే నంటూ దాని కథ ఇలా చెప్పాడు:

రఘు వంశంలో ఒకప్పుడు సుదాసు అనేవా డుండేవాడు. ఆయన కొడుకు వీరసహుడు. చిన్నతనంలోనే వేటకు వెళ్ళి, వనంలో ఇద్దరు రాక్షసులను చూశాడు. ఆ రాక్షసులు పులుల రూపంలో తిరుగుతూ కనిపించిన మృగాన్నెల్లా తినేస్తూ, అరణ్య







మంతా పాడుపెట్టేశారు. ఎక్కడా ఒక మృగం లేదు. అది చూసి వీరసహుడికి చాలా కోపం వచ్చింది. అత నా రాక్షసు లిద్దరినీ చూస్తూనే వారిలో ఒకణ్ణి చంపే శాడు. అప్పుడు రెండోవాడు, "పాపీ, అకార ణంగా నా అనుచరుణ్ణి చంపావుకదూ? నిన్నేం చేస్తానో చూడు," అంటూ అదృశ్యు డయిపోయాడు.

కొంతకాలం గడిచింది. ఆ రాజు ఇదే ఆశ్రమంలో ఒక బ్రహ్మాండమైన అశ్వమేధ యాగం చేశాడు. వసిష్ఠుడే ఆ యాగం చేయించాడు. యాగం పూర్తి అయేసరికి వెనకటి రాక్షసుడు, రాజుపైన పగబట్టి ఉన్న



వాడు గనక, వసిష్ఠుడి రూపంలో వచ్చి, "రాజా యజ్ఞం పూర్తి అయింది. నాకు చక్కని మాంసభోజనం పెట్టు," అని అడిగాడు.

రాజు సంతోషించి వంటవాణ్ణి పిలిచి, "గురువుగారికి హవిస్సు మాంసంతో రుచిగా భోజనం తయారుచెయ్యి," అన్నాడు. ఈ లోపుగానే రాక్షసుడు వంటవాడి రూపంలో నరమాంసంతో వంట సిద్ధం చేసి, రాజుకు చూపించి, "హవిస్సుతో చక్కని వంట చేశాను," అన్నాడు. రాజు వసిష్ఠుడికి తన భార్య అయిన మదయంతి చేత ఆ నరమాంసం వడ్డింపించాడు. వసిష్ఠుడు తనకు వడ్డించినది నరమాంస మని గుర్తించి, ఆగ్రహించి, "నువు నర భక్షకుడి వైపో!" అని రాజును ఘోరంగా శపించాడు.

రాజుకు కూడా కోపం వచ్చి, వసిష్ఠుణ్ణి శపించటానికి నీరు చేతిలోకి తీసుకున్నాడు. కాని అతను శపించే లోపుగా మదయంతి అడ్డుపడి, "ఆయన మనకు దేవుడిలాటి వారు. ఆయనను శపించరాదు," అన్నది. అప్పుడు రాజు చేతిలో నీళ్ళను తన పాదాల మీదనే పోసేసుకున్నాడు. ఆ నీటి వల్ల రాజు పాదాలకు కల్మషం కలిగింది.







అప్పటి నుంచీ అతనికి కల్మాషపాదు డనే పేరు వచ్చింది.

తరవాత వసిష్ఠుడు జరిగిన సంగతి గ్రహించి, కల్మాషపాదుడికి శాపఫలం పన్నెండేళ్ళే ఉండేటట్టు అనుగ్రహించాడు. రాజు పన్నెండేళ్ళ పాటు నరభక్షకుడుగా జీవించి, శాపం తీరి మామూలు మనిషి అయి, ఎప్పటి లాగే రాజ్యపాలన చేశాడు.

ఈ కథను వాల్మీకి వల్ల విని శత్రుఘ్నుడు పర్ణశాల ప్రవేశించే సమయానికి సీత కవలపిల్లలను కన్నది. ఈ వార్త ముని కుమారుల ద్వారా వినగానే వాల్మీకి వెళ్ళి, బాలచంద్రుల్లాగా ప్రకాశించే పిల్లలను చూసి, రక్షలు కట్టి, పెద్దవాడికి కుశుడనీ రెండోవాడికి లవుడనీ పేర్లు పెట్టాడు.

ఇది జరిగింది సరిగా అర్ధరాత్రి వేళ. ఆ సమయంలోనే శత్రుఘ్నుడు సీత వద్దకు వెళ్ళి, "అమ్మా, అదృష్టం," అని ఎంతో సంతోషించాడు. మర్నాడు అతను వాల్మీకి వద్ద సెలవు పుచ్చుకుని, పడమరగా ప్రయాణిస్తూ, ఏడు రోజులకు యమునా తీరం చేరి, అక్కడి మునుల ఆశ్రమాలలో సత్కాలక్షేపం చేస్తూ ఆ రాత్రి గడిపాడు.

మర్నాడు తెల్లవారగానే శత్రుఘ్నుడు చ్యవన మహాముని ని లవణాసురుణ్ణి గురించీ, వాడి త్రిశూలం గురించీ అడిగాడు.



వాడా శూలంతో ఎన్నో దారుణాలు చేశాడని చెబుతూ చ్యవనుడు మాంధాత వృత్తాంతం వివరించి చెప్పాడు.

అయోధ్య రాజైన యువనాశ్వుడి కుమారుడు మాంధాత. మహాబలవంతుడైన ఆ మాంధాత భూమిలో ఉండే రాజులనందరినీ జయించి, స్వర్గానికి వెళ్ళి దాన్ని కూడా జయించ నిశ్చయించాడు. ఆ సంగతి తెలిసి, ఇంద్రుడు మొదలైన దేవతలు భయపడ్డారు. ఇంద్రుడి అర్థాసనమూ, దేవతల సేవా కోరి వచ్చిన మాంధాతతో ఇంద్రుడు మంచిగానే, "ముందు భూలోకాన్ని జయించి రా, అప్పుడు దేవలోకాన్ని నీ కిచ్చేస్తాం," అన్నాడు.

"అదేమిటి? భూలోక మంతా అదివరకే జయించాను. అక్కడ నా శాసనానికి ఎదురులేదు," అన్నాడు మాంధాత.

"మధువనంలో లవణాసురు డనేవాడున్నాడు. వాడు నీకు లోబడి నడుచుకుంటున్నాడా?" అని ఇంద్రుడు మాంధాత నడిగాడు.

మాంధాత సిగ్గుపడి తల వంచుకుని భూమికి తిరిగి వచ్చి, లవణుణ్ణి జయించటానికి సేనా సమేతుడై బయలుదేరి వెళ్ళి, తనకు లొంగిపొమ్మని దూత ద్వారా లవణుడికి కబురు చేశాడు. లవణు డా దూతను పట్టుకుని తినేశాడు.

ఎంత కాలానికీ దూత తిరిగి రాకపోగా మాంధాత లవణుడి పైన యుద్ధం ప్రారంభించాడు. లవణుడు మాంధాతను చూసి నవ్వి, తన శూలాన్ని ప్రయోగించే సరికి, అది మాంధాతతో సహా అతని సైన్య మంతటినీ భస్మం చేసేసింది.

చ్యవను డీ సంగతి చెప్పి, "వాడి చేతిలో ఆ త్రిశూలం లేని సమయంలోనే నువు వాణ్ణి చంపాలి. రేపే ఆ పని చెయ్యగలుగుతావు," అన్నాడు. ఆ రాత్రి కబుర్లతో సులువుగా గడిచిపోయింది.





# ఉత్తర కాండ

మర్నాడు తెల్లవారుతూనే లవణుడు ఆహారం సంపాదించటానికై మధుపురం దాటి బయటికి వెళ్ళాడు. ఆ సమయంలో శత్రుఘ్నుడు యమునా నదిని దాటి, మధుపుర ద్వారం వద్ద నిలబడ్డాడు.

మధ్యాన్నం రెండు జాములయే సరికి లవణుడు తాను చంపిన జంతువు లన్నిటినీ మోస్తూ తన నగరానికి తిరిగి వచ్చి, ద్వారం వద్ద ఉన్న శత్రుఘ్నుణ్ణి చూసి, విరగబడి నవ్వుతూ, "ఒరే మనిషీ, నాకు ఆహారం కావటానికా వచ్చావు? ఇవాళ నాకు మంచి విందే!" అన్నాడు.

రోషంతో శత్రుఘ్నుడి కళ్ళు ఎర్రబడ్డాయి. "నీతో యుద్ధం చేసి, నిన్ను చంపటానికి వచ్చానురా, లవణుడా! నేను దశరథమహారాజు కొడుకును, రాముడి తమ్ముణ్ణి, నా పేరు శత్రుఘ్నుడు. ఇవాళ నా చేత నీకు చావు తప్పదు," అన్నాడతను.

లవణుడు వెటకారంగా నవ్వి, "నాకు మామ వరస అయిన రావణుణ్ణి మీ అన్న చంపినా మిమ్మల్ని నేను లక్ష్యపెట్టలేదు. నేను మహామహా వాళ్ళనే చంపాను. నాకు మీ వంటి వాళ్ళు గడ్డితో సమానం. నన్నెవరూ జయించలేరు. నాతో యుద్ధం చెయ్యవచ్చావుగా? ఉండు నీ తీట తీరుస్తాను. నన్ను వెళ్ళి ఆయుధం పట్టుకు రానీ," అన్నాడు.

"నా కంటపడిన నిన్ను ప్రాణాలతో పోనిస్తా ననుకున్నావా? నిన్ను ఈ క్షణంలోనే చంపేస్తాను," అన్నాడు శత్రుఘ్నుడు.







లవణుడు పళ్ళుకొరికి, చేతులు పిసుక్కుని, చెట్లు పెరికి శత్రుఘ్నుడి పైన విసరసాగాడు. శత్రుఘ్ను డా చెట్లనన్నిటినీ తన బాణాలతో నరికాడు. కాని ఒక చెట్టు తల మీద తగిల్తే శత్రుఘ్నుడు మూర్ఛపోయాడు. అది చూసి, శత్రుఘ్నుడు చచ్చా డనుకుని, మందమతి అయిన లవణుడు తన శూలాన్ని తెచ్చుకోవటానికి వెళ్ళలేదు. అందుకు మారుగా వాడు తాను చంపిన మృగాల మోపు నెత్తుకుని బయలుదేరే టంతలో శత్రుఘ్నుడు మూర్ఛ తెలిసి, ద్వారానికి అడ్డంగా నిలబడ్డాడు. మరుక్షణమే అతను, రాముడు తన కిచ్చిన బాణాన్ని ధనువుకు సంధించి, లవణుడి పైకి వదిలాడు. అది నిప్పులు కక్కుతూ వెళ్ళి, లవణుడి గుండెను చీల్చింది. లవణుడు చచ్చాడు. వెంటనే వాడి ఇంట ఉండే త్రిశూలం శివుడి వద్దకు వెళ్ళిపోయింది.

తరవాత శత్రుఘ్నుడు తన సేనను పిలిపించి, మధుపురాన్ని ఆక్రమించి, దానికి రాజై పాలించ సాగాడు. పన్నెండేళ్ళు గడిచాక అతనికి రాముణ్ణి చూడా లనిపించింది. అతను కొద్ది సేననూ, పరివారాన్నీ వెంటబెట్టుకుని అయోధ్యకు బయలుదేరి, దారిలో వాల్మీకి ఆశ్రమంలో ఒకరాత్రి మజిలీ చేశాడు.

వాల్మీకి శత్రుఘ్నుడికి అర్ఘ్యపాద్యాలిచ్చి ఆతిథ్యం జరిపి, అతనికీ, అతని సేనకూ, పరివారానికీ భోజనాలు పెట్టించాడు. భోజనాలయాక వారంతా వాల్మీకి రచితమైన రామకథను రాగతాళాలతో సహా విని ఎంతో అద్భుతం చెందారు. జరిగిపోయిన ఆ కథ మళ్ళీ కళ్ళ ఎదట జరుగుతున్నట్టే వాల్మీకి దానిని రచించాడు.

ఆ రాత్రంతా రామకథను వినటంలోనే గడిచిపోయింది. మర్నాడు శత్రుఘ్నుడు వాల్మీకి వద్ద సెలవు పుచ్చుకుని, అయో





ధ్యకు వెళ్ళి, రాముణ్ణి చూసి, "అన్నా, నీ ఆజ్ఞానుసారం లవణుణ్ణి చంపి అతని రాజ్యాన్ని ఏలుతున్నాను. కాని పన్నెండేళ్ళ పాటు నిన్ను చూడక తహతహ పుట్టి బయలుదేరి వచ్చాను," అన్నాడు.

రాముడు శత్రుఘ్నుణ్ణి కౌగలించుకుని, "నాయనా, రాజుకు రాజ్యం చెయ్యక తప్పదు గద. నీ రాజ్యం నీవు చూసుకో. ఎప్పుడన్నా నన్ను చూడాలనిపిస్తే వస్తూ ఉండు," అని అతన్ని పంపేశాడు.

భరతలక్ష్మణులు సపరివారంగా బయలుదేరి, శత్రుఘ్నుణ్ణి చాలా దూరం సాగనంపి, వెనక్కుతిరిగి వచ్చారు.

తరవాత కొన్ని రోజులకు ఒక పల్లెటూరి బ్రాహ్మణుడు తన అయిదేళ్ళ కొడుకు శవం తెచ్చి రాజద్వారం దగ్గిర నిలబడి ఏడవటం మొదలుపెట్టాడు. తన కున్న ఒకే కొడుకు అకాలమరణం పొందినందుకు ఏడుస్తూ ఆ బ్రాహ్మణుడు, రాజు సరిగా పాలిస్తే ఇలాటి అకాలమరణాలుండవనీ, ఇన్నాళ్ళకు ఇక్ష్వాకుల పరిపాలనలో, రాముడి హయాంలో దేశం దిక్కుమాలినదయిందనీ అన్నాడు.

రాముడీ సంగతి తెలుసుకుని చాలా చింతించి, తన మంత్రులనూ, వసిష్ఠుడు మొదలైన బ్రాహ్మణులనూ పిలిపించి,







అతను విమానం దిగి ఆ వ్యక్తిని సమీపించి, "నేను రాముణ్ణి, దశరథమహారాజు కొడుకును. తెలుసుకోవాలన్న కుతూహలం కొద్దీ అడుగుతున్నాను. నీ వే జాతివాడివి? ఏం కోరి ఈ కఠోర తపస్సు చేస్తున్నావు?" అని అడిగాడు.

తలకిందులుగా ఉండే ఆ తాపసి, "రాజా, నేను శూద్రుణ్ణి. నా పేరు శంబూకుడు. బొందితో స్వర్గానికి పోగోరి నేనీ తపస్సు చేస్తున్నాను," అన్నాడు. అతనింకా మాట్లాడుతూండగానే రాముడు తన కత్తి దూసి శంబూకుడి తల నరికేశాడు.

వెంటనే దేవతలు రాముడి పైన పుష్పవర్షం కురిపించి, దుందుభులు మోగించి, "రామా, ఈ శూద్రుడు స్వర్గానికి రాకుండా చేశావు. మాకంతే చాలు. ఏం వరం కోరుతావో కోరు," అన్నారు.

"అకాలమరణంపాలయిన ఆ బ్రాహ్మణబాలుణ్ణి బతికించండి," అన్నాడు రాముడు.

"శంబూకుడి తలతెగిన క్షణంలోనే ఆ బాలుడు బతికాడు," అంటూ దేవతలు వెళ్ళిపోయారు.

రాముడక్కడినుంచి, ఆ సమీపంలోనే ఉన్న అగస్త్యాశ్రమానికి వెళ్ళి, ఆ ముని ఇచ్చిన అతిథిసత్కారాలు స్వీకరించాడు.

వారితో బ్రాహ్మణబాలుడి అకాలమరణం గురించి చెప్పాడు. ఒక శూద్రుడు గొప్ప తపస్సు చేస్తున్నాడనీ, అది యుగధర్మానికి విరుద్ధమనీ, అందుకే ఈ బాలుడు చనిపోయాడనీ నారదుడు రాముడితో అన్నాడు.

రాముడు లక్ష్మణుడితో, "నీవు వెళ్ళి ఆ బ్రాహ్మణుణ్ణి ఓదార్చి, ఆ బాలుడి కళేబరాన్ని తైలభాండంలో భద్రంగా ఉంచు," అన్నాడు. తరవాత అతను ఆయుధాలు తీసుకుని పుష్పకం ఎక్కి, పడమరా, ఉత్తరమూ, తూర్పూ గాలించి, చివరకు దక్షిణదిక్కున, ఒక సరస్సులో తలకిందుగా తపస్సు చేస్తున్న మనిషి నొకణ్ణి చూశాడు.






అగస్త్యుడు రాముడికొక అభరణాన్ని బహూకరించాడు. రాముడు దాన్ని స్వీకరించి, "స్వామీ, ఇది దివ్యాభరణంలాగున్నది. ఇది తమకు ఎవరిచ్చారు?" అని అడిగాడు. ఆ ప్రశ్నకు సమాధానంగా అగస్త్యుడు శ్వేతుడి కథ చెప్పాడు.

వెయ్యియోజనాల విస్తృతి గల ఒక అరణ్యం ఉండేది. దాని మధ్య యోజనం చదరం గల సరస్సుండేది. ఆ అరణ్యంలో ఒక్క పక్షిగాని, మృగంగాని ఉండేది కాదు. సరస్సుకు సమీపంలో ఒక ఆశ్రమం ఉండేది. అగస్త్యుడా ఆశ్రమానికి వెళ్ళి, ఒక రాత్రి అందులో గడిపి, 'తెల్లవారు జామున సరస్సు వద్దకు వెళ్ళాడు. దాని ఒడ్డున ఆయన కొక పుష్టి గల శవం కనబడింది. అది ఏ మాత్రమూ చెక్కుచెదరకుండా ఉన్నది. అది ఏ విధమైన శవం అయి ఉంటుందా అని అగస్త్యుడు ఆలోచిస్తూండగా, అక్కడ ఒక విమానం ఆకాశం నుంచి దిగింది. అదొక దివ్య విమానం. అందులో ఒక దివ్యపురుషుడూ, అతన్ని సేవిస్తూ అనేకమంది అప్సరసలూ ఉన్నారు. అప్సరసలలో కొందరు పాడుతున్నారు, కొందరు వాద్యాలు వాయిస్తున్నారు, మరికొందరు నృత్యాలు చేస్తున్నారు.



కొంతసేపయాక ఆ దివ్యపురుషుడు విమానం నుంచి దిగి, సరస్సుతీరాన ఉన్న శవాన్ని తిని, సరస్సులో చెయ్యీ, నోరూ కడుక్కొని, తిరిగి విమానం ఎక్కబోయాడు. అదంతా చూస్తూ ఉండిన అగస్త్యుడు, "అయ్యా, నీ వెవరు? ఇలాటి పనికిమాలిన భోజనం చెయ్యటానికి కారణమేమిటి? ఎంత హీనులు కూడా ఇలాటి పని చెయ్యరు గదా!" అన్నాడు.

ఆ దివ్యపురుషుడు అగస్త్యుడికి తన పూర్వ కథ చెప్పాడు.

అతను విదర్భరాజైన సుదేవుడి కొడుకు. అతని పేరు శ్వేతుడు. సుదేవుడి కిద్దరు





దానికి బ్రహ్మ, "జంతువులు లేని అడవిలో నీకు భోజన సంతుష్టి ఏ మాత్రమూ లభించలేదు. అదీకాక నీవు అస్తమానమూ తపస్సులో ఉండి అతిథులకు భోజనం పెట్టలేదు. అందుకే నిన్ను ఆకలిదప్పులు వదలకుండా ఉన్నాయి. అరణ్యంలో ఉన్న నీ శవాన్నే తిని నీ ఆకలి దప్పులను తీర్చుకుంటూ ఉండు. కొంతకాలానికి అక్కడికి అగస్త్యుడు వచ్చి, తన అపారమైన మహిమ చేత నీ ఆకలిదప్పులను పూర్తిగా పోగొట్టుతాడు," అని చెప్పాడు.

తనను పలకరించినవాడు అగస్త్యుడేనని తెలియగానే ఆ దివ్యపురుషుడు, "స్వామీ, నన్ననుగ్రహించి, నాకీ కష్టం తొలగించండి. దానికి ప్రత్యుపకారంగా ఈ ఆభరణం స్వీకరించండి. ఇది ప్రతిరోజూ బంగారాన్నీ, ధనాన్నీ, బట్టలనూ, ఆహారాన్నీ, నగలనూ ఇస్తూ ఉంటుంది," అన్నాడు.

అగస్త్యుడా ఆభరణాన్ని స్వీకరించగానే శవం కాస్తా శిథిలమైపోయింది.. దివ్యపురుషుడు సంతోషించి స్వర్గానికి వెళ్ళిపోయాడు.

రాముడీ కథ విని అగస్త్యుడితో, "స్వామీ, శ్వేతుడు తపస్సుచేసిన వనంలో మృగాలూ, పక్షులూ లేకపోవటానికి కేమిటి కారణం?" అని అడిగాడు.

భార్యలు, ఇద్దరికీ ఇద్దరు కొడుకులు కలిగారు. వారిలో పెద్దవాడీ శ్వేతుడు. చిన్నవాడి పేరు సురథుడు. శ్వేతుడు తన తండ్రి అనంతరం చాలాకాలం రాజ్యం ఏలి, చివరకు సురథుడికి పట్టంకట్టి, తాను తపస్సు చేసుకున్నాడు. దీర్ఘతపస్సు చేసి అతను దేహం చాలించి, బ్రహ్మలోకానికి వెళ్ళాడు. కాని బ్రహ్మలోకంలో కూడా అతన్ని ఆకలిదప్పులు విడవలేదు. అది చూసి కంగారుపడి అతను బ్రహ్మ వద్దకు వెళ్ళి, బ్రహ్మలోకంలో కూడా తనను ఆకలిదప్పులు వేధించటానికి తాను ఏం తప్పుచేసి ఉండాలని అడిగాడు.







ఆ కథను అగస్త్యు డీ విధంగా చెప్పాడు: కృతయుగంలో మనుచక్రవర్తి తన కొడుకైన ఇక్ష్వాకుడికి పట్టం గట్టి, రాజనీతి చక్కగా బోధించి, తాను బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు. ఇక్ష్వాకు నూరుగురు కొడుకులను కన్నాడు. వారిలో ఆఖరివాడు దండుడు. అతను బుద్ధిహీనుడు. ఆ దండుడికి ఇక్ష్వాకు వింధ్య శైవలప్రాంతాల మధ్య రాజ్యం ఇచ్చాడు. దండుడు అక్కడ మధుమంత మనే చక్కని నగరం నిర్మించుకుని, శుక్రాచార్యులను గురువుగా పెట్టుకుని, రాజ్యంచేస్తూ వచ్చాడు.

శుక్రాచార్యులకు అరజ అనే అందమైన కూతురుండేది. ఒకనాడు దండుడు వనంలో తిరుగుతూ, ఒంటరిగా ఉన్న అరజను చూసి, ఆమెను కోరాడు. అరజ, తాను శుక్రాచార్యులు కూతురిననీ, దండుడు వెర్రి మొర్రి వేషాలువేస్తే శుక్రాచార్యులు ఘోరమైన శాపం ఇస్తాడనీ హితవు చెప్పింది. అయినా, మందమతి అయిన దండుడు అరజ హితబోధ వినక, ఆమెను బలాత్కరించాడు.

అతను మధుమంతానికి తిరిగివెళ్ళాక, అతని దుష్ప్రవర్తన శుక్రుడికి తెలిసింది. మధుమంతం చుట్టూ నూరు యోజనాల మేర ఏడు రోజులపాటు ధూళివర్షం కురిసి, సమస్తమూ నశించి పోవాలని శుక్రాచార్యుడు శపించాడు.

ఈ శాపం సంగతి వింటూనే అక్కడ నివసించే వారందరూ ఆ ప్రాంతాన్ని విడిచి వెళ్ళిపోయారు.

శుక్రుడు చెప్పినట్టే ఆ ప్రాంతమంతా వారం రోజులపాటు ధూళివర్షం కురిసి నాశనమైపోయింది.

ఈ కథలు వింటూ రాముడు అగస్త్యాశ్రమంలో కొంతసేపుండి, ఆ మహాముని వద్ద సెలవు పుచ్చుకుని అయోధ్యకు తిరిగి వచ్చేశాడు.





# ఉత్తరకాండ

రాముడు శంబూకుణ్ణి చంపి, అయోధ్యకు తిరిగి వస్తూనే, ద్వారపాలకుడితో భరత లక్ష్మణులను తన వద్దకు పంపమని చెప్పాడు. వారు త్వరలోనే రాముడి వద్దకు వచ్చారు. వారితో రాముడు, "తమ్ములూ, అన్ని పాపాలనూ పోగొట్టే రాజసూయం చేద్దామనుకుంటున్నాను. పూర్వం మిత్రుడూ, చంద్రుడూ రాజసూయం చేసే శాశ్వతమైన కీర్తి గడించారు. అందుకు మీ సలహా ఏమిటి?" అని అడిగాడు.

దానికి భరతుడు, "అన్నా, నీ ధర్మానికీ, కీర్తికీ లోటేమున్నది. రాజసూయం చేశావంటే అనేక రాజవంశాలు నాశనమవుతాయి, పౌరుషంకొద్దీ అనేకమంది రాజులు నశిస్తారు. అందుచేత రాజసూయం చేసి, భూమికి లేనిపోని సంక్షోభం కలిగించవద్దు," అన్నాడు.

భరతుడన్న మాట రాముడికి నచ్చింది. మంచి సలహా ఇచ్చినందు కతను భరతుణ్ణి మెచ్చుకున్నాడు.

అప్పుడు లక్ష్మణు డిలా అన్నాడు: "అన్నా, సమస్త పాపాలనూ పోగొట్టే మహాయజ్ఞం అశ్వమేధం. వెనక ఇంద్రుడు తనకు మహాపాతకం చుట్టుకోగా, బృహస్పతి సహాయంతో, అశ్వమేధం ద్వారా ఆ పాపాన్ని పోగొట్టుకున్నాడు."

లక్ష్మణుడా వృత్తాంతాన్ని ఈ విధంగా చెప్పాడు:

పూర్వం వృత్రుడనే గొప్ప రాక్షసుడుండేవాడు. అతను మహాధర్మపరుడు,







గొప్పజ్ఞాని; మూడులోకాలనూ ఎంతో ప్రేమగా చూసుకుంటూ, ధర్మం తప్ప కుండా పాలించాడు. అతని పాలనలో భూమి అన్ని కోరికలనూ తీర్చేది, దున్న కుండానే పండేది, పూలూ, పళ్ళూ, కాయలూ రసవంతంగా ఉండేవి.

ఇలా ఉండగా వృత్రుడికి తపస్సు చేయాలని సంకల్పం కలిగింది. అతను తన పెద్దకొడుక్కు రాజ్యం అప్పగించి ఉగ్రమైన తపస్సు ప్రారంభించాడు. ఆ తపస్సు చూసి దేవేంద్రుడు బెదిరి పోయాడు. అతను విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి, "వృత్రుడు అదివరకే మూడు లోకాలనూ జయించాడు. ఇప్పుడు తపస్సు కూడా ప్రారంభించాడు. ఈ తపస్సు పూర్తి అయిందంటే లోకాలుండేటంత కాలమూ అతన్ని నేను జయించలేను. అందుచేత నువు ఆ వృత్రుణ్ణి కడతేర్చితే గాని నాకూ, దేవతలకూ దిక్కులేదు," అన్నాడు.

దేవతల పక్షాన ఇంద్రుడిలా మొర పెట్టుకోగా, విష్ణుమూర్తి, "మహాత్ముడైన వృత్రుడు నాకు స్నేహితుడు. అందుచేత నే నతన్ని చంపను. అయితే నీ కోరిక కూడా తీసివెయ్యటానికి లేదు. అందుకని వృత్రుడు చచ్చే ఉపాయం ఒకటి చేస్తాను. నా శక్తిని మూడు భాగాలు చేసి, ఒకభాగం నీ లోనూ, ఒకటి వజ్రాయుధం లోనూ, మూడవదాన్ని భూమి లోనూ, ప్రవేశ పెడ తాను. అప్పుడు నువు వృత్రుణ్ణి చంప గలుగుతావు," అన్నాడు.

ఈ మాటలు విని ఇంద్రుడూ, దేవతలూ సంతోషించి, వృత్రుడు తపస్సు చేసుకునే వనానికి వెళ్ళారు. తపశ్శక్తి చేత మూడులోకాలనూ దహించేటట్టుగా వెలిగి పోతూ వృత్రుడు వారికి కనిపించాడు. అతన్ని చూస్తేనే దేవతలకు దడపుట్టింది. ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని రెండు చేతులా పట్టి వృత్రుడి తలను తెగవేశాడు.







వెంటనే బ్రహ్మహత్య ఇంద్రుడి శరీరాన్ని చుట్టుకున్నది. అతనికి తీరని దుఃఖం పుట్టుకొచ్చింది. అప్పుడు దేవతలు విష్ణువుతో, "దేవా, నువ్వేమో వృత్రుణ్ణి చంపావు; బ్రహ్మహత్య ఇంద్రుణ్ణి చుట్టుకున్నది. అది వదిలే ఉపాయం చెప్పు," అని మొరపెట్టుకున్నారు.

"ఇంద్రుడు అశ్వమేధం చేసినట్టయితే బ్రహ్మహత్య తొలగిపోయి అతడు ఎప్పటి దేవేంద్రు డవుతాడు," అని విష్ణుమూర్తి దేవతలకు చెప్పాడు.

ఈ సలహా విని దేవతలు బృహస్పతి మొదలైన మునులను వెంటబెట్టుకుని ఇంద్రుడున్న చోటికి వెళ్ళారు. ఇంద్రుడు తెలివి పూర్తిగా పోయి, భయభ్రాంతుడై ఒక చోట పడి ఉన్నాడు. ఆ ఇంద్రుణ్ణి వెంట ఉంచుకుని దేవతలు అశ్వమేధయాగం చేసిన మీదట, అతన్ని బ్రహ్మహత్య వదలి పోయింది.

లక్ష్మణుడు ఈ కథ చెప్పిన మీదట రాముడు అశ్వమేధం యొక్క మహిమను తెలిపే మరొక కథ చెప్పాడు.

పూర్వం కర్దమప్రజాపతి కొడుకు ఇలుడు బాహ్లికదేశాన్ని పరిపాలించేవాడు. అతనంటే దేవతలకూ, రాక్షసులకూ, నాగులకూ, యక్షులకూ గంధర్వులకూ, ఎంతో గౌరవం వుండేది.



ఒక చైత్రమాసంలో ఇలమహారాజు తన పరివారాన్ని వెంటబెట్టుకుని అడవికి వేటకు వెళ్ళాడు. ఎన్ని వేల మృగాలను చంపినా అతనికి వేటతమకం తీరలేదు. అందుచేత అతను వేటాడుతూ పోయిపోయి, కుమారస్వామి పుట్టిన చోటికి వెళ్ళాడు. అక్కడ పార్వతి పరమేశ్వరులూ, వాళ్ళ అనుచరులూ ఉన్నారు.

ఆ పర్వత ప్రదేశంలోగల విశేష మేమిటంటే, అక్కడ చెట్లూ, పక్షులూ, జంతువులూ కూడా ఆడవే.









అక్కడికి చేరుతూనే, ఇలుడూ, అతని భృత్యులూ కూడా స్త్రీలుగా మారిపోయారు. తనలో కలిగిన మార్పు చూసి ఇలుడికి బాధా, భయమూ పుట్టాయి. అతను శివుడి దగ్గిరకు వెళ్ళి స్తోత్రం చేసి, కాళ్ళపైన పడి రక్షించమన్నాడు.

"నీ అడతనం పోగొట్టటం తప్ప ఇంకే మైనా కోరుకో," అన్నాడు శివుడు.

ఇలుడు శివుణ్ణి మరొక వర మేదీ కోరక, పార్వతిని ప్రార్థించాడు. పార్వతి అతనిపై జాలిపడి, అతను ఒక నెల స్త్రీగానూ, మరొక నెల పురుషుడుగానూ ఉండేటట్టూ, స్త్రీగా ఉండేటప్పుడు జరిగేది పురుషుడుగా ఉండే టప్పుడు జ్ఞాపకం లేకుండానూ వర మిచ్చింది.

ఇలుడు కాస్తా ఇలగా మారింది. అతని సైనికు లందరూ స్త్రీలే అయారు. వారందరూ యథేచ్ఛగా ఆ అడవిలో తిరగ సాగారు.

వాళ్ళు స్త్రీలుగా మారిన కొండకు సమీపంలోనే ఒక సరస్సున్నది. అక్కడనే చంద్రుడి కొడుకైన బుధుడు ఆశ్రమం కల్పించుకుని, తపస్సు చేసుకుంటున్నాడు. అతను మంచి యౌవనంలో ఉండి, ఆకర్షణీయంగా ఉన్నాడు.

ఇలా, ఆమె వెంట ఉన్న స్త్రీలూ సరస్సులో దిగి, దాన్ని కల్లోలం చెయ్య సాగారు. బుధుడు వారిని చూసి, ఇల సౌందర్యం చేత సమ్మోహితు డయాడు. అంత అందమైన స్త్రీ మూడులోకాలలోనూ మరొకతె ఉండదని అతనికి తోచింది. ఇల వెంట ఉన్న స్త్రీలను కొందరిని అతను ఆశ్రమంలోకి పిలిచి, "ఆమె ఎవరు? ఈ ప్రాంతానికి ఏం పనిమీద వచ్చింది? నిజం చెప్పండి," అన్నాడు.

"అయ్యా, ఆమె మాకు నాయకురాలు. ఆమెకు భర్త లేడు. మమ్మల్ని వెంటపెట్టుకుని ఇలా అరణ్యమంతా తిరుగుతున్నది," అన్నా రా స్త్రీలు.







"మీ రంతా ఈ ఆశ్రమంలోనే కంద మూలాలు తింటూ ఉండిపొండి. ఇక్కడ ఉండే కింపురుషులు మీకు భర్తలౌతారు," అని బుధుడు వారితో అన్నాడు. వాళ్ళం దరూ వెళ్ళిపోయారు.

తరవాత బుధుడు ఇలతో, "నేను చంద్రుడి కొడుకును. నా పేరు బుధుడు. నన్ను భక్తిస్నేహలతో చూసుకుంటూ ఇక్కడే ఉండిపో," అన్నాడు.

"నీ యిష్టం," అన్నది ఇల.

ఇద్దరూ మహాసంతోషంగా ఆ నెల గడి పారు. ఒకనాడు ఉదయం ఇల కాస్తా, ఇలమహారాజై పక్కమీది నుంచి లేచాడు. అతనికి జరిగిన దేదీ జ్ఞాపకం లేదు. సరస్సులో బుధుడు చేతులు పైకెత్తి తపస్సు చేసుకుంటున్నాడు. ఇలు డతన్ని చూసి, "అయ్యా, నేను నా సైనికులతో ఈ పర్వత ప్రాంతానికి వేటకై వచ్చాను. వా రంతా ఎటు పోయారో తెలియకుండా ఉన్నది," అన్నాడు.

"రాజా, రాళ్ళవాన కురిసి, నీ పరివార మంతా నశించింది. నువు మాత్రం ఈ ఆశ్ర మంలో తలదాచుకున్నావు. విచారించకు. ఇక్కడ నువు సుఖంగా ఉండవచ్చు," అన్నాడు బుధుడు.



ఇలుడు తన అనుచరులు పోయినందుకు దిగులుపడుతూ, "నా కింక రాజ్యం ఏలాలని లేదు. మీరు అనుమతిస్తే నేను నా పెద్ద కొడుకైన శశిబిందుడికి పట్టం కట్టి, వెంటనే తిరిగి వస్తాను," అన్నాడు.

"ఇలమహారాజా, ఎందుకలా కలవర పడతావు? ఒక్క సంవత్సరం ఇక్కడ ఉండు. నీకు మేలు కలిగేటట్టు చేస్తాను," అన్నాడు బుధుడు. ఇలుడు సరేనన్నాడు.

ఒక నెలపాటు స్త్రీగా ఉండి మరొక నెలపాటు పురుషుడుగా ఉంటూ ఇలుడు తాను స్త్రీగా ఉన్న సమయంలో బుధుడికి ఒక కొడుకును కన్నాడు.











ఆటుతరవాత బుధుడు సంపర్తున్నీ, చ్యవనున్నీ, ప్రమోదనున్నీ, దుర్వాసుడు మొదలుగా గల ఇతర ఋషులనూ పిలిపించి, వారికి ఇలుణ్ణి పరిచయం చేసి, అతని పరిస్థితి యథాప్రకారం అయేటందుకేమైనా దారి చెప్పమన్నాడు. ఈ సమయంలోనే ఇలుడి తండ్రి అయిన కర్దముడూ, మరికొందరు ఋషులూ కూడా అక్కడికి వచ్చారు. అందరూ ఇలుడికి తలాఒక సలహా ఇచ్చారు. కాని కర్దముడు, తన కొడుక్కు మేలు కలగాలంటే, అశ్వమేధ యాగం చెయ్యటమే మార్గమన్నాడు. ఆయన సలహా ప్రకారం అందరూ చేరి అశ్వమేధయాగం చేసి. ఇలమహారాజుకు స్త్రీత్వం లేకుండా చేశారు. యజ్ఞం పూర్తి అయే సమయానికి శివుడే ప్రత్యక్షమై ఇల మహారాజును అనుగ్రహించాడు.

తరవాత ఇలుడు బాహ్లికదేశానికి తిరిగి వెళ్ళక, మధ్యదేశం లోని ప్రతిష్ఠానపురాన్ని ఏలుతూ, అక్కడే ఉండిపోయాడు. అతని కొడుకు శశిబిందుడు బాహ్లికదేశాన్ని పాలించాడు. ఇలకూ బుధుడికీ పుట్టిన పురూరవసుడు ఇలమహారాజు అనంతరం ప్రతిష్ఠానపురానికి రాజయాడు.

రాము డీ కథ తన తమ్ములకు చెప్పి, లక్ష్మణుణ్ణి పంపి, తన పురోహితులైన వసిష్ఠ, వామదేవ, జాబాలి మొదలైన వారిని రప్పించి, తాను అశ్వమేధం తలపెట్టిన సంగతి వారికి తెలియజేశాడు. వారు చాలా సంతోషించారు.

అశ్వమేధానికి అవసరమైన ప్రయత్నాలు వెంటనే ప్రారంభమై చాలా చురుకుగా సాగాయి.

సపరివారంగా బయలుదేరి రావలిసిందనీ, యజ్ఞోత్సవంలో పాల్గొన వలిసిందనీ, లక్ష్మణుడు కిష్కింధలో సుగ్రీవుడికీ, లంకలో విభీషణుడికీ దూతల ద్వారా ఆహ్వానాలు పంపాడు. రాముడి మంచి







కోరే రాజు లందరికీ ఆహ్వానాలు వెళ్ళాయి. నానా దేశాల బ్రాహ్మణులూ, ఋషులూ, సకుటుంబంగా గృహస్థులూ, గాయకులూ, నటులూ, నర్తకులూ ఆహ్వానించబడ్డారు.

నైమిశవనంలో గోమతీ నదీతీరాన యజ్ఞశాల నిర్మించబడింది. వేలకొద్ది బళ్ళతో ధాన్యమూ, అపరధాన్యాలూ, ఉప్పూ, గంధమూ చేరాయి. కోట్లకొద్దీ బంగారం వచ్చింది. వంటవాళ్ళూ, శిల్పులూ వచ్చారు. రాముడి అంతఃపురం నుంచి అతని తల్లులూ, బంగారుసీతా భరతుడి వెంట వచ్చి యజ్ఞం జరిగే చోటికి చేరారు. ఆహ్వానితులకు విడుదులు వేరువేరుగా ఏర్పాటు చేయబడ్డాయి.

ఈ ఏర్పాట్లన్నీ అయే లోపల రాముడు ఒక నల్లని గుర్రాన్ని విడిచి, దాని వెంట ఋత్విజులనూ, లక్ష్మణుణ్ణీ పంపాడు.

యజ్ఞం చూడవచ్చిన రాజులు రాముడికి కానుకలు తెచ్చారు. వారి సౌకర్యాలను భరతశత్రుఘ్నులు చూశారు. బ్రాహ్మణుల సౌకర్యాలను సుగ్రీవుడి వానరులూ, ఋషుల సౌకర్యాలను విభీషణుడి రాక్షసులూ చూశారు.

యజ్ఞం చాలా జయప్రదంగా జరిగింది. ఎక్కడా, ఎవరికీ, ఏ లోటూ కలిగిందన్న మాట పుట్టలేదు. భోజనాల దగ్గిర ఎవరూ నోరు తెరిచి అడగకుండానే కావలిసిన పదార్థాలు వడ్డన అయాయి. బంగారమేమిటి, ధనమేమిటి, రత్నాలేమిటి, బట్టలేమిటి, ఎవరేమికోరినా ఇచ్చారు. ఈ వస్తువులన్నీ పెద్దపెద్ద కుప్పలుపోసి, రాత్రీ, పగలూ కూడా అడిగినవారికి ఇస్తూనే వచ్చారు. అలాటి యజ్ఞాన్ని ఇంద్రుడూ, కుబేరుడూ, యముడూ కూడా చేసి ఉండలేదని చెప్పుకున్నారు. వానరులకూ, రాక్షసులకూ చేతినిండా పనిపడింది. యాచకులు కోరినదల్లా వారే ఇస్తూవచ్చారు. ఇదేవిధంగా ఏడాదిగడిచి యజ్ఞం పూర్తి అయింది.






రాముడు చేసిన అద్భుతమైన యజ్ఞానికి వాల్మీకి తన శిష్యులతో కూడా వచ్చి, ఋషి వాటికలో తన కోసం ప్రత్యేకించిన పర్ణ శాలలో బస చేశాడు. తాను రచించిన రామాయణాన్ని ఎక్కడపడితే అక్కడ గానం చెయ్యటానికి తన శిష్యులకు ఆయన అనుమతి ఇచ్చాడు. ఆయన కుశలవులతో, "మీ రెవరి బిడ్డలని ఎవరన్నా అడిగితే వాల్మీకి శిష్యులమని చెప్పండి. డబ్బిస్తే పుచ్చుకోకండి. రాముడు పిలిస్తే ఆయన ఎదట కూడా రామాయణాన్ని గానం చెయ్యండి. రాజు గనక ఆయన పట్ల మర్యాద చూపండి," అన్నాడు. "అలాగే, తాతా," అని వాళ్ళు పర్ణశాల నుంచి బయలుదేరారు.

వాళ్ళు రాగతాళయుక్తంగా రామాయణాన్ని గానం చేస్తున్న సంగతి విని రాముడు వారిని పెద్ద సదస్సు మధ్యకు పిలిపించి, గానం చెయ్యమన్నాడు.

ఆ మహా సదస్సులో మునులూ, రాజులూ, పండితులూ, పౌరాణికులూ, సంగీతవేత్తలూ, కళాకారులూ, నాట్యం తెలిసినవారూ, ఇంకెందరో ఉన్నారు.

ఆ రోజు కుశలవులు రామాయణం నుంచి మొదటి ఇరవై సర్గలూ పాడారు. రాముడు లక్ష్మణుడితో, "ఈ కుర్రవాళ్ళకు పద్దెనిమిది వేల సువర్ణాలిప్పించు," అన్నాడు. కాని లక్ష్మణుడు వారికి వేరు వేరుగా బంగారం ఇవ్వబోతే వాళ్ళు, "ఈ బంగారం మా కెందుకు? మేము







అరణ్యంలో కందమూల ఫలాలు తిని జీవించేవాళ్ళం," అన్నారు.

రాము డా మాటలు విని ఆశ్చర్యపడి, "అబ్బాయిలూ, మీరు పాడే ఈ కావ్యం ఎంత ఉంటుంది? దాన్ని ఎవరు రాశారు?" అని అడిగాడు.

"దీన్ని వాల్మీకి మహాముని రాశారు. ఆయన కూడా ఈ యజ్ఞానికి వచ్చిఉన్నారు. మీకు వినాలని ఉంటే రోజూ గానంచేస్తాం," అన్నారు సీతకొడుకులు.

రాముడు సరే నన్నాడు. పిల్లలు రోజూ వచ్చి, అందరి సమక్షంలో కొన్ని సర్గలు చొప్పున చాలా రోజుల పాటు రామాయ



ణాన్ని గానం చేశారు. ఈ గానంతో ఆ పిల్లలు సీత కొడుకులే నన్నది అందరికీ స్పష్టమయింది.

రాముడు తన దూతలను పిలిచి, "మీరు వాల్మీకి మహాముని వద్దకు వెళ్ళి, సీత పవిత్రురా లైన పక్షంలో, ఆమె ఇక్కడికి వచ్చి ఆ సంగతి నిరూపించటానికి ఆ మహాముని అనుమతిని కోరుతున్నానని ఆయనతో చెప్పండి," అని పంపాడు.

దూతలు వచ్చి రాముడి కోరికను విన్నవించగానే వాల్మీకి మహాముని, "సీత రాముడి కోరిక ప్రకారం వచ్చి శపథం చేస్తుంది," అని చెప్పాడు.

దూతలు ఆ మాట చెప్పగానే రాముడు సభికుల ఎదట సీత తన పవిత్రతను వెల్లడించుకో బోతున్నదని ప్రకటించాడు. అందరూ ఈ మాటకు సంతోషించి, రాముణ్ణి అభినందించారు.

మర్నాడు తెల్లవారగానే రాముడు యజ్ఞవాటికకు వెళ్ళి, మహామును లందరికీ కబురు చేశాడు. రాక్షసులనూ, వానరులనూ, నానాదేశాల నుంచి వచ్చిన నాలుగు వర్ణాల వారినీ పిలిపించాడు. అందరూ కూర్చుని ఉండగా వాల్మీకి మహాముని సీతను వెంటబెట్టుకుని వచ్చాడు. వాల్మీకి









వెనక నడిచివచ్చే సీతను చూడగానే అందరికీ గుండెలు నీరయిపోయాయి.

వాల్మీకి రాముడితో, "రామా, ఈ సీత మహాఇల్లాలు, ధర్మం తప్పనిది. లోకాపవాదుకు వెరచి ఈమెను నా ఆశ్రమం వద్ద వదిలిపెట్టావు. కనక నీకు ఆమె యందు విశ్వాసం కుదిరేటట్టుగా శపథం చేస్తుంది. ఈ బిడ్డ లిద్దరూ సీతకొడుకులు. నే నెన్నడూ అబద్ధమాడిన వాణ్ణి కాను. వీరు నీ కొడుకులు. నేను అంతులేని తపస్సు చేశాను. సీత నిజంగా చెడ్డదైతే, నా తపస్సు ఫలించక పోవుగాక! లోకాపవాదానికి వెరిచావే గాని ఆమెలో ఎలాంటి దోషం లేదని నీకూ తెలుసు," అన్నాడు.

రాముడు వాల్మీకికి నమస్కరించి, "మునీశ్వరా, మీ రన్నది నిజమే. లంకలోనే అగ్నిదేవుడు సీత పవిత్రతకు సాక్ష్యం పలికాడు. అందుకే నే నీమెను నా వెంట ఇంటికి తెచ్చాను. ఈ పిల్లలు నా పిల్లలే నని కూడా నాకు తెలుసును. ఈ మహాసభలో సీత తన నిర్దోషిత్వం రుజువు చేసుకునేటట్టుంటే నే నామెను సంతోషంగా ఏలుకుంటాను," అన్నాడు.

కాషాయవస్త్రాలు ధరించి ఉన్న సీత చేతులు జోడించి, నేల చూస్తూ, "నా మనసులో రాముణ్ణి తప్ప మరెవరినీ స్మరించని పక్షంలో భూదేవి నాకు దారి ఇచ్చుగాక! మనోవాక్కాయాల నేను రాముణ్ణి పూజించే దాన్నయితే భూదేవి నాకు దారి ఇచ్చుగాక! రాముడు తప్ప నా కింకేమీ తెలియని పక్షంలో భూదేవి నాకు దారి ఇచ్చుగాక!" అన్నది.



సీత ఇలా అంటూండగానే బలవంతులైన నాగకుమారులు ఒక దివ్యమైన సింహాసనాన్ని మోస్తూ భూమిలో నుంచి పైకి వచ్చారు. సింహాసనం ఎంతో అద్భుతంగా ఉన్నది. నాగకుమారుల తలలోని రత్నాలు వింతగా మెరుస్తున్నాయి. ఆ సింహాసనం







మీద ఉన్న భూదేవి తన రెండు చేతులూ చాచి, సీతను ఎత్తి సింహాసనం మీద కూర్చో బెట్టింది. వెంటనే సింహాసనం పాతాళానికి దిగి పోయింది.

ఇది చూసి అందరూ నిశ్చేష్టితులయి పోయారు. కొందరు సీతనే చూస్తూ ఉండి పోయారు. మరికొందరు రాముణ్ణి చూశారు. ఆ తరవాత ఒక్కసారిగా కలకలం బయలు దేరింది. వానరులు ఏడ్చారు. "ఎంతసాధ్వి!" అని మునులు మెచ్చుకున్నారు.

రాముడు చేతికర్ర మీద బరువు వేసి తలవంచుకుని చాలా సేపు కన్నీరుగార్చి, "నే నింత కష్టం ఎన్నడూ అనుభవించ



లేదు. ఓ భూదేవీ, నా సీతను నా కిచ్చెయ్యి, లేదా నాకు కూడా దారి ఇయ్యి. ఎవరురా, నా ధనుర్బాణాలు తెండి. ఈ భూమిని బద్దలు చేస్తాను," అని ఆవేశపడ్డాడు. అందరూ చేరి అతన్ని ఓదార్చారు.

వాల్మీకి కుశలవులను వెంటబెట్టుకుని తన పర్ణశాలకు వెళ్ళాడు. ఆ రాత్రి సీతను గురించిన స్మరణలతోనే గడిచిపోయింది.

మర్నాడు మళ్ళీ సభ జరిగినప్పుడు కుశలవులు ఉత్తర రామాయణాన్ని గానం చేశారు. దానితోనే యజ్ఞకాండ ముగిసింది. యజ్ఞానికి వచ్చినవారి నందరినీ తగిన విధంగా సత్కరించి రాముడు అయోధ్యకు తిరిగి వచ్చాడు. అతను వచ్చేటప్పుడు తన కొడుకులను వెంట తెచ్చుకున్నాడు. అతను మరొక స్త్రీని పెళ్ళాడక, బంగారు సీతను పక్కనే ఉంచుకుని అనేక అశ్వమేధ, వాజపేయ యజ్ఞాలు చేశాడు. అతను ధర్మం నిలబెట్టటానికి యత్నిస్తూ, న్యాయంగా పరిపాలన చేసి, ప్రజల ఆదరం పొందాడు. అతని పరిపాలనలో దేశం సుభిక్షంగా ఉన్నది. అకాలమరణాలూ, ఈతిబాధలూ లేవు.

కాలక్రమాన కౌసల్యా, సుమిత్రా, కైకేయీ మరణించారు. వారికి రాముడు







ఉత్తరక్రియలు చేసి, గొప్పగా దానధర్మాలు చేశాడు.

కొంత కాలం గడిచాక రాముడి వద్దకు కైకేయి అన్న అయిన యుధాజిత్తు వద్ద నుంచి గార్గ్యుడు పదివేల గుర్రాల కానుకతో సహా వచ్చి, "రామా, మీ మామ నీతో ఇలా చెప్పమన్నాడు. సింధునదికి రెండు పక్కలా గల గంధర్వదేశం శోభతో కూడినది. అక్కడ శైలూషుడి సంతతికి చెందిన గంధర్వులు మూడుకోట్లమంది, మహాబలవంతులున్నారు. వారిని జయించి గంధర్వదేశాన్ని వశపరుచుకో. నీ హితం కోరి ఈ మాట చెప్పాను," అని యుధాజిత్తు తరఫున సందేశ మిచ్చాడు.

"మంచిది. ఈ కుర్రవాళ్ళు భరతుడి కొడుకులు; తక్షుడూ, పుష్కలుడూ అనే వాళ్ళు. వీళ్ళ వెంట భరతుణ్ణీ, సేననూ పంపుతాను. భరతుడు గంధర్వులను జయించి, గంధర్వదేశాన్ని రెండుగా విభజించి, తన ఇద్దరి కొడుకులనూ వాటికి రాజులుగా చేసి తిరిగి వస్తాడు," అన్నాడు.

ఆ ప్రకారమే భరతుడు పెద్ద సేనను వెంటబెట్టుకుని పదిహేను రోజులు ప్రయాణం చేసి, కేకయదేశాన్ని చేరి, యుధాజిత్తును కలుసుకున్నాడు. తరవాత



ఇద్దరూ కలిసి గంధర్వుల మీదికి యుద్ధానికి వెళ్ళారు. యుద్ధంలో గంధర్వులు నశించారు. భరతుడు వారి దేశాన్ని జయించి, తక్షుడికి తక్షశిల అనే నగరాన్నీ, పుష్కలుడికి పుష్కలావతి అనే నగరాన్నీ ఏర్పాటు చేసి, ఆ పట్టణాలలో అయిదేళ్ళపాటు ఉండి, అయోధ్యకు తిరిగి వచ్చాడు.

ఇక లక్ష్మణుడి కొడుకులైన అంగదుడికీ, చంద్రకేతుడికీ రాజ్యాలు ఏర్పాటు కావలిసి ఉన్నది. వాళ్ళు ఏలదగిన దేశం ఏదన్నా ఉంటే చూడమని రాముడు లక్ష్మణుడితో అన్నాడు. కారుపథ మనే దేశం అందుకు తగి ఉన్నదని లక్ష్మణు డన్నాడు. దాన్ని







అంగదుడి కోసమూ, చంద్రకాంత మనే దేశాన్ని చంద్రకేతుడి కోసమూ ఏర్పాటు చేస్తే బాగాఉంటుందని నిర్ణయం జరిగింది. అంగదుడి వెంట లక్ష్మణుడూ, చంద్రకేతుడి వెంట భరతుడూ వెళ్ళి ఆయా దేశాలలో వారికి రాజ్యం ఏర్పాటు చేసి అయోధ్యకు తిరిగి వచ్చారు.

కాలం గడిచిపోయింది. ఒకనాడు యముడు మునివేషంలో రాముడి రాజ భవనానికి వచ్చి, లక్ష్మణుణ్ణి చూసి, "లక్ష్మణా, నేను ఒక గొప్ప మహర్షి దూతగా రాముణ్ణి పని మీద చూడవచ్చానని రాముడితో చెప్పు," అన్నాడు.



లక్ష్మణు డా మాట చెప్పగానే రాముడు మునిని లోపలికి పంపమన్నాడు. యముడు వచ్చి, రాము డిచ్చిన అర్ఘ్యపాద్యాలు స్వీకరించి, "రామా, మనం ఏకాంతంగా మాట్లాడాలి. మనం మాట్లాడుకునేటప్పు డెవరైనా వచ్చేపక్షంలో నీవు వారికి మరణ శిక్ష విధించాలి. అందు కిష్టమయే పక్షంలో నేను వచ్చిన పని చెబుతాను," అన్నాడు.

రాముడు సరేనని, లక్ష్మణుణ్ణి పిలిచి, "లక్ష్మణా, ద్వారపాలకుణ్ణి పంపేసి, నువే ద్వారం వద్ద ఉండు. మేం మాట్లాడు కుంటుండగా ఎవరు లోపలికి వచ్చినా మరణ దండన తప్పదు," అని చెప్పాడు.

తరవాత యముడు రాముడితో, "రామా, నేను మారువేషం ధరించి వచ్చిన యముణ్ణి, బ్రహ్మ పంపగా వచ్చాను. బ్రహ్మ నీతో ఇలా చెప్పమన్నాడు: నీవు రావణ సంహారం కోసం అవతరించిన విష్ణువువు. నీవు భూలోకానికి వచ్చిన పని అయిపో యింది. నీకు ఎప్పుడు తిరిగి రావాలని ఉంటే అప్పుడు తిరిగి రా," అన్నాడు.

రాముడు నవ్వి, "నీ రాక నాకు చాలా సంతోషం కలిగించింది. నేను కూడా ఎక్కడి నుంచి వచ్చానో అక్కడికి వెళ్ళటా నికి సిద్ధంగానే ఉన్నాను," అన్నాడు.







లోపల రాముడు యముడితో ఇలా మాట్లాడే సమయంలో దుర్వాసుడు వచ్చి, "లక్ష్మణా, ఇప్పుడే నేను రాముణ్ణి చూడాలి," అన్నాడు.

"స్వామీ, మా అన్న మరొక పనిలో నిమగ్నుడై ఉన్నాడు. కొంచెం ఆగాలి. మీరేం పని మీద వచ్చారో, నా వల్ల మీ కేం కావాలో చెప్పండి," అన్నాడు లక్ష్మణుడు.

దుర్వాసుడు ఉగ్రుడై, "వెంటనే నన్ను రాముడి దగ్గిరికి తీసుకుపోక పోయావో మీ వంశమంతా నిర్మూలమయేటట్టు శపిస్తాను," అన్నాడు. తాను ఒక్కడే చచ్చినా నష్టం లేదనీ, సర్వనాశం కారాదనీ ఆలోచించి లక్ష్మణుడు లోపలికి వెళ్ళి రాముణ్ణి పిలిచాడు.

రాముడు లేచివచ్చి, దుర్వాసుడికి నమస్కరించి, "స్వామీ, ఏమి ఆజ్ఞ?" అని అడిగాడు.

"నాకు వెంటనే భోజనం పెట్టించు," అన్నాడు దుర్వాసుడు. రాము డాయనకు భోజనం పెట్టించాడు. దుర్వాసుడు భోజనం చేసి, సంతోషించి వెళ్ళిపోయాడు.

రాముడికి తన శపథం జ్ఞాపకం వచ్చి విచారం కలిగింది. లక్ష్మణు డతన్ని సమీపించి, "అన్నా, నా కోసం దిగులు పడకు.



నన్ను చంపి నీ మాట నిలబెట్టుకో," అని చెప్పాడు.

రాముడు తన మంత్రి పురోహితులను పిలిచి వారికి జరిగిన దంతా చెప్పి వారి సలహా కోరాడు.

"రామా, లక్ష్మణుణ్ణి విడిచిపెట్టెయ్యి. త్యాగం వధతో సమానం. ధర్మభంగం కలగరాదు," అని వసిష్ఠు డన్నాడు.

లక్ష్మణుడు రాముడికి నమస్కారం చేసి, తన ఇంటికి కూడా పోకుండా, తిన్నగా సరయూతీరానికి వెళ్ళి, శ్వాస స్తంభింపజేసి, యోగం పట్టాడు. ఇంద్రుడు విమానంలో అదృశ్యంగా దిగివచ్చి లక్ష్మణుణ్ణి





శరీరంతో సహా స్వర్గానికి తీసుకుపోయాడు. విష్ణువులో నాలుగో భాగం తిరిగి వచ్చేసింది.

తరవాత రాముడు సభచేసి, "లక్ష్మణుడి లాగే నేను కూడా వెళ్ళిపోతాను. భరతుడికి పట్టాభిషేకం చేసే ఏర్పాట్లు చెయ్యండి," అన్నాడు. ఆ మాట విని భరతుడికి మతి పోయినట్టయింది. "నువ్వు లేని రాజ్యం నా కెందుకు? కుశలవులకు పట్టం కట్టు. కోసలకు కుశుణ్ణీ, ఉత్తరకోసలకు లవుణ్ణీ రాజును చెయ్యి. మనం స్వర్గానికి పోతున్నా మని శత్రుఘ్నుడికి కబురు చేద్దాం," అన్నా డతను.

భరతు డన్న ప్రకారమే కుశలవుల పట్టాభిషేకం జరిగింది. శత్రుఘ్నుణ్ణి పిలుచుకు రావటానికి మధురాపురానికి దూత వెళ్ళాడు. శత్రుఘ్నుడు తన రాజ్యాన్ని కూడా తన కొడుకులైన సుబాహుడూ, శత్రుఘాతీ అనే వాళ్ళకు పంచి అయోధ్యకు తిరిగి వచ్చాడు.

రాముడు స్వర్గానికి పోతున్నా డన్న వార్త విని సుగ్రీవ విభీషణులు సపరివారంగా వచ్చేశారు. సుగ్రీవుడు అంగదుడికి పట్టాభిషేకం చేసి మరీ వచ్చాడు.

తరవాత రామప్రస్థానం ప్రారంభమయింది. రాముడు సన్నని బట్ట కట్టుకుని, చేత దర్భలు పట్టుకుని, మౌనంగా నడవ సాగాడు. అతని వెంట అంతఃపుర స్త్రీలూ, భరతశత్రుఘ్నులూ, మంత్రులూ, భృత్యులూ, వానరులూ బయలుదేరారు. కొంత దూరం నడిచి రాముడు సరయూ నదిని చేరాడు. రాముడు ఆ నదిలో పాదాలు పెట్టాడు. అతనికి బ్రహ్మ పిలుపు వినబడింది. రాముడికీ, భరతశత్రుఘ్నులకూ వైష్ణవ శరీరాలు వచ్చేశాయి. విష్ణువు బ్రహ్మను చేరాడు. అతనితో బాటు అవతరించిన వారందరూ తమతమ లోకాలకు తిరిగి చేరుకున్నారు.

* సంపూర్ణం *



